# కంటిమెరమెర

ర చ న :

విశ్వకవి, రవీంద్రనాథ్ ఠాకూర్



అనువాదం :

బొమ్మరాజు రాఘవయ్య



ప్ర కా శ కు లు :

ప్రేమ్‌చంద్ పబ్లికేషన్స్

వి జ య వా డ - 1

# 1

వినోదిని తల్లి కిశోరి ఒకనాడు మహేంద్రుని తల్లి రాజలక్ష్మి వద్దకు వచ్చి పట్టుబట్టి కూర్చొంది. వీ రిద్దరు ఒకే గ్రామంనుండి వచ్చినవారు, బాల్యంలో ఇద్దరు కలిసిమెలిసి ఆటలాడుకొంటూ ఉండేవారు.

మరుసటి రోజున "అబ్బాయ్, మహేంద్రా! ఏవిధంగా నైనా పాపం బీదవారి మానాన్ని కాపాడాలి. పిల్ల అంద మయిందనీ, ఒక మిషనరీ స్త్రీవల్ల ఏదో చదవడం వ్రాయడం నేర్చుకొన్నదని వింటున్నాను." — అన్నది రాజలక్ష్మి మహేంద్రునితో.

మహేంద్రుడు:— అమ్మా! పెండ్లి కావలసినవారు చాలామంది ఉన్నారు, నేనొక్కడనే కాదుగా.

రాజ:— మహేంద్రా, ఇదే నీలో ఉండే పెద్దదోషం. నీయెదుట పెండ్లి ప్రస్తాపన చేయడానికే కష్టంగాఉంది.

మహేం:— అమ్మా, ప్రపంచంలో మాటలకు కొరవ లేదు. ఇదొక్కటే మాట్లాడవలసిన పనేముంది? ఇందుచేత ఇదొక పెద్దదోషం కాదంటాను.

మహేంద్రుని తండ్రి చిన్నతనంలోనే మరణించాడు; తల్లిమాత్రమే ఉంది. తల్లివిషయంలో మహేంద్రుని ప్రవర్తన అందరి పిల్లలలాగా లేదు. మహేంద్రుని వయస్సు దాదాపు

ఇరవై సంవత్సరాలుంటాయి. ఎమ్. ఎ. ప్యాసై డాక్టరు కోర్సు ప్రారంభించాడు, ఐతే యిప్పటికీ చిన్నతనంలోలాగానే తల్లితో కేచులాడడం, హఠంచేయడం మానలేదు. కంగారూ మృగపు పిల్లలాగా మాతృగర్భంనుండి బయటికి వచ్చికూడా తల్లి బహిర్గర్భంలో (ఒడిలో) ఇమిడి ఉండడం అతనికి అభ్యాసమైపోయింది. తల్లి సహాయం లేనిదే భోజనంచేయడం, నీరు త్రాగడంగాని లేవడం, కూర్చోడంగాని అతనికి సాధ్యంకాదు.

తల్లి వినోదినిని వివాహం చేసుకోనమని మాటిమాటికి వెంటపడుతూ ఉండడంచేత—"సరే, పిల్లనోకసారి చూస్తాను." అన్నాడు మహేంద్రుడు.

పిల్లను చూడడానికి నిర్ణయించుకొన్న రోజున మహేంద్రుడు—"పిల్లను చూడడంవల్ల ప్రయోజనమేముంది? నీ సంతోషంకొరకు వివాహం చేసుకోనడానికి నిర్ణయించుకొన్నప్పుడు మంచి చెడ్డలను విచారించడం వ్యర్థం." అన్నాడు.

మహేంద్రుడు కోపంవచ్చి ఇలా అంటున్నాడని గ్రహించింది తల్లి— 'అయినా మహేంద్రుడు పిల్లను చూచి నచ్చితే తప్పక ఆమెను వరిస్తాడు, అతడి కఠినస్వరం కోమలత్వాన్ని వహిస్తుంది.' అని వూహించింది.

నిశ్చింతగా వివాహం చేస్తానని మాట ఇచ్చింది రాజలక్ష్మి. ముహూర్తం నిర్ణయించబడింది. పెళ్లి ముహూర్తం సమీపిస్తూఉంది. మహేంద్రుని హృదయంలో అతి విచిత్రమైన భావాలు రేకెత్తసాగాయి. చివరికి ముహూర్తం రోజుకు

నాల్గురోజులు ముందుగా—"వద్దమ్మా, నే నెంతమాత్రం పెండ్లి చేసుకోను." అని తల్లితో కచ్చితంగా చెప్పివేశాడు.

బాల్యంనుంచి మహేంద్రునికి దైవసహాయం, మానవసహాయంకూడా సంపూర్ణంగా ఉంది. అందుచేతనే అతని కోరికలు శృంఖలా రహితంగా ఉన్నాయి—ఏ భాధను, ఏ విఘ్నాన్ని సహించడు. ఇతరుల అధికారాన్ని, వత్తిడిని ఎంతమాత్రం ఆమోదించడు. ఇతరుల వత్తిడివల్ల ఈ వివాహ సంబంధం తాను తన యిచ్ఛకు విరుద్ధంగా స్వీకరించడం జరిగిందని భావించాడు. ఇందుచేతనే వివాహ సంబంధంలో అకారణంగా అయిష్టం ఏర్పడింది; ఈ అయిష్టత చివరికి "నాకు వివాహంవద్దు" అనే వరకు వచ్చింది.

మహేంద్రునికి బిహారీ అను ఒక ముఖ్యమైన మిత్రుడున్నాడు. అతడు మహేంద్రుని దాదా (అన్న) యని, మహేంద్రుని తల్లిని 'అమ్మా'యని పిలుస్తూ ఉంటాడు. తల్లి వానిని 'స్టీమ్-బోటు' కు వెనుక కట్టబడే 'గాడిదబోటు' లాగా, మహేంద్రునికి అవసరమైన సామాను మోసేవానిలాగా భావిస్తూ ఉంటుంది; ఆమెకు వానియందు ప్రేమకూడా అంతమాత్రంగానే ఉంది. రాజలక్ష్మి బిహారీని పిలిపించి "అబ్బాయీ, అలాగయితే ఇక నీవీపని చేయకతప్పదు, లేకపోతే పాపం ఆ బీదపిల్లగతి..." అని అతనితో యేమేమో చెప్పబోయింది.

"అమ్మా, ఇది నావల్లకాదు. అనేకసార్లు మహేంద్రుడు పనికిరాదని పారవేసిన మిఠాయీలను నీమాట విని తిన్నాను; కాని పెళ్లి విషయంలో ఆవిధంగా చేయడానికి

వీలులేదు. అతడు పరిగ్రహింపజాలని కన్యను నేను చేపట్ట లేను." అని బిహారీ చేతులు జోడించి చెప్పాడు.

"బిహారీ వివాహం చేసుకోడు. అతనికి సర్వస్వమూ మహేంద్రుడే. పెళ్లి చేసుకొనడం పెళ్లాన్ని తీసుకొని రావడం అతడు ఎంతమాత్రం ఆలోచించలేడు." అని తనలో అనుకొన్నది రాజలక్ష్మి. ఇలా అనుకొనడంతో రాజలక్ష్మికి బిహారీమీద ఉన్న మమత ఎక్కువయింది.

వినోదిని తండ్రి ధనవంతుడు కాడు, ఐతే ఏకపుత్రిక కావడం చేత తన బిడ్డకు చాలాకష్టపడి ఒక మిషనరీ స్త్రీవల్ల చక్కగా చదువు చెప్పించాడు. చేతిపనులలోకూడా నైపుణ్యం సంపాదించింది. ఆమె నానాటికి యుక్తవయస్కురాలౌతున్నప్పటికి వారికి స్పృహరాలేదు. చివరికి తండ్రి మరణించాడు. ఇప్పుడు విధవరాలగు తల్లిని బిడ్డ వివాహం విషయంలో యోగ్యమైన వరుడెక్కడ దొరుకునా యనే చింత పీడిస్తూవుంది. డబ్బు లేకపోవడం మొదటిచిక్కు, రెండవది పిల్ల తెలివిగలది కావడం.

మహేంద్రుడు వివాహం చేసుకొనడని, బిహారీకి కూడా ఇష్టంలేదని గ్రహించింది రాజలక్ష్మి. ఇక లాభంలేదని తన పినతండ్రికొడుకును ఎలాగో ఇష్టపరచి వివాహంపూర్తి చేసింది.

ఎన్నో రోజులు గడవకముందే వినోదిని భర్త మరణించాడు. ఆమె విధవరాలయింది. "నేను వివాహం చేసుకొనక పోవడం ఎంత మేలయిందో చూడు, భార్య విధవమైతే

నే నీ ప్రపంచంలో ఘుడియన్నైనా ఉండడం సంభవిస్తుందా!”
నవ్వాడు మహేంద్రుడు.

ఇది జరిగిన తర్వాత మూడు సంవత్సరాలు గడిచాయి.
తల్లి కొడుకుల మధ్య ఒకనాడు ఈవిధంగా సంభాషణ జరిగింది.

తల్లి:— అబ్బాయీ, లోకులు నన్నునిందిస్తున్నారు!

కొడుకు:— ఎందుకమ్మా, నీ వెవరికేమి చెరుపు
చేశావు?

తల్లి:— కొడుకుకు వివాహంచేస్తే, కోడలు రాగానే
బిడ్డ పరాయివాడవుతాడనే భయంచేత నేను నీకు వివాహం
చేయడంలేదట.

కొడుకు:— నీకు ఈభయం ఉండడంలో తప్పేముంది?
నేనే తల్లినైతే నాగొంతులో ప్రాణంఉండగా నేను వివాహం
చెయ్యను. లోకులమాటలను సంతోషంగా అంగీకరించేవాణ్ణి.

“వింటున్నావా వీడి మాటలు” అని నవ్వింది తల్లి.

“కోడలువచ్చి కొడుకును స్వాధీనం చేసుకొంటుంది—
అప్పుడు ఎన్నెన్నో కష్టాలను అనుభవించి ఇంత ప్రేమవృష్టిని
వర్షిస్తూఉన్న తల్లి వేరైపోతుంది. తల్లి బిడ్డలమధ్య ఒక
అపరిచిత వ్యక్తి వచ్చి అంతరం కలిగిస్తుంది. ఇది నీకిష్టం
అవుతుందేమోకాని నాకెంతమాత్రం బాగాలేదు.” అన్నాడు
మహేంద్రుడు.

“విన్నావా చెల్లెలా, మహేంద్రుడు ఏమంటున్నాడో.
కోడలు వచ్చి నానుంచి తనను వేరుచేయకుండా ఉండటానికి
తాను వివాహంచేసుకోడట! ఇలాంటి విచిత్రమైన మాట

ఎక్కడైనా విన్నావా?" అని లోలోపల బాధపడుతూ తోడికోడలితో అన్నది రాజలక్ష్మి.

"అబ్బాయీ, ఇది నీ తెలియని తనం. ఏసమయంలో ఏపని జరగాలో అది జరగడమే మంచిది. ఇప్పుడు తల్లిఒడిని వదలిపెట్టి కోడలితోకూడా గృహ నిర్వాహణం చేసుకొనే సమయం వచ్చింది. ఇలాంటి సమయంలో నీవు చిన్న పిల్లల లాగా వ్యవహరించడం నాకు బాగాలేదు." అన్నది అతని పిన్నమ్మ.

ఇది రాజలక్ష్మికి నచ్చలేదు. తోడికోడలు చెప్పిన మాటలు సరళంగానే ఉన్నాయి, కాని మధురంగాలేవు.

"నా బిడ్డ నన్ను ఇతరుల బిడ్డలవలె కాక ఎక్కువగా ప్రేమిస్తుంటే ఇందులో నీకు బాగులేకపోవడమేమిటి చెల్లెలా? నీబిడ్డ అయితే నీకీ రహస్యం బోధపడి ఉండేది." అన్నది రాజలక్ష్మి.

'వీడు ఆమె బిడ్డకాడు, నా బిడ్డ కాబట్టి తోడికోడలు ఈర్ష్యగా మాట్లాడింది' అని అనుకొంది.

తోడికోడలు పేరు అన్నపూర్ణ—"నీవు వివాహం మాట తెచ్చావు కాబట్టి నేనావిధంగా అనవలసివచ్చింది. లేకపోతే నా కీవిషయంలో మాట్లాడే అధికారం ఏముంది?" అన్నది అన్నపూర్ణ.

"నా కొడుకు పెళ్ళాడకపోతే నీ గుండెలెందుకు అవిసి పోతున్నాయి? ఇంతవరకు నా బిడ్డ నెలాచూచుకొన్నానో,

ఇకముందుకూడా ఆవిధంగానే చూచుకొంటాను; ఈ విష యాలో ఎవరితోను నాకు అవసరంలేదు." అన్నది రాజలక్ష్మి.

అన్నపూర్ణ కన్నీరు కారుస్తూ అచ్చటినుండి వెళ్ళి పోయింది. మహేంద్రునికిది చాలా కష్టంగా తోచింది. అతను ఆరోజు కాలేజీనుండి త్వరగా వచ్చాడు. వెంటనే పినతల్లి గదికి వెళ్ళాడు.

పినతల్లి అన్నమాటలు ప్రేమతో అన్నవేయని మహేంద్రునికి తెలుసు. పినతల్లి చెల్లెలివద్ద ఒక తలిదండ్రులు లేని బాలిక ఉన్నదనికూడా తెలుసు. ఆ పిల్లను తనవద్ద ఉంచుకొనడానికి వీలుగా మహేంద్రుడు పెళ్ళాడితే బాగా ఉండునని ఆమె యాశ. మహేంద్రుడు పెళ్ళాడడని తెలిసి కూడా పినతల్లి ఆవిధంగా ఆశించడం అతడికి చాలా స్వాభావి కంగాను, కరుణాజనకంగాను కనిపించింది.

మహేంద్రుడు పినతల్లి గదికి వెళ్ళేసరికి సూర్యాస్త మానం అవుతూఉంది. తన పినతల్లి తలగడదింపుకు తల ఆనించి నేలమీద కూర్చొని ఉంది; ముఖం వాడి ఉంది. ఏదో మౌనంగా ఆలోచిస్తూ ఉంది. వంటఇంట్లో వంటకాలు ఎక్కడి వక్కడే పడి ఉన్నాయి. ఆమె భోజనాన్ని తాకినట్లుకూడా లేదు. ఇదంతా చూచాడు మహేంద్రుడు.

సామాన్యమైన విషయాల్లో కూడా మహేంద్రునికి కళ్లకు నీళ్లు వస్తూఉంటాయి. పిన్నమ్మను చూడగనే కళ్ళలో నీళ్ళు తిరిగాయి. దగ్గరకు వచ్చి ప్రేమతో, ఆదరంతో "పిన్నమ్మా!" అని పిలిచాడు.

"రా, నాయనా, కూర్చో!" అని అన్నపూర్ణ బలవంతంగా నవ్వింది.

"చాలా ఆకలిగా ఉంది. భోజనం చేయాలి." అన్నాడు మహేంద్రుడు.

మహేంద్రుని భావం గమనించి, పొంగి వస్తున్న అశ్రుధారలను ఆపుకొని తాను భోజనం చేసి మహేంద్రునికి కూడా తుష్టిగా భోజనం పెట్టింది అన్నపూర్ణ.

అప్పుడు మహేంద్రుని హృదయం కరుణాసానుభూతులతో నిండిఉంది. భోజనమైన తర్వాత పిన్నమ్మకు కొంత ధైర్యాన్ని బోధించి-"పిన్నమ్మా, పూర్వం ఒకసారి మీచెల్లెలిగారి అమ్మాయి విషయం చెప్పావు కదూ, ఆమెను నాకుకూడా ఒకసారి చూపించు." అని హఠాత్తుగా అన్నాడు. మాట అయితే అన్నాడు, కాని తర్వాత మహేంద్రునికి చాలా భయంకలిగింది.

"వివాహం మీదికి బుద్ధి మళ్ళిందా?" అని నవ్వింది అన్నపూర్ణ.

"నాకొరకుకాదు పిన్నమ్మా, బిహారీని సమ్మతింపజేశాను. పిల్లను చూడటానికి ఒకరోజు నిర్ణయం చెయ్యి." అని వెంటనే అన్నాడు మహేంద్రుడు.

"బాగుంది, దానికి ఆమాత్రం అదృష్టం కూడానా? బిహారీలాంటి వాడు రావడానికి అదృష్టంకావద్దూ!" అన్నది అన్నపూర్ణ.

పిన్నమ్మ గదికి వెలుపలి గుమ్మంలో అమ్మా కొడుకులు కలుసుకొన్నారు.

"మహేంద్రా,ఏదోసంభాషణలు జరుగుతున్నట్లుందే?" అని అడిగింది రాజలక్ష్మి.

"సంభాషణలేమీ లేవమ్మా, ఆకులు తీసుకొనివెళ్ళ డానికివచ్చాను." అన్నాడు మహేంద్రుడు.

"ఆకులు నాగదిలో కావలసినన్ని ఉన్నాయి." అన్నది రాజలక్ష్మి.

మహేంద్రుడు జవాబు చెప్పకుండా మౌనంగా వెళ్ళి పోయాడు. రాజలక్ష్మి అన్నపూర్ణ గదిలోనికి బయటనుండియే తొంగిచూచింది. ఏడ్వడంచేత ఉబ్బియున్న ఆమె కళ్ళను చూచి ఆమెకు అనేక ఆలోచనలు కలుగసాగినాయి.

"ఎందుకమ్మా అబ్బాయికేదో బోధించి పంపుతు న్నావు?" అని ప్రత్యుత్తరానికి నిరీక్షించక వెంటనే అచ్చటి నుండి వెళ్ళిపోయింది.

## 2

మహేంద్రుడు పిల్లను చూడవలెనని చెప్పినవిషయం మరిచాడు. ఐతే అన్నపూర్ణమాత్రం మరచిపోలేదు. పిల్లను తన పోషణలో 'ఉంచుకొన్న చెల్లెలి బావగారికి ఒక జాబు వ్రాసింది. ఆజాబులోనే పిల్లను చూడడానికి ఒక రోజుకూడా నిర్ణయించిది. మహేంద్రుడు కలకత్తాలో నివసిస్తున్నాడు. పిల్ల కూడా ఆనగరంలోనే ఒక మెయిన్‌స్ట్రీటులో ఉంది.

పిల్లను చూడడానికి ఒకరోజు నిర్ణయమైపోయింది. ఇది విని—"ఇంత తొందరయెందుకు పిన్నమ్మా, నేనీ విషయం ఇంత వరకు బిహారీతో చెప్పనేలేదు." అన్నాడు మహేంద్రుడు.

అన్నపూర్ణ:— ఇదేమిటి మహేంద్రా? నీవు బిహారీ ఇష్టపడ్డాడని చెప్పావుకదా, ఇప్పుడు వెళ్లకపోతే వారేమను కొంటారు చెప్పు?

మహేంద్రుడు బిహారీని పిలిపించి పరిస్థితినివివరించి— "కన్యను నీవిష్టపడకపోతే బలవంతంగా నీమెడకు కట్టేదేమీ లేదు." అన్నాడు.

బిహారీ:— ఇది నావల్లకాదు పిన్నమ్మ చెల్లెలి బిడ్డను చూచి ఇది నాకిష్టంకాలేదని నేను చెప్పలేను.

మహేంద్రుడు:— అది ఇంకా మంచిదే.

బిహారీ:— కాని మహేంద్రదాదా, ఇది చాలా అన్యాయం. నీభారాన్ని వదలించుకొనడానికి ఇతరుల నెత్తిన భారాన్ని మోపడం ఉచితమైన పనికాదు. ఇష్టంలేదని చెప్పి పిన్నమ్మను కష్టపెట్టడం నాకు చాలా బాధ కలిగిస్తుంది.

మహేంద్రునికి కొంచెం లజ్జ కోపం వచ్చి—"ఐతే ఏమంటావు?" అన్నాడు.

బిహారీ:— నీవు నా విషయంలో వారికి ఆశ కలిగించావు. ఇక వివాహమాడక తప్పదు, చూడవలసిన ఆవశ్యకం ఎంతమాత్రం లేదు.

బిహారీ అన్నపూర్ణను ఒక దేవతగా భావిస్తాడు, భక్తి కలిగి ఉంటాడు. చివరకు ఆమె బిహారీని పిలిపించి—"నాయనా,

అలా వీలులేదు. ముందు నీవు తప్పకుండా పిల్లను చూడాలి. నీకు పిల్ల నచ్చకపోతే నీకు ఎంత మాత్రం వివాహం జరగ నీయను. దైవసాక్షిగా చెపుతున్నాను." అని చెప్పింది.

నిర్ణయింపబడ్డ రోజున మహేంద్రుడు కాలేజినుండి వచ్చి తల్లితో — "నా పట్టుకోటు, ఢక్కా-ధోవతులు తీసి ఇవ్వు." అన్నాడు.

తల్లి—ఎందుకు, ఎక్కడికి వెళ్లుతున్నావు?

మహేం-ఒకచోటికి వెళ్ళాలి, చాలా త్వరగా వెళ్ళాలి, మళ్ళా వచ్చి చెప్పుతాను.

మహేంద్రుడు కొంత అలంకారం చేసుకోనకుండా ఉండలేకపోయాడు. ఇతరుల కొరకు వెళ్లుతున్నా పెళ్ళి కూతుర్ని చూడడానికి వెళ్ళడం కాబట్టి, యౌవనుడు కావడం చేత వెండ్రుకలు దువ్వడం, ఉత్తరీయంపైన ఒక సీసా సెంటు చల్లుకొనడం అతనికి అవసరంగా కనిపించింది.

ఇద్దరు పెళ్ళికూతుర్ని చూడడానికి వెళ్ళారు.

పెళ్ళికూతురి పెదతండ్రి విశ్వనాథప్రసాద్ మంచి భోగ పురుషుడు. బాగా సంపాదించి ఒక మూడంతస్తుల భవనం, దానికి అనుబంధంగా ఒక ఉద్యానవనం కట్టించుకొన్నాడు. చుట్టుప్రక్కల ఉన్న భవనాల్లో అతని భవనంకూడా అతని గౌరవంలాగానే తల ఎత్తుకొని నిల్చిఉంది.

విశ్వనాథుడు బీదవాడైన తన సోదరుడు మరణించిన తర్వాత మరదల్ని తన ఇంటికి తెచ్చి ఉంచుకొన్నాడు. బాలిక పిన్నమ్మ అన్నపూర్ణ ఆమెను తనవద్ద ఉంచుకొందా

మని అనుకొన్నది, అలా చేయడంవల్ల ఖర్చు తగ్గినప్పటికి కూడా దానితోపాటు గౌరవంకూడా తగ్గుతుందని భయపడి విశ్వనాథుడు అంగీకరించలేదు. మాన-మర్యాదలు రక్షించుకొనే విషయంలో చాలా పట్టుదలగల మనిషి; అందుచేతనే పిల్లను ఆమె పినతల్లివద్దకు లాంఛనంగాకూడా ఎన్నడూ పంపలేదు.

బాలిక వివాహ యోగ్యురాలు కావడంచేత విశ్వనాథుణ్ణి ఆమె పెళ్ళినిగురించినచింత పీడించసాగింది. కాని ఈరోజుల్లో 'యాదృశీభావనాయస్య సిద్ధిర్భవతితాదృశీ' అనే సామెత ఫలవంతంకావడం అంతగాలేదు. ఉద్దేశంతోపాటు ధనాన్నికూడా వెచ్చించవలసి ఉంటుంది. పెళ్ళిఖర్చు, వరకట్నం విషయంలో విశ్వనాథుడు "నాకూ ఒక కొమార్తె ఉంది, నేనొక్కడనే ఎన్నికార్యాలు చేయగలను!" అనడం మొదలుపెట్టాడు. ఈ చిక్కులలో ఆవిడ పెళ్ళి చేయవలెనని ఉద్దేశించినా ఆగిపోయింది. ఇదే సమయంలో మహేంద్రుడు సిద్ధపడి తన మిత్రునితోకూడా రంగంలో ప్రవేశించాడు.

చైత్రమాసం, సాయంసమయం, సూర్యు డస్తమించనున్నాడు. విశ్వనాథుని భవనంలోని రెండో అంతస్తులో దక్షిణ దిక్కుగా వున్న పంచలో ఒక గుండ్రని చలువరాతి తిన్నెమీద రెండు వెండిపళ్ళాలనిండా అతిథులకు కొన్ని లడ్లు, పళ్లు పెట్టిఉన్నాయి. ప్రక్కనే రెండు వెండిగ్లాసులు ఐస్ వాటరుతో నిండి ఉన్నాయి. ఆ చల్లని మంచునీటిలో నుండి వెలువడు ముత్యాలవంటి మంచు బిందువులు ఆపాత్ర

లకు మంచిఅందాన్ని కలిగించాయి. మహేంద్రుడు, బిహారి సంకోచిస్తూ జలపానం చేయడానికి కూర్చొన్నారు. దిగువ నున్న తోటలో జలధార యంత్రముగుండా తోటమాలి చెట్లకు నీరు పోస్తున్నాడు. దక్షిణ దిక్కునుండి వచ్చే గాలి క్రింద మట్టిమీద నీళ్ళు పడినందువల్ల పుట్టిన సుగంధాన్ని మోసుకొని మేడమీదికి వచ్చింది. అది మహేంద్రుని సుగంధంతో కూడిన ఉత్తరీయాన్ని ఎగురగొట్టుతూ ఆడు కొంటూ ఉంది. సమీపంగావున్న కిటికీలనుండి అప్పుడప్పుడు కొద్దికొద్దిగా అణచిపెట్టిన నవ్వులు, మెల్లిమెల్లిగా సంభాషణలు జరుగుతున్నట్లు అస్పష్టమైన ధ్వనులు, ఒక్కొక్కసారి చిన్నగా గలగలలాడుతున్న ఆభరణాలచప్పుళ్ళు వినబడుతున్నాయి.

జలపానం అయిన తర్వాత—"చున్నీ, తమలపాకులు తీసుకొనిరా." అని ఇంట్లోకి చూస్తూ అన్నాడు విశ్వనాథుడు.

తర్వాత కొంతసేపటికి తిన్నగా వెనుకనున్న ద్వారం తెరువబడింది. అంతులేని లజ్జాభారంతో తల వంచుకొని ఆ బాలిక పాన్‌దానా తీసుకొని విశ్వనాథునికి సమీపంగా వచ్చి నిల్చొంది.

"ఎందుకు సిగ్గుపడతావు? ఆకులు వారి ముందుంచు." అన్నాడు విశ్వనాథుడు. బాలిక గడగడ వణకుతూ పాన్ దానాను ఆ అతిథులముందు వుంచింది. పంచకు పడమటి దిక్కునుండి అస్తంగతుడగుచున్న సూర్యుని బంగారు ఛాయలు లజ్జతో వంగివున్న ఆ బాలిక ముఖానికి ఒక క్రొత్త అందాన్ని

కలిగించాయి. సరిగా అదే సమయంలో లజ్జావనతము—కరుణాజనకము అయిన ఆమె ముఖాన్ని మహేంద్రుడు చక్కగా చూచాడు.

ఆ బాలిక ఆకుల పళ్ళాన్ని అక్కడే ఉంచి లోపలికి పోబోతూ ఉండగా—"చున్నీ, కొంచెం ఉండమ్మా!" ఈమె నా తమ్ముడు ఉమాశంకరుని బిడ్డ. వారు వెళ్ళిపోయారు. ఇప్పుడు నాకంటే ఈమెకు ఎవ్వరూ లేరు." అని ఆ బాలికను అతిథులకు పరిచయం చేసి ఒక దీర్ఘ నిశ్వాసాన్ని విడిచాడు విశ్వనాథుడు.

మహేంద్రుని హృదయంలోని దయాప్రవాహం కట్టలు త్రెంపుకొని ప్రవహింపసాగింది. అతడు ఆ తలిదండ్రులు లేని బాలికమీద మరొకసారి తన కరుణాపూర్ణమైన దృష్టులను ప్రసరింపజేశాడు.

బాలిక వయఃపరిమాణాన్ని ఎవ్వరూ కచ్చితంగా చెప్ప లేక పోయారు. ఇంటివారు పన్నెండో, పదమూడో ఉంటా యని అంటారు—దానిభావం పదునాల్గు, పదిహేను సంవత్స రాలు కావచ్చు. పరాయివారి అనుగ్రహంతో జీవిస్తూ ఉన్నందువల్ల ఒక విధమైన సంకోచం, భయం ఆమె యౌవన ప్రకాశాన్ని దాచి ఉంచింది.

"నీపేరేమి?" అని దయార్ద్రహృదయుడైన మహేం ద్రుడు ఆమెనడిగాడు.

వెంటనే విశ్వనాథబాబు ఆమెకు ప్రోత్సాహకరంగా—"చెప్పుతల్లీ, నీపేరు చెప్పు." అన్నాడు.

బాలికకు వారి ఆజ్ఞను పాలించడం అలవాటు. తల వంచుకొని—"ఆశాలత." అన్నది.

"ఆశాలత!" అనే ఈపేరు మహేంద్రునికి ఆశాజనకం గాను; కంఠస్వరం అతికోమలంగాను ఉంది. తనహృదయంలో ఎవరోగాని 'ఆశాలత అనాథ!' అన్నట్లు వినిపించింది.

మిత్రులిద్దరు వెలుపలికి వచ్చి బండిమీద కూర్చొన్నారు. బండి బయలుదేరింది. "బిహారీ, నీవీబాలికను చేయి దాటి పోనీయకుసుమా!" అన్నాడు మహేంద్రుడు.

బిహారీ ఈమాటకు స్పష్టమైన జవాబుచెప్పక—"ఈ బాలికకు సరిగ్గా ఆమెపినతల్లి పోలికలే ఉన్నాయి. ఆమె లాగానే గుణవతికూడా కావచ్చు." అన్నాడు.

మహేంద్రుడు:—నేను నీపైనుంచినభారం ఇప్పుడు నీవు, సహింపరానిది కాదనుకొంటాను.

బిహారీ:—లేదు, దానిని నేను ఎత్తగలననుకొంటాను.

మహేంద్రుడు:— నీవు ఆభారాన్ని మోయలేనని అనుకోవద్దు, నీవామాట అనేలాగుంటే ఆభారాన్ని నేనే మోస్తాను. ఏమంటావు?

"మహేంద్రదాదా, నిజంగా చెప్పుతున్నావా? ఇప్పుడైనా కచ్చితంగా చెప్పు. నీవు నిజంగా ఆమెను పెళ్ళాడే లాగుంటే పిన్నమ్మ చాలా సంతోషిస్తుంది. ఆమె ఆపిల్లను ఎల్లప్పుడు ఆమెవద్ద ఉంచుకొనడానికి వీలుకలుగుతుంది." అని గంభీరంగా అన్నాడు బిహారీ.

మహేంద్రుడు:— నీవు పిచ్చివాడవా? అలాగైతే చాలా రోజులక్రిందటే జరిగిఉండేది.

బిహారీ ఇక అధికంగా మాట్లాడలేదు; ఇంటికి వెళ్ళాడు. మహేంద్రుడుకూడా బండిదిగి వీధులవెంట తిరిగి తిరిగి చాలా ఆలస్యంగా ఇంటికి వెళ్ళాడు.

మహేంద్రుని తల్లి-ఆసమయంలో పూరీకూర తయారు చేయడంలో మగ్నమై ఉంది. పినతల్లి అంతవరకు విశ్వనాథుని ఇంటినుండి తిరిగిరాలేదు.

మహేంద్రుడు ఒంటరిగా మేడ పైభాగంలో ఈజీ ఛైర్‌లో పండుకొన్నాడు. కలకత్తాలోని ఎత్తైన భవనశృంగాల మీదుగా శుక్లపక్ష సప్తమినాటి అర్ధచంద్రుడు గుట్టుగా తన సమ్మోహన మంత్రాలను వల్లెవేస్తున్నాడు. తల్లి వెళ్ళి భోజనానికి రమ్మని పిల్చింది. అతడు నిస్సారమైన మాటల్తో— "ఇప్పుడు నేను రాలేనమ్మా" అన్నాడు.

తల్లి:— ఐతే ఇక్కడికి తీసుకరానా?

మహేం:— వద్దు, ఈవేళ నాకు భోజనం వద్దు. తిని వచ్చాను.

తల్లి:— ఎక్కడ భోజనం చేయడానికి వెళ్లావు?

మహేం:— తర్వాత చెప్పుతాను. ఇప్పుడు నావంట్లో కులాసాగా లేదు.

మానవతియైన తల్లికి ఎన్నడూలేని పుత్రుని ఈ వ్యవహారం తప్పుగా తోచింది. ఆమె మరేమీ మాట్లాడకుండా వెళ్లుతూఉంది.

ఇంతలో మహేంద్రునికి తెలివి వచ్చింది. తాను చేసిన పొరబాటుకు లజ్జపడి—"అమ్మా! భోజనం ఇక్కడికి తీసుకరా" అన్నాడు.

"ఆకలి లేనప్పుడు ఎందుకు తీసుకొని రావడం?" అన్నది తల్లి.

ఈ మాటమీద తల్లి బిడ్డల మధ్య మానాభిమానాల సందర్భంగా కొంతసేపు చర్చ జరిగింది. చివరికి మహేంద్రునికి భోజనం చేయక తప్పలేదు.

# 3

ఆ రాత్రి మహేంద్రునికి బాగా నిద్ర పట్టలేదు. ప్రొద్దు పొడిచీపొడవకముందే బిహారీవద్దకువెళ్లి "తమ్ముడూ నేను రాత్రి బాగా ఆలోచించాను. పిన్నమ్మ చెల్లెలిబిడ్డను వివాహం చేసుకొనకపోతే ఆమెకు కోపం వచ్చేలాగుంది. ఆమె తన చెల్లెలి బిడ్డను నేను వివాహం చేసుకొంటే తన దగ్గర ఉంచుకొనవచ్చునని భావిస్తున్నది." అన్నాడు.

బిహారీ:—ఈ విషయంలో ఆమె కోరికను ఆమె అనేక సార్లు వెల్లడించియే ఉంది. దీనిని గురించి క్రొత్తగా మరేమీ చెప్పనక్కరలేదు. ఇందులో క్రొత్త విషయమేముంది?

మహేం:— ఆc. అదే నేనూ చెప్పేది. ఆశను నేను వివాహ మాడకపోతే జీవితాంతంవరకు ఆమె హృదయంలో ముల్లులాగా బాధిస్తూనే ఉంటుంది.

బిహారీ:— మరొక దిక్కుకు చూస్తూ ఐతే కావచ్చు!

మహేం:— నేను ఆమెను వివాహ మాడకపోవడం మంచిదికాదు – అది చాలా అన్యాయం.

బిహారీ:— (ఒక విధమైన అస్వాభావికమైన ఉత్సాహంతో)—మంచిమాట చెప్పావు. నీవు ఇష్టపడితే ఇదేమంత పెద్ద విషయంకాదు. ఐతే ఈ కర్తవ్యనిష్ఠ నిన్ననే నీకు కలిగి ఉంటే బాగుండేది.

మహేంద్రుడు:— ఒకరోజు ఆలస్యంగానే కలిగిందనుకో దానివల్ల నష్టమేముంది?

ఇట్లు మహేంద్రుడు వివాహంవైపునున్న తన మానసికమైన బంధాన్ని సడలించాడు. అటు ఈవిషయంలో ఆలస్యం కావడం అసహ్యంగా తోచింది. అనవసరమైన కాలహరణం జరుగకుండా త్వరగా అయిపోతే బాగాఉంటుందని ఆలోచిస్తున్నాడు.

మహేంద్రుడు తల్లివద్దకువెళ్ళి "సరేనమ్మా, నీమాటలనెంతమాత్రం జవదాటజాలను. నేను వివాహం చేసుకొంటాను." అన్నాడు.

'తోడికోడలు అకస్మాత్తుగా తన చెల్లెలిబిడ్డను చూడడానికి ఎందుకు వెళ్ళింది! మహేంద్రుడు అంత హడావిడిగా వెలుపలికి ఎందుకువెళ్ళాడు! ఆఁ, ఇప్పుడు అర్థమాతూఉంది.' అని మనసులో అనుకొంది రాజలక్ష్మి. తాను మాటిమాటికి కోరిన కోరికలన్నీ తుంగలోత్రొక్కి అతడు పిన్నమ్మ వ్యూహంలో పడిపోవడం ఆమెకు అవమానకరంగా ఉంది.

తోడికోడలి వ్యూహాన్ని భగ్నంచేయాలని దృఢప్రతిజ్ఞ చేసుకొని — "సంతోషం, నీకు మంచిపిల్లను వెదకుతాను." అన్నది.

"కన్యను వెదకవలసిన పనేముంది?" అని ఆశాలత విషయం చెప్పాడు.

"నాయనా, ఆపిల్ల మంచిదికాదు. ఆమెతో నీకు పెళ్లి జరుగనీయను, ఈమాట గట్టిగాచెప్పతున్నాను." అన్నది తల్లి.

"ఎందుకమ్మా, బాలిక చెడ్డదికాదు."—అని వీలైనంత సహనభావంతో అన్నాడు మహేంద్రుడు.

"ఆమెకు మూడుతరాలుగా ముందూ వెనుక ఎవ్వరూ లేరు; ఆమెను వివాహం చేసుకొనడంవల్ల కుటుంబం ఏమి సౌఖ్యం పొందుతుంది?" అన్నది తల్లి.

"కుటుంబంలో ఏసుఖంలేకపోయినా నాకు బాధలేదు. నాకు ఆపిల్ల చాలా చక్కగా ఉంది." అన్నాడు మహేంద్రుడు.

కొడుకు పట్టుదలచూచి రాజలక్ష్మి హృదయం ఈ విషయంలో ఇంకా కాఠిన్యాన్ని పొందింది. ఆమె సరాసరి అన్నపూర్ణవద్దకువెళ్ళి—"ఒక తల్లితండ్రిలేని కురూపిని నా ఏకైకపుత్రునికి కట్టి నాకూ నాబిడ్డకు ఎడబాపవలెనని చూస్తున్నావా? ఇంత రాక్షసత్వమా?" అని అరిచింది.

"మహేంద్రుని పెండ్లి విషయంలో మాటలేమీ జరుగలేదు. అతడు తనకుతానై నీతో ఏమయినా చెప్పాడేమో అదినాకు తెలియదు." అన్నది అన్నపూర్ణ ఏడుస్తూ.

కాని రాజలక్ష్మికి ఈమాటలు విశ్వాసాన్ని కలిగించ లేవు. అప్పుడు అన్నపూర్ణ బిహారీని పిలిపించి కంట నీరుపెట్టు కొని—"నీవిషయంలో అన్నిమాటలు మాట్లాడుకొన్నాము, మళ్ళీ ఈ అల్లరి తెచ్చిపెట్టావేమబ్బాయీ? నీవే ఆ అమ్మా యిని పెండ్లిచేసుకో. నీవు ఇష్టపడకపోతే నాకు చాలాకష్టంగా ఉంటుంది. పిల్ల చాలా చక్కగాఉంది. నీకు తగినపిల్ల." అన్నది.

బిహారీ:—పిన్నమ్మా, నీవు నాతో ఎందుకిలా చెబు తున్నావు? ఆమె నీచెల్లెలి కూతురు కావడంచేత నేనామెను వివాహ మాడనని నిరాకరించలేను. నేను ఇప్పుడూ సిద్ధంగానే ఉన్నాను, కాని మహేంద్రుడు—

అన్నపూర్ణ మధ్యలో మాటకుఅడ్డంవచ్చి-"అబ్బాయ్, మహేంద్రునితో ఆమె కెంతమాత్రం వివాహం జరుగజాలదు. ఆ వివాహం నీతో జరిగితేనే నేను నిశ్చింతగా జీవించగలను. మహేంద్రునితో ఈ వివాహం జరుగవలెనని నేనెంతమాత్రం కోరడంలేదు." అన్నది.

బిహారీ:—పిన్నమ్మా, నీకోరిక అలావుంటే నేనింకేమీ బదులు చెప్పను.

ఇది జరిగిన తర్వాత బిహారీ రాజలక్ష్మివద్దకు వెళ్ళి "అమ్మా, పిన్నమ్మ చెల్లెలి బిడ్డకు నాకు వివాహ సంబంధం నిశ్చయమైంది. నాకు ఇంట్లో నా అనే ఆడదిక్కు లేని కారణంచేత నేను స్వయంగా నీకు చెప్పవలసివచ్చింది. నా యీ ప్రవర్తనకు క్షమించాలి." అన్నాడు.

"ఏమంటున్నావు బిహారీ! నీవీ మాట చెప్పడం నాకు చాలా సంతోషంగా ఉంది. సాక్షాత్ లక్ష్మిలాంటి పిల్ల, నీకు తగి ఉంది. ఈ పిల్లను ఏ విధంగానైనా చేయి జారిపోనియ్యకు" అని ఆశ్చర్యభావంతో అన్నది రాజలక్ష్మి.

"ఎందుకు చేయి జారిపోనిస్తాను. మహేంద్రదాదా స్వయంగా చూచి నాకీ సంబంధాన్ని ఏర్పాటు చేశాడు." అన్నాడు బిహారీ.

మహేంద్రుడు ఇలాంటి విఘ్నాలను బాధలను చూచి ఇంకా తీవ్రరూపాన్ని ధరించాడు. అతడు తన తల్లితోను, పిన్నమ్మతోను జగడమాడి ఒకహాస్టల్‌లో నివసించడం మొదలుపెట్టాడు.

రాజలక్ష్మి ఏడుస్తూ అన్నపూర్ణ దగ్గరకు వచ్చింది. "చెల్లీ, అబ్బాయి దుఃఖంతో ఇంటినుండి వెళ్ళినట్లు తెలుస్తూ ఉంది. ఇప్పుడు నీవే వానిని మంచి మార్గంలోకి త్రిప్పగలవు." అన్నది.

"కొంచెం ధైర్యం వహించు, మూడు నాలుగు రోజులలో అతని కోపం తగ్గిపోతుంది." అన్నది అన్నపూర్ణ.

రాజలక్ష్మి:—వాడి విషయం నీకు తెలియదు. వాడు కోరిన వస్తువు దొరకకపోతే ఇక వాడేదయినా చేస్తాడు. నీ చెల్లెలి బిడ్డను ఏ విధంగానైనాసరే వానికి—

అన్నపూర్ణ:— బాగుంది, అదెలా జరుగుతుంది? బిహారీకిచ్చి వివాహం చేయడం ఒక విధంగా నిర్ణయమైపోయింది.

రాజలక్ష్మి:— నిశ్చయమైనదాన్ని మార్చడానికి ఎంతకాలం పట్టుతుంది? నీవు అంతా చేయగలవు.

రాజలక్ష్మి వెంటనే బిహారీని పిలిపించి "నాయనా, నీకు వేరొక మంచిపిల్లను కుదిర్చిపెడతాను. ఇది నీకు తగింది కాదు. దీనిని విడిచిపెట్టు." అన్నది.

"లేదమ్మా, అలా జరగడానికి వీలుకాదు. అంతా నిశ్చయమైపోయింది." అన్నాడు బిహారీ.

అప్పుడు రాజలక్ష్మి అన్నపూర్ణతో—"అమ్మాయీ, నామీద ఒట్టు, నీకాళ్ళమీద పడతాను. నీవు బిహారీతో చెప్పావా అంతా చక్కబడి పోతుంది." అన్నది.

అన్నపూర్ణకు వేరేమార్గం లేకపోయింది. బిహారీని పిలిచి—"బిహారీ, ఆపిల్లను వివాహం చేసుకోనవద్దని నేను ఏ ముఖంతో నీకు చెప్పేది? కాని నీవే చెప్పు. ఇప్పుడు నేనేం చెయ్యాను? ఆశాలతను నీకిచ్చి వివాహంచేస్తే నాకు చాలా సంతోషంగా ఉండేది, కాని అన్నివిషయాలు నీకు తెలుసు." అని ఇక మాట్లాడలేకపోయింది.

బిహారీ:— నేను గ్రహించాను పిన్నమ్మా! నీవెలా కావాలీఅంటే అలాగేచెయ్యి. ఐతే నాదొక ప్రార్థన, వేరొక ప్పుడు వివాహవిషయంలో నాతో ఏమీ చెప్పవద్దు.

ఇలాఅని బిహారీ వెళ్ళిపోయాడు. అన్నపూర్ణ కళ్ళు అశ్రుపూరితాలయినాయి; కాని మహేంద్రుని క్షేమాన్నికోరి అప్పటికప్పుడు వాటిని తుడిచివేసుకొంది. ఇదీ ఒక విధంగా మంచిదే అని సంతృప్తిని పొందింది.

రాజలక్ష్మి, అన్నపూర్ణల హృదయాల్లో ఒక విధంగా అసంతుష్టికరమైన భావాలు రేకెత్తుతూనే ఉన్నాయి. ఇంతలో వివాహముహూర్తం ఆసన్నమయింది. బాగాలైట్లు వేయించారు. సన్నాయి వాళ్ళు మధురగానాన్ని వినిపిస్తున్నారు. విందులలో మృష్టాన్నానికి మిఠాయిలకి ఏమాత్రం కొరవలేదు.

ఆశాలత సాలంకృతమైన సుందరదేహంతో, లజ్జతో నిండిన ముఖంతో మొదటిసారిగా ఆయింటిలో అడుగుపెట్టింది.

ఈ సంసారోద్యానవనంలో ఆమె నవకోమలమైన హృదయానికి కంటకప్రాయంగా ఏదీ కనిపించడంలేదు. పైగా ఆమె పినతల్లి చక్కగా ప్రేమిస్తూ ఓదారుస్తూ ఉండడంవల్ల ఆమెకు ఏమాత్రం భయసందేహాలు కలుగడంలేదు.

కొన్నాళ్ళు గడిచాక మహేంద్రుని పిల్చి—"కోడల్ని కొన్నిదినాలు ఆమె పినతండ్రివద్దకు పంపాలి." అన్నది రాజలక్ష్మి.

మహేంద్రుడు:— ఎందుకు! ఏమిపనిఉంది?

తల్లి:— నీకు పరీక్షదినాలు కదా, చదువుకు విఘ్నం కలుగకుండా ఉండగలందులకు.

మహేం:— నేను పసివాడనా? నేను నామంచిచెడ్డలను గుర్తించలేనా?

"రోజులుమాత్రం ఎన్ని ఉన్నాయి? ఒక సంవత్సరమే గదా!" అని సందేహిస్తూ అన్నది రాజలక్ష్మి.

"ఆవిడకు తలిదండ్రులుండిఉంటే పంపడానికి నాకే అభ్యంతరంలేదు.; కాని పినతండ్రివద్ద ఉంచడం నాకిష్టం లేదు." అని దృఢచిత్తంతో అన్నాడు మహేంద్రుడు.

'బలే! ఇప్పుడే ఈ విధంగా ప్రారంభించావు! అన్నీ నీవేనా, నాకేఅధికారమూ లేదా! నిన్న పెళ్ళయిందో లేదో ఈవేళనుంచే నీకింత బాధ్యతకలిగిందా! నాకూ ఒకప్పుడు పెళ్ళయింది కాని ఇంత నిర్లజ్జ, ఇంత నిర్భయంగా సంచరించడం నాకు తెలియదు!' అని లోలోపల అనుకొన్నది రాజలక్ష్మి. "అమ్మా, నీవెంతమాత్రం భయపడవద్దు, పరీక్షలలో నా కెంతమాత్రమూ ఇబ్బందిలేదు." అన్నాడు మహేంద్రుడు.

## 4

రాజలక్ష్మి ఒక్కసారిగా మంచి ఉత్సాహంతో కోడలికి గృహనిర్వహణ కార్యకలాపాలు నేర్పడం సాగించింది. ఆశకు పగలంతా సామానుల గదిలో, వంట యింటిలో, దొరగారి సేవలో గడచిపోతూ ఉంది. ఇదిగాక రాత్రియందు రాజలక్ష్మి ఆమెచేత బట్టలు కుట్టిస్తూ, ఆమెకు ఆత్మీయ వియోగంవల్ల కలిగే చింతను తొలగిస్తూ ఉంది.

అన్నపూర్ణ బాగా ఆలోచించి తాను ఆశకు దూరంగా ఉండడం మంచిదని తలచింది.

తండ్రి బలవంతంగా చెరకురసాన్ని పిండుకొని మిగులకుండా త్రాగుతుండగా చూచి కుమారుడు తానుగూడా

త్రాగకపోతినే అని వ్యాకులం చెందుతున్నట్లు మహేంద్రుడు కూడా వ్యాకులపడడం మొదలు పెట్టాడు. తన కళ్ళఎదుట నవయువతియగు కోడలి బలాన్ని ఇంటిపనులనే తిరుగలిలో వేసి పిండిపిండిచేసి మన్నులోకలిపివేస్తున్నారు. ఆహా! మహేంద్రుడు దీనినెలా భరింపగలడు?

మహేంద్రుడు అన్నపూర్ణవద్దకువెళ్ళి – "పిన్నమ్మా, అమ్మ చూడు కోడలిచేత ఎలా పనిచేయిస్తున్నదో; దీనివల్ల దాని ఆరోగ్యం త్వరలో పాడైపోయేలాగుంది." అన్నాడు.

ఎక్కువగా పనిచేయిస్తున్నదనే సంగతి అన్నపూర్ణకు కూడ తెలుసు. ఐనప్పటికి–"మహేంద్రా, నీవెందుకలా భావిస్తున్నావు? పనిపాటలు నేర్పినందువల్ల ఆరోగ్యభంగం కలుగుతుందా? ఈనాటి కోడళ్ళలాగా నవలలుచదవడం, తివాచీలు నేయడం, యూరపియన్ లేడీలాగా తయారవడం బాగా ఉంటుందా?" అన్నది బెట్టుగా.

"మంచిగాని, చెడుగాని ఈనాటి పిల్లలు ఈనాటికి తగినట్లే ఉండాలి. నాభార్య నాలాగానే నవలలు చదివి రసగ్రహణం చేయగలుగుతుంది; ఐతే దీనిలో ఎగతాళి చేయవలసిన విషయంగాని, దుఃఖించవలసిన విషయంగాని ఎంత మాత్రమూ కనిపించడంలేదు." అన్నాడు రోషంతో మహేంద్రుడు.

అన్నపూర్ణగదిలో తనకొడుకు మాట్లాడుతూ ఉండడం విని ఎక్కడిపని అక్కడేవదలిపెట్టి పరుగెత్తివచ్చింది రాజలక్ష్మి.

"ఇద్దరి మధ్య ఏదో సంభాషణలు జరుగుతున్నాయే?" అన్నది కటువుగా.

మహేంద్రునికి బాగా కోపం వచ్చింది—"మరే సంభాషణలు లేవు. నీ కోడలిచేత దాసీదానిలాగా ఇంటిపనులు చేయించడం బాగాలేదు." అన్నాడు.

"ఐతే ఆవిడ ఏంచేస్తుంది?" అని అడిగింది తన కోపాన్ని దిగమ్రింగుకొంటూ రాజలక్ష్మి.

మహేం:— నే నావిడకు చదువు నేర్పుతాను.

రాజలక్ష్మి బదులు మాట్లాడకుండా త్వరత్వరగా వెళ్ళి ఒక ఘడియతర్వాత కోడలి చేతులు రెండూ పట్టుకొని మహేంద్రునివద్దకు తీసుకొనివచ్చి – "ఇదిగో నీభార్య చదువు నేర్పుకో!" అన్నది.

వెంటనే అన్నపూర్ణవద్దకు వచ్చి చేతులు జోడించి "అమ్మా, నన్ను క్షమించు. నేను మీ అమ్మాయి గౌరవాన్ని తెలుసుకోలేకపోయాను; ఆమె సుకుమార హస్తాలతో పని చేయడంవల్ల కలిగిన మచ్చలను పోగొట్టి బూబమ్మను చేసి మహేంద్రునికి అప్పగించు. ఆమె కాలుమీద కాలువేసుకొని చదువుతూ ఉంటుంది. నేను దాసీపని చేస్తూ ఉంటాను." అని అక్కడినుండి తన ఇంటికి వెళ్ళి గభాలున తలుపులు మూసింది రాజలక్ష్మి.

అన్నపూర్ణ క్షోభతో ఆలోచిస్తూ క్రింద కూర్చొంది. ఆకస్మాత్తుగా, హఠాత్తుగా సంభవించిన ఈ గృహ విప్లవానికి కారణం బోధపడలేదు. ఆమె లజ్జ, భయం, దుఃఖం కలుగడంచేత

చింతిస్తూ ఉంది. 'సరే, ఇక నా భార్య విషయం నేనే చూచు కొంటాను. లేకపోతే అన్యాయం జరుగుతుంది.' అని కోపంతో నిశ్చయించుకొన్నాడు మహేంద్రుడు.

కోరిక కలగడం అందుకు అనుగుణంగా కర్తవ్యబుద్ధి ఉండడం ఇది వాయు—అగ్ని సంయోగంవంటిది. కాలేజి, పరీక్షలు, మిత్రత, సామాజిక విధానాలు, అణచి ఉంచడం ఇవన్నీ ఏమయినాయో తెలియదు. భార్యను ఉన్నతికి తేవ డమే మహేంద్రుని లక్ష్యమయింది. పనిపాటల నుండి, లౌకిక అభిమానాలనుండి తన దృష్టిని మరల్చాడు.

'మహేంద్రుడు భార్యతో గూడా వెళ్ళినప్పటికీ వాడి ముఖం చూడను. తల్లిని విడిచిపెట్టి భార్యతో ఎలా వుంటాడో అదీ చూస్తాను.'—అని తనలోఅనుకొంది అభిమానవతియైన రాజలక్ష్మి.

పగలు గడిచింది, రాత్రి గడచిపోయింది. రెండవరోజు వచ్చింది; కాని కొడుకు క్షమార్పణ కోరడానికి వస్తున్న చప్పుడేమీ వినిపించడంలేదు రాజలక్ష్మికి. 'ఈరోజున క్షమా ర్పణ కోరడానికి వచ్చేలాగుంటే క్షమిస్తాను. లేకపోతే వాని అంతు తేలుస్తాను.' అని నిర్ణయించుకొంది.

పన్నెండు గంటలయింది, తన గదిలోని కెవ్వరూ రాలేదు.

అంతట—'నేను స్వయంగా వానివద్దకు వెళ్ళి క్షమిస్తాను. ఒకవేళ బిడ్డకు కోపం వచ్చిందనుకో, తల్లికికూడా కోపంరావలసిందేనా?' — అనేనిర్ణయానికివచ్చింది రాజలక్ష్మి.

రెండవ అంతస్తుమీద ఒక మూలగా ఒక చిన్నగది ఉంది. అది మహేంద్రునికి చదువుకొనడానికి పడుకొనడానికి వినియోగింపబడుతూఉంది. ఇక్కడ చాలా దినాలనుండి తాను కొడుకుబట్టలు విదిలించి చుట్టిపెట్టలేదు, పడక సరియైనస్థానంలో ఉంచలేదు, చక్కగా శుభ్రపరచనూలేదు.

రాజలక్ష్మికి ఈపనులుచేయడం బాగాఅభ్యాసం అయింది. ఆమె అన్నింటికంటె ఈపనులకే ఎక్కువ ప్రాధాన్యాన్నిస్తుంది. చాలా దినాలుగా ఈపనులు చేయక పోవడం చేత ఆమె హృదయం పాలతో నిండిన స్తనంలాగా లోలోపల బాధింపసాగింది. మధ్యాహ్నం అయింది.—'మహేంద్రుడు కాలేజీకి వెళ్ళివుంటాడు, వెళ్ళి వాడిగది బాగుచేసివస్తాను. వాడు కాలేజినుండి వచ్చి చూచి తల్లికి తనమీద దయవచ్చిందని తెలుసుకొంటాడు.' అనుకొంది.

రాజలక్ష్మి మెట్లుఎక్కి పైకివెళ్ళింది. మహేంద్రుని గది ద్వారానికి వేసియున్న పరదా తొలగింపబడిఉంది. దానికి ఎదురుగా వస్తూఉండగానే ముల్లు గ్రుచ్చుకొన్నదానిలాగా అదరిపడ్డది. మహేంద్రుడు నేలమీద పడుకొని నిద్రపోతున్నాడు. కోడలు దర్వాజాకు వీపునానించి తిన్నతిన్నగా మగని అరికాళ్ళను ఒత్తుతూఉంది.

మధ్యాహ్నపు ప్రకాశవంతమైన వెలుతురులో తలుపు తెరచి వుండగా ఈ యవ్వన లీలాభినయాన్ని చూచి ఆమెకు లజ్జగలిగి 'ఛీ' యని నిశ్శబ్దంగా క్రిందికి వెళ్ళిపోయింది.

# 5

కొన్నిదినాలు వరుసగా నీరుపోయని కారణంచేత వాడిపోయి పసుపురంగుగామారిన బీజదళాలు నీరు దొరకగానే నవనవలాడుతూ ఒక్కసారిగా పైకిలేస్తాయి. దుర్బలత్వాన్ని—అణగి ఉండడాన్ని విడిచిపెట్టి, సంకోచరహితంగాను, చింతారహితంగాను తనఅధికారాన్ని ఉన్నతమయిందిగాను ఉజ్వలమయిందిగాను చేసుకొంటుంది. ఆశాలత పరిస్థితికూడా ఈ విధంగానేవుంది. తనకు రక్తసంబంధం కలిగి ఉన్నస్థానంలో హృదయపూర్వకంగా ఆమెను ప్రేమించిన వారెవ్వరూలేరు. నేడు ఇతరుల ఇంటికివచ్చి అయాచితంగా లభించిన మిక్కిలి దగ్గర సంబంధాన్ని, సంశయ రహితమైన అధికారాన్ని పొందింది. మహేంద్రుడు, ఆ మమతారహితమైనపాలనలో పెరిగిన అనాథబాలిక శిరస్సుమీద తన చేతులతో కిరీటాన్ని ధరింపజేశాడు. ఈ అపూర్వగౌరవాన్ని పరిగ్రహించడంలో ఆమె ఎంతమాత్రం తటపటాయించలేదు. క్రొత్తకోడలికి ఉండదగిన లజ్జ, భయం అన్నీ విడిచిపెట్టి సౌభాగ్యవతియైన స్త్రీలాగా అపూర్వమహిమతో వెలిగిపోయింది. ఆమె ఒక్కక్షణంలో సంకోచరహితంగా పతి పాదాలముందుగా తన సింహాసనాన్ని అమర్చుకొంది.

రాజలక్ష్మి ఆదినం మధ్యాహ్నసమయంలో క్రొత్తగా వచ్చిన ఇతరులబిడ్డను-అనేకదినాలనుండి అభ్యాసంకలిగివున్న దానిలాగా ఆ సింహాసనంలో ఉండగా చూచి అసహ్యం

తోను, ఆశ్చర్యంతోను క్రిందికి దిగిపోయింది. ఆమె ఈ మంటతో అన్నపూర్ణనుకూడా మండింప చేయాలనే భావంతో అన్నపూర్ణ ఇంటికి వెళ్ళి "అమ్మా, వెళ్ళిచూడు మీ జమీందారు బిడ్డ విషయం, జమీందారుగారి ఇంటినుండి ఎలాంటి శిక్షణ పొంది వచ్చిందో! ఇంట్లో పెద్దవారుండగానే నేను ..."అన్నది. అన్నపూర్ణ ఖిన్నురాలై—"అక్కా, నీవు నాకెందుకు చెప్పడం? నీ కోడలు, ఆమెకు ఏదయినా నేర్పడానికిగాని, లేదా దండించడానికిగాని నీ కధికారముంది." అన్నది.

"నా కోడలు! నీలాంటి మంత్రి వుండగా నామాట లెందుకు వింటుంది?" అని గర్జించింది రాజలక్ష్మి.

అంతట అన్నపూర్ణ తన పాదాలధ్వనితో భార్యాభర్త లను మేల్కొల్పుతూ పైనున్నగదికివెళ్ళి, — "ఏమే, నీవీ విధంగా నన్ను తల ఎత్తనీయకుండా చేస్తావా? సిగ్గూ శరం లేదా, సమయాసమయాలు లేవా; వృద్ధురాలైన అత్తమీద అన్ని పనులు పడవేసి పట్టపగలు, మధ్యాహ్నం ఈ విధంగా ఇక్కడ కాలక్షేపం చేస్తున్నావా? ఇందుకేనా నిన్నిక్కడికి తెచ్చింది? నా ముఖాన దేవుడిలా వ్రాశాడూ?" అన్నది ఆశాలతతో. ఇలా అంటూఉండగా అన్నపూర్ణకు కళ్ళనీళ్లు గిర్రునతిరిగాయి. ఆశాలతకూడా లేచి తలవంచుకొని పైట చెరగుసవరించుకొంటూ బదులు చెప్పకుండా ఏడ్వడం మొదలు పెట్టింది.

మహేంద్రుడు:— పిన్నమ్మా, కోడలిమీద ఎందుకు కేకలు వేస్తావు? నేనే ఆమె నిక్కడ ఆపి వుంచాను.

అన్నపూర్ణ:—ఐతే నీవీ పని చేయడం మంచిదేనా? ఇది తల్లిదండ్రులు లేని బిడ్డ, అమ్మవద్ద పనిపాటలు నేర్చుకొనే అవకాశం దొరకడంలేదు. ఈమెకు మంచిచెడ్డలు ఎలా తెలుస్తాయి! నీవు దీనిని ఇలా తయారుచేయడం బాగుందా?

మహేం:— ఇదిగో చూడు, దీనికి పలక, కాపీ, మొదటివాచకం కొనిపెట్టాను. ఈ విషయంలో మీరు నన్ను దూషించండి, భూషించండి; నేను దీనికి తప్పక చదువు నేర్పుతాను.

అన్నపూర్ణ:— ఐతే పగలంతా చదివిస్తూనే ఉండాలీ? సాయంకాలం ఒకటి రెండు గంటలు చెప్పితే చాలదూ?

మహేం:— చదువు రావడం అంత సులభంకాదు పిన్నమ్మా, దానికి ఎక్కువకాలం పట్టుతుంది.

అన్నపూర్ణ కోపంతో అచ్చటనుండి వెళ్ళిపోయింది. ఆశాలతకూడా మెల్లిమెల్లిగా ఆమె ననుకరించింది. మహేంద్రుడు రెండు చేతులతో దారి నడ్డగించి నిల్చొన్నాడు. అశ్రుపూరితాలైన ఆమెకళ్ళలోని ప్రార్థనను అతడు లెక్కచేయలేదు. “ఆగు, నిద్రపోవడంలో చాలాకాలం వృథాగా గడిచింది. నిద్రమూలంగా ఆగిపోయిన పాఠాలు పూర్తిచేస్తాను.”అన్నాడు.

మా పాఠకులలో చాలమంది మహేంద్రుడు నిద్రించి చదివించకుండా అమూల్యమైన కాలాన్ని వ్యర్థంచేశాడని భావిస్తూ వుండవచ్చు. ఇలాంటి పాఠకులకు ఒకవిషయం చెప్ప

వలసిఉంది. అది యేమంటే మహేంద్రుడు నిర్వహించే బోధనాపద్ధతిని ఏస్కూళ్ల ఇన్‌స్పెక్టరుకూడా ఆమోదింపజాలడు.

ఆశాలతకు అనేకకారణాలచేత తాను విద్యనేర్చుకోనడం అసహజంగా ఉన్నప్పటికీ, ఆమెకు భర్తయందుండే విశ్వాసంవల్ల వారి ఆజ్ఞను పాలించడం తనకు కర్తవ్యమని భావించింది. ఈ కారణంచేత ఆమె అతికష్టంమీద కల్లోలంగాఉన్న తన మనస్సును, ఎగుడు దిగుడుగావున్న ఆలోచనలను ఏకాగ్రంచేసి ఆగదిలో నేలమీద పరచిఉన్న పక్కమీద ఒక మూలగా కూర్చొని, ఒక్కసారిగా పుస్తకంమీదికి వంగి పేజీలను త్రిప్పుతూ పాఠం వల్లిస్తూఉంది. మరియొక వైపుగా ఒక చిన్నటేబుల్‌మీద డాక్టరుపరీక్షకు సంబంధించిన పుస్తకాలను తెరచి మాస్టరుగారు కుర్చీమీద కూర్చొన్నాడు. మధ్యమధ్య తనవిద్యార్థిని పాఠంమీద మనసు లగ్నంచేసి బాగా చదువుతున్నదా లేదా యని క్రీగంటితో కనిపెట్టి చూస్తున్నాడు. చూస్తూచూస్తూ హఠాత్తుగా తన పుస్తకాలను మూసి — "చున్నీ," అని పిలిచాడు మహేంద్రుడు. (ఆశాలతను మామూలుగా పిలిచేపేరు చున్ని.) ఆశాలత అదిరిపడ్డది; ఆమె తలఎత్తి మహేంద్రునివైపు చూచింది.

"పుస్తకం తీసుకరా, ఎంతవరకు చదివావో చూస్తాను." అన్నాడు మహేంద్రుడు.

మాస్టరుగారెక్కడ పరీక్షిస్తారో అని ఆశాలత భయపడ్డది; ఎందుకంటే పరీక్షలో విజయాన్ని పొందగలననే ధైర్యం

ఆమెకులేదు. లక్షసార్లు ప్రయత్నించినా "శిక్షావళి" మీదికి తనమనసుపోవడంలేదు. ఆమె పాఠంచదివి, దానిభావం గ్రహించాలని ఎంతప్రయత్నించినా ఆనల్లని అక్షరాలు చీమలలాగా బారులుతీర్చి తనదృష్టిపథాన్నుండి తొలగి పోతూనే ఉన్నాయి.

మాష్టరు పిలువగానే అపరాధినిలాగా భయపడుతూ భయపడుతూ ఆశాలత పుస్తకంతోకూడా వచ్చి మహేంద్రుని కుర్చీవద్ద నిల్చొంది. మహేంద్రుడు ఆమె భయపడి పరుగెత్తు తుందేమో అన్నట్లు ఆమెనడుముమీద ఒకచేతిని వేసి రెండవ చేతితో పుస్తకాన్ని పట్టుకొని—"సరేచెప్పు, ఇవ్వాళ ఎంత చదివావో?" అని అడిగాడు.

ఆమె దృష్టికి ఎన్నిపంక్తులు కనుపించాయో, అంత వరకు చూపించింది ఆశాలత.

"అమ్మయ్యో! ఇంతచదివేశావూ! చూడు, నేను నీవు చదివినంతగా చదువనేలేదు." ఇలా అంటూ తనపుస్తకంలోని ఒకశీర్షికను మాత్రమే చూపించాడు.

"ఐతే ఇంతసేపటినుండి ఏమి చేస్తున్నారు?" అని ఆశ్చ ర్యంగా ప్రశ్నించింది ఆ అమాయకురాలైన ఆశాలత.

"నేనొక మనిషి విషయాన్ని గురించి ఆలోచిస్తు న్నాను, ఐతే ఆ కఠినహృదయురాలు శిక్షావళిపైన తన చూపును లగ్నంచేసి తన మనసుకు సంతోషాన్ని కలిగిస్తున్న సీతాకోకచిలుక పాఠాన్ని చదువుతూ దారితప్పిపోయింది." అని ఆమె గడ్డాన్ని పట్టుకొని అన్నాడు మహేంద్రుడు.

ఆధారంలేని ఈ దోషారోపణకు తగిన సమాధానం ఇవ్వగలిగిఉండికూడా లజ్జచేతనూ, ప్రేమవత్తిడిచేతనూ ఓటమిని అంగీకరించి మౌనాన్నివహించింది ఆశాలత.

ఈ పైవిషయాలను చదివిన తర్వాత మహేంద్రుని పాఠశాలలో సర్కారువారి విద్యానియమాలనుగాని, వ్యక్తిగతమైన పాఠశాలలోని విద్యానియమాలనుగాని పాటించడం లేదని మా పాఠకులు గ్రహించియే ఉంటారు.

ఒక్కొకరోజు మహేంద్రుడు వెలుపలికి వెళ్లుతూ ఉండేవాడు. ఈ అవకాశాన్ని ఉపయోగించుకొని చదవడానికి ప్రారంభించేది ఆశ. ఇంతలో మహేంద్రుడు ఎక్కడినుంచి వచ్చేవాడోగాని వెనుకవైపుగా ఆమె కళ్లు మూసేవాడు, ఆమె చేతిలోని పుస్తకాన్ని లాగి-"నీవు చాలా కఠినురాలవు, నేను ఇంట్లో లేని సమయంలో నన్ను మోసగించి చదువు మీద మనస్సు లగ్నంచేస్తున్నావు!" అనేవాడు.

ఆశాలత:— మీరు నన్ను మూర్ఖురాలనుగా చేయగోరుతున్నారా?

మహేం:— ఐతే నీ దయవల్ల నేను పండితుడనవుతున్నానా?

ఈ మాటవల్ల ఆశాలతకు ఒక్కసారిగా స్పృహ వచ్చి అక్కడినుంచి వెళ్ళిపోదలచి—"నేను మీ చదువు విషయంలో బాధ కలిగించానా?" అన్నది.

"ఈ విషయం నీకేమి తెలుసు? నేను లేకుండా సహజంగానే నీవు చదువు సాగిస్తున్నావు, కాని నీవు లేకుండా చదవడం నాకు సాధ్యం కావడంలేదు." అన్నాడు మహేంద్రుడు, ఆమె చెయ్యి పట్టుకొని.

"ఇంత తేలికగా దోషాన్ని ఆరోపించడమా?" అని ఆశ్వీజ మాసంలోని చిన్నవర్షపుజల్లుల్లాగా ఆశాలత ఏడ్వడం చీదడం ప్రారంభిస్తుంది. కాని వెంటనే కన్నీటితోకూడిన ప్రకాశవంతమైన శోభతో ప్రేమాకాశంలో లీనమవుతుంది.

విద్య చెప్పేవాడు స్వయంగా విద్యకు విఘ్నాలను కలిగిస్తూవుంటే విద్యావనంలో వంటరిగా ముందుకు అధిగమించడం ఒక అబలయగు బాలికకు సాధ్యమా! అప్పుడప్పుడు ఆశాలతకు తన అత్తగారి బెదరింపులు జ్ఞాపకం రావడంవల్ల వ్యాకులాన్ని పొందేది. తాను చదువుకొంటున్నాననడం మోసంగా కనిపించింది. అత్తగారి ఎదుటికి వెళ్లడానికి సిగ్గుతో చచ్చిపోతున్నది. ఇదిగాక అత్తగారికికూడా యీమె పని చేయడం ఇష్టంలేదు; ఒకపని చేయమని చెప్పడమూలేదు. ఒకవేళ అత్తగారు ఫలానా పని చెయ్యమని చెప్పకపోయినా ఆశాలత స్వయంగా చేయడానికి ప్రయత్నించేది, ఇంతలో అత్తగారు–"ఏంచేస్తున్నావు! పైకి వెళ్ళు, నీ చదువుకు విఘ్నం కలుగుతుంది!" అని వ్యంగ్యంగా అనేది.

"నీ చదువు వ్యవహారం చూస్తుంటే మహేంద్రుని డాక్టరు పరీక్షకూడా గంగలో కలిపేలాగున్నావు!" అన్నది ఆశాలతతో అన్నపూర్ణ.

ఇది ఆశాలతకు చాలా కష్టం కలిగించింది. ఆమె తన హృదయాన్ని పాషాణంగా చేసుకొంది.

"మీ చదువు పాడైపోతున్నది. ఇక నేను క్రింద అత్త గారివద్ద ఉంటాను." అని భర్తకు చెప్పింది.

ఈ స్థితిలో ఇలాంటి కఠోరమైన సన్యాసవ్రతం! శయన గృహంనుండి ఒక్కసారిగా అత్తగారి ఇంటిలోనికి ఆత్మనిర్వా సనమా! ఈకఠోర ప్రతిజ్ఞ చేసేసమయంలో ఆశాలత కన్నులు కన్నీటితో నిండిపోయినవి. ఆమె నవనవలాడు పెదవులు కంపించిపోయినవి. కంఠము రుద్ధమైపోయింది. "సరే, ఐతే పిన్నమ్మఇంటికి వెళ్లు; ఎందుకంటే, అలాగైతే పిన్నమ్మ ఇక్కడికి వస్తూపోతూ ఉంటుంది." అన్నాడు మహేంద్రుడు.

తన ఇంత ముఖ్యమైన ప్రస్తావనకు జవాబుగా ఈ పరిహాసాన్ని విని కోపగించుకుంది ఆశాలత.

"చున్నీ! ఇంకో మంచిమార్గం చెప్పతాను, నన్ను నీకళ్ళకు ఎదురుగా వుంచుకొని నేను చదువుతున్నానో లేదో పహరా ఇస్తూవుండు." అన్నాడు మహేంద్రుడు.

ఈ విషయం సహజంగానే జరిగిపోయింది. ఎదుట వుండి పహరా యివ్వడం ఏవిధంగా జరుగుతుందో దానినిగురించిన సమాచారం మీకు ఎక్కువగా చెప్పవలసిన పనిలేదు; ఐతే

ఒక్క విషయం. చెప్పాలి; అది ఏమంటే ఈసంవత్సరం మహేం ద్రుడు ఫేలయ్యాడు. ఆశాలత శిక్షావళి చదువుతూ వున్నదే కాని ఆమె తన పేరుకూడా శుద్ధంగా వ్రాయలేకపోయింది.

కాని ఈచదవడం చదివించడం అనే వ్యవహారాలు నిర్విఘ్నంగా జరిగిపోతునే వున్నాయనడానికికూడా వీలులేదు. మధ్య మధ్య బిహారీ వచ్చి అల్లరి చేస్తూవున్నాడు. మహేంద్ర దాదా, మహేంద్రదాదా యని వీధికివీధి మారుమ్రోగేలాగా కేకలు పెట్టేవాడు. ఏదోవిధంగా మహేంద్రుణ్ణి ఆగదిలోనుండి బయటకు లాగందే వదిలిపెట్టేవాడుకాడు. మహేంద్రుడు శ్రద్ధగా చదవడంలేదనే కారణంచేత బిహారీ అతనికి కోపంవచ్చేలాగా మాట్లాడేవాడు. ఆశాలతతో అనేవాడు—"వదినా, నమలకుండా ముద్ద మ్రింగితే జీర్ణంకాదు, బాగా నమిలి మ్రింగాలి. నీవు భోజనాన్ని ఒకే కబళంలో మ్రింగివేస్తున్నావు. జీర్ణంచేసే మాత్రలు లేవుసుమా!"

మహేం:— చున్నీ, నీవు బిహారీమాటల్లో మోసపోవద్దు. నేను సుఖపడుతున్నానని ఏడుపుగా ఉంది వాడికి.

బిహారీ:— సుఖం అనుభవించడం నీచేతుల్లోనే ఉంది. ఐతే దాన్ని ఇతరులు ఏడవకుండా అనుభవించు.

మహేం:— కాని దుఃఖించేవాణ్ణి ఇంకా దుఃఖించేలాగా చేయడం సుఖాన్నికలిగిస్తుందని నీకు తెలియదా! చున్నీ, నేను మూర్ఖంగా నిన్ను బిహారీమెడకు కట్టవలెననిచూచాను, ఇంకానయం, దేవుడు మేలుచేశాడు.

బిహారీ ముఖం కోపంతో ఎఱ్ఱబడిపోయింది. "నోరు మూసుకో" అని గట్టిగా అన్నాడు.

ఈ సంభాషణలలో తనలోతాను బిహారిమీద కోప పడుతూఉంది ఆశాలత. ఇదివరలో ఆశాలతకు బిహారీకి వివాహ సంబంధం ఆలోచించడం జరిగింది. ఈకారణంచేత మామూలు గానే బిహారీఅంటే ఆమెకు విముఖత్వం కలిగింది. బిహారీకి ఇది తెలుసు, అందుచేతనే మహేంద్రుడు అప్పుడప్పుడు ఎత్తి పొడుస్తూ ఆనందాన్ని పొందుతూ ఉంటాడు.

రాజలక్ష్మి బిహారీని పిలిపించి తనదుఃఖాన్ని వెళ్ళబోసు కొంటూవుంటుంది.

"అమ్మా, పట్టుపురుగు పట్టును బయటికి వదలి వుండలు చేస్తూ ఉన్నంతవరకు దానినిగురించిన చింత అంతగా ఉండదు, కాని అది తనబంధాలను త్రెంచుకొని ఎగురగలిగి నప్పుడు దాన్ని బయటికి వెళ్ళకుండా, లోపలికి రానీయ కుండానిరోధించడం కష్టమవుతుంది. అతడు నీప్రేమబంధాలను ఈవిధంగా త్రెంపివేస్తాడని ఎవరూహించగలరు!"అని అంటూ ఉంటాడు బిహారీ.

మహేంద్రుడు పరీక్షలో అపజయంపొందాడని తెలిసి రాజలక్ష్మి ఒక్కసారిగా గప్పుమనిమండిపడింది; ఐతే దీని ఫలి తాలను అనుభవించింది అన్నపూర్ణ. ఈదుఃఖంతో ఆమె నిద్రాహారాలకు దూరమైపోయింది.

# 6

వర్షాకాలంవచ్చింది, సాయంకాలానికి కొంచెం ముందుగా వర్షంకురిసింది. ఇంకా మేఘాలు ఆవరించేఉన్నాయి. ఎసెన్సు చల్లబడిన ఉత్తరీయాన్ని, మెడలో ఒకపుష్పమాలను ధరించి మహేంద్రుడు సంతోషంగా తనపడకగదిలో ప్రవేశించాడు. ఆశాలతకు తెలియకుండా వెళ్ళి హఠాత్తుగా ఆమెను అదరిపడేలాగా చేద్దామనే సంకల్పంతో అడుగులు చప్పుడు కాకుండావెళ్ళాడు. లోపలికి తొంగిచూచాడు. తూర్పు దిక్కుగా ఉన్నద్వారం ఒకరెక్క తెరవబడిఉంది. గాలి వీచడం వల్ల వానచినుకులు లోపలికి వస్తున్నాయి. గాలికి దీపం ఆరిపోయింది. క్రిందపక్కమీద పడుకొని వెక్కివెక్కి ఏడుస్తూ ఉంది ఆశాలత.

మహేంద్రుడు త్వరత్వరగా ఆశాలతనద్దకు వచ్చి "ఏంజరిగింది?" అని అడిగాడు.

ఆమె ఇంకా పొర్లిపొర్లి ఏడ్వసాగింది. చాలాసేపు ఏడ్చినతర్వాత ఆమె కొంచెంకొంచెంగా చెప్పినమాటలను బట్టి తనపిన్నమ్మ ప్రతినిత్యమూ జరిగేజగడాలను భరించలేక తనమేనత్తకొడుకు ఇంటికివెళ్ళినట్లు అర్థమయింది.

మహేంద్రుడు కోపంతో మండిపడ్డాడు. "వెళ్ళిందీ; ఐతే ఇలాంటి సంతోషకరమైనదినాన్ని మన్నులో కలిపివేశారన్నమాటే!" అని తనలో కటకటపడ్డాడు.

చివరికి తనకోపం పూర్తిగా తల్లిమీదికి మళ్ళించాడు. ఆమే ఈఅల్లరికి మూలకారణమని భావించాడు—"పిన్నమ్మ వెళ్ళినచోటికే మనంకూడా వెడదాంపద, అమ్మ యింకెవరి మీద జగడంచేస్తుందో చూద్దాం." అన్నాడు ఆశతో.

మహేంద్రుడు అప్పటికప్పుడే అనవసరంగా నానా హంగామా చేయడం, సామాను మూటలు కట్టడం, కూలీలను పిలవడం ప్రారంభించాడు.

రాజలక్ష్మి అంతా తెలుసుకొంది. ఆమె మహేంద్రుని వద్దకు వెళ్ళి—"ఎక్కడికి వెడుతున్నావు?" అని శాంతంగా ప్రశ్నించింది.

మహేంద్రుడు మొదటజవాబు చెప్పలేదు. రెండు మూడు సార్లు అడిగిన తర్వాత—"పిన్నమ్మవద్దకు వెడతాను." అన్నాడు.

"నీ వెక్కడికి వళ్ళవద్దు, పిన్నమ్మను పిలిపిస్తాను." అన్నది రాజలక్ష్మి.

ఈ విధంగా చెప్పి రాజలక్ష్మి వెంటనే పాలకి యెక్కి అన్నపూర్ణవద్దకు వెళ్ళి, చేతులు జోడించి—"అమ్మా! శాంతం వహించి నన్ను క్షమించు!" అన్నది.

అన్నపూర్ణ వెంటనే ఆమె కాళ్ళమీద పడి—"అక్కా, నన్నెందుకు నరకంలో తోస్తావు. నీవేది చెబితే అది చేయ డానికి సిద్ధంగా వున్నాను." అని వినయంగా ప్రార్థించింది.

"నీవు వచ్చేశావు, ఈకారణంచేత మహేంద్రుడుకూడా భార్యను తీసుకొని ఇల్లు వదిలి వచ్చివేస్తున్నాడు." ఇలా

అంటూ అభిమానం, క్రోధం, నింద ఒక్కసారిగా కలగడం చేత బాధతో ఏడ్వసాగింది రాజలక్ష్మి. అన్నపూర్ణ వెంటనే రాజలక్ష్మితో వచ్చివేసింది. ఇంకా ఇంట్లో చిల్లర చిల్లరగా కలహాలు ఉండనేఉన్నాయి. అన్నపూర్ణ ఇంటికిరాగానే ఆశాలత ఏడవడం మానింది. మహేంద్రుడు ఆమెను అనేక విధాలుగా హాస్యంగా మాట్లాడుతూ నవ్విస్తూ ఉన్నాడు. ఈ లక్షణాలను బట్టి చూస్తే అమూల్యమైన ఈరాత్రి బొత్తుగా వ్యర్థంగా పోతుందనడానికి వీల్లేదు.

అన్నపూర్ణ వెళ్ళి—"చున్నీ, నీవు నన్ను ఇంట్లోనూ ఉండనియ్యవు, మరొకచోటికి వెళ్ళినా వెంటబడుతునే వున్నావు. నన్ను ఎక్కడా శాంతంగా జీవించనియ్యవా యేమిటి?" అన్నది.

ఒక్కసారిగా దెబ్బతిన్న లేడిలాగా అదరిపడ్డది ఆశాలత.

"పిన్నమ్మా, చున్నీ మీకేమీ అపకారం చేసింది?" అన్నాడు కోపంతో మహేంద్రుడు.

"క్రొత్తకోడలి సిగ్గుమాలిన ప్రవర్తనాన్ని చూడలేక నేను వెళ్ళిపోయాను. తుచ్ఛురాలా, అత్తగారిని ఏడిపించి మళ్ళీ నన్నెందుకు పిలిపించావు?" అన్నది అన్నపూర్ణ.

జీవనానికి సంబంధించిన సరస కవిత్వాధ్యాయంలో తన తల్లి పినతల్లి ఈ విధంగా విఘ్నంకలిగిస్తారని మహేంద్రుడు భావించలేదు.

మరునాడు రాజలక్ష్మి బిహారీని పిలిపించి—"అబ్బాయ్, నేను కొన్నిరోజులు నా పుట్టింటికి వెళ్ళదలచుకొన్నాను.

చాలా దినాలుగా వెళ్లలేదు. ఈ విషయం మహేంద్రునితో చెప్పు." అన్నది.

"చాలారోజులుగా వెళ్ళలేదు, అందుచేతనే ఇప్పుడు కూడా వెళ్ళవద్దు. ఇందులో నీకేకష్టమూ కలుగదనినాభావం. సరే, మహేంద్రదాదాతో చెప్పుతాను, కాని అతడు నిన్ను వెళ్ళనీయడనుకొంటాను." అన్నాడు బిహారి.

బిహారివెళ్లి మహేంద్రునితో చెప్పినమీాదట—"అమ్మ తన జన్మస్థానానికి వెళ్లదలచుకొంటే ఆమెనెవరు ఆపగలరు? కాని అమ్మఅక్కడ ఎక్కువరోజులుండడం బాగావుండదు; వర్షాకాలం, స్థలంకూడా అంతమంచిదికాదు." అన్నాడు మహేంద్రుడు.

మహేంద్రుడు అంతత్వరగా అంగీకరించడం అతనికి చాలాతప్పుగా తోచింది.—"అమ్మవంటరిగా వెళ్ళితే ఆమెకు పనిపాటలు సేవాశుశ్రూషలు ఎవరుచేస్తారు? కోడల్నికూడా ఆమెవెంటపంపితే బాగావుంటుంది." అని బిహారి చిరునవ్వు నవ్వాడు.

బిహారి అన్న హాస్యపుమాటలకు కొంచెం లజ్జతో— "అలాజరుగదు!" అన్నాడు మహేంద్రుడు.

మాటలంతటితో ఆగిపోయినాయి, ఇక ముందుకు సాగలేదు.

బిహారి ఇలాంటి ఎగతాళిమాటలతో ఆశాలతను ఉడికిస్తూవుండేవాడు. ఆమె తనలోతాను బాధపడుతూఉండేది.

దీనివల్ల మహేంద్రునికి ఒకవిధమైన సారంలేనిసుఖం కనబడు తూఉండేది.

మాకు తెలిసినంతవరకు రాజలక్ష్మికి తనతండ్రిఇంటికి వెళ్లవలెననే ఉద్దేశ్యంలేదు. ఎండాకాలంలో నదిలో నీటి ప్రమాణం తగ్గినప్పుడు పల్లెవాడు అడుగడుగుకు వెదురుకర్రతో లోతు పరీక్షిస్తూఉంటాడు. ఆవిధంగానే తల్లీకొడుకులమధ్య కూడా లోతు తెలుసుకొనడానికిది పరీక్షలాంటిది. రాజలక్ష్మి- తాను పుట్టింటికివెళ్ళడానికి మహేంద్రుడింతత్వరగా తనఅంగీ కారాన్ని తెలుపుతాడని-కలలోగూడా భావించలేదు. మహేం ద్రుని ఈసంభాషణపద్ధతిని విని—'నాతోడికోడలు ఇల్లువిడిచి వెళ్లడానికి నేను ఇల్లువిడిచివెళ్లడానికి భేదముంది! అది ఇంద్ర జాలం తెలిసినరాక్షసి, నేను మామూలు తల్లినిమాత్రమే, నేను వెళ్ళడమేమంచిది.' అని తనలో అనుకొంది.

అన్నపూర్ణ అసలువిషయాన్ని తెలుసుకొంది.—"అక్క వెళ్ళేలావుంటే నేనూవుండను!" అన్నది మహేంద్రునితో.

"విన్నావా అమ్మా? నీవు వెళ్ళేలాగుంటే పిన్నమ్మ కూడా వెళ్ళుతుందట. ఇక మనఇంటిపనులెలా జరుతాయి?" అని తల్లితోఅన్నాడు మహేంద్రుడు.

రాజలక్ష్మికి ప్రతిరోమంలోనూ విద్వేషవిషం వ్యాపిం చింది__"నీవుకూడా వస్తావాచెల్లెలా? ఇది జరిగేదేనా? నీవు వెళ్ళితే పనెలాసాగుతుంది? నీవు ఇక్కడేవుండితీరాలి."అన్నది.

రాజలక్ష్మికి ఇంట్లో ఒక్కొక్క గడియ ఒక్కొక సంవత్సరంలాగా గడుస్తూఉంది. మరుసటి మధ్యాహ్నమే తన ప్రయాణానికి ఏర్పాట్లుచేసుకొంది.

మహేంద్రుడే తల్లిని పుట్టింట్లో విడిచిపెట్టి వస్తాడని అందరూ అనుకొన్నారు. చివరికి చూస్తే ఒక కావలివాణ్ణి, ఒక గుమాస్తాను ఏర్పాటు చేశాడు.

"మహేంద్రదాదా, నీవింతవరకు ప్రయాణం కాలేదేమి?" అన్నాడు బిహారీ.

మహేంద్రుడు కొంచెం సంకోచిస్తూ-"నేను కాలేజికి ..." అన్నాడు.

బిహారీ:— మంచిది నీవుండు, నేను పంపించివస్తాను.

మహేంద్రుడు తనలోతాను బాధపడ్డాడు.

"బిహారీ ఇప్పుడు పూర్తిగా అనవసరజోక్యం కలిగించుకొంటున్నాడు. అమ్మ విషయంలో నాకంటె వాడికి ఎక్కువ చింత వున్నట్లు చూపిస్తున్నాడు." అని ఆశాలతతో ఏకాంతంగా అన్నాడు.

అన్నపూర్ణ విధిలేక వుండిపోయింది; కాని లజ్జచేత, దుఃఖంచేత, క్షోభచేత దూరదూరంగా ఉంటూవుంది. పినతల్లి ప్రవర్తన మహేంద్రునికి తప్పుగా తోచింది; ఆశాలతకూడా తనలోతాను ఛీదరించుకొంది.

# 7

రాజలక్ష్మి తన పుట్టింటికి వెళ్ళింది. ఆమెను పుట్టింటిలో విడిచిపెట్టి తిరిగి వద్దామని బిహారీ మొదట అనుకొన్నాడు; కాని అచ్చటి పరిస్థితులనుబట్టి తిరిగి రాలేకపోయాడు.

రాజలక్ష్మి పుట్టింట్లో ఒకరిద్దరు వృద్ధవితంతువులకంటె మరెవ్వరూ లేరు. గ్రామంలో మనుష్యులుకూడా ఎక్కువగా లేరు. చుట్టుపక్కల దట్టమైన అడవి — వెదురుగుట్టలతో నిండిఉంది. ఇంటికిఎదురుగా దట్టంగా తుంగ పెరిగివున్న ఒక చెరువుఉంది. పట్టపగలే నక్కలు అరుస్తూవుంటాయి. ఆ భయానకమైనశబ్దాలువిని రాజలక్ష్మి భయపడుతూ ఉంది.

"జన్మభూమి అనే విషయం నిజం, కాని నేను దీన్ని స్వర్గాదపిగరీయసీ,స్వర్గంకంటె మించిందనిమాత్రం ఏవిధంగాను చెప్పలేను. అమ్మా, కలకత్తాకు పద. ఇక్కడ నిన్ను వంటరిగా విడిచిపెట్టి వెళ్లితే నాకు పాపంవస్తుంది, నీకుకూడా ఏమీ తోచదు." అన్నాడు బిహారీ.

రాజలక్ష్మికికూడా ఇక్కడ విసుగుపుట్టింది. ఇంతలో వినోదిని వచ్చి ఆమెకు సేవాశుశ్రూషలుచేస్తూ అక్కడే వుంది.

వినోదినినిగురించి మొదటనే పరిచయం చేయబడింది. ఒక పర్యాయం మహేంద్రునితోను, అతడు అంగీకరించనందువల్ల వేరొకసారి బిహారితోను ఈమె వివాహాన్ని గురించిన ప్రస్తావన జరిగింది. చివరకు దైవనిర్ణయంవల్ల ఆమెను వివాహ

మాడినవాడు రోగికావడం, కొద్దిరోజుల్లోనే తన పరివారాన్ని దుఃఖసాగరంలోముంచి అతడు వెళ్ళిపోవడం జరిగింది.

అతడు చనిపోయినతర్వాత ఆనిర్జనగ్రామంలోనే-అడవిలో ఆశ్రయంలేక వంటిగావున్న ఉద్యానలతవలె—తనజీవితం గడుపుతూవుంది వినోదిని. ఆ అనాథ తనమేనత్త రాజలక్ష్మికి భక్తిపూర్వకంగా నమస్కారంచేసి ఆమెసేవలో తనశరీరాన్ని మనస్సును లగ్నంచేసింది.

ఒక్కక్షణం ఆలస్యంచేయదు. మనస్ఫూర్తిగా-నియమానుసారంగా పనిచేస్తూవుంటుంది; మంచిరుచికరమైన వంటకాలుచేసి పెడుతుంది; మంచిమాటలతో అందరినీ సంతోషపెట్టుతుంది; దీనినే సేవఅంటారు.

"అమ్మాయీ, చాలప్రొద్దుపోయింది. ఇక నీవువెళ్ళి భోజనంచెయ్యి." అనేది రాజలక్ష్మి. కాని ఆమె వింటేగా, పంఖాతో విసరుతూ పాదాలువత్తుతూ మేనత్త నిద్రించేవరకు అచ్చటినుండి లేవదు.

"అమ్మాయీ, నీవీ విధంగా కష్టంచేస్తుంటే నీరస పడతావు." అని రాజలక్ష్మి అంటే తన విషయంలో ఉపేక్షను ప్రకటిస్తూ—"అమ్మా, నేను ఆజన్మదుఃఖితురాలను, నాకు రోగాలుగీగాలు లెక్కలేదు. ఆహా! నీవు ఇన్నిరోజుల తర్వాత ఇక్కడికివచ్చావు, ఇక్కడ మనఃపూర్వకంగా నీసేవ చేయడంతప్ప ఇంకేవిధంగా నిన్ను గౌరవించగలను?" అనేది.

బిహారీ కొన్నిదినాల్లోనే ఆగ్రామంలో పేరు సంపాదించాడు. రోగిష్టివాడు మందుచెప్పమనీ, వ్యవహారాల్లో వున్న

వాడు జయాన్నిపొందే సలహాయివ్వమనీ, వుద్యోగం కావల సినవాడు ఏదయినా వుద్యోగం చూపించమనీ, వేరొకడు అర్జీ వ్రాసిపెట్టమనీ అడుగుతూవుంటే ఎవరికితగినట్లు వారికి సలహాయిచ్చి పంపుతుండేవాడు. ముసలివాళ్ళు చీట్లపేకలు, పాచికలు ఆడుతూవుంటే వారితోకలిసి ఆడుతుండేవాడు. నీచ జాతివాళ్ళు కల్లుత్రాగుతుంటే సకౌతుకంగా అక్కడికి తయా రయేవాడు. ఈవిధంగా తనకు స్వాభావికంగావున్న సహృద యంతో అందరితో కలిసిమెలిసి వుండేవాడు. అన్ని మనఃప్రవృ త్తులవారుకూడ ఎవరికివారే అతనిని తనవానిగా భావించడం జరుగుతూఉంది. ఇలా అందరూ అతనిని ప్రేమిస్తున్నారు.

వినోదినికూడ ఆకుగ్రామంలోకివచ్చిపడ్డ నగరవాసియగు యువకునికి నిర్వాసంవల్ల కలిగేతాపాన్ని యధాసాధ్యంగా తగ్గించడానికి అంతఃపురంలోనుంచే ప్రయత్నిస్తూవుంది. బిహారి గ్రామమంతా తిరిగితిరిగి ఇంటికివచ్చి చూచేసరికి ఎవరో తన పడకనువిదిలించి శుభ్రంగా వుంచేవారు. ఒకకంచుగ్లాసులో కొన్ని అడవిపూలు — ఆకులుతో నిర్మింపబడిన పూలగుత్తి ఉంచేవారు. పడకసమీపంగా ఒకప్రక్క తులసీదాసు, సూర దాసు మొదలగు భక్తులువ్రాసిన గ్రంథాలు; కొన్ని 'సరస్వతి' మాసపత్రిక సంచికలు చక్కగా అమర్చబడివుండేవి. గ్రంథాలు తెరచిచూస్తే వాటిలో చక్కని అక్షరాలలో 'వినోదిని' అని వ్రాసిఉండేది. 'పల్లెపట్టులలోని అతిథిసత్కారాలలోకంటె ఇందులో ఒకవిశేషంవుంది'—అని బిహారి ఈవిషయాలను ఎత్తి చూపి వినోదినిని పొగడుతూవుండేవాడు. అప్పుడు రాజలక్ష్మి

"ఈపిల్లనే మీరు వివాహమాడకుండా నిరాకరించారు!" అనేది.

బిహారీ నవ్వుతూ—"అవునమ్మా, మేము మంచిపని చేయలేదు, మోసపోయాము. కాని పెళ్ళిచేసుకోకుండా మోసగించడం మంచిదే; పెళ్ళిచేసుకొని మోసగించడమే చెడ్డది—దుఃఖప్రదమూను." అనేవాడు.

రాజలక్ష్మి తనలో—'ఈ అమ్మాయిని మావాడికి చేసుకొంటే బాగా ఉండేది!' అనుకొన్నది.

రాజలక్ష్మి అప్పుడప్పుడు కలకత్తాకు వెళ్ళే ప్రస్తావన తెచ్చేది. ఇదివిని వినోదిని కన్నీరు కార్చేది. – "అత్తయ్యా, నాలుగు దినాలుమాత్రమే వుండి వెళ్ళడానికి వచ్చావా? నీవిక్కడికి రాకముందు ఏదోవిధంగా నారోజులు గడుపు కొంటూ వున్నాను, కాని ఇప్పుడు నీవు లేకుండా ఉండడం నాకు ఎలా సాధ్యమౌతుంది?" అన్నది.

"బిడ్డా, నీవు నాయింటికోడలివెందుకు కాకపోయావు? మనఃపూర్వకంగా ప్రేమించేదాన్నికదా!"అని ఒకొక్కప్పుడు అంటూవుండేది రాజలక్ష్మి.

ఈమాట వినగానే లజ్జతో వినోదిని అచ్చటినుంచి వెళ్ళిపోయేది. కలకత్తానుండి ఏదో వినయంతోకూడిన ప్రార్థనలతో నిండిన జాబు వస్తుందని ఎదురుచూస్తూ ఉంది రాజలక్ష్మి. మహేంద్రుడు తను పుట్టినప్పటినుండి ఎన్నడూ ఇన్ని దినాలు తనతల్లి లేకుండా ఉండలేదు. తనతల్లి వియోగం భరించలేక మహేంద్రుడు దుఃఖిస్తూ వుంటాడని ఆమె భావించింది.

యీవిషయంలో తన కుమారుడు పశ్చాత్తాపాన్ని ప్రకటిస్తూ ప్రార్థనాపూర్వకంగా జాబు వ్రాస్తాడని గంపెడాశతో ఉంది.

బిహారీకి మహేంద్రునివద్దనుండి లేఖవచ్చింది-"అమ్మా, చాలా దినాలకు తర్వాత పుట్టింటికి వెళ్ళావు; నీవు సంతోషంగా ఉన్నావనుకొంటాను." అని వ్రాశాడు.

"బిహారీ, మహేంద్రుడు ఇంకా యేమని వ్రాశాడో కొంచెం వినిపించు నాయనా!"—అని అడిగింది రాజలక్ష్మి.

బిహారీ— ఇంకేమీ వ్రాయలేదమ్మా!

ఇలాఅని ఆ ఉత్తరాన్ని నలిపినలిపి ఒక పుస్తకం అట్టలో పెట్టి ఒకమూల విసిరివేశాడు.

రాజలక్ష్మి ఇక ఎలా ధైర్యంవహిస్తుంది? 'బిహారీకి కష్టంకలిగేలాగా తనమీద కోపంతో మహేంద్రుడు ఏదో వ్రాసివుంటాడు.' అనుకొంది.

దూడ ఆవుపొదుగులో ఒకదెబ్బపొడవగానే పాలు ఏవిధంగా దిగివస్తాయో అదేవిధంగా మహేంద్రుని వ్యంగ్య వాక్యాలతోనిండిన జాబువల్ల రాజలక్ష్మిహృదయంలో చాలా దినాలుగా ఆగివున్న పుత్రవాత్సల్యమను ప్రవాహం ఒక్కసారిగాప్రవహించింది. ఆమె మహేంద్రుని అన్ని అపరాధాలను ఒక్కసారిగా క్షమించివేసింది—"మహేంద్రుడు కోడలితో సుఖంగావుంటే ఉండనీ—వాడెలాకావాలీఅంటే అలాసుఖంగా ఉండనీ! కోడలిమీద కోపంతో ఇక వాణ్ణెప్పుడూ నేను కష్టపెట్టను. ఎన్నడూ ఒక్కఘడియకూడా వాణ్ణి విడువకుండా

వున్నతల్లి ఈవిధంగా విడిచిపెట్టి ఇంతదూరం వచ్చింది! ఇక మహేంద్రుడు కోపపడడంలో దోషంలేదు." అనే నిశ్చయానికి వచ్చింది.

రాజలక్ష్మికళ్ళు నీళ్ళతోనిండాయి.—"వెళ్ళునాయనా, స్నానంచెయ్యి, చాలా ఆలస్యంఅయింది." అని అనేకసార్లు బిహారీతో చెప్పింది.

ఆదినం బిహారీకి స్నానంచేయడానికి భోజనంచేయడానికి ఇష్టంకలుగలేదు. "లేదమ్మా, ఇంకావేళకాలేదు." అన్నాడు.

"అలాకాదు, వెళ్ళి స్నానంచెయ్యి." అని కోపంతో అన్నది రాజలక్ష్మి.

పదేపదే చెప్పడంచేత బిహారీ స్నానానికివెళ్లాడు. బిహారీ వెళ్ళగానే రాజలక్ష్మి పుస్తకంలోనుండి నలిపిపెట్టిన ఆ లేఖను బయటికి తీసింది. దాన్ని వినోదినిచేతికిచ్చి — "చూడమ్మాయ్, మహేంద్రుడు బిహారీకి ఏమివ్రాశాడో!" అన్నది.

వినోదినిచదివి వినిపించ మొదలుపెట్టింది. మహేంద్రుడు, మొట్టమొదట బిహారీ చదివివినిపించినవిధంగానే తల్లికి సంబంధించిన విషయంవ్రాశాడు. అంతకంటె ఏమీలేదు. దానికి తర్వాత ఆశాలతకు సంబంధించిన విషయాలున్నాయి. ఆనందంతో వళ్ళుమరచి రంగరస రహస్యాలన్నీ, యేకరువు పెట్టాడు. వినోదిని ఇకముందు చదువలేకపోయింది. మూడు నాల్గు పంక్తులుచదివి లజ్జతో ఆగిపోయింది.—"అత్తా, వీటిని విని నీవేంచేస్తావు?" అన్నది. రాజలక్ష్మి తన ప్రేమమయమైన

లక్షణాలను ఒక్కసారిగామార్చి కాఠిన్యాన్నివహించి శిలా రూపాన్నిపొందింది. కొంతసేపు ఏమీమాట్లాడలేదు. తర్వాత 'ఉండనీ!' అనిచెప్పి జాబును తిరిగి తీసుకోనకనే గదినుండి వెలుపలికి వెళ్ళిపోయింది.

వినోదిని ఆజాబుతీసికొని తనపడకగదికి వెళ్ళిపోయింది. లోపలగొళ్ళెంబిగించి పక్కమీద పడుకొని జాబుచదవడం ప్రారంభించింది.

జాబులో వినోదినికి ఏ రసంలభించిందో, అది ఆమెకే తెలియాలి; కాని ఆరసం ఆమెకు సుఖాన్ని కనిగించేదికాదని మాత్రం చెప్పవచ్చు.ఆమె అనేకసార్లు ఆజాబును మొదటినుండి చివరివరకు చదివింది. చదువుతూచదుతూ ఆమెకళ్ళు మధ్యాహ్నపు వేడి ఇసుకలాగా మండసాగాయి; ఆమె వేడినిశ్వాసాలు ఎండమావులలోని వాయువుల్లాగా బయటికి వస్తున్నాయి.

ఆమె మనస్సులో,మహేంద్రు డెలావున్నాడు? ఆశాలత ఎలావుంది? మహేంద్ర—ఆశల ప్రేమ ఎలాంటిది? ఈ విషయాల మీాద గందరగోళం బయలుదేరింది. జాబు గుండెలమీాద వుంచుకొని ఎదుటనున్న ఆకాశంవైపుచూస్తూ చాలాసేపు అలాగే పడుకొంది.

బిహారీ చాలాసేపు మహేంద్రుని జాబుకొరకు వెతికాడు; కాని ఆజాబు దొరకలేదు.

ఆ దినం మధ్యాహ్ననికి ఆకస్మికంగా అన్నపూర్ణ వచ్చింది. ఏదయినా చెడువార్త వినవలసివస్తుందేమోననే శంకతో రాజలక్ష్మి హృదయం అల్లకల్లోలంగా ఉంది. ఆమె

వెంటనే ఏ విషయం ప్రశ్నించలేకపోయింది; మలినముఖంతో అన్నపూర్ణ ముఖాన్ని నిరీక్షిస్తూవుంది.

"అక్కా, కలకత్తాలో అంతా క్షేమంగా ఉన్నారు." అన్నది అన్నపూర్ణ.

రాజలక్ష్మికి గుండెలు కుదుటపడ్డాయి "రా, ఐతే నీవెందుకు వచ్చావు?" అన్నది.

అన్నపూర్ణ:—అక్కా, నీయింటికి వెళ్ళి నీయింటి వ్యవహారం నీవు చూచుకో, నాకీ సంసారతాపత్రయాల్లో ఉండడంఇష్టంలేదు, నేను కాశీకి వెళ్ళదలచుకొన్నాను. కాశీకి వెళ్ళడానికి సిద్ధపడి నిన్నుచూడడానికి మాత్రమే వచ్చాను. నేను తెలిసిగాని, తెలియకగాని ఏ అపరాధాలైనా చేసివుంటే క్షమించ ప్రార్థన. ఇదిగాక నీకోడలు యింకా చిన్నపిల్ల. ఆమెకు తల్లి తండ్రిలేరు. దోషిగాని, నిర్దోషిగాని—ఆమె నీది. ఇలా అంటూవుండగా ఆమెకు కన్నీళ్ళు బొటబొట రాలాయి; ఇక ముందు మాట్లాడలేకపోయింది.

రాజలక్ష్మి వెంటనే స్నానపానాదులకు ఏర్పాట్లు చేయడానికి వెళ్ళింది. బిహారీ పిన్నమ్మ వచ్చిందని విని, దుర్గాలయంనుండి పరుగెత్తుకొంటూ వచ్చాడు. అతడు అన్నపూర్ణ పాదాలను స్పృశించి—"పిన్నమ్మా, నీవిలా నిర్ణయించుకొన్నావెందుకు? నీవీ విధంగా ప్రేమను బాంధాలను త్రెంచుకొని మమ్మొ వదలి వెళ్ళుతావా?" అన్నాడు.

"ఇక నీవు నన్నడ్డగించవద్దు. మీరంతా సుఖంగా ఉండండి. నేను లేనందువల్ల మీకు నష్టమేమీ లేదు." అన్నది అన్నపూర్ణ తన అశ్రుప్రవాహాన్ని ఆపుకొంటూ.

బిహారీ కొంతసేపు మౌనంగా కూర్చొని-"పిన్నమ్మా, మహేంద్రుడు నిన్నుకూడా పంపివేశాడు! వాడి అదృష్టం బాగా లేదు!" అన్నాడు.

అన్నపూర్ణ అదరిపడి-"అలా అనవద్దుబిహారీ. మహేంద్రుడు నన్నేమీ అనలేదు, కాని నేను కొంతకాలం దూరంగా వుండకపోతే ఈయిల్లు బాగుపడదు. అందుకే కాశీవాసానికి నిర్ణయించుకొన్నాను." అన్నది.

బిహారీ చాలాదూరంలోవున్న నీలాకాశాన్ని తదేక దృష్టితో చూస్తూకూర్చొన్నాడు. అన్నపూర్ణ తన పైట చెరగునుండి బంగారుతోచేయబడిన రత్నమయమైన ఒక నాగరాన్ని తీసి—"నాయనా, ఈ శేషాభరణాన్ని నీవద్ద వుంచుకో; నీకు వివాహమైన పిమ్మట నా ఆశీర్వాదంతో నీభార్యకు దీనిని ధరింపజెయ్యి." అన్నది.

బిహారీ ఆ యాభరణాన్ని తన శిరస్సున ధరించాడు. అతనికళ్ళనుండి అశ్రుధారలు ప్రవహిస్తున్నాయి, వెంటనే అక్కడినుండిలేచి బయటికి వెళ్ళాడు.

"బిహారీ, నా మహేంద్రుణ్ణి నా ఆశాలతను మరువకు." అని ప్రయాణమయ్యే సమయంలో చెప్పింది అన్నపూర్ణ.

తిరిగి రాజలక్ష్మి చేతిలో ఒకకాగితాన్నిఉంచి— "మామగారి సంపత్తిలో నాకువచ్చిన భాగాన్ని మహేంద్రుని

పేర వ్రాశాను. ఇది దానికిసంబంధించిన దానపత్రం. నాకు ప్రతినెల పదిహేనురూపాయలు మాత్రం కాశీకి పంపిస్తూ ఉండు." అన్నది.

తదుపరి రాజలక్ష్మికి సాష్టాంగ దండప్రణామంచేసి, అన్నపూర్ణ కాశీకి వెళ్ళిపోయింది.

# 8

ఆశ భయపడ్డది. ఇలా ఎందుకుజరిగింది? అమ్మ వెళ్లింది, పిన్నమ్మ వెళ్ళింది. వీరి సుఖానుభవం అందర్నీ బయటికి వెళ్లగొడుతున్నది!

నిర్జనంగాను, శూన్యంగాను, ఒంటరిగాను ఈయింటిలో నవ్యపథంలో నడుస్తూవున్న దాంపత్యజీవితపు ప్రేమలీల ఆవిడకు అసంగతంగా కనుపిస్తూఉంది. సంసారంలోని కఠిన కర్తవ్యాలనుంచి, ప్రేమను, పుష్పాన్ని త్రుంచినట్లుగా త్రుంచివేస్తే ఆ ప్రేమ తనరసంతో తనను సజీవంగా నిల్పుకొనలేదు; క్రమక్రమంగా వాడి వికృతరూపాన్ని ధరించి కడకు ఎండిపోతుంది. ఆశకుకూడ తమ నిరంతర ప్రేమకలాపాలలో ఒక విధమైన అలసట రసహీనత కనిపించాయి. ఆ ప్రేమవృక్షం ఉన్నట్లేవుండి ఎప్పుడు కూలిపోతుందో అనిపిస్తూవుంది. సంసారానికి బలమైన, ప్రశస్తమైన ఆశ్రయం లేనిదే, దాన్నిలాగి నిలబెట్టడం కష్టసాధ్యం అనిపించింది. పసిపాటలలోకూడా మూలాధారమైన ప్రేమ కూడిఉండక

పోవడంచేత భోగవికాసం పరిపూర్ణంగాను స్థిరంగాను వుండ జాలదు.

మహేంద్రుడుకూడా తనకు విముఖంగావున్న పరివారానికి వ్యతిరేకంగా విద్రోహంచేసి తనప్రేమోత్సవాన్ని ఉజ్జ్వలంగాచేయడానికి దీపహారతిలోని అన్నివత్తులను ఒక్కసారిగా వెలిగించి గొప్పప్రయత్నం చేయడమేగాక, శూన్యగృహంలోని ప్రేమికుల ఆనందాన్ని సంపూర్ణంచేయడానికి ప్రయత్నించడం మొదలుపెట్టాడు. కుసుమకోమలమైన ఆశాలత హృదయంలో ఒకచిన్నదెబ్బకొట్టి ఆమెను ప్రోత్సహించవలెననే భావంతో "చున్నీ, ఈనాడు నీలో ఏదోమార్పుకనుపిస్తున్నదే, కారణమేమిటి? పిన్నమ్మ వెళ్ళిపోయిందేఅనుకో, అందుకు గడియగడియకు దుఃఖించడమెందుకు? మనఇద్దరి సంబంధం కంటెఇతరులతోడి సంబంధానికి ప్రాముఖ్యం ఉందా? అన్నిటి కంటె మనఉభయుల ప్రేమసంబంధం అమూల్యమైనది పరిపూర్ణమైనది కాదా?" అన్నాడు.

'ఎందుకు దుఃఖిస్తున్నాను? మా ప్రేమలో ఎక్కడో తప్పక అసంపూర్ణత్వం ఉంది. ఇందుచేతనే నేను లక్షప్రయత్నాలు చేస్తున్నాను, కాని మనస్సు ఆనందాన్ని పొందడం లేదు. పిన్నమ్మ వెళ్ళిపోయింది, అమ్మకూడా ఇంట్లోలేదు. ఇది చూచి నేనెందుచేతనో చాలవ్యాకులపడుతున్నాను.' అని దుఃఖంతో తనలో యోచించింది ఆశ.

ఇది జరిగిన తర్వాత ఆమె తన ప్రాణాలొడ్డి సంతోషాన్ని ప్రకటించడానికి, ఈ ప్రేమ అపరాధాన్ని కడిగివేయడానికి ప్రయత్నిస్తూఉంది.

ఇప్పుడు ఇంటి పనిపాటల్లో ఆటంకం సంభవిస్తూఉంది. ఏ పనీకూడా తృప్తికరంగా జరగడంలేదు. పనివాళ్లకు సోమరితనంఎక్కువయింది.ఒకదినం ఒక పనికత్తె ఆరోగ్యంబాగాలేదనే నెపంతో ఇంటివద్దనే కూర్చొంది. వంటవాడు భంగుత్రాగి, గంజాయి దమ్ముకొట్టి వేసి యెక్కడికో పరారయాడు.

"ఈరోజు మన మిద్దరమూ కలిసి వంటచేద్దాము, బలే మజగా వుంటుంది." అని ఆశతో అన్నాడు మహేంద్రుడు.

మహేంద్రుడు బండిమీదయెక్కి కూరగాయలు మొదలయినవి తీసుకొనిరావడానికి వెళ్ళాడు. ఏవస్తువెంత కావాలో అతనికి తెలియదు, మూటనిండా వస్తువులు తీసుకొని నవ్వుతూ నవ్వుతూ వచ్చాడు. ఆ వస్తులతో ఏమిచేయాలో ఆశకు తెలియదు. ఆ వస్తువుల పరీక్షలోనే రెండు మూడు గంటలు గడిచింది. అనేకవిధాలైన, చిత్రవిచిత్రమైన రుచులతో నిండిన పదార్థాలను తయారుచేయడంవల్ల మహేంద్రునికి చాలా ఆనందం కలిగింది. మహేంద్రుడు పొందిన ఆనందంవల్ల ఆశకు తృప్తిలభించలేదు. ఆమె తన తెలివితక్కువకు అసామర్థ్యానికి లోలోపల చాల లజ్జను విచారాన్ని పొందింది.

ఇంటి సామానులన్నీ అస్తవ్యస్తంగా పడివున్నాయి. ఏవస్తువును వెదకడంకూడా సాధ్యంకావడంలేదు. మహేంద్రుని సర్జికల్ పనిముట్లు కూరలు తరుగుకొనడానికి ఉపయోగించ

బడుతూ చెత్తచెదారాల పోగులలో అజ్ఞాతవాసం చేస్తున్నాయి. ఇదేవిధంగా వారినోట్ పుస్తకాలు విసనకర్రలస్థానాన్ని ఆక్రమించి బూడిదరాసుల్లో విశ్రాంతి పొందుతున్నాయి.

ఎన్నడూ తన దృష్టిపథంలోనికిరాని ఈ గందరగోళాన్నంతా చూచి అంతులేని ఆనందాన్ని పొందుతున్నాడు మహేంద్రుడు. కాని ఈపరిస్థితి ఆశకు చాలాదుఃఖంకలిగించింది. శృంఖలారహితమైన యథేచ్ఛాచారప్రవాహంలో గృహనిర్వహణాన్ని సంపూర్ణంగా త్రోసివేసి, దానితోపాటు తాను కూడా నవ్వుతూ నవ్వుతూ మునకలువేయడం - పైకితేలడం ఆమెకు చాలా భయంకరంగా కనిపించింది.

ఒకదినం సంధ్యాసమయంలో పంచపాళిలో మంచము మీద వారిద్దరుకూర్చొని ఉన్నారు. అప్పుడేవర్షంపడి మేఘాలు విడిపోయాయి. వర్షం వెలిసినపిమ్మట కలకత్తాలోని అంబరచుంబితాలైనభవనాలు ప్రకాశవంతమైనవెన్నెల పడడంవల్ల మనోహరంగా ప్రకాశిస్తున్నాయి. గృహావరణంలోని చిన్నతోటలో కుప్పతిప్పలుగా రాలిన పొగడపూలనుతెచ్చి మౌనంగా తలవంచుకొని ఆశ మాలగ్రుచ్చుతూవుంది. మహేంద్రుడు ఆమెకు కష్టంకలిగేలాగా మాలనులాగుతూ, ఆమెకిష్టంలేని ప్రశ్నలనువేస్తూ, అనవసరమైన జగడాలకు ప్రయత్నిస్తూవున్నాడు. ఆశకిది కష్టంగాతోచి బదులుచెప్పబోతే. ఆమెనోరుమూసి మాట్లాడనివ్వడంలేదు.

ఇదేసమయంలో పొరుగింటిలోని పెంపుడు 'కోయిల' కుహూ కుహూ, అని కూయసాగింది. అప్పుడు మహేంద్రుడు,

ఆశ ఇద్దరుకూడా పైనవున్న పంజరంమీదకు తమదృష్టులను పోనిచ్చారు. పొరిగింటి కోయిల కూయగానే వీరి కోయిలకూడా వెంటనే కూసేఅలవాటు.

"ఈకోయిలకు ఈవేళ యేమివచ్చింది?" అని కోపంతో అన్నది ఆశ.

మహేంద్రుడు:—అది నీమాటలకు లజ్జపడుతూ వుంది.

"ఎగతాళికాదు, చూడండి—దానికేమి వచ్చిందో!" అని గంభీరంగా అన్నది ఆశ.

మహేంద్రుడు పంజరాన్ని క్రిందికిదించాడు. పంజరం పై భాగంలోవున్న గుడ్డను పైకెత్తిచూడగా, కోయిలచచ్చి పడివుంది. అన్నపూర్ణ వెళ్ళిపోయినతర్వాత నొకర్లెవ్వరూ దానూలేదు, ఎవ్వరూ దానివిషయాన్ని ఎత్తుకోనూలేదు.

చూస్తూచూస్తూ వుండగానే ఆశముఖం కరుణచేత, క్షోభచేత నల్లబడిపోయింది. ఇక మాలకట్టలేకపోయింది; పూలు అక్కడే పడివున్నాయి. ఈఘటనవల్ల మహేంద్రునికి కూడా కొంత కష్టంకలుగపోలేదు. ఐతే ఆసమయంలోకూడా రసభంగం కలుగుతుందనే భయంచేత ఎగతాళిగా తేలగొట్టి వేయాలని ప్రయత్నంచేసి "అదీమంచిదేలే, నేను కాలేజీకి పోయినప్పుడంతా, ఇదినిన్ను 'కుహూ-కుహూ' అని మండిస్తూ ఉంటుంది. చస్తేచచ్చిందిలే!" అన్నాడు.

ఇలాగని ఆశను రెండుచేతులతో తనబడిలోకి తీసు కొనడానికి ప్రయత్నించాడు మహేంద్రుడు. కాని ఆశ తిన్నగా తనను విడిపించుకొని చెరగులోనిపూలు పారవేసి—

"సరే, ఇక ఈ ప్రేమ కలాపం అలావుంచి, మీరు వెంటనే వెళ్ళి అమ్మను తీసుకరండి." అన్నది.

## 9

ఇదేసమయంలో 'మహేంద్రదాదా, మహేంద్రదాదా' అని బిహారీ కేకలు వేశాడు. మహేంద్రుడుకూడా 'అరె ఎవరు! బిహారీ! రా! తమ్ముడూ, రా! అని' పిల్చాడు. బిహారీని చూచి మహేంద్రుని చిత్తం ఆనందాన్ని పొందింది. వివాహమైన తర్వాత వీరిసుఖంలో పానకంలో పుడకలాగా బిహారీ అడ్డుపడడానికి వస్తూవుండేవాడు. నేడు మహేంద్రునికి ఆ సుఖంకొరకే, ఆబాధయే, చాలా అవసరంగా కనిపించింది.

బిహారీ రావడంచేత ఆశస్థితికూడా కొంచెం తేలిక పడినట్లువుంది. వెంటనే ముఖంకప్పుకొని ఆమెలేచి వెళ్లుతూ వుంది.

"ఎందుకు వెళ్ళుతున్నావు? మరెవ్వరూకారు, మన బిహారీయే." అన్నాడు మహేంద్రుడు.

"వారికి మంచినీరు తేవడానికి వెళ్ళుతున్నాను." అన్నది ఆశ. కొంతపని కలుగడంచేత ఆమెకు దుఃఖం కొంచెం తగ్గింది. ఆమె తనఅత్తగారి విషయాలు తెలుసుకొనడానికి ముసుగువేసుకొని నిలబడివుంది. కాని బిహారీతో మాట్లాడడంలేదు.

"నేను వచ్చి మీ వ్యవహారాల్లో విఘ్నం కలిగించినట్లుగా తోస్తుంది. ఏమీ పర్వాలేదు కూర్చో వదినా, నేను వెళ్ళిపోతున్నాను." అని వస్తూనే అన్నాడు బిహారీ.

మహేంద్రునివైపు నిరీక్షిస్తూవుంది ఆశ.

"అమ్మ ఎలావుంది?" అన్నాడు మహేంద్రుడు.

"అమ్మ, పిన్నమ్మ విషయాలెందుకు తెస్తావు దాదా? వారి విషయం ఆలోచించడానికి చాలాకాలం వుంది! Such a night was not made for sleep nor for mothers and aunts! (ఇలాంటిరాత్రులు నిద్రించుటకుకాని, అమ్మ పిన్నమ్మలకొరకుగాని కాదు)" అన్నాడు బిహారీ పరిహాసంగా.

ఈవిధంగా అని తిరిగి పోబోతూవుండగా మహేంద్రుడు బలవంతంగా చెయ్యిపట్టుకొని కూర్చోబెట్టాడు.

"వదినా, చూడు నా తప్పేమీ లేదు, నన్ను బలవంతంగా కూర్చోపెడుతున్నాడు. పాపంచేస్తున్నది మహేంద్ర దాదా, శాపానుభవం నాదిఅవుతుందేమో!" అన్నాడుబిహారీ.

ఆశ యీ మాటలకెంతమాత్రం జవాబు చెప్పలేక పోయింది; తనమనస్సులో కోపపడుతూవుంది. బిహారీ తెలిసికూడా నన్ను ఉడికిస్తున్నాడని చింతించింది.

బిహారీ:— వాహ్వా, ఇల్లు ఏమి కళకళలాడుతూ వుంది! ఇప్పుడుకూడా అమ్మనుతీసుకొని రావలసిన అవసరం కలుగలేదా?

మహేంద్రుడు:— ఆమెరావడం చాలా అవసరం, మేము ఆమెకొరకు ఎదురుచూస్తున్నాము.

బిహారీ:—ఈవిషయంతోనే ఒక్కజాబు వ్రాస్తే ఏమైన నష్టంకలుగుతుందా? ఈమాత్రం వ్రాయడంచేత నీబహు మూల్యమైన సౌఖ్యసమయంలో అంతనష్టంరాదు; ఐతే ఆమె ఎంతో సంతోషిస్తుంది. (ఆశవైపుతిరిగి) వదినా, నీవు మహేంద్రునికి, జాబు వ్రాసుకొనడానికి రెండు మూడు నిమిషాలు శలవు యివ్వవలసిందని ప్రార్థిస్తున్నాను.

ఆశ దుఃఖంతో వెళ్ళిపోయింది, ఆమెకళ్ళనుండి నీరు ప్రవహిస్తూఉంది.

"ఏ శుభలగ్నంలో నీ దర్శనంఅయిందో కాని ఏవిధమైన మేలు కలుగకపోవడమేకాక తగువులుకూడా లేవదీస్తున్నావు." అన్నాడు మహేంద్రుడు చిరాకుపడి.

బిహారీ:— నిన్ను మొదట నీతల్లియే చెడగొట్టింది. ఇప్పుడు భార్యకూడా చెడగొట్టుతూవుంది. ఇది నేను చూడలేను. ఇందుచేత వీలైనప్పుడు నాల్గుమాటలు అంటూ వుంటాను.

మహేంద్రుడు:— దీనివల్ల లాభం?

బిహారీ:— నీకు లాభంలేదు, కాని నాకువుంది.

## 10

బిహారీ స్వయంగా ఒకలేఖను వ్రాయించుకొని మరుసటిరోజే రాజలక్ష్మిని తీసుకొని రావడానికి వెళ్లాడు. బిహారీ స్వయంగా లేఖవ్రాయించుకొని వచ్చాడని రాజలక్ష్మి గ్రహిం

చింది; కాని ఆమె ఉండలేకపోయింది. ఆమెవెంట వినోదిని కూడా వచ్చింది.

రాజలక్ష్మి వచ్చి ఇంటిదుర్దశను చూచింది. అంతా దుర్వాసనతో నిండివుంది. గుడ్డలునల్లగా మాసి అస్తవ్యస్తంగా వున్నాయి. ఇదిచూచి మళ్ళీ ఆమెదృష్టి కోడలిమీదికిమళ్లింది. కాని కోడలి నడతలో పూర్తిగా మార్పువచ్చినట్లుగావుంది! ఆమె నీడవలె అత్తను వెంటాడుతూవుంది. అడుగకుండానే అత్తకు సహాయపడాలని చూస్తూవుంది. అదిచూచి—"ఉండనీ, ఉండనీ. నీవు దాన్ని పాడుచేస్తున్నావు. నీకుచేతగాని పనికి ఎందుకువస్తావు?" అనసాగింది రాజలక్ష్మి.

అన్నపూర్ణ వెళ్లడంచేత కోడలిప్రవర్తన చక్కబడిందని రాజలక్ష్మి భావించింది. కాని పిన్నమ్మవుండగానే తాను సుఖంగావున్నట్లు, అమ్మవచ్చినతర్వాత తనసుఖం లోపించినట్లు మహేంద్రుడు భావిస్తాడేమోనని అనుమానించింది. దీనివల్ల పిన్నమ్మ తనసుఖాన్ని కోరుతూవుండేదని, అమ్మ తన మార్గంలో కంటకంగావుందని అతడు భావించేలాగుంటే కోడలిచేత ఈస్థితిలో పనిచేయించవలసిన అవసరం లేదని తలచింది.

అప్పుడప్పుడు పగటికాలంలో మహేంద్రుడు పిలువనంపేవాడు; ఆశ వినీ విననట్లుగా వెళ్ళేదికాదు; కాని రాజలక్ష్మి "వింటున్నావా లేదా? మహేంద్రుడు పిలుస్తున్నాడు; అధికంగా ప్రేమించడంచేత పర్యవసానం ఇలాఅయింది! వెళ్లు,

నీవు కూరలు తరగవలసినపనిలేదు." అని బలవంతంగా పంపేది రాజలక్ష్మి.

తిరిగి వెనుకటిలాగానే పలక-బలపం 'శిక్షావళి' నాటకం ప్రారంభం అయింది. వెనుకటిలాగానే — మొదలు-చివరలేని ప్రేమ సంబంధమైన అభియోగాలు, ఒకరినొకరు అపరాధులుగా ఆరోపించుకొనడం, 'ఇద్దరిలో ఎవరికి ప్రేమఎక్కువ' అనే విషయంమీద యుక్తిరహితంగా తర్కించుకొనడమూ, మేఘావృతమైన వర్షపుదినాలలో పగటిని రాత్రిగాను, వెన్నెల రాత్రులను పగలుగాను భావించుకొనడం, అలసట-బలహీనత, వీటిని మనోబలంతో బలవంతంగా తొలగించు కొనడం, చిత్తం శిథిలంకావడంచేత ఆనందంలభించకపోయినా ఒకరినొకరు ఘడియకూడా విడిచివుండడం మహాభయంకరంగా భావించడం—జరుగుతూవుంది.

ఇది ఇలా జరిగేదినాల్లో ఒకరోజు వినోదిని తన రెండు చేతులు ఆశ భుజాలమీదవేసి—"మీ ప్రేమానుబంధం ఎల్లప్పుడూ ఇలాగే వుండాలని కోరుతాను; కాని నన్ను ఒక్కసారి కన్నెత్తి చూడకపోతివేయని నాకు దుఃఖం కలుగుతూఉంది." అన్నది.

పినతండ్రివద్ద చిన్నతానాన్నుంచి పొరుగుబిడ్డలాగా పోషింపబడడంచేత ఇతరులతో కలిసిమెలిసి వుండటానికి సంకోచిస్తూవుంది ఆశ. ఎవరైనా తనతో స్నేహంచేయడానికి ప్రయత్నిస్తారేమోనని భయపడుతూవుంది. వినోదిని— మన్మథునివిల్లువలె కలిసివున్నకనుబొమలు, ప్రకాశవంతంగాను

మనోరంజకంగాను కనుపించే చూపులు, అమాయకంగా వున్నముఖమూ, ప్రతిభావంతమైన యౌవనముకలిగి-ముందుకు వచ్చింది. ఐనప్పటికి ఆశ ముందుగా ఆమె విషయాల్ని గురించి ప్రశ్నించడానికెంతమాత్రం సాహసం చేయలేకపోయింది.

అత్తగారు వినోదినిని దండించడంలేదని, అత్తగారివల్ల ఆమె భయపడడంలేదని గ్రహించింది ఆశ. అత్తగారుకూడా ఆమెను మాటిమాటికి ఉదహరణంగా చూపి గౌరవిస్తూఉంది. వినోదిని గుణగుణాలను ప్రశంసిస్తూవుంది. ఆమె గృహకార్య నిర్వహణంలో ఘటికురాలని, అధికారం చలాయించడంలో తప్పేమీ లేదని భావించింది ఆశ. పనివాళ్ళను గద్దించి వారి చేత చక్కగా పనిచేయించడానికి ఆమె ఎంతమాత్రం వెరవడం లేదు. ఇదంతాచూచి ఆమెముందు తానెందుకూ పనికిరానని భావించింది.

ఇలాంటి గుణవతి – బుద్ధిమతియైన వినోదిని తనతో స్నేహం చేయవలెనను కోరిక యెప్పుడైతే వెల్లడించిందో ఇక ఆమె ఆనందానికి మేరలేకుండా పోయింది. ఒక్క ఘడియలో వినోదినినాలుగుమాటలతో ఆశసంకోచశీలతను తుడిచిపెట్టింది. ఇంద్రజాలికుడునాటిన వృక్షంలాగా ఇద్దరు చెలికత్తెలమధ్య నాటబడిన ప్రేమబీజం ఒక్కదినంలోనే అంకురించి పుష్పించి ఫలవంతమయింది.

"మంచిది అక్కా, మనఇద్దరిపేరు ఒక్కటిగా వుండాలి. అదేపేరుతో నీవు నన్నూ, నేను నిన్నూ పిలుస్తూవుండాలి. అలాగైతే చాలా బాగా వుంటుంది." అన్నది ఆశ.

"ఏపేరు పెట్టుకొందాంచెప్పు?" అన్నది వినోదిని నవ్వుతూ.

ఆశ తనకుతోచిన కొన్ని మంచిపేర్లను—'గంగ, గులాబ్' వంటివి చెప్పింది.

వినోదిని:— అబ్బే, ఈపేర్లన్నీ పాతబడిపోయినవి. ప్రేమ, గౌరవాలకు సంబంధించిన ఈపేర్లన్నింటిమీద ఆదరం పోయింది.

ఆశ:— ఐతే నీకేది ఇష్టమోచెప్పు.

'కంటి మెరమెర.' అన్నది వినోదిని నవ్వుతూ.

ఆశ ఏదో చక్కనిపేరు పెట్టవలెనని ఆశపడింది; కాని వినోదిని సలహాచేత ప్రేమపూర్వకంగా పెట్టిన యీ చీవాట్లను అంగీకరించింది. వినోదిని మెడలో తన రెండుచేతులను వేసి 'కంటి మెరమెర!' అని పొర్లిపొర్లి నవ్వింది ఆశ.

# 11

ఆశకు ఒక తోడు చాలా అవసరంగా వుంది. ప్రేమకు సంబంధించిన ఆనందోత్సవం ఇద్దరితోనే పరిపూర్ణంకాదు; చిత్తాన్ని ప్రసన్నంచేసే మధురసంభాషణామిఠాయీలను పంచడానికి మూడవమనిషికూడా అవసరమవుతుంది.

వినోదినికూడా ఇలాంటి రసానికి ఆకలిగొని వుంది. మత్తుగావున్న మనిషి ఘాటుగలసారాయి త్రాగినట్లు క్రొత్త కోడలి క్రొత్తప్రేమఇతిహాసాన్ని మిక్కిలిఆసక్తితో చెవియొగ్గి

వినడం ఆరంభించింది. అలావినడంవల్ల ఆమె మెదడు గిర్రున తిరుగసాగింది, రక్తం తుకతుక వుడుకుతూవుంది.

మధ్యాహ్న సమయంలో రాజలక్ష్మి నిద్రపోతూవుంది. పనివాళ్ళు క్రిందిభాగంలో విశ్రాంతి పొందుతూవున్నారు. బిహారీ ఎన్నివిధాలుగానో బోధిస్తూ వుండడంచేత ఏదో కొద్ది కాలంమాత్రమే కాలేజీకి వెళ్ళుతున్నాడు మహేంద్రుడు. ఎండచే కణకణలాడుతూవున్న నీలాకాశంలో ఒకచివరనుండి వేరొకచివరకు గద్దకూత తీవ్రస్వరంతో ప్రారంభమై తిన్నతిన్నగా క్షీణిస్తూ అప్పుడప్పుడు వినబడుతూవుంది. ఇలాంటి సమయంలో ఆశతన నిద్రాగృహంలో నేలమీదవున్న దిండుమీద తనకురులను విరియబోసుకొని పడుకొంది; వినోదిని తన ఎదురురొమ్ముకుక్రిందుగా దిండుపెట్టుకొని, కాళ్ళుచాచు కొని, ఆశాలత చెబుతూవున్న మహేంద్రుని ప్రేమగాథలను మనసార వింటూవుంది. ఇలా వింటూవుండగా ఆమె బుగ్గల యందున్న గులాబీరంగు ఘనీభవించింది, శ్వాసపీల్చడం ఎక్కువయింది.

వినోదిని ఆనందంతో ఆమెను త్తేజపరుస్తూ చిన్నచిన్న విషయాలమీదకూడా ప్రశ్నలమీద ప్రశ్నలనుకురిపిస్తూవుంది. ఒక్కొక్కవిషయాన్ని అనేకసార్లు వింటూవుంది. ఒకవిష యాన్నిగురించినవర్ణన పూర్తికాగానే "సరేచెల్లెలా, ఇలాగైతే ఏమౌతుంది, ఆలాజరిగితే నీవేంచేస్తావు?" అని తన వూహా ప్రపంచంలో బయలుదేరిన సందేహాలను ప్రశ్నలద్వారా నివర్తించుకొంటూవుంది.

ఈవిధగా క్రొత్తక్రొత్త వూహాలవైపు తన విలాస విషయాల హద్దులను పొడిగించడంవల్ల ఆశ హృదయం చీకాకు నొందడంలేదు—ఆమెకు ఉల్లాసంగానేవుంది.

"మంచిది, నీకు బిహారీకి వివాహం జరిగివుంటే ఎలా వుండేది?" అని అడిగింది వినోదిని.

ఆశ:— వద్దమ్మా, ఇలాంటి మాటలనవద్దు – ఛీ-ఛీ, నాకు చాలాలజ్జగావుంది. ఐతే, నీతో అతనికి వివాహం జరిగివుంటే భాగుండేది. మీ యిద్దరిమధ్యకూడా రాయ బారాలు జరిగాయికదూ!

వినోదిని:— నావివాహం విషయంలో అనేకమందితో, మాటలు జరిగాయి. వాళ్ళతో జరగకపోవడమేమంచిది. నేను పూర్వంలాగానే హాయిగా వున్నాను.

కాని ఆశ దీన్ని అంగీకరించలేదు—ఎదురువాదం చేసింది. తనకంటె వినోదిని సుఖాన్ని అనుభవిస్తూ వుందని ఆమె ఎలా అంగీకరిస్తుంది?—"సరే, ఒకవేళ మావారితో నీసంబంధం జరిగివుంటే...నీవు సమ్మతించివుంటే జరిగే వుండేది!" అనేది ఆశ.

జరిగేవుండేది! ఎందుకు జరగలేదు? ఆశ వుపయోగిస్తూ వున్న యీశయ్య ఒకప్పుడు నాదికావలసినస్థితి సంభవించింది. వినోదిని, ఆ యలంకరింపబడిన కేళీనికేతనాన్ని పరిశీలిస్తూ, ఈ విధంగా ఆలోచిస్తూవుంది—ఒక దినం తనదిగా కావలవున్న గృహంలో తాను పరాయిదానిలాగా నివసిస్తూవుంది.

ఈ యింటిలో ఆమెకేమి హక్కు వుంది.. ఆమెకూడా ఒకఅతిథి, ఈరోజు వుంటుంది రేపు వెళ్ళిపోతుంది.

సంధ్యాసమయానికి కొంచెం ముందుగానే అడుగకనే తన పనితనాన్ని ప్రదర్శిస్తూ ఆశకు జడఅల్లి శృంగారించి సరియైనవేళకు ఆమె భర్తవద్దకు పంపుతూ ఉండేది. ఆమె విలక్షణమైన కల్పన దాగియుండి ఆ నవవధువు వెనుకనే ఒక ప్రియ యువకునివలె రహస్యమైన నిర్జనస్థానంలో ప్రవేశిస్తూవుంది. అప్పుడప్పుడు ఏదో కారణం కల్పించి వెళ్లనిచ్చేదికాదు వినోదిని. మాటల్లో చిక్కుపెట్టి "కొంచెం ఉండవమ్మా, వెళ్ళుదువుగాని! మీ దైవం ఎక్కడికీ పారిపోడులే! అతడేమీ అడవిజంతువుకాదు, తప్పించుకొనివెళ్లడానికి." అంటూవుండేది.

ఇదేవిధంగా హేళనచేస్తూ మాటల్లో చిక్కుపెట్టి ఆలస్యంచేసేది. ఒకదినం చాలాకోపంతో మహేంద్రుడు ఆశతో—"నీసఖి నిన్నేమీ కదిలి-మెదలనిచ్చేలాగా లేదే-ఆమె ఎప్పుడు ఆమెఇంటికి వెళ్లుతుంది?" అన్నాడు.

"చూడండి, మీరు నాచెలినేమి అనవద్దు. ఆమె మిమ్మెంతగా ప్రేమిస్తూవుందో మీకు తెలియదు. మిమ్ములను గురించి ఎంతశ్రద్ధగా వింటుంది, ప్రతిరోజు సాయంత్రం మహాప్రేమతో నన్ను అలంకరించి మీవద్దకు పంపుతుంది!" అన్నది దుఃఖంతో ఆశాలత.

రాజలక్ష్మి మొదట కోడలిని పని చేయనిచ్చేదికాదు. కోడలిపక్షం వహించి పనిపాటల్లో కోడలికి ప్రవేశం కలిగించింది వినోదిని.

వినోదిని పగలంతా పనిచేస్తూవుండేది, ఒక్క ఘడియ కూడా వృధాగా కాలం గడిపేదికాదు. ఒకటి తర్వాత ఒకటి పనులను నిర్ణయించేది. అందుచేత ఆశకు అక్కడ నుండి వెళ్ళే అవకాశం లభించేదికాదు. 'ఆశ భర్త శూన్యంగా వున్న మేడమీదగదిలో ఒకమూల కోపంతో మండిపడుతూ ఉంటాడు'-అని తనలోతాను క్రూరంగా నవ్వుకొంటూఉండేది వినోదిని.

"ఇక నన్నువెళ్లనీ, లేకపోతే వారు కోపపడతారు." అనేది ఆశ.

"ఆగు, ఈపనిచేసి వెళ్ళుదువుగాని, అంత ఆలస్యం లేదులే." అనేది వినోదిని.

"ఇక ఇప్పుడుకాదు. వారు చాలాకోపిస్తారు, నన్ను వెళ్ళ నివ్వు." అని కొంచెం ఆగినతర్వాత కష్టంగాఅనేది ఆశ.

"కొంచెం ఉండనమ్మా, ఈవేళ కొంచెం కోపపడితే ఏమి? చూడు, కూరలో కారం అవసరమైనట్లే 'ప్రేమ సంబధం' లోకూడా 'గిల్లికజ్జాలు' చాలా అవసరం అవు తాయి." అనేది వినోదిని.

ఐతే ఆ కారంమజా వినోదినికి మాత్రమే తెలుసు.ఆశకు దానిలోని రుచి ఎంతమాత్రం తెలియదు. ఐతే వినోదినివద్ద కారం అవసరమయ్యే కూరలుమాత్రంలేవు. ఇలా ఆలోచిస్తూ వుండగానే వినోదినికి నరనరంలో అగ్ని దహించివేస్తు న్నట్లుంధి, ఎటుచూస్తే అటు ఆమెకళ్ళనుండి నిప్పురవ్వలు రాలేవి.

'ఇలాంటి సౌఖ్యవంతమైన గృహం—ఇలాంటి ప్రేమ గలపతి—నేనీ గృహాన్ని రాజుయొక్క రాజ్యంగాను, ఈపతిని సేవకునిగా వుంచుకొనగలను. అప్పుడు యీ యింటిస్థితి ఇలా వుండేదా? నేనునాస్థానంలో అమాయకురాలైన పిల్ల—ఆటబొమ్మ వుంది.' అని తనలో ఆలోచిస్తూవుంది వినోదిని.

ఆశ మెడలో తన చేతులనువేసి—"కొంచెం ఆగు, నిన్నరాత్రి నీభర్తకు నీకు ఏసంభాషణలు నడిచాయో చెప్పు. మీప్రేమ సంభాషణలు వినడంవల్ల నాకుకలిగిన ఆనందంతో భోజనంకూడా రుచించడంలేదు." అన్నది వినోదిని.

# 12

మహేంద్రుడు ఒకనాడు చాలాకోపంతో తనతల్లి వద్దకువెళ్ళి—"ఇదినీకు బాగావుందాఅమ్మా? పరాయి యింటి విధవపడుచును నీవద్ద ఉంచుకొనవలసిన అవసరంయేముంది? ఆమె ఉండడం నాకిష్టంలేదు—ఎప్పుడేమౌతుందో ఎవరికి తెలుసు!" అన్నాడు.

రాజలక్ష్మి:—అది పరాయిదెలా అవుతుందినాయనా? అది నా పినతండ్రి కోడలు, దానిని పరాయిదాన్నిగా నేను భావించను.

మహేం:— వద్దమ్మా, ఇదిమంచిదికాదు. ఆమెను వాళ్ళ యింటికి పంపించడమే ఉత్తమం.

మహేంద్రుడు ఏది అనుకొంటాడో అది చేయక మానడని ఆమెకు బాగాతెలుసు. ఇక యెవ్వరిమాటా వినడని

కూడా తెలుసు. అతడిమాట తీసివేయడం చాలాకష్టం. అంతట బిహారీని పిలిపించి—"బిహారీ, నీవు కొంచెం మహేంద్రునికి తెలియజెప్పు. వినోదిని మన పనులన్నీ నిర్వహిస్తూ వుంది. ఆమెనాకు చాలా సహాయకారిగావుంది. ఆమె పరాయిదికాదు; కాని ఆమె చేసేసేవ మరెవ్వరూ నాకు చెయ్యలేరు." అని చెప్పింది రాజలక్ష్మి.

బిహారీ ఆమెకు జవాబు చెప్పలేదు. మహేంద్రుని వద్దకు వెళ్ళి—"మహేంద్రదాదా, వినోదిని విషయంలో ఏదయినా ఆలోచిస్తున్నావా?" అని అడిగాడు.

మహేంద్రుడు నవ్వి—"ఘడియఘడియకు ఆలోచిస్తూనే వున్నాను. ఈ ఆలోచనతో నాకు రాత్రులు నిద్రకూడా రావడంలేదు. మీ వదిననే అడుగరాదు? ప్రస్తుతం వినోదినిని గురించిన ఆలోచనతో ఇతరఆలోచనలన్నింటికి స్వస్తిజరిగింది." అన్నాడు.

ముసుగులోపలినుండి మహేంద్రునివైపు తీవ్రమైన కుటిలకోపంతో చూచింది ఆశ.

"ఏమిటి? 'విషవృక్షం'లో చెప్పినట్లయిందా?" అన్నాడు బిహారీ. ('విషవృక్షం' బంకించంద్రుని బెంగాలీనవల)

"సరిగ్గా అదే జరిగింది, చున్నీ ఇప్పుడామెను పంపివేయాలని చిందులు త్రొక్కుతూవుంది." అన్నాడు మహేంద్రుడు.

ముసుగులోపలినుండియే తీవ్రదృష్టి ప్రసరింపజేసింది ఆశ.

బిహారీ—పంపించివేయడంవల్ల ఏమిలాభం, ఆమె మళ్లీ రాకుండా వుంటుందా? విధవా వివాహం చేసివెయ్యి—ఆమె విషపుకోరలు సమూలంగా వూడిపోతాయి.

మహేం:— కుందనందినికికూడా వివాహం జరిగింది తెలుసా! (బంకించంద్రుని 'విషవృక్షం' కే 'కుందనందిని' అని కూడా పేరు.)

బిహారీ:— సంతోషం, ఇక నీ ఉపమాలంకారాన్ని అలావుంచు. నేనప్పుడప్పుడు వినోదినినిగురించి అలోచిస్తూనే వున్నాను. ఆమె నీవద్ద ఎల్లకాలం ఉండజాలదు. కాని ఆమెను ఆ అడవిలాంటి ప్రదేశంలోకి పంపడమూ మంచిదికాదు. అలా పంపడం ఆమెకు శిక్షవిధించడమే అవుతుంది. అక్కడి కష్టాలను నాకళ్ళార చూచేవచ్చాను.

వినోదిని ఇంతవరకు మహేంద్రుని ఎదుటకు రానేలేదు. కాని బిహారీ ఆమెను చూచివున్నందువల్ల ఆమె అడవులలో ఉండతగిందికాదని తెలుసుకొన్నాడు. మహేంద్రుని యింట్లో వున్నందువల్ల ఎప్పుడో ఏదో అనర్థం సంభవించకపోదనే చింత కూడా అతణ్ణి పిడిస్తూవుంది. ఎందుచేతనంటే, ఒకప్పుడు గృహాన్ని ప్రకాశవంతంచేసే దీపమే ఆ గృహానికి చిచ్చుపెట్టి భస్మీపటలం చేస్తూవుంటుంది.

మహేంద్రునికి బిహారీమాటలను వినడంచేత బాగా నవ్వొచ్చింది. బిహారీకూడా దానికి జవాబు చెప్పాడు. ఆమె ఒక ఆటవస్తుకాదని ఆమెను నుపేక్షించడం కష్టమని బిహారీ భావించాడు.

"అమ్మా, కోడలిని ఎక్కువకాలం నీవద్ద నుంచు కోవద్దు. నీవు సాధువైన పల్లెటూరి బిడ్డవు, నాగరకులైన యువకుల భావాలు నీకు తెలియవు.నీవు తెలివిగలదానివి, బాగా ఆలోచించి వ్యవహరిస్తూవుండు." అని వినోదినికి బోధించింది రాజలక్ష్మి.

ఇదిజరిగిన తర్వాత వాతావరణం మరొకవిధంగా మారింది. వినోదిని ఆశను తనదగ్గరకు రానీయకుండా ఆడంబర పూర్వకంగా జాగ్రత్తపడుతూవుంది—"నే నెవరు, నీవెవరు? నాపరిస్థితి బాగాలేదు. నా గౌరవ మర్యాదలను గుర్తించి నడుచుకొనకపోతే ఎప్పుడేమి జరుగుతుందోనని భయపడు తున్నాను." అన్నది వినోదిని.

ఆశ కాళ్లావేళ్ళాబడి వినోదినిని బ్రతిమాలింది, ఎంత గానో ఏడ్చింది, కాని వినోదిని ఆమెనిశ్చయాన్ని మార్చు కొనలేదు. ప్రతిరోజు తనకథలను వినిపించడం అలవాటయింది ఆశకు. ఇక ఎవరితో చెప్పుకొంటుంది! ఆమె లక్షసార్లు వినోదినితో కలియాలని – సంభాషించాలని కోరుతూవుంది, కాని వినోదిని దురాతిదూరంగా వుంటూవుంది.

ఇటు మహేంద్రుని భావంలో మార్పుగోచరింప సాగింది. ప్రేమానుబంధం సళ్ళిపోతూవుంది. గడియగడియకు దగ్గరకూర్చొనుశక్తి లోపిస్తూవుంది. పూర్వం ఆశ ఒకపని చేయలేకపోయినా–చెడగొట్టినా మహేంద్రుడు నవ్వుతూవుండే వాడు; దానిలోకూడా అతనికి ఒకవిధమైన రసం కనిపిస్తూ వుండేది; కాని ఇప్పుడలాలేదు. ఆమె ఏపనినైనా–చెరచినా,

చేయకపోయినా అతడికి సంతోషంకలగడంలేదు. ఇప్పుడు ఆశ అమాయకత్వంవల్ల అతడికి కోపంకలుగుతూవుంది. మహేంద్రుడు పైకి చెప్పకపోయినా అతడి లోపలవున్నకోపం ఆశ గ్రహిస్తూనేవుంది. ఎల్లప్పుడు ఇద్దరు ఒకేచోట కలిసిమెలిసి వుండడంచేత ప్రేమవిలువ తగ్గిపోతూవుందని అతడు తెలుసుకొన్నాడు. మహేంద్రుని ప్రేమగానం అపస్వరాలతో నిండిపోతున్నట్లు కనిపిస్తూవుంది—దానిలో అస్వాభావికత చాపల్యం అనేవి అతనికి తెలియకుండానే చోటుచేసుకొని వృద్ధిపొందసాగాయి.

ఇలాంటి సమయంలో వేర్వేరుగా వుండడంతప్ప మరొక రక్షణసాధనం కనిపించదు; విచ్ఛేదమో లేక వియోగమో తప్ప దీనికి మరొక ఔషధంలేదు. ఇలాంటి సంకటపరిస్థితుల్లో స్త్రీలు దూరంగావుండడానికే ప్రయత్నిస్తారు. ఇది స్త్రీలకు స్వభావసిద్ధమైన సహజసంస్కారం ఆశకూడా మహేంద్రునికి దూరంగా వుండడమే యుక్తంగా తలచింది. కాని ఎచ్చటికి వెళ్లడం? వినోదినికంటే ఆమెకు మరొక ఆశ్రయంలేదు.

మహేంద్రుడుకూడా, ప్రేమమత్తు కొంచెం తగ్గగానే, తెలివితెచ్చుకొని ఇంటి వ్యవహారాల్లో, చదువు సంధ్యల్లో తనదృష్టిని ప్రసరింపజేశాడు. అతడు ఆమూల ఈమూల పడివున్న డాక్టరుపరీక్షకు సంబంధించిన పుస్తకాలను ప్రోగుచేసి వాని దుమ్ము విదలగొట్టడం మొదలు పెట్టాడు. కోటు, సూటు, హ్యాటు పెట్టెలోనుండి తీసి ఎండలో వేస్తున్నాడు.

# 13

వినోదిని తన మాటల్లోకి రాకపోవడంచేత ఆశకు ఒక ఆలోచన తట్టి—"సరే అక్కా, నీవు వారి ఎదుటికి ఎందుకు వెళ్ళవు? దూరదూరంగా పరుగెత్తుతున్నావెందుకు?" అన్నది.

వినోదిని ముక్తసరిగాను, తీవ్రంగాను—"ఛీ, ఛీ!"అన్నది.

"నీవేమీ పరాయిదానవు కాదన్నదే అత్తగారు!" అన్నది ఆశ·

"ప్రపంచంలో నాకు నావాళ్ళూ లేరు, పరాయివాళ్ళూ లేరు. నన్నెవరు తనవారుగా భావిస్తే వారేనావారు, నన్ను పరాయిగా ఎవరుభావిస్తారో వారు నావారైనా నాకుపరాయి వారే!" అన్నది గంభీరంగా వినోదిని.

'నిజమే, ఈమె చెప్పినదానికి తిరుగులేదు. వారు వినోదినికి సంబంధించినంతవరకు ఏమాత్రం న్యాయంగా ప్రవర్తించడంలేదు. ఆమెను పరాయిదానిలాగా భావించడం, అకారణంగా ఆమెతో విరోధించడం బాగాలేదు.' అని తనలో అనుకొన్నది ఆశ.

"మీరు నా సఖితో మాట్లాడవలసివుంటుంది." అని ఆరోజు రాత్రి తన భర్తతో చాలగట్టిగా చెప్పింది.

"నీవు ఎంత గొప్ప సాహసంచేశావు!" అని నవ్వాడు మహేంద్రుడు.

ఆశ:— ఎందుకు, ఇందులో భయపడవలసిన విషయమేముంది?

మహేం:— నీసఖి సౌందర్యాన్ని నీవు వర్ణించడం చూస్తే, నేనామెతో ఇలా ప్రవర్తించడమే క్షేమకర మనిపిస్తోంది.

ఆశ:— మీరు ఈవిషయంలో భయపడకండి, నేను సవరించుకొంటాను. ఇక ఎగతాళిమాని ఆమెతో మాట్లాడు తారాలేదా నిజం చెప్పండి.

వినోదినిని చూడడం మహేంద్రునికి పూర్తిగా ఇష్టం లేదనడానికి వీలులేదు. అప్పుడప్పుడు ఆమెను చూడాలని అతని హృదయంలో కోరిక కలుగుతూనే వుంది. కాని ఈకోరి కను తాను స్వయంగా వెల్లడించడం ఉచితంకాదని ఊరు కొన్నాడు.

ఆంతరిక విషయాల్లో మహేంద్రుని ఆదర్శం ఇతర వ్యక్తులకంటె కొంచెం కఠినంగా వుంటుంది. తల్లి అధికార ప్రాబల్యం ఎక్కడ కుంటువడిపోతుందోననే సందేహంతో అతడు మొదట వివాహ మాడడానికికూడా సందేహించాడు. ఇప్పుడు ఆశ స్థానాన్ని సురక్షితంగా వుంచాలని అతడు కోరు తున్నాడు. మరొక స్త్రీకి సంబంధించిన ఆలోచనలకు తన హృద యంలో అణుమాత్రమైన అవకాశాన్ని కల్పించడం మహేం ద్రునికిష్టంలేదు. ప్రేమనుగురించిన విషయాల్లో తాను నిశ్చితమైన భావాలుగలవాడనని గర్విస్తూవుంటాడు. మైత్రికి సంబంధించి నంతవరకు బిహారీతోతప్ప మరొకరి మైత్రిని అతడంగీకరించడు. ఎవడైనా తన మైత్రిని కోరుతూ వచ్చేయెడల వానిని అనాదర దృష్టితో చూచేవాడు బిహారీయెదుట అతణ్ణి హేళన

చేసి ఆనందిస్తూ వుండేవాడు. బిహారీ ఈవిషయంలో ఏదయినా ప్రస్తావన చేస్తే—"నీ వలా చేయగలవు బిహారీ, నీవెక్కడికి వెళ్ళితే అక్కడ మిత్రులకు కొదువలేదు; కాని నేను మాత్రం ప్రతి వ్యక్తితో మైత్రి నెరపడానికి సిద్ధంగాలేను." అనేవాడు.

అలాంటి మహేంద్రుని మనస్సు, ఈ మధ్య తనకు తెలియకుండానే, ఒక విధమైన వ్యగ్రకుతూహలంతో ఈ అపరిచిత యువతిమీాదికి నడుస్తూవుండడంచేత, తనకు తానే లజ్జపడి తిట్టుకొంటూ చివరికి క్రుద్ధుడై ఆమెను ఇక్కడనుంచి పంపివేయవలసిందని తల్లితో పోట్లాడుతున్నాడు.

మహేం:— పోనిద్దూ చున్నీ, నీసఖితో మాట్లాడడానికి నాకు అవకాశం ఎక్కడుంది? చదువుకొనే సమయంలో చదువుకోవాలి! కాస్త తీరికలభిస్తే నీవూ నేనూ ముచ్చటించుకోవలసి వుంటుందిగదా. వినోదిని యెదుటికి వెళ్ళడానికి, ఆమెతో సంభాషించడానికి నాకు వ్యవధిఎక్కడిది?

ఆశ:— మంచిది, మీారు చదువుకొనే సమయంలో చదువుకోండి, నావాటకువచ్చిన సమయాన్ని ఆమెకు బదిలీ చేస్తాను; అప్పుడు సంభాషిస్తారా?

మహేం:— నీవు బదిలీచేస్తావు, కాని నేనెందుకు బదిలీ చేస్తాను?

అశ వినోదినిని ప్రేమిస్తూవుంది; కాని మహేంద్రుడు ఈకారణంగా ఆశకు తనయందుగల పతిప్రేమ కొరతవడిందని భావించి కోపగించుకొన్నాడు — "నాలాంటి అనన్యప్రేమ నీకులేదు." అన్నాడు.

కాని ఆశ దీన్ని ఎంతమాత్రం అంగీకరించడంలేదు; ఈవిషయంలో అతనితో వాదిస్తూవుంది; కాని తర్కంలో ఓడిపోతూవుంది.

మహేంద్రుడు పతి పత్నులమధ్య సూదిమోపినంత స్థానాన్నికూడా వినోదినికి ఇవ్వగోరటంలేదు—ఇది అతనికొక గర్వకారణంగావుంది. మహేంద్రుని ఈయభిమానం ఆశకు అసహ్యంగావుంది; కాని ఇప్పుడామె ఓటమిని అంగీకరించి— "మంచిదే, నాయందు గౌరవంవుంచి నాకోరిక ప్రకారం ఒకసారి ఆమెతో మాట్లాడరాదు!" అన్నది.

ఆశఎదుట తనప్రేమయొక్క శ్రేష్ఠత్వాన్ని, దార్ఢ్యాన్ని స్థిరీకరించి, ఆమెననుగ్రహించినట్లుగా వినోదినితో సంభాషించ డానికి అంగీకారాన్ని తెలిపాడు మహేంద్రుడు—"కాని ఎప్పుడు పడితే అప్పుడు ఆమెతో సంభాషించను, ఒకటి రెండుసార్లు మాత్రమే మాట్లాడుతాను." అని ముందుగానే చెప్పివుంచాడు.

మరుసటిదినం ఉదయమే వినోదిని నిద్రలేవకముందే ఆశ ఆమెవద్దకువెళ్ళి ఆమె మెడలో చేతులువేసి కౌగలించు కొంది. — "అరె, ఇదేమాశ్చర్యం! చకోరి నేడు చంద్రుని విడిచి మేఘాన్నెందుకు సమీపించింది?" అన్నది వినోదిని.

ఆశాలత:— నీవలె నేను కవిత్వంచెప్పలేను. నీవు నాయెదుట కవిత్వం చెప్పడం పెంటపోగుమీద ముత్యాలు వెదచల్లడంలాగావుంది. నీమాటలకు జవాబు చెప్పగలవారి- ఎదుటికి యెందుకువెళ్ళవు?

వినోదిని:— అంత సరసుడెవరు ?

ఆశ:— నీమరది. లేదమ్మా, ఎగతాళికాదు, వారు నీతో మాట్లాడవలెనని నాతో అనేకసార్లు చెప్పారు.

'భార్య చెప్పడంచేత నాకు పిలుపువచ్చింది, ఐతే నేను పిలిచీ పిలువకముందే వెళ్ళడమేనా!' అనుకొని బెట్టుచేసింది చతుర వినోదిని.

వినోదిని ఎంతమాత్రం అంగీకరించలేదు. తన భర్త ఎదుటికి వెళ్ళడానికి చాలా సిగ్గుపడ్డది ఆశ.

'నాఎదుటికి రావడానికి కూడా కాదూ గీదూ అంటుందా? నన్నుకూడా ఇతర మగవాళ్ళలాగానే భావిస్తూ వుందా? ఇంకొకడైతే ఏదోవిధంగా వినోదినిని చూడకుండా వుండేవాడా? మాట్లాడడానికి ప్రయత్నించకుండావుండే వాడా? నేనీవిషయంలో ఏమాత్రమూ ఆలోచించలేదు, ఈవిషయాన్ని కూడా ఆమె గుర్తించలేదా? ఇతర పురుషులకు నాకు ఎంత అంతరంవుందో ఒకసారి బాగాఆలోచిస్తే ఆమెకే తెలుస్తుంది.' అని లోలోపల వుడికిపోయాడు మహేంద్రుడు.

'ఇన్ని రోజులుగా నేను వీరి ఇంట్లోవున్నాను; కాని మహేంద్రుడు ఒక్కసారికూడా నన్ను చూడడానికి ప్రయత్నించలేదు! నేను అత్తయ్యతో సంభాషించే సమయంలో ఏదోపని కల్పించుకొనియైనా రావచ్చునే. ఇంత ఔదాసీన్యం, ఇంతనిర్లక్ష్యం ఎందుకో! నేనేం కొయ్యముక్కనా? నేను మనిషినికానా? ఆడుదాన్నికానా? వారు నన్నొకసారి పరిచయంచేసుకొంటే నాలో, చున్నీలో ఎంతభేదంవుందో

తెలిసి వచ్చేది!' అని రెండురోజులనుండి వినోదినికూడా లోలోపల అనుకొంది.

"ఈవేళ మీరు కాలేజీకి వెళ్ళినట్లుగా వెళ్ళండి, నా చెలిని గదిలోకి తీసుకొనివస్తాను. మీరు కాలేజికి వెళ్లకుండా మార్గమధ్యంనుండియే అకస్మాత్తుగా తిరిగిరండి. ఇక వినోదిని మనకు దొరికిపోతుంది." అని వుపాయంపన్నింది ఆశ.

మహేం:— ఆమె నీవిధంగా దండించడానికి ఆమె ఏ అపరాధం చేసింది?

ఆశ:— లేదండీ, నాకు అమెమీద చాలా కోపంగా వుంది. మీయెదుటికి రావడానికి ఆమె ఇష్టపడడంలేదు! ఆమె నీ విధంగా బాధపెట్టి ఆమె ప్రతిజ్ఞాభంగంచేసి మరీవదుల్తాను.

మహేం:— నీప్రియ సఖిని చూడనంతమాత్రంచేత నేనేమీ చచ్చిపోను. ఇలా దొంగచాటుగా చూడడం నాకు బాగాలేదు.

"నామీద ఒట్టుసుమా, మీరొకసారి ఇలా చేసితీరాలి. ఒక్కసారి ఏవిధంగానైనాసరే అమెకు శృంగభంగం చేయాలి. తర్వాత మీ యిష్టం." అని చెయ్యిపట్టుకొని దీనంగా ప్రార్థించింది ఆశ.

మహేంద్రుడు మాట్లాడలేదు.

"ప్రాణనాథా, నేను మిమ్ము ప్రార్థిస్తున్నాను, నామాట వినండి." అని మళ్ళీఅన్నది ఆశ.

వినోదినిని చూడవలెననే మహేంద్రుని కోరిక దిన క్రమంగా వృద్ధిపొందుతూవుంది; ఐనప్పటికి అవసరాన్ని

మించిన ఔదాసీన్యాన్ని ప్రకటిస్తూ ఆశను తృప్తిపరచడానికే మాత్రమే అన్నట్లుగా దానికి సమ్మతించాడు.

శరదృతువు, ఆకాశం నిర్మలంగావుంది, మధ్యాహ్నపు సమయంలో వినోదిని మహేంద్రుని గదిలో కూర్చొని, ఆశకు మెడపట్టీ అల్లడం నేర్పుతూవుంది. ఆశకు ధ్యానం ఎక్కడో వుంది, ఆమె మాటిమాటికి ద్వారంవైపుచూస్తూ, అల్లికలో తప్పులు వేసి వినోదిని యెదుట తన తెలివితక్కువను ప్రదర్శించుకొంటూవుంది. చివరకు వినోదినికి విసుగుపుట్టి, ఆశ చేతిలోవున్న మెడపట్టీని తీసుకొని విసరివేసి—"ఇది నీవల్ల కాదు. నాకు వేరేపనివుంది, నేను వెళ్ళుతున్నాను." అన్నది.

"ఆఁ-ఆఁ, కొంచెమాగు, ఈసారిచూడు. ఇక తప్పు వేయను." అన్నది ఆశ.

ఇలాఅని మెడపట్టీని తెచ్చి తిరిగిఅల్లడం నేర్చుకొంటూ వుంది. ఈ మధ్యలో మహేంద్రుడు మెదలకుండా వినోదినికి వెనుక దర్వాజాకు సమీపంగా వచ్చి నిల్చొన్నాడు. ఆశ ఆ దిక్కుకు చూడకుండా తల వంచుకొని మెల్లిమెల్లిగా నవ్వు కొంటూ వుంది.

వినోదిని:— ఎందుకు, నవ్వు సాగించావు? ఏదయినా జ్ఞాపకం వచ్చిందా?

ఆశ తన నవ్వు ప్రవాహాన్ని అణచుకొనలేకపోయింది, పెద్దగా పకపక నవ్వింది. మెడపట్టీని వినోదినిపైనవేసి—"కాదు గోదరీ, నీవు నిజంచెప్పావు—ఇది నావల్లకాదు."అని ఆశ వినోదిని కౌగలించుకొని పెద్దగా నవ్వ మొదలుపెట్టింది.

వినోదిని మొదటే అంతా గమనించింది. ఆశ చంచలత్వం; ముఖకవళికలు చూచి, ఆశ ఈరోజు నన్ను మాయ చేయడానికి చేతగానితంత్రమేదో పన్నిందని తెలుసుకొంది. మహేంద్రుడు వెనుక నిశ్శబ్దంగా నిల్చివుండడంకూడ ఆమె గ్రహించకపోలేదు. కాని అతి తేలికగా, అమాయికురాలిలాగా, ఆశాలత పన్నిన అసమర్థమాయాజాలంలో మనస్ఫూర్తిగా కావాలని చిక్కుకొంది.

మహేంద్రుడు లోపలికివచ్చి—"ఈ నవ్వుకు కారణమేమో నేనుకూడా తెలుసుకోవచ్చునా?" అన్నాడు.

వినోదిని అదరిపడి చెరగుతో ముసుగు వేసుకొంటూ లేవబోయింది. కాని ఆశ ఆమె చేయి పట్టుకొని ఆపింది.

మహేంద్రుడు నవ్వి—"మీరు కూర్చోండి, నేను వెళ్ళుతున్నాను." అన్నాడు.

"వద్దు" అన్నది ఆశ.

సాధారణ స్త్రీలలాగా లేచి వెళ్ళిపోడానికి గట్టిగా ప్రయత్నించలేదు వినోదిని. ఎప్పటిలాగా కూర్చొంది.

"వారి ఎదుట సిగ్గుపడవలసిన అవసరమేముంది?" అన్నది ఆశ.

వినోదిని మహేంద్రునివైపు సంజ్ఞచేస్తూ—"వారికిలాంటి కోరిక వుంటే నేను కూర్చొంటున్నాను—కాని నన్ను లోలోపల తిట్టవద్దు! శపించవద్దు!" అన్నది వినోదిని.

"వెంటనే యిచ్చటినుండి వెళ్ళేశక్తి మీకాళ్ళకు లేకుండా మాత్రం శపిస్తాను." అన్నాడు మహేంద్రుడు.

వినోదిని:—ఇందుకు నేను భయమందడంలేదు. ఎందు కంటే మీకు మహోత్సవుంటే నాలుగైదు నిముషాలకు మించి సైముండదు. ఆమాత్రం ఇప్పటికే గడిచివుండవచ్చు. ఇలాఅని తిరిగి లేవబోయింది వినోదిని.

"నీవు వెళ్ళావా, నామీదఒట్టు. ఇంకా కొంచెంసేపు కూర్చో." అని ఆమెచేయి పట్టుకొని అన్నది ఆశ.

# 14

"నిజంచెప్పండి, నాసఖి ఎలావుందో?" అని అడిగింది ఆశ.

మహేంద్రుడు నిర్లక్ష్యంగా—"చెడ్డదికాదు." అన్నాడు.

"మీకెవ్వరూ నచ్చరు" అని చిన్నబోయిన ముఖంతో అన్నది ఆశ.

మహేం:— ఒక్కమనిషి తప్ప.

ఆశ:— మంచిది, ఆమెతో కొంచెం సంభాషణలు జరుగనీయండి; అప్పుడు చెప్పుదురుగాని.

మహేం:— ఇంకా సంభాషణలే? ఈ సంభాషణలు నిరంతరం జరుగుతూనే ఉంటాయా యేమిటి?

ఆశ:— ఆమె మీయెదుటికివస్తే పలుకరించరాదేమిటి? సదుద్దేశ్యాలతో సంభాషలు జరుగుతూనే వుండాలి. ఒకనాడు ఒకరినొకరు పరిచయంచేసికొని తిరుగు మాట్లాడకుండా, కలిసి కొనకుండా వదలిపెడితే నాసఖి ఏమనుకొంటుంది? మీ మాట

లన్నీ విచిత్రంగా వుంటాయి. మరొకరైతే ప్రయత్న పూర్వకంగా ఆమెతో మాట్లాడేవారు; కాని మీనెత్తిమీద ఏదో పెద్దభారం పడ్డట్లుగావుందే!

ఇతరులలోకంటే తనలో ఏదో ఆధిక్యం వున్నదనడం చేత మహేంద్రుడు చాలా సంతోషించాడు. —"మంచిది. దీనికొరకు భయపడడం, విజ్ఞాపనులు చేయడం అవసరం ఏముంది? నేను ఇక్కడినుండి తప్పించుకొని వెళ్ళుదామంటే నాకు స్థానం దొరకడంలేదు; నీసఖి ఇక్కడ పీఠం వేసినట్లుగానే కనుబడుతోంది. అందుచేత మేము ఎప్పుడోఒకప్పుడు ఎదురు పడకతప్పదు. ఎదుట పడ్డప్పుడు పెద్దమనుష్యుల్లాగా వ్యవహరించవలసి ఉంటుంది. ఈవిషయాన్ని నీవు నీభర్తకు బోధించనక్కరలేదులే." అన్నాడు.

ఏదో ఒకసాకుతో ప్రతిరోజు వినోదిని తన ఎదుటికి వస్తుందని మహేంద్రుడు విశ్వసించాడు; కాని అతడు ఇలా భావించడం పొరబాటు. ఆమె అలా కనుపించలేదు, ఆకస్మికంగా కలిసికోవడంకూడా పడలేదు.

తనలోని ఔత్సుక్యం-వ్యగ్రత బయటపడకుండా వుండ గలందులకు మహేంద్రుడు ఆశఎదుట వినోదినినిగురించి చర్చించడంలేదు. మధ్యమధ్య ఆమెను కలుసుకొనవలెననే స్వాభావికమూ సామాన్యమూనైన కోరికను అణచివుంచడం వల్ల మహేంద్రుని తాపం వృద్ధిపొందుతూవుంది. మీదు మిక్కిలి వినోదిని చూపించే నిర్లక్ష్యభావం దానికి మరింత ఉద్దీపనం కలిగిస్తూవుంది. ఆమెను కలుసుకొన్నతర్వా

అమరుసటిదినం మహేంద్రుడు ఆశయెదుట ఈ ప్రస్తావన తెచ్చి నవ్వుతూ ఆశతో—"సరే, నీ స్వామివిషయంలో నీసఖి అభిప్రాయం ఎలావుందో తెలుసుకొన్నావా?" అని ప్రశ్నించాడు.

ఆశ ఈవిషయంలో ఒక పెద్ద ఉత్సాహపూరితమైన నివేదికను సమర్పిస్తుందని ఆత్రుతగా ఎదురుచూచాడు మహేంద్రుడు. కాని ఆమె తనకుతానుగా ఈవిషయంలో యేమీ ప్రస్తావించక పోవడంచేత స్వయంగా తానే ఈ ప్రసంగాన్ని ఎత్తి ఎగతాళిగా ప్రశ్నించాడు.

ఆశ చాలా ఇరకాటంలో పడ్డది. దీన్నిగురించి వినోదిని ఏమీ చెప్పలేదు. ఇాదుచేత తన సఖిమీాద తనలోతాను చీదరించుకొన్నది—"ఉండండి, నాల్గుదినాలు సంభాషణలు సాగనివ్వండి, అప్పుడు మీా విషయంలో ఆమె అభిప్రాయం ద్యోతకమవుతుంది. సంభాషణలు జరుగడంగాని, కలిసికొనడం గాని ఇంకా ఎన్నోసార్లు జరుగలేదుగా." అన్నది.

ఆశ జవాబు మహేంద్రునికి ఇంకా నిరాశను కలిగించింది. వినోదినిని కలిసికొనడంలో నిర్లక్ష్యంగా వుండడంగాని, ఉపేక్షించడంగాని అతనికి ఇక అసంభవంగా కనిపించింది.

ఇంతలో బిహారి వచ్చాడు—"ఏం మహేంద్రదాదా, దేన్నిగురించి తర్కించుకొంటున్నారు?" అని ప్రశ్నించాడు.

"చూడు తమ్ముడూ, వినోదినో, ఇంద్రజాలమో, ఇదేం పేరోగాని ఆమెతో మీావదిన స్నేహం చేసింది. వారిలోవారు పిల్చుకొనడానికి 'వెండ్రుకలత్రాడు', 'చేపముల్లు' ఇలాంటిపేరు ఏదో పెట్టుకొన్నారు. నేనుకూడా ఆమెతో స్నేహం చేయా

లట, నన్ను పిలవడానికి 'సిగరెట్టు బూడిద' 'అగ్గిపుల్ల' లాంటి ఏదో పేరు పెట్టుకోవాలట! బాగుందా?" అన్నాడు మహేంద్రుడు.

ప్రతివాదం చేయాలనే కాంక్షతో ముసుగులోనున్న మధురమూ, అరుణవర్ణమూనైన ఆశ పెదవులు అదరసాగాయి. బిహారీ తన దృష్టిని ఒకసారి మహేంద్రునివైపు ప్రసరింపజేసి, తరువాత ఆశవైపు తిరిగి—"వదినా, ఈలక్షణాలు బాగాలేవు. ఇవి మాయమాటలు. మీ'కంటి మెరమెర'ను నేను చూచాను. నేమామెను మాటిమాటికి చూడడం సంభవిస్తే నేను నాదుర దృష్టంగా భావించలేనని ప్రమాణంచేసిచెప్పుతున్నాను. అలాంటప్పుడు ఆమెతో కలవడానికి మహేంద్రునికి ఇంతగా ఇష్టం లేకపోవడం నమ్మతగినసంగతికాదు." అన్నాడు.

మహేంద్రునికి బిహారీకి చాలా భేదంవుంది—ఆశకు నేడు ఈ విషయంలో మరొక ప్రమాణం లభించింది!

ఒక్కసారిగా మహేంద్రునికి ఫోటోగ్రాఫీ నేర్చుకోనాలని ఉత్సాహం కలిగింది. పూర్వం ఒకసారి ఫొటోగ్రాఫీ నేర్చుకొనడం ప్రారంభించి అసంపూర్తిగానే విడిచిపెట్టాడు. తిరిగి ఇప్పుడు ఆ కెమెరాను మరమ్మతు చేయించాడు; ద్రావకాలు తెప్పించాడు; బొమ్మలు తీయడం ప్రారంభించాడు. ఇంట్లో నౌకర్లకు, పనివాళ్లకుకూడా ఫొటోలు తీశాడు.

ఒక రోజున 'మీరు నాసఖికి ఫోటో తీయవలసింద'ని పట్టుపట్టింది ఆశ.

మహేంద్రుడు ముక్తసరిగా 'సరే' అని జవాబిచ్చాడు.

వినోదిని అంతకంటే సంక్షేపంగా 'వద్దు' అన్నది.

మరొకసారి తంత్రంపన్నవలసిన అవసరంకలిగింది ఆశకు. కాని దీన్నికూడా ముందుగానే గ్రహింప గలిగింది వినోదిని.

మధ్యాహ్న సమయంలో వినోదినిని తనగదిలోనికి పిల్చుకరావడానికి, ఆమెను అక్కడ నిద్రింపజేయడానికి, ఆ తరుణంలోనే ఆమె ఫోటో తీయించి తనమాట అంగీకరింపని సఖికి బలవంతంగా తగినశాస్తి చేయడానికి నిర్ణయించుకొంది ఆశ.

వినోదిని ఎన్నడూ పగలు నిద్రించేదికాదు. ఇదేమి ఆశ్చర్యమోకాని ఆదినం ఆమె గదిలోకివస్తూనే నిద్రపోయింది. ఎర్రని శాల్వానుకప్పుకొని, తెరచివున్న కిటికీవైపుగా తన ముఖాన్నిత్రిప్పి, చెయ్యి దిండుమీద పెట్టి ఒక ఆకర్షవంతమైన పద్ధతిలో నిద్రపోయింది.

"ఫోటో తీయించుకోడానికే పండుకొన్నట్లుగా వుందే!" అన్నాడు ఈమెను చూస్తూనే మహేంద్రుడు.

మహేంద్రుడు కెమెరా తెచ్చాడు. ఏవైపునుంచి ఫోటో తీస్తే బాగుంటుందో నిర్ణయించుకోడానికి ఆమెను నలుదిక్కుల నుండి చక్కగాచూచాడు. 'ఆర్ట్' కొరకు మెల్లిమెల్లిగా తలగడవద్దకువచ్చి విరియబోసుకొనివున్న ఆమె శిరోజములను చక్కదిద్దడంకూడా జరిగింది. — "కాళ్ళవద్దనున్న శాలువను కొంచెం ఎడమవైపుగా తొలగించు."అని ఆశ చెవిలోచెప్పాడు మహేంద్రుడు.

"నాకు బాగాచేతగాదు, మేల్కొంటుంది—మీరే తొలగించండి." అన్నది మెల్లగా అమాయకురాలైన ఆశ.

మహేంద్రుడే సవరించాడు.

ఫోటో తీయడానికి కెమెరాకు 'లెన్సు' బిగించాడు, ఇంతలో ఏదో ధ్వనివల్ల ఆమెమేలుకొని ఆవలిస్తూ వళ్ళు విరిచింది; వెంటనే ఒక దీర్ఘనిశ్వాసాన్ని తీసుకొని లేచి కూర్చొంది. పకపకనవ్వింది ఆశ; వినోదిని చాలా కోపపడింది; అంతట ఆమె తన ప్రకాశవంతమైన నేత్రాలతో మహేంద్రునిమీద అగ్నిబాణాల్ని వర్షించి—"చాలా అన్యాయం." అన్నది.

మహేం:— అన్యాయమే, ఇందులో సందేహంలేదు. ఐతే దొంగతనంచేశాను, దొంగ అనికూడా అనిపించుకొన్నాను. కాని చోరీఅస్తి చేతికిరాలేదు. ఈకారణంచేత ఇహపరాలకు రెంటికి దూరమైనాను! ఇందుచేత నా అన్యాయాన్ని పూర్తిచేసుకోనీ,తర్వాత నీయిచ్చవచ్చినట్లు దండించు.

ఆశకూడా వినోదినివెంటపడింది. ఫోటో తీయబడింది; కాని అదిచెడిపోయింది. ఈకారణంగా చిత్రకారుడు మరుదినం వేరొకచిత్రం తీయందే విడువలేదు. ఈతంతు జరిగినతర్వాత చెలికత్తెలిద్దరు కలిసి ఫోటో తీసుకొనడం మంచిదని ఇది వారి స్నేహానికి చిహ్నంగా తమగదిలో వుంచుకొనవచ్చునని ప్రస్తాపనవచ్చింది. ఈప్రస్తాపనను వినోదినికూడా అంగీకరించక తప్పిందికాదు. "మంచిదే, కాని మరొకసారి ఫోటో తీయాలీ అంటే అలావీలుకాదు." అని షరతుపెట్టింది. వినోదిని.

మహేంద్రుడు బుద్ధిపూర్వకంగానే ఈ ఫోటోనుకూడా చెడగొట్టాడు. ఈవిధంగా ఫోటోలు తీస్తూ మాట్లాడుతూ మాట్లాడుతూ మైత్రి ఎక్కువై పోయింది.

# 15

ఎవరైనా ఇటూఅటూ కదిలిస్తే నివురుగప్పివున్న నిప్పు తిరిగి పుంజుకొంటుంది. ఆశా మహేంద్రులమధ్య నిండుగా వున్న ప్రేమోత్సాహం తిన్నతిన్నగా ఆరిపోసాగింది. ఇప్పుడది మూడవ పక్షంవారు లేవదీయడంచేత తిరిగి మేల్కొంది.

ఆశలో పరిహాసమాడే శక్తిలేదు; కాని వినోదినికి పరిహాసమాడడం, యుక్తి సమాధానాలివ్వడం బాగా తెలుసు. ఈ కారణంచేత ఆశకు వినోదిని చాలా అవసరమయింది. ఆమె వినోదినిని తన ఆనందానికి ఆశ్రయంగా భావించింది. మహేంద్రుని ఆనందపరచడం ఎలాగా అని ఇప్పుడామెకున్న దిగులుకాస్త తీరిపోయింది.

వివాహమైన తర్వాత కొద్ది దినాలకే ఆశా మహేంద్రులు విడివిడిగా తమ వ్యక్తిత్వాల్ని సంపూర్ణంగా మరచి పరస్పరం ఆత్మార్పణలో పరాకాష్టను పొందాలనే కాంక్ష ప్రబలమయింది. ప్రేమగానం ఒక్కసారిగా తారస్థాయిలో ప్రారంభమయింది; వడ్డీతిని తృప్తిపడకుండా మూలధనాన్నే మింగివేసే ప్రయత్నం జరిగింది. కాని వారి ఉన్మాదప్రవాహాన్ని దైనందిన సాంసారిక స్రోతాలుగా ఎలా మార్చగలరు?

సారా త్రాగిన మనుష్యుడు మధ్యలో నిషా దిగిపోయి నందువల్ల కలిగిన శిథిలత్వాన్ని పోగొట్టుకొనడానికి తిరిగి సారాను కోరుతాడు; కాని అలాంటి నిషాను ఆశ ఎక్కడ నుండి తెస్తుంది? ఇలాంటి సమయంలో వినోదిని ఒక క్రొత్త వర్ణచిత్రమైన పానపాత్రను నింపుకొని తెచ్చి, ఆశ చేతికి అందిం చింది. ఆశ తనభర్త సంతోషంతోను ప్రఫుల్లవదనంతోను కనిపించడంచేత నిశ్చింతగా కాలంగడుపుతూవుంది. ఇప్పుడామె స్వప్రయత్నాల అవసరం తప్పింది.

మహేంద్రుడు, వినోదిని వారిలోవారు పరియాచ కాలతో, నవ్వులాటలతో, గడుపుతూవుంటే ఆశకూడా వారితోపాటు మనసార నవ్వుతూ వారిని అనుకరిస్తూవుంది. వారు పేకాటలాడే సమయంలో మహేంద్రుడు ఆశను మోస గించినప్పుడు ఆమె వినోదినిని తీర్పరిగాఎంచుకొని కరుణా పూర్వకంగా అభియోగం దాఖలుచేసేది. మహేంద్రుడు ఎప్పుడైనా నవ్వినా, కోపగించినా తగినసమాధానం ఇస్తుందనే ఆశతో వినోదిని వైపుచూచేది. ఈవిధంగా ప్రతిదినం ఈ ముగ్గురువ్యక్తుల సమావేశాలు జరుగసాగాయి.

ఇంతకాండ జరుగుతున్నప్పటికీ వినోదిని పనిపాటల్లో ఏమాత్రం పొరపొచ్చాలు రానీయడంలేదు. ఆమె వంటపని, అన్ని ఇతర ఇంటిపనులు, రాజలక్ష్మి సేవ ఇవన్నీ నిర్వహించి కాని ఈబాతాఖానీల్లో ప్రవేశించడంలేదు.

"మీరు నౌకర్లను వారివారిపనులను చేయనీయకుండా వారిని పాడుచేస్తున్నారు." అని మండిపడేవాడు మహేంద్రుడు.

వినోదిని :—ఏపని చేయకుండా స్వయంగా నాశనమై పోయేకంటే ఇది మంచిదే. వెళ్ళండి, మీరు కాలేజీకి వెళ్లండి.

మహేం:—నేను వర్షం పడేలాగావుంది. వెళ్ళను.

వినోదిని:— కాదు, అలా వీలులేదు — మీబండి సిద్ధంగా వుంది—కాలేజీకి వెళ్ళకతప్పదు.

మహేం:— నేను వద్దని చెప్పాను.

వినోదిని:— నేను తెమ్మని చెప్పాను.

ఇలాఅని వినోదిని మహేంద్రుని బట్టలు తెచ్చి ఎదురుగా వుంచేది.

మహేం:— నీవు ఏరాజపుత్రుల ఇంటియందో జన్మించ వలసిందానవు. నీవు రాజపుత్ర స్త్రీవి అయితే యుద్ధయాత్రలో నీస్వామికి స్వయంగా కవచం ధరింపజేసేదానివే.

వినోదినివల్ల లభించే ఈ ఆనందోత్సాహాలకొరకు కాలేజీకి వెళ్ళకుండా ఉండడం మహేంద్రునికి కష్టసాధ్యమై పోయింది. ఆమె కఠినశాసనంవల్ల మధ్యాహ్నపు సమావేశం సాయంకాలానికి మార్చబడింది. ఇలా మార్పు కావడంవల్ల కలిగిన సాయంసమావేశం అతనికి మనోహరంగాను, ఆకర్ష వంతంగాను వుంది. పగలంతా ఇతర కలాపాల్లో మగ్నమై వుండడంవల్ల సాయంకాలపు విశ్రాంతి మహేంద్రునికి ఒక క్రొత్త ఆనందాన్ని చేకూరుస్తూవుంది.

* * *

ఇంతకుముందు ఒక్కొక్కప్పుడు సమయానికి వంట తయారయ్యేదికాదు. అందువల్ల మహేంద్రుడు కాలేజీకి

వెళ్ళడం మానేసేవాడు. ఇప్పుడు వినోదిని అలా కాదు; హడా విడి చేసి, సమయానికి వంటచేసి, భోజనం పెడుతూవుంది. భోజనం కాగానే బండి సిద్ధంగా వుందని కబురు పంపుతూ వుంది. ఇంతకుముందు ఎంతో బాధపడితేగాని ఏ బట్ట ఎక్కడ వుండేది తెలిసేదికాదు; కాని ఇప్పుడు అన్ని బట్టలు వేర్వే రుగా అల్మారాలో ఉంచబడుతున్నాయి.

మొదటమొదట వినోదిని ఈ అన్ని విశృంఖలవిహారా లకు ఆశను వెక్కిరిస్తూ తియ్యని మాటలతో బెదరిస్తూవుండేది. మహేంద్రుడుకూడా అనివార్యమైన ఆశ అమాయకత్వాన్ని చూచి నవ్వుతూ త్రోసిపుచ్చేవాడు. చివరకు,మైత్రికారణంగా వినోదిని ఆశ కర్తవ్యభారాన్ని తానే వహించింది. ఆ గృహా నికి ఇంకనూ అలంకార ప్రాయమైపోయింది.

మహేంద్రుని కోటుబటను వూడిపోయింది. ఆశకు వెంటనే యేమిచేయడానికి తోచలేదు; వినోదిని వెంటనే వచ్చి దిగులుపడియున్న ఆశ చేతిలోనికోటు తీసికొనివెంటనే బటను కుట్టివేసింది. ఒకదినం మహేంద్రుని కొరకై వుంచిన భోజ నంలో పిల్లి మూతిపెట్టింది; ఆశ చింతతో బాధపడుతూవుంది; వినోదిని అప్పటికప్పుడే వంటగదిలో ప్రవేశించి, పొయ్యి వెలి గించి, ఒక్కగడియలో వంటపూర్తిచేసింది. ఇదిచూచి ఆశ చాలా ఆశ్చర్యపడింది.

మహేంద్రుడు ఈవిధంగా అన్నపానాదుల్లో, వస్త్ర ధారణంలో, పనిపాటల్లో అన్నివిధాలుగా వినోదిని నిపుణ హస్తాలుచేసే సేవానుభవాన్ని పొందసాగాడు. ఆమె అల్లిన

ఉన్నిమోజాలు అతని పాదాలయందున్నూ, ఉన్ని 'నెక్ టై' మెడలోనూ కోమలమైన ఆమె మానసిక స్పర్శలాగా గోచరిస్తూవుంది. ప్రస్తుతం ఆశకూడా ప్రియసఖియొక్క నిపుణ హస్తాలతో చక్కగా అలంకరించబడి, సుగంధం అలదబడి, మహేంద్రునివద్దకు వెళ్లుతూవుంది. ఆ అలంకరణ విధానంలో ఆశ సౌందర్యంకొంత, తనసఖి సౌందర్యంకొంత సమ్మిళితమై వుంది. గంగా యమునా సంగమంలాగా ఆశలో వినోదిని అంతర్భూతమైవుంటూ, ఈరూపంతో ఆమె నిత్యమూ రాత్రియందు క్రొంగ్రొత్త విధానాలతో మహేంద్రుని ఎదుటికి హాజరవుతూవుంది.

బిహారీకి వెనుకటిలాగా ఆదరసత్కారాలు పూజ్యమైనాయి. అతణ్ణెవ్వరూ పిలువడంలేదు. ఒకరోజు బిహారి మహేంద్రునికి 'రేపుఆదివారం, మధ్యాహ్నంవచ్చి అమ్మచేతి భోజనం తింటాను.' అని జాబువ్రాశాడు.

బిహారీ వచ్చేలాగుంటే ఈ ఆదివారాన్ని మన్నులో కలుపుతాడని మహేంద్రుడు భావించాడు. వెంటనే 'నేను రేపు ఒకముఖ్యమైన పనిమీద వెళ్లవలసివుంటుంది.' అని ఒక జాబు వ్రాసిపంపాడు.

'నేను ఉండననే సమాచారం చదువుకొని బిహారీ ఇక రా'డని మహేంద్రుడు భావించాడు. ఐతే ఇలాంటి సమాధానాన్ని పొందికూడా ఆరోజే భోజనంపూర్తిచేసుకొని వచ్చివేశాడు బిహారీ. మహేంద్రుడు ఇంట్లోనేవున్నాడని ఎక్కడికి వెళ్ళలేదని నౌకర్లవల్ల తెలుసుకొని లోపలికివెళ్ళిపోయాడు.

మెట్లమీాదికివెళ్లి, అలారంమ్రోగించి, నేరుగాగదిలోకివెళ్లాడు. మహేంద్రుడు కొంచెం సిగ్గుపడి 'తలనొప్పిగావుంది' అని తల పట్టుకొని దిండుమీద పడివున్నాడు. నొప్పిఅనేమాటవిని మహేంద్రుని వికలత్వంచూచి గాభరాపడింది ఆశ. 'ఇప్పుడేం చేసేది' అనే ప్రశ్నభావంతో వినోదినివైపుచూచింది. ఈ తల నొప్పి ఏపాటిదో, ఎలావచ్చిందో వినోదినికి బాగా తెలుసు; ఐనప్పటికి—"చాలాసేపటినుండి కూర్చొన్నారు, కొంచెం నిద్రపొండి. నేను 'ఉడికొలోన్' తెస్తాను." అని భయాన్ని ప్రకటిస్తూ అన్నది వినోదిని.

మహేం:—పోనిద్దూ, ఏమీ అక్కర్లేదు.

వినోదినిఅంగీకరించలేదు; ఆమెత్వరగా 'ఉడికొలాన్'ను మంచునీటితో కలుపుకొని తెచ్చింది.

వినోదిని ఆ నీటిలో రుమాలు తడిపి ఆశ చేతికిచ్చి "దీన్ని వారి తలకు పట్టీలాగా కట్టు." అని చెప్పింది.

మహేంద్రుడు మాటిమాటికి "పోనిద్దురూ, ఇప్పుడేమీ అక్కర్లేదు." అంటున్నాడు.

బిహారి నవ్వు లోలోపలనే అణచుకొని మెదలకుండా తమాషా చూస్తున్నాడు. మహేంద్రుడు 'నేనెలా గౌరవింపబడుతున్నానో బిహారి గ్రహిస్తాడు.' అని గర్వంగా తనలో అనుకొన్నాడు.

బిహారి ఎదుట సిగ్గుపడి ఆశ రుమాలు చక్కగా కట్టలేక పోయింది. రెండుమూడు చుక్కలు 'ఉడికొలోన్' మహేంద్రుని కళ్ళలో పడ్డాయి. అప్పుడు వినోదిని ఆశ చేతిలోవున్న

రుమాలు తీసుకొని చక్కగా కట్టి ఉడికొలోన్ నీటిలో మరొక బట్టను తడిపి పట్టీమీద పోస్తూవుంది. మేలిముసుగు కప్పుకొని, తలగడదిక్కున కూర్చొని, పంఖా విసరుతూవుంది ఆశ.

"మహేంద్రబాబూ, కొంచెం విశ్రాంతిగా వుందా?" అని అడిగింది వినోదిని.

ఈ విధంగా మధురస్వరంతో అమృతవర్షాన్ని కురిపించి వినోదిని చురుకుగా బిహారివైపు చూచింది. బిహారి కళ్ళలో ఆనందపూరితమైన నవ్వు ప్రకాశిస్తూవుంది. ఇదంతా నాటకమని అతడికి తెలుసు. అతణ్ణి మరిపించడంగాని మోసగించడంగాని వీలుకాదని, అతడివద్ద ఏరహస్యాన్ని దాచలేమని. తెలుసుకొంది వినోదిని.

"పెద్దవదినా, ఇలాంటిసేవను పొంది రోగం తొలగిపోకపోవడంగాక ఎక్కువకూడా అవుతుంది." అని నవ్వాడు బిహారి.

వినోదిని:—మేము మూర్ఖస్త్రీలం, అది మాకేం తెలుస్తుంది చెప్పండి. మీ డాక్టరీ పుస్తకాల్లో ఇలానే వ్రాసిఉందా?

బిహారి—ఏమైనా వ్రాసి వుండనీ, నేను ప్రత్యక్షంగా చూస్తూనేవున్నాను. మీ సేవాశుశ్రూషలు చూస్తుంటే నాకు లేని తలనొప్పి ప్రారంభం అయింది. కాని నావంటి అభాగ్యులకు ఇలాంటి తలనొప్పి మందుమాకులు లేకనే తగ్గిపోతుంది. మన మహేంద్రుడు గొప్ప భాగ్యశాలి సుమా.

ఉడికొలోన్‌తో తడిసిన బట్టను తీసివేసి — "ఇంకేమీ అక్కరలేదు, మిత్రునికి మిత్రుడే చికిత్స చేస్తాడు." అన్నది వినోదిని.

ఈ వ్యవహారమంతా చూచి, బిహారి తనలోతాను కుళ్ళి పోతున్నాడు. ఇటు కొన్ని దినాలనుండి చదువుతో సతమత మవుతున్నాడు; అతడికి మహేంద్రుడు, ఆశ, వినోదిని ఇంత చనువుగా కలిసిమెలిసి వుంటున్న సంగతి ఏమాత్రమూ తెలి యదు. ఈనాడు బిహారి వినోదినిని జాగ్రత్తగా చూచాడు; ఆమెకూడా బిహారిని చూచింది.

బిహారి తీక్ష్ణస్వరంతో—"బలేమాట. మిత్రునికిచికిత్స, మిత్రునికిసేవ మిత్రునివల్లనే కాగలుగుతుంది. నేను తలనొప్పిని తెచ్చాను, నేనే దాన్ని నావెంట తీసుకువెళ్ళుతాను. 'ఉడికొ లోన్.ఎసెన్సు' చాలా విలువగలవస్తువు. దాన్ని యీవిధంగా వ్యర్థం చేయకండి." అని ఆశవైపు చూచి—"వదినా, చికిత్స చేసి రోగాన్ని తొలగించేకంటే రోగం రాకుండా చేయడం మంచిదేకాక బుద్ధిమంతుల కర్తవ్యంకూడాను." అన్నాడు.

# 16

ఇకదూరంగావుండి ప్రయోజనంలేదని, ఎలాగైనా వీరి మధ్య చొరవచేసుకొనవలెనని, వీరిలో యెవ్వరూ నన్నుకోరక పోయినప్పటికి వారి వెంటనుండక తప్పదనీ నిశ్చయించు కొన్నాడు బిహారి.

వీరు తననుపిలువలేదే గౌరవించలేదే అని వ్యధపడకుండా వారి పద్మవ్యూహంలోకి చొరబడడం మొదలుపెట్టాడు. అతను వినోదినిని పిల్చి "చూడు పెద్దవదినా, ఈపిల్లవాణ్ణి వాడితల్లి కొంత పాడుచేసింది, మిత్రుడుకొంత పాడుచేశాడు, భార్య మరి కొంత పాడుచేస్తూఉంది—ఇక నీవుకూడా ఈ సంఘంతో కలిసి అతణ్ణి పాడుచేయకు. వానికి మరొకమార్గం చూపించమని నాప్రార్థన." అన్నాడు.

మహేం:— అంటే!

బిహారి:— అంటే నాలాంటివాణ్ణి...ఎవరిచేత ఆదరించ బడనివాణ్ణి...

మహేం:— శుభ్రంగా పాడుచెయ్యి! బిహారీ, పాడు కావాలని ఆశించడం అంత తేలికకాదు. విజ్ఞాపన అందించడం తోనే పనికాదు!

"పాడవడానికికూడా తగిన యోగ్యతకావాలి బిహారీ బాబూ!"అన్నది వినోదిని నవ్వుతూ.

బిహారి:— స్వయంగా యోగ్యత లేకపోయినప్పటికి కళాకారుని నేర్పరితనంవల్ల అంతా అయిపోతుంది! ఒకసారి పరీక్షించి చూచుకోరాదు?

వినోదిని:— ముందేసిద్ధపడి రావడంవల్ల ప్రయోజనం లేదు; అజాగ్రత్తగా ఉండడం జరుగుతుంది. (ఆశతో) ఏమం టావు? మీ యీమరిదిగారిభారం నీవెందుకు వహించరాదూ?

ఆశ ఆమెను తనవద్దనుండి కొంచెంగా ముందుకు త్రోసింది. బిహారి ఈపరిహాసాన్ని లెక్కచేయలేదు.

ఆశను అడ్డంగావుంచుకొని పరిహాసంగా మాట్లాడడం బిహారీ అసహ్యించు కొంటున్నాడని వినోదిని గమనించక పోలేదు. అతడు ఆశను దేవిగా భావించి ఆమెయందు భక్తి శ్రద్ధలు చూపిస్తున్నాడని, తనను తేలికగా చూస్తున్నాడని తెలుసుకొని ముల్లు గుచ్చుకొన్నదానిలాగా బాధపడ్డది వినోదిని.

"మీ మరిదిగారు నన్ను అడ్డంపెట్టుకొని నీ ఆదరాన్ని—ప్రేమను అర్థించడానికి బిచ్చగాడై వచ్చాడు—కొంచెం భిక్ష పెట్టు." అని ఆశతో మళ్ళీఅన్నది వినోదిని.

ఆశ ఈ హేళనవల్ల మండిపడిపోయింది.

ఒక్క నిమిషంలో బిహారిముఖం కందగడ్డయిపోయింది. ఐతే అతడు ఆభావాన్ని అణచుకొని—"బలే, నావంతు మరొకరి మీదికి నెట్టచూస్తున్నావా! మహేంద్రునితో ఈ లోఖవ్యాపారం చేయడానికి ఆలోచిస్తున్నావా?" అని నవ్వుతూ అన్నాడు.

బిహారి పూర్తిగా సర్వనాశనం చేయడానికే వచ్చాడని వినోదిని గ్రహించింది. బిహారి విషయంలో అతి జాగ్రత్త మెలగవలసివుంటుందని, నిరస్త్రయై వుండరాదని, ఆమె నిశ్చయించుకొంది.

మహేంద్రుడుకూడా ఉగ్రుడయ్యాడు. హుషారుగా విస్పష్టంగా మాట్లాడడంవల్ల కవిత్వంలో మాధుర్యం తగ్గిపోతుంది; ఐతే బిహారి విస్పష్టంగానే చెప్పివేశాడు. కాని మహేంద్రుడుమాత్రం కొంచెం తీవ్రస్వరంతో వ్యంగ్యంగా

—"బిహారీ, నీదాదాకు మరెక్కడికీ వ్యాపారం చేయడానికి వెళ్ళే అవసరం కలుగదు. అతడి చేతిలోవున్న దానితోనే అతడు సంతోషిస్తాడు." అన్నాడు.

బిహారి:—కావచ్చు, అదృష్టంలో అలా వ్రాయబడి ఉంటే బయటినుంచికూడా దీనికి సంబంధించిన అలలు పొంగి వచ్చి చలింపజేయడంకూడా సంభవిస్తుంది.

"ఇప్పటికి మీ చేతిలో ఏమీలేదు, ఇక అలలెక్కడ నుండి వస్తాయి?" అని జవాబు చెప్పింది వినోదిని.

బిహారివైపు ఒక చిరునవ్వుతోకూడిన దృష్టి విసరివేసి, వినోదిని తన బొటనవ్రేలితో ఆశ పాదాలను అదిమింది. ఆశ కోపంతో లేచింది. బిహారి ఓటమి అంగీకరించి కోపంతో మాటాడలేదు. బిహారిలేచి వెళ్ళబోతూవుండగా—"బిహారి బాబూ, హఠాత్తుగా వెళ్ళిపోకండి. నేను నాసఖిని పంపివస్తున్నాను." అన్నది వినోదిని.

వినోదినికూడా వెళ్ళిపోవడంతో సభ్యస్థానాలన్నీ ఖాళీ పడ్డాయి; ఈ కారణంచేత మహేంద్రుడు తనలోతాను చాలా బాధపడ్డాడు. అతని మానసికమైన అసంతృప్తిని బిహారి గ్రహించకపోలేదు. ఇంతవరకు బిహారి తెగబడి యేమీ అన లేకపోయాడు, మనస్సులోనే అణచివుంచుకొన్నాడు.

ఇప్పుడు యేకాంతం లభించడంచేత బయటపడ్డాడు. "దాదా, నీకై నీవు సర్వనాశనం కాదలచుకొంటే నా అభ్యంతరంలేదు—ఎప్పుడూ నీనడత ఇలాగేవుంది; కాని అమాయికబాలిక, (ఆశ) నిన్ను పూర్తిగా విశ్వసిస్తున్నట్టిది—నీవు

తప్ప ఆమెకు మరియొక ఆశ్రయంలేదు—ఆమెను సర్వనాశనం చేయవద్దని మాత్రం ప్రార్థిస్తున్నాను. ఆమె విషయంలో విశ్వాసఘాతకుడివి కావద్దు!" అని బిహారి అంటూవుండగా అతని కంఠం డగ్గుత్తిక పడిపోయింది.

మహేంద్రుడు తన కోపాన్ని దాచుకొని—"బిహారీ, నీమాట నాకర్థం కావడంలేదు. చిక్కు ప్రశ్నలాగా కాక స్పష్టంగా చెప్పు." అని అడిగాడు.

బిహారి:—స్పష్టంగానే చెబుతాను. వినోదిని నిన్ను బుద్ధిపూర్వకంగా ఒక అగ్నికుండంలోకి ఈడ్చుకపోతూవుంది. నీవు అమాయకుడిలాగా అటువైపే ముందుకు సాగుతున్నావు!

మహేంద్రుడు సింహంలాగా గర్జిస్తూ—"అబబం! నీవు గొప్పయింటి బిడ్డలను యీ విధంగా సందేహదృష్టితో చూచే లాగుంటే, నీవు జనానాలోకి రావడం తగదు!" అన్నాడు కోపంగా.

ఇదేసమయంలో చిన్న వెండిపళ్లెంలో మిఠాయిలు తీసుకొని నవ్వుతూ వచ్చింది వినోదిని. ఆమె ఆపళ్లాన్ని బిహారి ముందువుంచింది. "ఇదేమిటి? నాకు బొత్తిగా ఆకలిలేదు." అన్నాడు బిహారి.

"అలా వీలులేదు, తమనోరు తియ్యబరచి పంపాలి." అన్నది వినోదిని.

"నాదరఖాస్తు మంజూరైనట్లు తోస్తుంది; నన్ను గౌరవించడం ప్రారంభం అయింది." అన్నాడు బిహారి నవ్వుతూ.

"తమరు మరదిగారా యె! మీకు వారు బంధువులు, వారి మీద మీకు అధికారం ఉంది. మీ అధికారం సాగే స్థానంలో బిచ్చమెత్తవలసిన పనిలేదు. మీరు బలవంతంగా కూడా గౌరవం సంపాదించగలరు. ఏమంటారు మహేంద్ర బాబూ?" అని మందహాసం చేసింది వినోదిని.

క్రోధంలో నిండియున్న మహేంద్రుని నోటినుండి మాట రావడంలేదు.

వినోదిని:— బిహారీబాబూ, మీరు లజ్జచేత తినడం లేదా, లేక కోపంచేతనా? మరెవరినైనా పిలవాలా?

బిహారి:— మరెవ్వరినీ పిలువనవసరంలేదు. ఇంతవరకు చాలు.

వినోదిని:— పరిహాసంతో మిమ్మ జయించలేక పోయాను; మిఠాయిపెట్టినా మీనోరు మూతపడకుండావుంది.

ఆరాత్రి మహేంద్రుని ఎదుట ఆశ బిహారియెడల తన కోపాన్ని ప్రకటించింది. అప్పుడతను మామూలుగా ఎగ తాళిలో త్రోసివేయకుండా ఆమె అభిప్రాయాన్ని చక్కగా బలపరిచాడు.

ఉదయం లేస్తూనే మహేంద్రుడు బిహారి ఇంటికి వెళ్ళాడు. "బిహారీ, నూరుకానీ, వెయ్యికానీ, వినోదిని మన యింటి స్త్రీకాదు, నీయెదుటికి రావడం ఆమె తప్పుగా భావిస్తూ వుంది." అన్నాడు.

బిహారి:— అలాగా! ఐతే ఇక యిప్పటినుంచే నేను ఆమె యెదుటికిరాను.

మహేంద్రుని దుఃఖం తొలగిపోయింది. ఇంతసులభంగా తనకార్యం సానుకూలం అవుతుందని అతడు భావించలేదు. బిహారి తన అడుగుజాడలలోనే నడుస్తూవున్నప్పటికి మహేంద్రుడు అతనిచూచి తనలోతాను భయపడుతూనేవున్నాడు.

ఆదినమే బిహారి మహేంద్రుని ఇంటికివెళ్ళి వినోదినితో "పెద్దవదినా, నేను క్షమాభిక్ష వేడుతున్నాను." అన్నాడు.

వినోదిని:— ఎందుకు, బిహారీబాబూ?

బిహారి:— నీవు నాఎదుటికి రావడానికి ఇష్టపడడం లేదని మహేంద్రదాదావల్ల తెలిసింది. నేను నిస్సంకోచంగా ఆరోజు మీయెదుటికి వచ్చాను. అది మీకు కోపకారణం కావచ్చు. అందుచేత క్షమాభిక్ష వేడడానికి వచ్చాను.

వినోదిని:— ఇదేమిటి బిహారీబాబూ? నేను ఈవేళ వుంటాను, రేపు వెళ్ళిపోతాను. నాకొరకు మీరెందుకు రావడం మానేస్తారు? ఇంత వ్యవహారం జరుగుతుందని నాకు ముందుగా తెలిసివుంటే నేను రాకుండానే వుండేదాన్ని.

ఇలా అంటూవుండగానే వినోదిని కుంచించుకుపోయింది. కళ్ళనుండి నీటిబిందువులు రాలాయి. వెంటనే మరొకగదిలోకి వెళ్ళిపోయింది.

మహేంద్రుని మాటలు నమ్మి, వినోదినికి బాధ కలిగించానని, పొరబడ్డానని బిహారిచింతించాడు.

ఆరోజు సాయంత్రం రాజలక్ష్మి మహేంద్రునితో— "వినోదిని తన ఇంటికి వెళ్ళుతానంటున్నది." అన్నది.

"ఎందుకమ్మా, ఇక్కడ ఆమె కేమైనా కష్టంగా వుందా?" అని కష్టంగా అన్నాడు మహేంద్రుడు.

రాజలక్ష్మి—కష్టమేమీ లేదు. తనలాంటి విధవస్త్రీలు పరాయి యింటిలో చాలా దినాలువుంటే లోకులు నిందిస్తారని ఆమె అంటున్నది.

"ఇది పరాయి యిల్లా?" అని దుఃఖంతో అన్నాడు మహేంద్రుడు.

బిహారి కూర్చొనేవున్నాడు. మహేంద్రుడు అతనివైపు తిరస్కారంగా చూచాడు.

ఈ సమాచారం బిహారికికూడా బాధ కలిగించింది. నిన్నటి సంభాషణల్లో నడచిన నిందా భూయిష్టమైన వ్యవహారం వినోదినికి బాధ కలిగించి వుంటుందని అనుకొన్నాడు.

ఆశా మహేంద్రులిద్దరు వినోదినిమీద కోపగించుకొన్నారు. "మమ్ములను పరాయివారిలాగా భావిస్తున్నావా అక్కా?" అని అడిగింది ఆశ. "ఇన్ని దినాలైన తర్వాత మేము పరాయివాళ్ళమైపోయామా!" అన్నాడు మహేంద్రుడు.

వినోదిని—మీరు ఎల్లకాలం నన్నిక్కడే వుంచుకొంటారా?

మహేం—మాకంత అధికారం ఎక్కడిది?

ఆశ:— ఐతే నీవు మామనస్సులను ఎందుకు హరించావు? మాతో ఎందుకు ఇంతగా కలిసిమెలిసి వున్నావు?

ఆరోజు ఏ నిశ్చయం జరుగలేదు.

"లేదు సోదరీ, ఇక ఉండను; రెండు దినాల భాగ్యానికి అంతగా ప్రేమించడం మంచిదికాదు." అన్నది వినోదిని రెండు రోజులు గడిచాక. ఇలాఅని ఒకసారి వ్యాకులంగా మహేంద్రునివైపు చూచింది. మరుసటిదినం బిహారీ వచ్చి—"పెద్ద వదినా, ఎందుకు వెళ్లుతానంటున్నావు? నావల్ల ఏదయినా తప్పు జరిగిందా? ఇది దానికి విధించిన శిక్షేనా?" అన్నాడు.

వినోదిని ముఖం ప్రక్కకు త్రిప్పి "మీ దోషమేముంది? అది నా అదృష్టంలోవున్న దోషం." అన్నది.

"నీ విక్కడనుంచి వెళ్ళేలాగుంటే, నామీద కోపంతో వెళ్ళావని నేను అనుకోనక తప్పదు." అన్నాడు బిహారి.

"మీరే చెప్పండి, నేనిక్కడ వుండడం మంచిదేనా?" అని కరుణాపూర్వకమైన దృష్టితో చూచి అన్నది వినోదిని.

బిహారి చిక్కులోపడ్డాడు. ఉండడం మంచిదేనని ఎలా చెప్పడం? "నీవు తప్పక వెళ్ళవలసేవుంటుంది, కాని మరికొంత కాలంవుండి వెళ్ళినందువల్ల నష్టమేముంది?" అన్నాడు బిహారి.

వినోదిని నేలకుచూస్తూ—"మీరందరు నన్ను ఉండమని కోరుతున్నారు, మీమాట మీరడం కష్టంగావుంది; ఐతే మీరు ఈవిధంగా చేయడం బాగాలేదు." అన్నది. ఇలా చెబుతూవుండగా ఆమె ఆకర్ణాంతమైన కనుదమ్ములనుండి పెద్దపెద్ద ముత్యాలవంటి జలబిందువులు రాలాయి.

ఇలాంటి నిశ్శబ్దమైన అశ్రువర్షంచేత వ్యాకులపడి— "ఈ కొద్దిదినాల్లోనే నీవు నీమంచిగుణాలవల్ల అందరిని నీ వాళ్ళుగా చేసుకొన్నావు; ఈ కారణంచేత ఎవ్వరూ నిన్ను

విడువలేకుండా వున్నారు. మనసులో ఏమీ వుంచుకోవద్దు. నీలాంటి లక్ష్మిని బుద్ధిపూర్వకంగా ఎవరు విడువగలరు?" అన్నాడు బిహారి.

ఒకమూలగా మేలిముసుగుతో కూర్చొని చెరగుతో మాటిమాటికి కన్నీరు తుడుచుకొంటూ వుంది ఆశ.

ఇక ఎప్పుడూ ఇక్కడినుండి వెళ్ళవలెనని ఆలోచించలేదు వినోదిని.

# 17

రామాయణంలో పిడకలాటలాగా మధ్యలో ఏర్పడిన ఈ గందరగోళాన్నంతా ఒక్కసారిగా నాశనం చెయ్యాలనే సంకల్పంతో—"వచ్చే ఆదివారం 'దమ్ దమ్' పార్కులో విందు ఏర్పాటు చేద్దాం." అన్నాడు మహేంద్రుడు.

ఈ ప్రస్తావనవల్ల ఆశకు చాలా ఉల్లాసం కలిగింది; వినోదిని దీన్ని ఎంతమాత్రం అంగీకరించలేదు.

ఆమె ఇష్టపడక పోవడంవల్ల ఆశా మహేంద్రులకు కోపం కలిగింది. ఇప్పుడు వినోదిని తమతో కలవకుండా దూరంగా ఉండడానికి ప్రయత్నిస్తూవుందని వారుభావించారు.

రెండుజాములు దాటింతర్వాత బిహారిరాగానే— "బిహారీబాబూ, మహేంద్రబాబు ఆదివారం 'దమ్ దమ్' పార్కుకు షికారుకు వెళ్ళాలంటున్నారు. నేను వారివెంట వెళ్లగోరటంలేదు. ఈకారణంచేత వారిద్దరు నామీద మండి పడుతున్నారు." అన్నది వినోదిని

బిహారి:— వారు మండిపడడంలో అనుచితంలేదు. నీవు వెళ్లకపోతే వారు పడేబాధలు చెప్పతరంకాదు. విరోధులుకూడా ఆబాధలు పడరాదని నాకోరిక.

వినోదిని:— మీరు వచ్చేలాగుంటే నేనూ వస్తాను. మీరుకూడా బయలుదేరండి.

బిహారి—సరే, ఐతే యజమాని కోరిక ననుసరించి ఏపనైనా జరగాలి, వారేమంటారు?

యజమానికి, యజమానురాలికి బిహారి విషయంలో వినోదిని తమకంటె ఎక్కువ శ్రద్ధను చూపించడం చెడ్డగా తోచింది. బిహారిని వెంటతీసుకొనివెళ్ళడమనే ప్రశ్న ఉదయించేసరికి మహేంద్రుని ఉత్సాహంలో అర్ధభాగం కర్పూరంలాగా గాలిలో కలిసిపోయింది. 'నీవు రావడం వినోదినికి అంగీకారంకా'దని బిహారితో చెప్పుదామనుకొన్నాడు మహేంద్రుడు. దీనికి చాలా ప్రయత్నించాడు; కాని ఇక బిహారిని తన సమాజంలోకి రాకుండా నిరోధించడం దుర్ఘటమని భావించాడు.

"మంచిది, అలాగే. ఐతే బిహారీ, నీవు వచ్చావా ఏదో గందరగోళం చేయకుండా ఉండలేవు. ఆ వీధిలోవుండే మిత్రులందర్ని పిల్చి అల్లరి చేయడమో లేక ఏ తెల్లవాడితోనో తగాదాలు పెట్టుకోవడమో చేస్తావు.ఇదీనాభయం." అన్నాడు మహేంద్రుడు.

మహేంద్రుని హృదయాంతర్గతమైన వ్యతిరేకతను గ్రహించాడు బిహారి. అతడు తనలోతాను నవ్వుకొని—"ఇదే ప్రపంచంలోని ఆనందం! ఎక్కడ ఎలా జరుగుతుందో, ఎక్కడ

ఏతగువు ఎదురౌతుందో ముందుగా చెప్పలేం. పెద్దవదినా, నన్ను వెళ్ళనీ, నేను సరిగ్గా మీరు వెళ్ళేసమయానికి హాజరౌతాను.'' అన్నాడు.

ఆదివారంనాటి ఉదయం నౌకర్లకు, సామానుకు ఒక మూడవ తరగతిబండీ, యజమానులకొక రెండవతరగతి బండీ బాడుగకు తెప్పించారు. బిహారి ఒక పెద్ద సామానుపెట్టెతో వచ్చాడు.

"దీన్ని తెచ్చావెందుకు? నౌకర్లు కూర్చోడానికే బండిలో స్థానంలేదు; ఇక ఇంతపెద్దపెట్టె ఎక్కడపెడతావు?" అన్నాడు మహేంద్రుడు.

బిహారి:— భయపడబోకువదీనా, నేనంతాసరిచేస్తాను.

ఆశా వినోదినిలు బండిలోపలికి వెళ్ళి కూర్చొన్నారు. బిహారి యెక్కడ కూర్చొంటాడోయని మహేంద్రుడు తహతహ లాడుతున్నాడు. బిహారి తనపెట్టెను బండికప్పుమీద త్రాటితో కట్టివేసి, వెంటనే తాను కోచ్-బాక్సు మీదికివెళ్ళి కూర్చొన్నాడు.

మహేంద్రుని ప్రాణాలు కుదుటపడ్డాయి. బిహారి బండిలో కూర్చోకుండావుంటే బాగుంటుందని మహేంద్రుడనుకొన్నాడు: కాని అతణ్ణి కాదనే సాహసంలేదు మహేంద్రునికి.

"బిహారీబాబూ, క్రింద పడిపోవుగదా?" అన్నది భయంతో వినోదిని.

బిహారి:— భయపడవద్దు, క్రిందపడిపోవడం మైమర వడం అనేవి నావాటాకు రాలేదు.

"లేకపోతే నేనువెళ్ళి కోచ్ బాక్సుమీద కూర్చొని బిహారిని ఇక్కడికి పంపుతాను." అని బండిపోతూవుండే సమయంలో వ్యంగ్యంగా అన్నాడు మహేంద్రుడు.

ఆశ భయంతో మహేంద్రుని పైబట్టపట్టుకొని "వద్దు. మీరిక్కడే వుండండి." అన్నది.

"మీకు అభ్యాసంలేదు, అంతఅవసరమేముంది? ఎక్కడైనా పడిపొయ్యారా ఇక నానాఅవస్థ పడాలిసివుంటుంది." అన్నది వినోదిని.

మహేంద్రుడు కొంచెం ఆవేశంతో—"పడిపోతాను! అదెన్నటికి జరుగదు." అని లేవ ప్రయత్నించాడు. ఇంతలో "మీరు బిహారిమీద దోషంమోపుతుంటారు; కాని జరిగే అల్లరులన్నిటికీ మీరే కారకులనిపిస్తోంది." అన్నది వినోదిని.

"సరే, ఒకపనిచేద్దాము; నేను మరొకబండిమీద వెళ్ళుతాను. బిహారి లోపల కూర్చొంటాడు." అని ముఖం వ్రేలాడ వేశాడు మహేంద్రుడు.

ఆశ:—ఐతే నేనుకూడా మీవెంట ఆబండిలోనే కూర్చొంటాను.

వినోదిని:— మరి నేను బండినుండి దూకుతానేమో!

ఇదిఇలా పరాచకాలతో వెళ్ళిపోయింది; కాని దారిపొడుగునా మహేంద్రుడు విరక్తభావంతో ముఖం వ్రేలాడ

వేసేవున్నాడు. బండి 'దమ్‌దమ్' పార్కుకు చేరింది; కాని ముందేవచ్చిన నౌకర్లున్నబండి ఇంతవరకు జాడలేదు.

అది శరదృతువు. ప్రాతఃకాలం అతి మనోహరంగాఉంది. ఎండ కాయడంచేత మంచువల్ల కలిగిన తేమ ఆరిపోతూవుంది. మంచుచే ఆచ్ఛాదితమైన చెట్లఆకులు నిర్మలమైన సూర్యరశ్మి తగులడంచేత మిలమిల ప్రకాశిస్తున్నాయి. పార్కులో ప్రహరీ గోడకు దగ్గర దగ్గరగా సుగంధిలమైన పుష్పవృక్షాలు ఉన్నాయి. వానిక్రిందరాలిన పుష్పాలనుండి వెడలిన సుగంధం ఆ వనాన్ని చుట్టవేసింది. కలకత్తాలోని గొప్పభవనాల్లో వుండే ఆశ, బంధనాలనుంచి విడివడి అడవిలో విడిచిపెట్టిన ఆడు జింకలాగా విచ్చలవిడిగా సంచరించడంచేత మహానందం దాన్నిపొందింది. ఆమెవినోదినితో కలిసి చాలా పూలు సేకరించింది. సీతాఫలముల చెట్లనుండి చాలాపళ్లుకోసుకొని తిన్నారు. తర్వాత చెలికత్తెలిద్దరు చాలసేపు చెరువులో స్నానంచేశారు. ఆ సుందరీమణులిద్దరు కలిసి తమ అకారణమైన ఆనందోత్సాహాలద్వారా వృక్షాల నీడలను, కొమ్మల మధ్యనుండి వెలువడు వెలుగును, జలాశయంలోని స్వచ్ఛమైన నీటిని, ఫలపుష్పాలను సజీవంగా పులకాంకితాలై ఆనందిస్తున్నవా అన్నట్లు చేశారు.

స్నానమైనతర్వాత చెలికత్తెలిద్దరు వచ్చిచూచారు. నౌకర్లను తీసుకొనివస్తున్న బండి ఇంతవరకూరాలేదు. అక్కడ చల్లని గాలిరావడానికి అనువుగా కట్టిన ఒకయిల్లువుంది. ఆయింటి పంచలో మహేంద్రుడు 'ఈజీచైర్'లో కూర్చొని

విదేశ వ్యాపారస్తులు చేసిన ఒక ప్రకటన పత్రాన్ని చదువుతూ వున్నాడు. అతడిముఖం వాడివుంది. నోరు ఎండిపోయింది.

"బిహారీబాబు ఎక్కడ?" అని అడిగింది వినోదిని.

"తెలియదు." అని ముక్తసరిగా జవాబిచ్చాడు మహేంద్రుడు.

"ఐతేపదండి, వారిని వెదకి తీసుకొనివద్దాము." అన్నది వినోదిని.

మహేంద్రుడు:— అతణ్ణెవ్వరూ దొంగిలించుకొని వెళ్ళరు, వారిని పోగొట్టుకొంటామేమో అనే చింత అంత కంటె అవసరంలేదు. అతణ్ణి వెదుకకపోయినా వస్తాడు.

వినోదిని:— మీవంటి దుర్లభమైన మిత్రరత్నాన్ని పోగొట్టుకొంటానేమో అని అతడు చింతిస్తూవుండవచ్చు: పదండి, అతడి దుఃఖాన్ని పోగొట్టి వద్దాము.

తోటలో ఒక మంచి బావివుంది. అక్కడే ఒక పెద్ద వటవృక్షం వుంది. ఆచెట్టునానుకొని ఒక రాతితిన్నె వుంది. బిహారి అక్కడే తన బాక్సు తెరచి 'స్టౌ' తీసి దానిమీద నీళ్లు కాస్తున్నాడు. అందరు రాగానే ఒక్కొక్కకప్పు వేడి తేనీరు ఇచ్చి ఒక పళ్లెంలో కొన్ని మిఠాయీలు ఉంచి దాన్నివారి యెదుట వుంచాడు.

"బిహారీబాబు సామాను తేవడంవల్ల బ్రతికిపోయాము; లేకపోతే మహేంద్రబాబు టీ లేక నానా బాధలు పడేవాడు." అని అనేకసార్లు అన్నది వినోదిని.

తేనీరు దొరకడంచేత మహేంద్రుని ప్రాణాలు కుదుట పడ్డాయి. అప్పటికీ అతడు "బిహారీ సర్వనాశనం చేశాడు, ఘనం షికారుకువచ్చే సమయంలోకూడా దిక్కుమాలిన స్టాఫూను తట్టెడు తెచ్చాడు. దీన్ని వదలిపెట్టి బయటికి వెళ్లడానికి టిఫెన్ తీసుకొనడానికీ వీలులేకుండావుంది." అన్నాడు.

బిహారి:— అలాగైతే నా తేనీరు నాకిచ్చేసి అన్నపానాదులు లేకుండానే వెళ్ళి ఆనందించండి.

మధ్యాహ్నమయింది. అప్పటికీ నౌకర్లున్న బండి రాలేదు. బిహారి పెట్టెలోనుండి వారి తిండికి కావలసిన సామానంతా తీసుకొంటున్నారు. పప్పు, బియ్యం, కూరలు, చిన్న చిన్న సీసాల్లో అనేక రకాల మసాలా దినుసులు వున్నాయి. "బిహారీబాబూ, మీరు మమ్మల్ని మించిపోయారు, ఇంట్లో యజమానురాలు లేదు, ఇదంతా ఎక్కడ తరిఫీతు పొందారు?" అన్నది వినోదిని.

బిహారి:—పాపిష్టి పొట్టకోసం నేర్చుకొనవలసివచ్చింది. నా విషయం నేను చూచుకొనకపోతే మరెవరు చూస్తారు?

బిహారి ఈ మాటల్ని ఎగతాళిగానే అన్నాడు, కాని వినోదిని గంభీరంగా కరుణాపూర్ణమైన దృష్టితో బిహారివైపు చూచింది.

వినోదినీ బిహారీలు కలిసి వంట ప్రారంభించారు. ఆశ సందేహిస్తూ వారికి సహాయంగా వచ్చింది; కాని "మీరు కూర్చోండి" అన్నాడు బిహారి.

మహేంద్రుడు ఏమీ చేయలేకపోయినా తనలోతాను కుమిలిపోతున్నాడు. అతనుదగ్గరకుకూడా రాలేదు. ఒకమూట ఆధారం చేసుకొని కాలిమీదకాలువేసుకొని పండుకొని,గాలికి కదులుతూవున్న వటపత్రాలమీద సూర్యకిరణాలు చేసే నృత్యాన్ని చూస్తూవున్నాడు.

వంట తయారుకాగానే — "మహేంద్రబాబూ వట పత్రాల్ని లెక్కించడం పూర్తిఅయిందా? ఇక స్నానం చేయండి." అన్నది వినోదిని.

ఇంతలో పనివాళ్ళు సామానుతోవచ్చారు. వారిబండి దారిలో విరిగిపోయింది. రెండుజాములు దాటినతర్వాత భోజనం పూర్తిఅయింది. మఱ్ఱిచెట్టునీడలో 'చీట్లపేక' ఆడే ప్రస్తావన వచ్చింది; కాని మహేంద్రుడు అంగీకరించలేదు. వెంటనే అతడు పండుకొని నిద్రపోయాడు. ఆశకూడా అక్కడి విశ్రాంతి గృహంలో తలుపువేసుకొని నిద్రపోవడానికి వెళ్ళింది.

ముసుగు తలమీదికి లాగుకొంటూ "నేనూ నిద్రించ డానికి వెళ్లుతున్నాను." అన్నది వినోదిని.

"ఎక్కడికి వెళ్ళుతారు? కొంచెం కబుర్లు చెప్పండి, మీ గ్రామంలోని విశేషాలు చెప్పండి." అన్నాడు బిహారి.

మధ్యాహ్నపు వేడిగాడ్పులు చెట్లఆకుల్ని కదలిస్తూ వున్నాయి. సరస్సు ఒడ్డునవున్న నేరేడు చెట్టుమీద గుబురుగా వున్న ఆకుల్లోనుంచి మాటిమాటికి కుహూకుహూ అని కూస్తూవుంది కోకిల. తన బాల్యవిషయాలు వినిపించడం మొదలుపెట్టింది వినోదిని. తన తలిదండ్రుల విషయాలు,

బాల్య స్నేహితురాండ్ర విషయాలు చెబుతూవుండే సమ
యంలో తనశిరస్సుమీాదనున్న ముసుగు తొలగిపోయింది.
వినోదిని ముఖంలో ప్రతిక్షణమూ ఆమె పరిపూర్ణ యవ్వన
వికాసం కనుపిస్తూవుంది; ఆమె బాల్యస్మృతులఛాయలు ఈ
తేజస్సును మరింత ప్రకాశవంతం చేశాయి. మొట్టమొదట
అనేక సంశయాల కాకరమైన, కౌతుకపూర్ణమూ - ఆనంద
మయమూ నగు ఆమె తీక్ష్ణదృష్టుల్లోని జ్యోతి,ఒకప్రశాంతమగు
జలపూర్ణరేఖారూపంలో పరిణతిని పొందగానే బిహారీకి వినో
దిని ఒక క్రొత్తమనిషిలాగా కనిపించింది. ఈ జ్యోతికి
కేంద్రంలో ఇప్పుడుకూడా ఒక కోమల హృదయం, తనఅమృత
ప్రవాహంతో ఒకసరస్సు నిర్మించుకొని ఉందనీ, అతృప్త
విషయలాలసాజ్వాలలచేత ఆమె ఆర్ద్రహృదయం ఎండిపోలేదనీ
అతడు తెలుసుకొన్నాడు.బిడియంకలిగిన పతివ్రతలాగా అనన్య
భక్తితో తనహృదయంలో పతిసేవ చేస్తూనేవుంది వినోదిని.
మాతృహృదయంలోవుండే మమతకూడా ఒక మహాసాగరం
అంతవుంది ఆమె హృదయంలో. బిహారి మనోదర్పణంలో
ఇంతకుపూర్వం ఈమూర్తియొక్క నీడకూడా పడలేదు. నాటక
రంగంలో తెరఎత్తినట్లుగా ఈదినం ఆకస్మికంగా అడ్డుతొలగి
పోయింది; అతడికి వెంటనే అపూర్వమైన దృశ్యం కనిపించింది.

'వినోదిని పైకి చూడడానికి ఒక విలాసవతిలాగా కను
పిస్తూవుంది; కాని ఆమెలో పూజానిమగ్నమైన ఒక కాంత
నిరాహారమై తపస్సు చేస్తూవుంది.' అనుకొన్నాడు బిహారి.
తనను తానే గుర్తింపలేని మానవుడు ఇతరులనేమి గుర్తింప

గలడనీ, అలా గుర్తించగలిగితే అతడు అంతర్యామి అవుతా డని బిహారి ఒకదీర్ఘ విశ్వాసాన్ని విడిచి తనలోతాను అను కొన్నాడు. సామాన్యంగా వ్యక్తియొక్క బాహ్యప్రవర్తనను అనుసరించేవారి మంచిచెడ్డలను ఆలోచిస్తూవుంటారు. కాని అదిచాల పొరబాటు అనుకొన్నాడు.

వారి సంభాషణ ప్రవాహం సాగిపోతూ వుంది; ప్రశ్న మీద ప్రశ్న వేస్తూ ఆ ప్రవాహానికి అడ్డంకులు లేకుండా చేస్తున్నాడు బిహారి. ఈమాటలనన్నింటినీ వినడానికి తగిన వ్యక్తి ఇంతవరకూ వినోదినికి దొరకలేదు——మరొక విషయ మేమంటే, ఈ విధంగా తన్నుతాను మరచిపోయి ఎన్నడూ యేపురుషునితోకూడ ఆమె హృదయపూర్వకంగా, ఉన్నది ఉన్నట్లుగా చెప్పివుండలేదు. నేడు వరుసగా అనేకగంటలవరకు సానుభూతితో మనసులగ్నంచేసి వింటున్న ఒక యువకుని ముందు, హృదయంలోని మాటలు చెప్పుకొని, పరిశుభ్రమైన నీటిలో స్నానంచేసి మాలిన్యాన్ని పోగొట్టుకొన్నట్లు తృప్తి పడ్డది.

ఈ రోజు ప్రొద్దున్నే లేవవలసిరావడంచేత నిద్రకు విఘ్నం కలిగింది మహేంద్రునికి. ఇందువల్ల బాగా మూడు నాలుగు గంటలు నిద్రించినమీదట ఐదు గంటలకు మెలకువ వచ్చింది. లేస్తూనే"ఇక బయలుదేరండి." అన్నాడు చిరాకుగా.

వినోదిని:—— మరికొంతసేపు ఆగి వెళ్ళితే ఏమైన యిబ్బందా?

మహేం:—అవును. ఇక్కడకు తెల్లవాళ్ళు సాయంత్రం పూట సారా త్రాగి షికారు వస్తారు. వారిని ఎదుర్కొనవలసి వస్తే ఇబ్బందే కలుగుతుంది.

సామానంతా ప్రోగుచేసి మూటలు కట్టడంలో చీకటి పడ్డది. ఈ మధ్యలో నౌకరువచ్చి "బండి ఎక్కడికి వెళ్ళిందో తెలియడంలేదు." అన్నాడు. దాన్ని వెలుపలి ద్వారంవద్ద నుంచి ఇద్దరు తెల్లవాళ్ళు బలవంతంగా స్టేషన్‌వైపు లాక్కొని వెళ్ళారు.

మరో బండికి కబురు పంపారు. 'ఈ దినమంతా నిరుపయోగమైపోయింది.' అని మహేంద్రుడు తనలోతాను అనుకొని తనకోపాన్ని, వ్యాకులాన్ని దాచుకోలేకపోయాడు.

శుక్లపక్ష సుధాకరుడు చెట్లకొమ్మల్లోనుంచి బయలుదేరి తిన్నతిన్నగా పైకెక్కుతున్నాడు. ఆ నిశ్శబ్దమూ ప్రశాంతమూనైన స్థానం వెలుగు, నీడలచే చిత్రవిచిత్రంగా వుంది. ఈ దినం దైవవినోదంచే ప్రకాశిస్తున్న భూమండలం మీద ఒక అపూర్వ అనుభవాన్ని సంపాదించింది వినోదిని. ఆ చీకటిరాత్రి ఆతోట మధ్యమార్గంలో ఆశను కలిసికొని కౌగలించుకొన్నపుడు బొత్తిగా నిష్కపటంగా కనుపించింది. వినోదిని రెండుకళ్ళనుంచి అశ్రువులు రాలుతుండగా చూచి, "ఎందుకమ్మా అలా ఏడుస్తావు?" అన్నది ఆశ వ్యథాపూర్వకంగా.

వినోదిని—ఏమీలేదు చెల్లీ. ఈ దినం నాకు చాలా ఆనందంగా వుంది; మరేమీలేదు.

ఆశ:— నీకీరోజు ఇంత ఆనందం కలగడానికి కారణం?

వినోదిని:— నేను చచ్చిపోయి పరలోకంలోకి వచ్చినట్లూ, నాకిక్కడ అన్ని సుఖాలు లభిస్తున్నట్లూ ఉంది.

ఆశ ఈమాటలకు ఆశ్చర్యాన్ని పొందింది. దానిఅర్థం ఆమెకు బోధపడలేదు. చచ్చిపోవడమనే మాటవల్ల ఆమెకు దుఃఖంకలిగి—"ఛీ, అక్కా, అవేంమాటలు? అలా అనవద్దు." అన్నది.

వేరొక బండి దొరికింది. బిహారి మళ్ళా కోచ్-బాక్సు మీదకువెళ్ళి కూర్చొన్నాడు. వినోదిని మౌనంగా కిటికీగుండా వెలుపలికి చూస్తూవుంది. వెన్నెలలో స్నానమాడుతున్న వృక్షపంక్తులు ప్రవహిస్తూవున్న దట్టమైన ఛాయాప్రవాహం లాగా కళ్ళఎదుటనుండి వెళ్ళిపోతున్నాయి. బండిలో ఒక మూల కూర్చొని నిద్రతో తూగుతూవుంది ఆశ. మహేంద్రుడు దారిపొడుగునా తనకోరిక సాగలేదనేచింతతో కళ్ళు మూసుకొని కూర్చొన్నాడు.

## 18

షికారుకువెళ్ళిన చెడురోజుకు తర్వాత వినోదినిని తిరిగి తన అధీనంలోకి తీసుకోవాలనే కోరికకలిగింది మహేంద్రునికి; కాని ఆ మరుసటిదినమే రాజలక్ష్మికి జ్వరం తగిలింది. రోగం అంత పెద్దదికాకపోయినా బాధ, బలహీనం యెక్కువగా వున్నాయి. రాత్రింబగళ్ళు ఆమె సేవాశుశ్రూషల్లో నిమగ్నమై ఉంది వినోదిని.

"రాత్రింబగళ్ళు ఇలాపనిచేస్తే చివరకు నీవుకూడా మంచాన పడతావు; అమ్మకు సేవచేయడానికి వేరే మనుష్యులను ఏర్పాటు చేస్తాను." అన్నాడు వినోదినితో మహేంద్రుడు.

అక్కడేవున్న బిహారి—"దాదా, నీవు ఇంతగా చింత పడవద్దు. ఆమెచేసే సేవ చేయనియ్యి. ఈవిధంగా ఇతరులు చేయగలరా?" అన్నాడు.

మహేంద్రుడు చీటికిమాటికి రోగివద్ద కొంతసేపు నిల్చొనివెళ్ళడం ప్రారంభించాడు. ఏపనీ చేయనివాడు ప్రతి క్షణం పనిచేసేమనిషి వెంటనంటివుండడం చాలా అసహ్యంగా వుంది వినోదినికి. "మహేంద్రబాబూ, మీరిక్కడవుండి నాచేత పని చేయిస్తున్నారా యేమిటి? వెళ్లండి, మీచదువు పాడు చేసుకోకండి." అని కోపంతో రెండు మూడుసార్లు మందలించింది వినోదిని.

మహేంద్రుడు తన వెంటవెంట తిరుగుతున్నాడని వినోదినికి విజయగర్వం, సుఖానుభవం కలుగుతూవున్నాయి. ఐనప్పటికి ఇంత నీచత—రోగంతో బాధపడుతున్న తల్లివద్ద కూడా మాంసపు ముక్కలమీద కన్నువేసిన పిల్లిలాగా కూర్చొనడం—ఆమె చూడలేకపోయింది. ఆమెకు అసహ్యం కలిగింది. వినోదిని ఒక పనిమీద తనబుద్ధిని లగ్నంచేస్తే ఇతర పనులను ఎంతమాత్రం ముట్టుకోదు. ఆమెకు పథ్యపానాదులు చేసి పెట్టడం, మందుమాకులివ్వడం, ఉపచారాలు చేయడం, ఇంట్లో ఇంకా ఇతర ముఖ్యమైన పనులు నిర్వహించడం

పూర్తికానిదే అనవసరంగా ఎంతమాత్రం కూర్చోడు. అంటే ఎప్పుడు ఏపని అవసరమో అదిపూర్తికానిదే మరొకపని చేయడానికి ముందుకురాడు.

రాజలక్ష్మి స్థితి ఎలావుందో చూచి వెళ్ళడానికని మధ్యమధ్య బిహారివస్తున్నాడు. అతడు వస్తూనే ఎవరూ చెప్పకుండానే అక్కడ యేపని అవసరమో తెలుసుకొనేవాడు; క్షణంలో అవసరాల్ని సమకూర్చి వెళ్ళిపోయేవాడు. బిహారీబాబు తన కృత్యాలను జాగ్రత్తగా కనిపెట్టివున్నాడని గమనించింది వినోదిని. బిహారి ఈవిధంగా సానుభూతితో పరిశీలించడం ఆమె తన పరిశ్రమకు బహుమానంగా భావించింది.

మహేంద్రుడు తనకుతాను బుద్ధి చెప్పుకొని ప్రతిరోజు కాలేజీకి వెళ్ళవలసిందేనని ఒకగట్టి నియమాన్ని పెట్టుకొన్నాడు. ఇక్కడ ఇతడు కోపంతో ధుమధుమ లాడిపోతున్నాడు. కాని అక్కడేమి మార్పువచ్చిందో; సమయానికి వంట తయారు కావడంలేదు, బండివాడు ఏమయినాడో తెలీదు; మరుసటిరోజే మోజాలు అదృశ్యమైనాయి. ఈ యిబ్బందులన్నీచూచి పూర్వంలాగా అతనికి సంతోషం కలుగడంలేదు.

సకాలంలో అవసరమైన వస్తువు లభించడంవల్ల ఎలాంటి ఆనందం లభిస్తుందో దాని అనుభవం కొద్ది దినాల్లోనే మహేంద్రునికి కలిగింది. సుఖంలోపించడంచేత ఆశ చేసే అవకతవకలుచూచి అతనికి నవ్వు రావడంలేదు. "చునీ, నేను స్నానంచేయడానికి ముందే నాకోటుకు గుండీలు పెట్టి

వుంచమనీ, నాపంట్లామూ ఉన్నిమోజాలు అన్నీ ఒక్కచోట పెట్టమనీ ఎన్నిసార్లో నీకు చెప్పాను; కాని ఒక్కరోజైనా నీవావిధంగా చేయలేదు. సరిగ్గా సమయానికి బట్టలు, గుండీలు అన్నీ వెదకటం నాకు చాలా కష్టంగావుంది." అన్నాడు.

ఆశ లజ్జతో బాధపడి "పనివాడితో చెప్పాను." అన్నది మెల్లగా.

"పనివాడితో చెప్పావా? నీచేత్తోచేస్తే ఏమయినా దోషమా? నీకు ఏ పనిచేయడానికి తెలివిలేదు."

ఈ మాటలు వినగానే ఆశకు పిడుగుపడ్డట్లైంది. ముందెప్పుడు మహేంద్రుడు ఇలా అనేవాడుకాడు. మీరే నన్ను ఏపనీ నేర్చుకోనకుండా చేశారనడానికి ఆమెకు తోచలేదు. ఇంటిపనులు చేయడానికి ప్రతినిత్యం అభ్యాసం చేయవలసి వుంటుందనే విషయపరిజ్ఞానంకూడా ఆమెకులేదు. 'తాను స్వభావతః క్షమింపరాని మూర్ఖురాలననీ, ఈ కారణంచేత ఏపనీ చక్కగా చేయలేకున్నా'నని అనుకొంది. అప్పుడప్పుడు మహేంద్రుడు తన్నుతాను మరచి వినోదిని గొప్పతనాన్ని వర్ణిస్తూవుంటే దోషాన్ని తనమీదనే మోపుకొని, ఆ అమాయకబాలిక మౌనంగా-వినయంగా తనతప్పిదాన్ని స్వీకరిస్తూ వుండేది.

మాటిమాటికి రుగ్మతలో నున్న అత్తగారి గదికి సమీపంగా తిరుగుతూ వుండేది ఆశ—మాటిమాటికి సిగ్గుతో గుమ్మానికి ఎదురుగా నిల్చొంటూవుండేది.

ఆమె తనను ప్రపంచానికి ఉపయోగించే లాగా చేసుకొనాలని కోరుతూవుంది, తనపనిని చూపాలని ప్రయత్నిస్తూవుంది, కాని ఆమెపనిని కావాలని కోరేవారెవరూ లేరు. పనిలో ఏవిధంగా చొరబడాలో—ప్రపంచంలో స్థానాన్ని పొందడమెలాగో ఆమె కర్థంకావడలేదు. తాను అయోగ్యురాలననే సంకోచంతో దూరదూరంగా తిరుగుతూవుంది. మానసికంగా బాధకలిగించే ఏదో ఒకరకమైనపీడ ఆమె హృదయంలో దినదినాభివృద్ధి పొందుతూవుంది; కాని అర్థంకాని ఆపీడను—వ్యక్తంగాని ఆ అనుమానాన్ని ఆమె స్పష్టంగా తెలుసుకొన లేకుండావుంది. ఆమె తన సర్వసుఖాన్ని నాశనం చేసుకొంటూ వున్నట్లు భావిస్తూవుంది. ఆమెకు మొదట ఈ సుఖాలు ఎలావచ్చాయో, ఇప్పుడెలా నాశనమైపోతున్నాయో, ఏమిచేస్తే తిరిగితాను నిలుపుకోగలదో బోధపడడంలేదు. నాలాంటి అజ్ఞానురాలు ప్రపంచంలోలేదనీ, నేను ఎందుకూ పనికిరాని · అసమర్థననీ, ఎవరికైనా చెప్పుకొని భోరున ఏడవాలని ఆమెకప్పుడప్పుడు అనిపించేది.

ఈమధ్య ఆశా మహేంద్రులిద్దరు ఒక్కొక్కప్పుడు మాట్లాడుకొంటూ, ఒక్కొక్కప్పుడు మౌనంగావుంటూ ఆనందంతో సుఖంగా కాలంగడుపుతూ వున్నారు; కాని ఇప్పుడేమో వినోదిని వుండకపోవడంచేత ఆశ ఎదుట మహేంద్రునికి సహజంగానే నోటమాట రావడంలేదు — ఏమీ మాట్లాడకుండా ఉండడంకూడా అతనికి ఉచితంగా కనిపించడంలేదు. మధ్యాహ్నం దాటింది. లోపలినుండి పనివాడు

వచ్చాడు. మహేంద్రుడు వానిచేతిలోని జాబును చూచి "ఎక్కడిదాజాబు?" అన్నాడు.

పనివాడు:— బిహారీబాబు గారిది.

మహేం:— ఎవరిచ్చారు?

పనివాడు:— పెద్దకోడలుగారిచ్చారు.

"చూతాం." అని మహేంద్రుడు దాన్ని తీసుకొన్నాడు. దాన్ని తెరచి చదువుదామనుకొన్నాడు మనసులో. మూడు నాలుగుసార్లు ఆజాబును అటుఇటూత్రిప్పి పనివాని ముందు విసరివేశాడు; కాని దాన్ని తెరచి చదువలేదు. ఆ జాబును తెరచినట్లయితే, దానిలో 'అత్తగారు సగ్గుజావ తీసుకొనడానికి ఇష్టపడడంలేదు, ఈవేళ బియ్యపుజావ ఇవ్వవచ్చా?' అని ప్రశ్నిస్తూ వ్రాయబడివుంది.

మందు విషయంలో, పథ్యపానాదుల విషయాల్లో వినోదిని మహేంద్రుని ఎంతమాత్రం అడిగేదికాదు. ఈ విషయంలో బిహారి సలహాప్రకారమే వెళ్ళేది.

మహేంద్రుడు చాలాసేపటివరకు పంచలో అటూ ఇటూ తిరిగిన తర్వాత తన రూములోకి వెళ్ళాడు. లోపలికి వెళ్ళుతూవుండగానే దారంతెగి ఒకప్రక్కకు ఒరిగి క్రిందపడిపోవడమే తడవుగావున్న ఒకపటము గోడమీద వ్రేలాడుతూ కనిపించింది. అప్పుడు ఆశనుపిల్చి "వస్తువులీవిధంగా పాడైపోతుంటే నీకు ఆలోచనేలేదు." అని గద్దించాడు.

వినోదిని తోటలో రాలిన పూలను ఏరితెచ్చి, గుత్తులుగా కట్టి, ఇత్తడి పూలపాత్రలో ఉంచింది. అవి వాడిపోయి

నప్పటికి పారవేయకుండా అలాగే వుండడం చూచాడు మహేంద్రుడు. అతడిదృష్టి ఇదివరకెన్నడు వానిమీదికి పోయేదికాదు; ఇవ్వాళ అదికూడా అతనికి కనిపించింది. వినోదినివచ్చి ఈ వాడిన పూలగుత్తులను పారవేయకపోతే ఇవికూడా అలాగే వుంటాయనుకొంటాను.” అన్నాడు మహేంద్రుడు.

ఇలా అని పూలగుత్తులతోసహా పూలపాత్రనుకూడా తీసుకొని వెలుపలికి విసరివేశాడు. అది మెట్లమీదుగా కణకణ మ్రోగుతూ క్రిందికి దొర్లిపోయింది.

‘ఆశ నావుద్దేశ్యాల కనుగుణంగా ఎందుకుండదు, నా మనసు కనుగుణంగా ఎందుకుపనిచేయదు? ఆమె నన్నెప్పుడూ సంతోషంగా వుంచడానికి ప్రయత్నించకుండా ఇంత నిర్లక్ష్యంతో సోమరితనంతో ఎందుకు ప్రవర్తిస్తూవుంది?’ ఈ విధంగా మానసికమైన ఆందోళన పొందుతూ ఆమెవైపు చూచాడు. ఆమెముఖం పాలిపోయివుంది, మంచపుకోడు పట్టుకొని నిల్చొనివుంది. పెదవు లదరుతున్నాయి. ఇక అక్కడ నిల్చొనుశక్తి లోపించడంచేత గడగడ వణకుతూ అచ్చటి నుండి వెళ్ళిపోయింది.

మహేంద్రుడు తిన్నగా వెళ్ళి ఆక్రింద పడిన పూల పాత్రను తెచ్చాడు. గదిలో ఒకమూలగా తను చదువుకొనే ‘టేబిల్’ వుంది. తిన్నగా వెళ్ళి కుర్చీమీద కూలబడ్డాడు. రెండు చేతుల్తో తల పట్టుకొని మోచేతులు టేబిల్ మీద ఆనించి చాలాసేపు ఆలోచిస్తూ అలాగే కూర్చున్నాడు.

సాయంత్రం అయింది. నౌకరు లాంప్ వెలిగించి వుంచి పోయాడు, కాని ఆశ రాలేదు. మనస్సు బాగా లేకపోవడం చేత డాబామీద ఇటూఅటూ తిరగడం మొదలుపెట్టాడు మహేంద్రుడు.

రాత్రి తొమ్మిది గంటలయింది. వారింట్లో మనష్యు లెక్కువగాలేరు. అర్ధరాత్రిలాగా నిశ్శబ్దంగా వుంది. ఐనా ఆశ రాలేదు. మహేంద్రు డామెకు కబురుపంపాడు. ఆశ సంకోచంతో తిన్నతిన్నగా వచ్చి తలుపుదగ్గరగా నిల్చొంది. అతడామెను కౌగలించుకొన్నాడు. ఆమెహృదయం దుఃఖంతో నిండివుంది. మహేంద్రుడు ఆదరించడంచేత ఆ దుఃఖం పొంగి వచ్చింది. ఆమె చిన్నపిల్లలలాగా వెక్కివెక్కి ఏడ్వసాగింది. మహేంద్రు డామెను గుచ్చి కౌగలించుకొని, ముద్దుపెట్టుకొని మౌనంగా నక్షత్రాలవైపు తదేకదృష్టితో చూడడం మొదలు పెట్టాడు.

రాత్రి పడకకు వెళ్ళేంతర్వాత—"చున్నీ, నాకు కాలేజిలో 'నైట్ డ్యూటీ' అధికంగావుంది. రాత్రులు ఇక్కడి నుండి కాలేజీకి వెళ్లడం చాలా కష్టం. అందుచేత కొన్నాళ్ళు నేను కాలేజీవద్దనే 'మెస్'లో వుండవలసివుంటుంది." అన్నాడు మహేంద్రుడు.

'ఇంతవరకు క్రోధం శాంతించలేదా? నామీదికోపం వల్లనే మీరు నాకు దూరంగాఉండే ఏర్పాటు చేసుకొంటు న్నారా! ఆహా, నేనెందుకూ పనికిమాలినదాన్ని, వివేకంలేని

దాన్ని, నేను మరణించడమే మంచిది!' అని లోలోపల కుమిలి పోయింది ఆశ. .

కాని మహేంద్రుని నడతలో, సంభాషణల్లో క్రోధ లక్షణాలేవీ కనిపించడంలేదు. అతడు చాలసేపటివరకు ఆమెను గట్టిగా కౌగలించుకొనే వున్నాడు; ఇదిగాక మాటిమాటికి తన వ్రేళ్ళతో ఆమెవెంద్రుకలను చక్కగా సవరిస్తూ జడ వదు లయ్యేలాగా చేశాడు. ఆశను వెనుక బాగా ఆదరించేరోజుల్లో కూడా వూరికే ఆమెజడ వదులు చేస్తూవుండేవాడు—ఆశ కూడా అదేమనేదికాదు నేడుకూడా బదులుచెప్పక పులకిత శరీరమై పతిఒడిలో పరవశమై పడివుంది.

ఆకస్మికంగా ఆమె మస్తకంమీద ఒకవేడి అశ్రు బిందువురాలింది; వెంటనే మహేంద్రుడు ఆమెనోటివద్ద తన నోరుంచి, డగ్గుత్తికపడిన కంఠంతో "చున్నీ" అన్నాడు. ఆమె అందుకేమీ బదులుచెప్పకనే తన కోమలమైన రెండు చేతు లతో మహేంద్రుని చుట్టివేసింది. "నేనపరాధిని, క్షమించు." అన్నాడు మహేంద్రుడు.

ఆశ తన కుసుమ-సుకుమారమైన కరకమలాలతో మహేంద్రుని నోరుమూసి—"వద్దు, వద్దు, అలాంటి మాట అనవద్దు.నాదేదోషం.నన్ను మీచరణదాసినిగా భావించి, మీ యిష్టమొచ్చినట్లు దండించండి. నన్నుమీపాదాలవద్ద ఆశ్రయం లభించేలాగా అనుగ్రహించండి." అన్నది.

'మెస్'లో ఉండటానికి నిశ్చయించుకొన్న దినం ఉదయం నిద్రలేస్తూనే "చున్నీ, నీవు నాజీవన సర్వస్వమూ,

నాహృదయమణివి అయినావు. నేను యెప్పుడూ నిన్ను నా హృదయంలో వుంచుకొంటాను. ఎవ్వరూ నిన్నక్కడినుండి తొలగింప జాలరు.” అన్నాడు మహేంద్రుడు.

అప్పుడు ఆశ గుండెరాయిచేసుకొని విరహవేదనను సహించడానికి సిద్ధపడి—“మీరు ప్రతిదినం నాకొకలేఖ వ్రాయగలరా?” అని తనస్వామికి ఒక చిన్న విజ్ఞాపన చేసింది.

మహేం:— నీవు దానికి జవాబుకూడా వ్రాస్తావా?

ఆశ:— నాకు తెలీదు.

మహేంద్రుడు ప్రేమతో ఆమెవెంద్రుకలను సవరిస్తూ నీవు బాబూ హరిశ్చంద్రుని ‘ప్రేమయోగిని’ అనే పుస్తకం చదివితే బాగా వ్రాయడం నేర్చుకొనగలవు.” అన్నాడు.

ఆశ:— వెళ్ళండి; నన్ను పరిహాసం చేస్తున్నారు. మీరు వ్రాయండి, అదేచాలు.

ఆదినం యథాశక్తి తనచేతుల్తో మహేంద్రుని గుడ్డా గోచీలు సందూకాలో పెట్టడానికి కూర్చొంది ఆశ. అతడి మందపాటి చలికాలపు దుస్తులు చక్కగా మడవడానికి, పెట్టెలో పెట్టడానికి కష్టంగా వుంది.ఆశా మహేంద్రులిద్దరుకలిసి ఎలాగో అదిమి త్రొక్కి—ఒక్క పెట్టెలో పెట్టవలసిన సామాను రెండు పెట్టెలలో నింపారు. పొరబాటుగా పెట్టెల్లో వేయకుండా మిగిలిన గుడ్డలను కొన్ని చిన్నచిన్న మూటలుగా కట్టారు. ఇందులోకూడా తన అజ్ఞానాన్ని తెలుసుకొని ఆమె సిగ్గుపడ్డది; ఐనప్పటికి మొదటిదినాల్లోలాగానే పరాచకాలు, ఆనందం, ప్రేమపూర్ణమైన అన్యోన్య దోషారోపణలు చేసుకొనడంలో

మళ్ళీ వెనుకటి ఆనందాన్ని అనుభవించగలిగింది. మహేంద్రుడు తనకుదూరం కానున్నాడనే విషయం ఒక్క గడియ సేపు మరచిపోయింది ఆశ. బండివాడు అనేకసార్లు "బండి సిద్ధంగా వుంది" అని చెప్పాడు; కాని మహేంద్రుడు వినిపించుకోనేలేదు. చివరకి "బండి విడిచివెయ్యి" అన్నాడు మహేంద్రుడు.

ఉదయమనుకొన్నది మధ్యాహ్నమయింది, మధ్యాహ్నంనుండి సాయంత్రంకూడా అయింది. ఇక అప్పుడు ఆరోగ్య రక్షణవిషయంమీద ఆశకు ఒక ఆదేశమిచ్చాడు మహేంద్రుడు. ఆమెకూడా మాటిమాటికి ఉత్తరాలు వ్రాసేలాగా వాగ్దానాన్ని పొందింది. ఇంత జరిగిన తర్వాత గుండె రాయిచేసుకొని వారిద్దరు ఒకరినొకరు విడిచిపెట్టగలిగారు.

రెండు దినాలనుండి రాజలక్ష్మి లేచి కూర్చొంటూ వుంది. సాయంత్రం మందమైన దుప్పటికప్పుకొని రాజలక్ష్మి వినోదినితో కలిసి చీట్లపేక ఆడుతూవుంది. నేడు ఆమె మనసు స్వాస్థ్యాన్ని పొందింది. ఏవిధమైన బాధలులేవు. మహేంద్రుడు అక్కడికి వెళ్ళాడు. వినోదినివైపు చూడనైనాలేదు. "అమ్మా, నాకు కాలేజిలో రాత్రులందు పని నేర్చుకొనవలసిఉంది, ఇక్కడ వుండడం సుకరంగా వుండదు. నేను కాలేజికి సమీపంలో 'బోర్డింగు'లో ఉండడానికి ఏర్పాట్లు చేసుకొన్నాను. ఇవ్వాళనుంచి అక్కడే వుంటాను." అని తల్లితో అన్నాడు.

రాజలక్ష్మి లోలోపల కోపపడి—"ఐతే వెళ్ళు! చదువుకు ఇబ్బంది కలిగేలాగుంటే ఇక్కడేం చేస్తావు?" అన్నది.

రాజలక్ష్మి జ్వరం తగ్గుతూవున్నప్పటికి మహేంద్రుడు వెళ్ళుతాడనే వార్త వినేసరికి సంవత్సరాలనుంచి దుర్బలం గానూ అలసటగానూ ఉన్నట్లనిపించిందామెకు. వెంటనే వినోదినిని పిల్చి "దిండు తీసుకరా అమ్మా" అన్నది. దిండు తల క్రింద పెట్టుకొని పడుకొన్నది రాజలక్ష్మి. వినోదిని ఆమె శరీరాన్ని నిమురుతూ కూర్చొంది. మహేంద్రుడు తల్లినుదుటి మీద తనచెయ్యివుంచాడు, చెయ్యిపట్టుకొని నాడి పరీక్షించాడు. రాజలక్ష్మి తనచేయి లాగుకొని "నాడిచూచి ఏం చేస్తావు? నీవు వెళ్లు, నేను బాగానే వున్నాను." అన్నది.

# 19

'ఈవ్యవహారం ఏమిటి? అభిమానమూ, క్రోధమా లేక భయమా? నన్ను లక్ష్యం చేయడంలేదని నాకు తెలియ జేయడానికి ప్రయత్నిస్తున్నాడు. దూరంగా ఉంటాడు? చూస్తాను, ఎన్నిదినాలు అక్కడఉంటాడో!' అని తనలో తాను అనుకొంది వినోదిని.

ఐతే ఆమెకు మహేంద్రుడు వెళ్ళిపోయింతర్వాత మనసు అక్కడ నిలవడంలేదు! స్వాస్థ్యం తగ్గిపోతూవుంది.

ఆమె ప్రతిదినమూ మహేంద్రుని తన సద్గుణజాలంలో చిక్కించుకొంటూ చూపుతూపులతో ఛేదిస్తూవుంది. ఇందులో ఆమెకేమి సుఖం లభిస్తూవుందో తెలియదు. మహేంద్రునితో పాటే ఆమె సుఖంకూడా వెళ్ళిపోయింది. ఇప్పుడామెకు

ఆ గృహమంతా శూన్యంగా కనిపిస్తూవుంది. మత్తుదిగిపోయిన తర్వాత త్రాగుబోతు స్థితి ఎలావుంటుందో అదేస్థితి ఈమెకు కూడా సంభవించింది. మహేంద్రుడు లేని ఆశ వినోదిని ఎదుట బొత్తిగా కళాహీనంగాను - రసహీనంగాను-ఉంది. మహేంద్రుడు ఆశను ప్రేమిస్తున్నాడు, ఆదరిస్తున్నాడుకూడా. ప్రణయ వంచితమైన వినోదిని చిత్తం మాటిమాటికి చలిస్తూవుంది. బాధచేతనూ ఒకవిధమైన క్రోధావేశంచేతనూ ఆమె విరహిణీప్రవృత్తికి హెచ్చరిక లభించింది. తన జీవనాన్ని నిరర్థకంచేసిన మహేంద్రుడు, తనలాంటి యువతీరత్నాన్ని అనాదరంచేసిన మహేంద్రుడు, ఆశలాంటి బుద్ధిమాలిన బాలికను స్వీకరించాడు! వినోదిని అతణ్ణి ప్రేమిస్తుందా, లేక విరోధిస్తుందా?—అతనికి హృదయాన్ని అర్పిస్తుందా, లేక కఠిన దండన విధిస్తుందా?—తానుకూడా గ్రహించలేకుండా వుంది వినోదిని. మహేంద్రుడు ఆమెహృదయంలో అగ్నిరగిల్చాడు. అది ప్రేమాగ్ని అవుతుందా, అసూయాగ్ని అవుతుందా, లేక రెండింటి కలయికవల్ల ఏర్పడినట్టిదా? అది ఆమెకూడా తెలుసుకోనలేకుండా వుంది. 'పరమేశ్వరుడు ఏస్త్రీకికూడా నాలాంటి దశకలిగించకుండుగాక. నేను చావదలచుకొన్నానో, చంపదలచుకొన్నానో నాకే తెలియడంలేదు.' అని ఆమె తన మనసులో అనుకొని వికటంగా నవ్వుకొంది.

తగులబడి పోవడానికైనా, తగులబెట్టడానికైనా వినోదినికి మహేంద్రునితో అవసరముంది. ఆమె తన అగ్నిబాణాల్ని మరెవరిమీద ప్రయోగిస్తుంది? తీవ్రంగా శ్వాస

తీసుకొంటూ 'ఎక్కడికి వెళ్లుతావు? తప్పకవస్తాడు! అతడు నామనిషి!' అనుకొన్నది తనలోతాను.

మూడు నాల్గుదినాలు గడిచినతర్వాత మహేంద్రునికి పోస్టుద్వారా ఒకజాబు వచ్చింది. ఆజాబుమీద మహేంద్రునికి పరిచితమైన అక్షరాలతో చిరునామా వ్రాయబడి వుంది. పగటిపూట ఈ గందరగోళంలో తెరచిచూడడం మంచిదికాదని అతడు తన రొమ్ముభాగంలోని వేస్టుకోటు జేబులో దాన్ని భద్రపరిచాడు. కాలేజీలోలెక్చరు వినే సమయంలో, ఆస్పత్రిలో తిరిగేసమయంలో, తన ప్రేమవిహంగము తనరొమ్ముభాగంలో గూడుకట్టుకొని అందులో నిద్రిస్తూవుందని, దాన్ని మేల్కొల్పగానే దాని మృదుమధుర వాక్కులు తన చెవుల్లో ప్రతిధ్వనిస్తాయని అప్పుడప్పుడు అని పిస్తూవుంది మహేంద్రునికి.

సాయంకాలం మహేంద్రుడు తనగదిలో, లోపల గడియవేసుకొని, లాంతరుముందు పడకకుర్చీలో సుఖంగా పండుకొన్నాడు; తర్వాత అతడు తనశరీర వేడిమిచే వెచ్చబడి వున్న లేఖను తన జేబునుండి బయటికి తీశాడు. లేఖ చేతిలోకి తీసుకొనగానే ఏదో ఒకవ్యక్తియొక్క విరహాగ్నిలో తప్తమైన సుకోమల హృదయం జ్ఞాపకం వచ్చింది. చాలసేపు కవరు చేతిలోకి తీసుకొని దానిమీద వ్రాసివున్న తన నామాక్షరాలను చూస్తూవున్నాడు. జాబులో పదిఇరవై అక్షరాల కంటె ఎక్కువగా వ్రాయబడి ఉండవని అనుకొన్నాడు; ఆశ తన భావాలను స్పష్టంగా ప్రకటిస్తుందనే ఆశ తన

కెంతమాత్రమూ లేదు. వంకరటింకర పంక్తులతో ఎగుడు దిగుడు అక్షరాలతో ఆమె ప్రేమపూర్ణమైన ఉచ్ఛ్వాసాన్ని ఊహించుకొనవలసి వుంటుందని భావించాడు. లకోటామీది ఆశయొక్క వచ్చీరాని అక్షరాల్లో, తెలివితేటలతో వ్రాయ బడివున్న తనపేరుతోకూడా—పవిత్ర వైకుంఠంతో సమాన మైన పతివ్రతా స్త్రీయొక్క సుందరహృదయాన్నుండి వెలు వడిన సత్యమైనప్రేమను గురించిన రాగమాలిక మహేంద్రునికి వినిపించింది.

మహేంద్రుని మనసులో, దీర్ఘకాలం కలిసిఉండడంవల్ల కలిగిన ఒకవిధమైన నిస్పృహ ఈ రెండుదినాల వియోగంవల్లనే తొలగిపోయి, సాధుశీలయగు ఆశలోవున్న సరళమూ సత్యమూ అయిన ప్రేమప్రకాశాన్ని పొంది, వెనుకటి సుఖ స్మృతి తిరిగి ప్రజ్వలించింది. ఒకవైపు ఆశచేసే తల తోక లేసి యింటిపనులు మహేంద్రుని ఆమెనుండి విముఖునిగా చేస్తు న్నాయి; ఐతే ఆమెను విడిచిపెట్టి దూరంగా రావడంచేత అతని హృదయంలోని కర్మహీనము కారణహీనమునైన విశుద్ధ ప్రేమానందప్రకాశంలో ఆశయొక్క మనోమూర్తి తిరిగి ఉజ్జ్వలంగా ప్రకాశింపసాగింది.

మహేంద్రుడు తిన్నతిన్నగా గొప్ప ప్రయత్నంతో లకోటాచించి జాబు బయటికితీసి, దాన్ని కళ్ళకద్దుకొని ముద్దు పెట్టుకొన్నాడు. అతడి రోమాలు గగుర్పొడిచాయి. వెనుకటి రోజుల్లో ఒకప్పుడు ఆశకు మహేంద్రునిచే బహూకరించబడిన అత్తరు ఘుమఘుమలు — ఒక వ్యక్తియొక్క చిన్న నిశ్వాసం

లాగా ఆజాబులోనుంచి బయలుదేరి అతని హృదయంలో విలీనమైనాయి.

ఉత్తరాన్ని తెరచి చదవడం ప్రారంభించాడు మహేంద్రుడు. కాని ఇదేమాశ్చర్యం? పంక్తులు వంకరటింకరగా అక్షరాలు ముద్దలుగా వున్నాయి. కాని భాష సామాన్యంగా లేదు! వ్రాతమాత్రం ఆశదే, మాటలు ఆమెవిగా కనిపించడంలేదు! ఇలా వ్రాయబడి ఉంది—

"ప్రియతమా,

"మీరు దేన్ని మరవడానికి ఇచ్చటినుండి వెళ్ళారో, ఈలేఖద్వారా దాన్ని మీకెలా జ్ఞాపకంచేయను? మీరు వెల్లగించివేసిన లత యేముఖంతో మీ సహాయంవల్ల మళ్ళీ పైకి లేవగలుగుతుంది? అది యెందుకు నేలగలసిపోలేదు?

"కాని ప్రియా, ఒక్క-నిముషమాత్రం నన్ను జ్ఞాపకం చేసుకొంటే మీకేమి నష్టముంటుంది? మీహృదయంలో యేమాత్రం బాధకలుగుతుంది? అలాకాజాలదు. మీ యీ 'మరపు' అనేది నాప్రక్క- బొమికెల్లో ముల్లులాగా గ్రుచ్చుకొనివుంది. అది రాత్రింబగళ్ళు ప్రతిపనిలో, ప్రతిఆలోచనలో, ఎటుతిరిగితేఅటు బాధపెడుతూవుంది. నాథా, మీరెలా మరచి పోగలిగారో, ఆ మరచిపోయే విధానం నాకుకూడా ఉపదేశించండి.

"నాథా, మీరునన్ను ప్రేమించుటకు ప్రారంభించారంటే అది నా అపరాధమా? నేను స్వప్నంలోకూడా ఎన్నడైనా ఇంతసౌభాగ్యాన్ని ఆశించానా? నేనెక్క-డినుండి

వచ్చాను? నన్నెవరెరుగుదురు? మీరు నన్ను కన్నెత్తి చూడక పోతే, లేక నన్ను మీ ఇంట్లో జీతంలేని దాసీగా వుంచుకొంటే నేను మిమ్మల్ని నిందించగలనా? ప్రియతమా, మీరు స్వయంగా నాలో ఉన్న ఏసద్గుణాన్ని చూచి ముగ్ధులైనారు — దేన్ని చూచి నన్నింతగా ఆదరించారు? ఇదిగాక నేడు మేఘాలు లేకనే పిడుగు పడిందంటే అది క్రూరకే కాల్చి ఎందుకు విడిచిపెట్టింది— ఒక్కసారిగా నుగ్గునుగ్గు చేసి ఎందుకు నాశనం చెయ్యలేదు?

"మీరు నన్ను విడిచి వెళ్ళిననాటినుండి నేను చాలా ఓర్మి వహించాను, బాగా ఆలోచించాను, ఐతే నాకొక్కటీ అర్థం కావడంలేదు.—ఇంట్లో ఉండి నన్ను మీరు విడిచిపెట్టలేరా? నాకొరకు ఇల్లు విడిచిపెట్టవలసిన అవసరమేముంది? మీ రింట్లో ఉంటే మాత్రం మిమ్మల్ని చుట్టిచుట్టి తిరుగుతున్నానా? నాకు ఇంట్లో ఒకమూల కొంచెం స్థలం ఇస్తే, లేక ఇంటి వెలుపలి దర్వాజాలో ఉంచితే, నేను మీకళ్ల యెదుట పడతానని మీ భయమా? నాయందు మీకింత ఈర్ష్య వున్నప్పటికీ మీరు వెళ్లడమెందుకు? నాకెక్కడైనా స్థానం దొరకదా? ఎలా వచ్చానో అలాగే వెళ్ళిపోతాను."

ఇదేంజాబు! ఈభాష ఎవరిది?—అదిమ హేంద్రునికి బాగా అర్థమయింది. ఆకస్మికంగా దెబ్బతగలడంచేత మూర్ఛపోయిన వానిలాగా లేఖ చేతిలో వుంచుకొని స్తంభీభూతుడైనాడు. శరవేగంతో పరుగిడుతూవున్న మార్గంలో బలమైన ఎదురు దెబ్బ తగులడంచేత తల్లక్రిందులై 'కింభూత్-కిమాకార్'

అయి అతనిమనసు కుప్పగా కూలిపోయింది. మహేంద్రుని మనసు ఒక విచిత్రపరిస్థితిలో పడిపోయింది.

చాలాసేపు ఆలోచించినమీదట మహేంద్రుడు ఆ జాబును అనేకసార్లు చదువుకొన్నాడు. కొంతకాలంవరకు 'భవిష్యం'లాగా అస్పష్టంగావున్న విషయం ఇప్పుడు 'వర్తమానం' లాగా కళ్లఎదుట కనిపిస్తూవుంది. మహేంద్రుని జీవనాకాశంలో ఒకమూల ఛాయగా కనుపిస్తూన్న ధూమకేతువు తనవిశాల అగ్నిశిఖలతో ప్రజ్వలిస్తూ ఎట్టయెదుట కనుపించింది.

ఈ లేఖలోని భాష వినోదినివల్ల కూర్చబడింది. అమాయకురాలైన ఆశ, అది తనదనే భావించి వ్రాసింది. మొదట ఆశ ఎంతమాత్రము ఊహించనట్టిమాటలు వినోదిని వ్రాయిస్తూవుంటే ఆ మెకవి తనమాటలుగానే తోచడం మొదలుపెట్టాయి. అనుకరించబడిన మాటలు వెలుపలనుండి మూలస్థానాన్ని పొంది ఆమెవే అయినవి. మహేంద్రుని వియోగంవల్ల సంభవించిన ఈ క్రొత్త బాధను ఆశ ఇంత అందంగా ప్రకటింపజాలను. 'నా సఖి నా మనసులోని విషయాలను ఇంత చక్కగా ఎలా తెలిసికొంది? ఇంత అందంగా అన్ని సంగతులు ఎలా వ్రాయించింది?' అని ఆమె తన మనసులో ఆలోచిస్తూవుంది.

ఆశ తన అంతరంగిక సఖిని అతిప్రేమతో తన మనిషిగా చేసుకొంది; ఎందుకంటే తన మనసులోని వ్యథకు తగిన భాష తన సఖివద్ద ఉంది.

మహేంద్రుడు కుర్చీలోంచిలేచి కనుబొమలు ముడుచు కొని వినోదినిమీద కోపం తెచ్చుకొనవలెనని ప్రయత్నిం చాడు; కాని ఈలోగానే ఆశమీద కోపం వచ్చింది.

'ఆశకు ఇంత తెలివితక్కువ ఏమిటి! భర్త విషయంలో ఇంత అసభ్యప్రవర్తన ఏమిటి!' అనుకొని, ఆభావంతోనే తిరిగి లేఖ చదవడం ప్రారంభించాడు. చదివాక అతని హృదయంలో ఒక విధమైన ఆనందం కలిగింది.

అతడాలేఖను ఆశ వ్రాసినట్టుగానే భావించి చదవడం మొదలుపెట్టాడు, కాని ఆలేఖలో ప్రయోగించబడిన భాష అమాయకురాలైన ఆశను యెంతమాత్రం స్ఫురణకు తేవడం లేదు. మూడునాల్గు పంక్తులు చదివేసరికి నురుగుతోవున్న సారాయిలాగా ఒక విధమైన సుఖము, ఒక విధమైన మైకము ఉత్పన్నం చేయగల సందేహం నాలుగుదిక్కులనుండి అతని మనస్సుకు నాలుగంచులా తన చిహ్నలను ముద్రిస్తూ వుంది. అది ప్రచ్ఛన్నంగా వుండికూడా ప్రకటమవుతూ, నిషిద్ధమైకూడా వెంట తిరుగుతూ, విషమిశ్రితమైకూడా మధుర రుచులను కలిగిస్తూ, ఎదురుగా నిల్చి ఒక్కసారిగా వెనుకకు తిరిగిపోయింది. ప్రేమప్రకాశం మహేంద్రుని పిచ్చివాణ్ణి చేసి వేసింది. చేతుల్లోనో, కాళ్ళలోనో ఏదో ఒక స్థానంలో ఖడ్గాన్ని గ్రుచ్చిగానీ, మరేమైనా చేసిగానీ, ఈ హానికరమైన విషాద్రవ్యాన్ని నాశనంచేసి, నా మనస్సును స్వస్థానంలో చేర్చి దిగ్బంధనం చేస్తాను—అనుకొన్నాడు.

మహేంద్రుడు తన రెండు పిడికిళ్ళతో గట్టిగా టేబిల్ మీద గ్రుద్ది, కుర్చీమీదినుండి లేచి నిల్చొని 'విసిరికొట్టు, జాబు తగలబెట్టు' అని అరచి, ఆజాబును లాంపుదగ్గరకి తీసుకొని వెళ్ళాడు; కాని దాన్ని కాల్చలేదు—మరొకసారి దాన్ని చదువుకొన్నాడు. మరునాటి ఉదయం నౌకరు గది తుడవడానికి వచ్చి చూచాడు—టేబిల్ మీద కాగితాలు కాల్చిన బూడిద రాలి పడివుంది. ఐతే అది ఆశ వ్రాసిన జాబును కాల్చిన బూడిదకాదు. మహేంద్రుడు రాత్రి ఆలేఖకు జవాబు వ్రాస్తూ అనేక కాగితాలు చింపివేశాడు. ఇది ఆకాగితాల బూడిద.

# 20

ఇంతలో మరొకజాబు వచ్చింది—— .

"మీరు నాజాబుకు జవాబు వ్రాయలేదు, మంచిపని చేశారు. మంచివిషయం వ్రాయరాదు, కాని మీ జవాబు నేను తెలుసుకొన్నాను. భక్తుడు తన ఇష్టదేవతను పిలిచినప్పుడు అదేమయినా జవాబిస్తుందా? ఈ దీనురాలి పూజోపకరణాలకు మీ పాదాలముందు స్థానం లభించింది – అదే నాకు పదివేలు.

"కాని భక్తుని పూజాపురస్కారాలు స్వీకరించడంలో పరమశివుని తపస్సుకు భంగం కలిగివుంటే అందుకు నాప్రాణనాథుడు కోపగించకూడదు. మీరు నాకు వరదాన మివ్వండి ఇవ్వకపోండి, కన్నెత్తి చూడండి చూడకపోండి, తెలుసు

కొనండి తెలుసుకొనకపోండి, భక్తునికి పూజించక గతిలేదు. ఆ కారణంచేత ఈవేళకూడా నాలుగు అక్షరాలు వ్రాసి పంపుతున్నాను. ఓ నా శిలామూర్తీ, మీరేమీ చలించకండి!”

తిరిగి జవాబు వ్రాయడానికి కూర్చొన్నాడు మహేంద్రుడు. కాని ఆశకు వ్రాసే లేఖలో వినోదిని ప్రశ్నలకు జవాబులు తమంతటతామే కలంనుండి దొర్లివస్తున్నాయి— వానిని వ్రాయకుండా యుక్తితో దాచ చూస్తున్నాడు. అనేక కాగితాలు ధ్వంసంచేసి, అర్ధరాత్రి గడిచాక ఒకజాబు వ్రాసి కవరులోవుంచి, దానిమీద ఆశ నామాక్షరాలు వ్రాసే సమయంలో ఎవడోగాని వీపుమీద ఒక్క చరుపు చరిచి— ‘మోసగాడా, నిన్ను నమ్మిన అమాయకబాలిక యెడలనా ఇంత కపటవర్తన!’ అన్నట్లు అనిపించింది.

మహేంద్రుడు జాబును ముక్కలు ముక్కలుగా చించి వేశాడు. ఆరాత్రిఅంతా మోచేతులు టేబిలుమీద ఆనించి రెండు చేతులతో ముఖాన్ని దాచుకొని, తనముందు తానే దాగుకొనడానికి ప్రయత్నించాడు.

మూడవ లేఖ వచ్చింది. దానిలో ఇలా వుంది—

“బొత్తిగా గౌరవించడం తెలియనివాడు ప్రేమించడం కూడా ఎరుగడు. నా ప్రేమను అనాదరంనుండి అవమానం నుండి రక్షించుకొనజాలనప్పుడు, దూషితమైన ఆ ప్రేమను మీకెలా అర్పించగలను?

“బహుశ నేను మీ మనస్సును చక్కగా గుర్తించ లేకపోయాననుకొంటాను; ఇందువల్లనే ఇంత సాహసం

చేయగలిగాను. ఇందుచేతనే మీరు విడిచివెళ్లిన తర్వాతకూడా, నాకు నేనే ముందుకు సాగి, జాబు వ్రాశాను — మీరు మౌనం వహించినా నేను నా మనసులోని విషయం సంతోషంగా చెప్పివేశాను. కాని, మిమ్ముల్ని గుర్తించడంలో నేను పొరబడివుంటే అందులో నాదోషమేముంది? ఒక్కసారి మనస్సు లగ్నంచేసి, అన్ని విషయాలను ఆమూలాగ్రంగా పరీక్షించుకో—నేననుకొన్నట్లు నీవనుకొన్నావో లేదో, అప్పుడు చెప్పు.

"పొరబాటేవ్రాశానో, సత్యమేవ్రాశానో ఏమయినా కానీ, అది ఇక తుడుపబడజాలదు—ఒకరికిచ్చివేసిందీ తిరిగి రాదు—ఇదేవిచారకరమైన విషయం. ఛీ ఛీ, సర్వసామాన్యంగా ఏ స్త్రీకూడా ఇలాంటి లజ్జను అనుభవించవలసి వుండదు! ఐతే ఇందువల్ల నేను మిమ్ము మరుస్తానని అనుకో వద్దు. ప్రేమించేవారు, తమప్రేమ ఉపేక్షించబడడాన్నికూడా సహించగలరు. మీరు నాలేఖను కోరకపోతే పోనివ్వండి—జవాబు ఇవ్వకపోతే, ఇంతే, ఇకమాట్లాడను."

ఈజాబు చూచుకొని ఇక ఆగలేకపోయాడు. నేను ఆశ వ్రాసిన ఈజాబులకు కోపంవచ్చి తిరిగి వెళ్ళుతున్నానని, వినోదిని తనను మరవడానికి ఇల్లువదలి పరుగెత్తివచ్చానని అనుకొంటున్నదని, వినోదినిమోపిన ఈనిందను వెంటనే అసత్యమని నిరూపించడానికికూడ తాను వెంటనే ఇంటికి వెళ్ళవలసిన అవసరం వున్నదని అనుకొన్నాడు.

ఇదేసమయంలో బిహారీ వచ్చాడు. బిహారీని చూడగానే మహేంద్రుని హృదయోత్సాహం ద్విగుణీకృతమైంది. ఇంతవరకు అనేకవిధాలైన సందేహాలు కలుగడంచేత బిహారి విషయంలో అతనిమనసు మాలిన్యాన్ని పొందుతూవుంది— మైత్రికి అంతరం ఏర్పడుతూవుంది. ఈజాబులన్నీ చదివిన తర్వాత ఈర్ష్య, ద్వేషం, సందేహం అన్నీ నశించాయి.

మహేంద్రుడు మంచిహుషారుగా బిహారీనిపిల్చాడు. కుర్చీమీదనుండిలేచి, బిహారివెన్నుమీద ఒకదెబ్బవేసి, అతడిచెయ్యిపట్టుకొని తీసుకవచ్చి వేరొకకుర్చీలో కూర్చోబెట్టుకొన్నాడు. కాని బిహారిముఖం ఎప్పటిలాగా ప్రకాశవంతంగాలేదు. 'పాపంవీడు ఈమధ్య వినోదిని వద్దకువెళ్ళి ఆమెవల్ల పురస్కారానికి బదులు తిరస్కారాన్ని పొందినట్లున్నాడు.'అనుకొన్నాడు మహేంద్రుడు.

మహేం:— ఈమధ్య మాఇంటికి వెళ్లావా?

"ఇప్పుడు అక్కడినుంచే వస్తున్నాను." అని గంభీరభావంతోఅన్నాడు బిహారి.

బిహారి మనోవ్యథను ఊహించుకొని మహేంద్రుడు ఒకవిధమైన ఆనందాన్ని పొందుతూ—'పాపం! అభాగ్యుడు, బిహారి బొత్తిగా స్త్రీలప్రేమకు నోచుకోక పోయాడు!' అని తనమనసులో అనుకొన్నాడు. ఇలాఅనుకొంటూ జాబులు పెట్టివుంచిన వేస్టుకోటు జేబుమీద తనచేతితో నిమిరాడు.

మహేం:— అందరూ బాగున్నారా?

బిహారి:— బాగానే వున్నారు, నీవు ఇల్లువిడిచి ఇక్కడ వుండడం ఎందుకు?

మహేం:— ప్రస్తుతం రాత్రిపూట పనిచూచుకోవలసి ఉంది; ఇంటినుండి రోజూ రావడం ఇబ్బందిగావుంటుంది.

బిహారి:— ఇదివరకు కూడా రాత్రిడ్యూటీ పడుతూనే ఉంది. అప్పుడు ఇల్లు విడిచిపెట్టి ఇక్కడికి రాలేదుగదా!

"నీకేమైనా సందేహంగా వుందా?" అని నవ్వాడు మహేంద్రుడు.

బిహారి— లేదు, ఎగతాళి కట్టిపెట్టి ఇక ఇంటికిపద.

ఇంటికి వెళ్లడానికి సిద్ధంగానే వున్నాడు మహేంద్రుడు. బిహారి అనురోధాన్ని విని తన అభిప్రాయాన్ని బయట పడ నీయలేదు—ఇంటికి రావశం ఎంతమాత్రం ఇష్టం లేనట్లు నటించాడు. "అదెలా వీలవుతుంది? ఇంటికి వస్తే సంవత్సరం పొడుగునా చేసినకృషి కృష్ణార్పణమైపోతుంది." అన్నాడు.

బిహారి:— చూడు దాదా, నిన్ను నేను చిన్నప్పటి నుండి ఎరుగుదును, నన్ను మోసగించబోకు. నీవు అన్యాయం చేస్తున్నావు.

మహేం:—అన్యాయం ఎవరికి చేస్తున్నాను జడ్జిగారు?

"నీవు చాలా సహృదయుడవని ఎప్పుడూ చెప్పుకొనే వాడవు. ఇప్పుడు ఆ సహృదయత అంతా ఏమైపోయింది"? అన్నాడు బిహారి కోపంతో.

మహేం:— కాలేజి ఆస్పత్రిలో వుంది.

బిహారి:—చాల్లే, ఊరుకో! నీవిక్కడ నాతో ఎకచకా లాడుతూ నవ్వుతున్నావు. అక్కడ నీ చున్నీ గదిలోకి-బయటకు ఏడుస్తూ తిరుగుతూ వుంది తెలుసా?

ఆశ ఏడుస్తున్నదనే విషయం వినగానే మహేంద్రుని హృదయంలో దెబ్బకొట్టినట్లయింది. సంసారంలో ఇతరుల సుఖదుఃఖాలుకూడా తనమీద ఆధారపడి వున్నాయనే సంగతి క్రొత్తగా ఎక్కిన ఈమత్తులో మరచిపోయాడు మహేంద్రుడు. అదరిపడి — "చున్నీ ఏడవడం ఎందుకు?" అన్నాడు హఠాత్తుగా.

"అదినీకు తెలీదు, నాకు తెలుసు." అని కోపంతో అన్నాడు బిహారి.

"మీ మహేంద్రుడు సర్వజ్ఞుడుకాడు, అందుకు కోపించదలచుకొంటే వాణ్ణి అలా సృష్టించిన దేవుడిమీద కోపించు." అన్నాడు మహేంద్రుడు.

బిహారి ఆవేశంచూచి మహేంద్రుడు ఆశ్చర్యపడ్డాడు. బిహారి హృదయహీనుడని కోపిష్టియని అతనిభావం.—'వీనికి ఈవ్యాధి ఎప్పటినుంచి సోకింది? పెండ్లికుమార్తె ఆశను చూడడానికి వెళ్ళినప్పటినుంచే సోకివుంటుంది! పాపం బిహారి చాలా అభాగ్యుడు!' అనుకొన్నాడు.

మనసులో 'పాపం' అనుకొన్నాడు; కాని అందువల్ల మహేంద్రునికి దుఃఖం కలుగలేదు, పైగా ఒకవిధమైన ఆనందం కలిగింది.

ఆశ హృదయంలో అనన్యరూపంలో యెవరు సింహాసనం అధిష్టించి ఉన్నారో అతడికి చక్కగా తెలుసు. బిహారీ ఎంతగా కోరుతూవున్నా అతడికి లభించని—లభించడం అసంభవమైన ఒకవస్తువు తనదగ్గరేవుందనీ, ఎప్పటికీ అదితనదేననీ ఒకవిధమైన గర్వపూర్ణమైన ఆనందాన్నిపొంది ఉబ్బిపోయాడు.

"సరే పద, బండి తెప్పించు"అన్నాడుమ హేంద్రుడు.

మహేంద్రుడు ఇంటికివచ్చాడు; అతడి దర్శనం లభించగానే ఆశ దుఃఖమంతా పొగమంచులాగా విడిపోయింది. ఆమెకు తాను వ్రాసిన జాబుల విషయం జ్ఞాపకం రావడంచేత మహేంద్రుని ఎదుట తలఎత్తుకొనలేనంత సిగ్గు, బాధకలిగింది. మహేంద్రుడు తియ్యని బెదరింపులతో "విడిచిపెట్టి వెళ్ళానని, మరచి పొయ్యానని నిందలుమోపి .లేఖలువ్రాశావే, అవి ఎవరి ప్రోత్సాహంతో వ్రాశావు?" అన్నాడు. ఇలాఅని అనేక సార్లు తాను చదివిన ఆ జాబులను మహేంద్రుడు తన జేబు నుండి బయటికి తీశాడు.

ఆశ వ్యాకులపడి—"మీ కాళ్ళమీద పడతాను, వాటిని చింపి పారవేయండి." అని ఆ జాబులను మహేంద్రుని చేతుల్లోనుండి తీసుకొనడానికి ప్రయత్నించింది. మహేంద్రు డాజాబులను ఆశకు అందనీయకుండా తిరిగి తనజేబులో పెట్టుకొని—"నేను అవసరండుండి విధిలేక వెళ్ళాను, కాని నీవు మరొకవిధంగా భావించి .అనవసరంగా నామీద దోషారోపణ చేశావు." అన్నాడు.

ఆశకు కళ్ళనుండి అశ్రుబిందువులు రాలాయి. "ఈసారికి క్షమించండి, మరెన్నడు ఇలాచేయను." అన్నది.

మహేం:— ఎప్పుడూ చేయవుకదా?

ఆశ:— ఎప్పుడూ చేయను.

అప్పుడు మహేంద్రుడు ఆశను ప్రేమతో దగ్గరికి తీసుకొని ముద్దుపెట్టుకొన్నాడు.

అశ:— జాబులిలా ఇవ్వండి, చించిపారవేస్తాను.

మహేం:—వద్దు, వాటిని వుండనీ.

ఈ జాబుల్ని తన అపరాధానికి గుర్తుగా తనవద్ద ఉంచుకొంటున్నాడని ఆశ సాధారణంగా భావించింది.

ఈ జాబుల వ్యవహారంవల్ల ఆశ మనస్సు వినోదిని మీదినుంచి తిరిగిపోయింది. ఆమె తనభర్త వచ్చాడన్న శుభవార్తచెప్పి తన సఖిని సంతోషపెట్టడానికి వెళ్ళలేదు; పైగా ఆమె ఎదురుపడినా ముఖంతప్పించి వెళ్ళుతూవుంది. వినోదిని ఇదంతా తెలుసుకొని తన పనిపాటలు చేసుకొంటూ దూరదూరంగానే ఉంటున్నది.

'ఇది చాలా చిత్రంగావుందే! వినోదిని విచ్చలవిడిగా వచ్చి కలుసుకొంటుందనుకొన్నాను—కాని రంగం వేరు రూపంలోవుంది. ఐతే ఈలేఖల అంతరార్ధమేమిటి?' అని ఆలోచించాడు మహేంద్రుడు.

అతడు ఇంటినుండి హాస్టలులోవుండడానికి వెళ్లేముందు స్త్రీహృదయంలో వుండే రహస్యం తెలుసుకొనే ప్రయత్నం యేదీచేయరాదని గట్టిగా నిర్ణయించుకొన్నాడు. వినోదిని

ఒకవేళ దగ్గరకురావడానికి ప్రయత్నించేసినాకూడా దూరంగా ఉండాలని అనుకొన్నాడు. ఇప్పుడు ఆనిర్ణయాన్ని తారు మారుచేసి–'ఇదిసరికాదు. మామనసులలో నిజంగా ఒకవిధమైన వికారం కలిగింది. వినోదినితో మామూలుగానే వ్యవహరిస్తూ, నవ్వుతూ–పరిహాసాలు చేసుకొంటూ, ఈ సంశయాత్మకమైన వికారభావాల్ని తొలగించుకొనడమే మంచిది.' అను కొన్నాడు.

"మీసఖి దృష్టిలో ప్రస్తుతం నేనే 'కంటి మెరమెర' అవుతున్నట్లున్నాను. ఆమె దర్శనం కావడంలేదే!" అన్నాడు ఆశతో మహేంద్రుడు.

"ఆమెకేమొచ్చిందో ఎవరికి తెలుసు!" అని నిస్పృహగా సమాధానమిచ్చింది ఆశ.

ఇంతలో రాజలక్ష్మి వచ్చి "వినోదిని ఇంటికి వెళ్లుతా నంటున్నది. ఇక్కడ ఎంతమాత్రం ఉండదట." అని బొంగురు పోయిన గొంతుతో అన్నది.

ఇది విని మహేంద్రుడు అదరిపడ్డాడు; కాని ఎలాగో సమాళించుకొని "ఎందుకమ్మా?" అని అడిగాడు.

రాజలక్ష్మి:— ఏమో నాయనా, ఇప్పుడామె ఎంత చెప్పినా వినడంలేదు. నీకు ఎవరినీ గౌరవించడం తెలీదు. గొప్ప యింటి బిడ్డ పరాయివారి ఇంట్లో ఏదో తనకుగల ప్రేమచేత ఉంటూవుంది. ఐతే నీవామెను మన మనిషిలాగా గౌరవించ డంలేదు. ఇక ఆమె ఎలావుంటుంది?

వినోదిని తాను నిద్రించేగదిలో కూర్చొని పక్కమీది దుప్పటి కుట్టుతూవుంది. "ఏమండోయ్! కంటి మెరమెర!" అని పిలిచాడు మహేంద్రుడు.

సమాళించుకు కూర్చొని-"ఎవరు! మహేంద్రబాబూ!" అన్నది వినోదిని.

మహేం:— భలే, మహేంద్రబాబు? ఇదెప్పటినుంచి?

వినోదిని తిరిగి దుప్పటి కుట్టడంలో తన మనసు లగ్నం చేసి దానివైపే చూస్తూ—"మరేమని పిలవాలి?" అన్నది.

"మీసఖిని పిలుస్తున్నావుకదూ?—'కంటి మెరమెర' అని" అన్నాడు మహేంద్రుడు.

పూర్వంలాగా నవ్వుతూ సమాధానం ఇవ్వలేదు వినోదిని—మాట్లాడకుండా దుప్పటి కుట్టుకొంటూ వుంది.

మహేం:—మనిద్దరికి అదేచుట్టరికం ఉన్నదనిపిస్తూవుంది.

వినోదిని చేస్తున్నపని క్షణకాలం ఆపి, పిమ్మట కుట్టుతుండగా మిగిలిపోయిన దారపుకొసను పంటితో కొరికి— "అది నాకేమితెలుసు, మీకే తెలవాలి!" అన్నది.

ఇలా అని తన హృదయంలోనుంచి వెలుపలికి వచ్చిన జవాబుల్ని అణచిపెట్టి, గంభీరభావంతో – "కాలేజి ఆస్పత్రి నుండి వచ్చివేశారా?" అని అడిగింది.

మహేం:—అవును, అక్కడ శవాలను కోస్తూ ఎందాకా ఉండేది?

వినోదిని తిరిగి పళ్ళతో దారాన్ని కొరికి—"ఇప్పుడు ప్రాణాలతో వున్నవారి అవసరం వచ్చిందనుకొంటాను." అన్నది.

ఇవ్వాళ వినోదినితో అతిసహజంగా స్వాభావికంగా నవ్వుతూ పరియాచకాలాడుతూ తన మనోమాలిన్యాన్ని కడిగి వేసుకొందామని నిశ్చయించాడు. ఐతే ఆమె సంభాషణలు, హావభావాలు మహేంద్రుని కోరికను నిష్ఫలం చేశాయి. ఆమె మామూలుగా నవ్వుతూ మాట్లాడడంలేదని మహేంద్రుడు గ్రహించాడు. వినోదిని హృదయం తనకు దూర దూరంగా వెళ్ళుతున్నట్లు గ్రహించి, అతడిమనస్సు అతి వేగంగా ఆమెవేపు సాగిపోతూ వుంది-ఆమెకు తనకు మధ్యనున్న దూరాన్ని తొలగించి వేయాలని అతడు తొందరపడు తున్నాడు.

వినోదిని అనిన చివరిమాటకు తగిన జవాబు చెప్పకనే మహేంద్రుడామెవద్దకు వెళ్ళి కూర్చొని—"నీవు మమ్మల్ని విడిచిపెట్టి ఎందు వెళ్ళగోరుతున్నావు? నావల్ల ఏమయినా అపరాధం జరిగిందా?" అన్నాడు.

అప్పుడు ఆమె కొంచెం ప్రక్కకు తొలిగి, తలఎత్తి విశాలమైన తన ఉజ్జ్వల నేత్రాలను మహేంద్రుని నేత్రాలతో కలిపి—"అవసరమైన పనులు అందరికీ ఉంటాయి. తమరు ఎవరి అపరాధంవల్ల ఇల్లువాకిలీ విడిచిపెట్టి కాలేజీలో మకాం చేశారు? నేనూ వెళ్ళవలసేవుంది, నాకేమీ అవసరమైన పనుల్లేవా?" అన్నది.

ఎంత ఆలోచించినాకూడా మహేంద్రునికి దీనికి తగిన సమాధానం లభించలేదు. కొంచెంసేపాగి—"నీవు వెళ్ళకపోతే అక్కడ ఆగిపోయేపని ఏదో కొంచెం చెప్పగలవా?" అని ప్రశ్నించాడు.

ఏకాగ్రభావంతో సూదిలో దారం గ్రుచ్చుతూ గ్రుచ్చుతూ—"అవసరమైన పని ఉందో లేదో అది నాకే తెలుసు, దానివ్యవహారం మీకు చెప్పడమెందుకు?" అన్నది వినోదిని.

మహేంద్రుడు దుఃఖగంభీరమైన ముఖంతో ద్వారానికి వెలుపల నిల్చివున్న రావిచెట్టు అగ్రభాగాన్ని చూస్తూ ఐదారు నిమిషాలు మౌనంగా కూర్చొన్నాడు. మాట్లాడకుండా సూది ఆడిస్తూవుంది వినోదిని. సూది క్రిందపడ్డా వినిపించేటంత నిశ్శబ్దంగావుంది. కొంచెంసేపటికి మహేంద్రుడు మాట్లాడాడు. ఆకస్మికంగా మాట్లాడంచేత వినోదిని అదరిపడడంతో ఆమె వ్రేళ్లలో సూది గ్రుచ్చుకొంది.

మహేం:— ఎంతబ్రతిమాలినా ఉండదలచుకోలేదా?

వినోదిని తన వ్రేలు అదిమి నెత్తురు బయటికితీస్తూ— "అసలు అంతగా బ్రతిమాలవలసిన అవసరమేముంది? నేను వుంటేయేమి, లేకపోతేయేమి?—మీకు దీనివల్ల లాభనష్టాలేమున్నాయి?" అన్నది.

ఇలా అంటూఉండగా కంఠం డగ్గుత్తికపడింది. మనస్సు బాగా లగ్నంచేసి పనిచేస్తున్నట్లు తలవంచుకొని కుట్టుకొంటూవుంది. తలవంచుకొన్నప్పుడు ఆమె కళ్ళనుండి నీరుబుకు

తున్నట్లు కనిపించింది. శీతకాల ప్రభాకరుని మందప్రభలు సంధ్యాకాలపు అంధకారంలో కలిసిపోతున్నాయి.

మహేంద్రుడు వెంటనే వినోదిని చేతినిపట్టుకొని గద్గద ...రంతో—"నాకేదయినా లాభనష్టాలు కలిగేలాగుంటే ...ంటావా?" అన్నాడు.

ఆమె వెంటనే తనచెయ్యి విడిపించుకొని దూరంగా ...యింది. మహేంద్రునికి మైకం దిగిపోయింది. తాను అన్న ...ట ఒకభయంకరమైన వ్యంగ్యంలాగా తనకర్ణ రంధ్రా... మాటిమాటికి ప్రతిధ్వనిస్తూవుంది.—మహేంద్రుడు ...ధంచేసిన తన నాలుకను పళ్ళమధ్యగా బాగా అదిమి ... తననాలుకనుండి మళ్ళా యేమాటరాలేదు.

...దే నిశ్శబ్దసమయంలో ఆశ లోపలికి ప్రవేశించింది. వెంటనేనవ్వి వెనుకటి సంభాషణల వరుసలోనే— ... ఇలా అనేలాగుంటే మీకు కోపం వచ్చేలాగా ...చన నేను వెళ్ళజాలను. 'ఇక మీరు చెప్పనిదే నేనువెళ్లను.

తనభర్త సఫలప్రయత్నుడు' కావడంవల్ల సంతోషించి ఆశ వినోదినిని కౌగలించుకొంది.—"ఐతే ఈమాటే ఖాయం, మీరు వెళ్ళమని చెప్పేవరకువెళ్ళను, వెళ్ళను, వెళ్లను అని మూడుసార్లు ప్రతిజ్ఞచేసి చెప్పాలి." అన్నది.

వినోదిని అలాగే చెప్పింది. "నీవిక్కడ ఉండవలసిన అవసరం ఉన్నప్పుడు ఎందుకీరాద్ధాంతం? చివరికి వీరితో ఓడి పోవలసివచ్చింది కదా!" అన్నది ఆశ.

"ఏం మహేంద్రబాబూ, నిజంచెప్పండి ఓడిపోయింది నేనా, మీరా?" అని నవ్వింది వినోదిని.

మహేంద్రుడు యింతవరకు నిశ్శబ్దంగా నిల్చొని వున్నాడు. తన అనుచిత వ్యవహారం యిల్లంతా చుట్టివేసిందనీ అగౌరవం తన్ను చుట్టు ముట్టిందనీ అతడు భావించాడు. ఆశయెదుట వెనుకటిలాగా బాగా నవ్వుతూ త్రుళ్లుతూ ఎలా మాట్లాడగలడు?—ఒక్క క్షణంలో తన యీ అవ్య ప్రవర్తనను, నిగ్రహశూన్యతను ఒక్క తేలికపాటి నవ్వులో ఒక స్వాభావికమైన సంభాషణలోకి మార్చడం సా మౌతుందా? ఈ పైశాచికమైన ఇంద్రజాలాన్ని, కపట నాన్ని ప్రకటించడం అతని శక్తికిమించిన పని. నాలుక కట్టిపోతుండగా, చిన్నచిన్న మాటల్తో—"నేనే ఓడిపో అని వెంటనే బయటికి వెళ్ళిపోయాడు.

కొంచెం సేపటిలో మహేంద్రుడు తిరిగివచ్చి నితో "నన్ను క్షమించు" అన్నాడు.

వినోదిని:— క్షమించటానికి మీరేమి అపరాధం చేశారు?

మహేం:— నిన్ను బలవంతంగా ఇక్కడ ఉంచడానికి మాకు యే అధికారమూ లేదు.

"నన్ను మీరు నిర్బంధమేమీ చేయలేదు. మంచి మాటలతోనే చెప్పారు. దీనినే బలవంతమనికూడా అంటారా? (ఆశతో) నీవు చెప్పు చెల్లీ, బలవంతం, ప్రేమ రెండు ఒకే వస్తువుకు నామాంతరాలా?" అని నవ్వింది వినోదిని.

ఆశ ఆమెతో సంపూర్ణంగా యేకీభవించి—“ఎన్నడూ కాదు.” అన్నది.

వినోదిని:— నేను యిక్కడ వుండవలెనని కోరుతున్నారు, నేను వెళ్ళితే మీకు కష్టం తోస్తుంది, ఇది నా అదృష్టంగా భావిస్తున్నాను. (ఆశతో) చెల్లీ, ప్రపంచంలో ఇలాంటి హితైషులెందరు దొరుకుతారు? ఇతరుల సుఖాలు తన సుఖాలుగాను, కష్టాలు తన కష్టాలుగాను భావించేవారిని బుద్ధిపూర్వకంగా ఎవరు విడిచిపెట్టకోగుతారు?

తనభర్త సిగ్గుతో మాట్లాడకపోవడం చూచి-“అక్కా, మాటల్లో నిన్నెవరు జయించగలరు?” అన్నది ఆశ.

మహేంద్రుడు మళ్ళీ త్వరత్వరగా వెళ్ళిపోయాడు. అప్పుడు రాజలక్ష్మితో కొంతసేపు మాట్లాడి మహేంద్రుని వెదుకుతూ ఆ వైపే వచ్చాడు బిహారి. మహేంద్రుడు ద్వారం యెదురుగా అతణ్ణి చూస్తూనే-“తమ్ముడూ, బిహారీ, నావంటి నీచుడు కపటి యీ ప్రపంచంలో మరిలేడు.” అని, మహేంద్రుడు వినోదినికి వినపడేటంత పెద్దగా అన్నాడు.

వినోదిని గదినుండి వెంటనే-“బిహారీబాబూ!” అని పిలుపు వినవచ్చింది.

బిహారి:— కొంచెం ఉండు పెద్దవదినా, ఇప్పుడే వస్తాను.

వినోదిని:— కొంచెం విని వెళ్ళరాదూ.

బిహారి లోపలికి వెళ్ళుతూనే ఒకసారి ఆశవైపు చూచాడు. మేలిముసుగులోనుంచి కనపడినంతవరకు ఆమెలో

విషాదచిహ్నాలుగాని, బాధాచిహ్నాలుగాని, అతడికి కనిపించ లేదు.

ఆశ లేచి పోసాగింది; వినోదిని ఆమెను బలవంతంగా పట్టుకొని నిల్పి "బిహారీబాబూ, నాసఖికీ మీకు సవతిబాంధ వ్యం వున్నట్లుందే, మిమ్ము చూడగానే యీమె పరుగెత్తడ మెందుకు?" అన్నది.

ఆశ చాలాసిగ్గుపడి రెండుచేతుల్తో వినోదిని వీపుమీద చరిచింది.

బిహారి నవ్వి—"భగవంతుడు నన్నంత సుందరంగా పుట్టించలేదు, అదీకారణం." అన్నాడు.

వినోదిని:— చూచావా చున్నీ, బిహారిబాబు ఎలా మాటల్లో తప్పించుకొంటున్నాడో! నీమీద దోషం మోప కుండా విధాతమీద దోషారోపణం చేస్తున్నాడు. లక్ష్మణుని వంటి శుభలక్షణాలుగల మరదిని కలిగివుండికూడా వారిని గౌరవించలేక పోవడం నీ దురదృష్టం!

బిహారి:— పెద్దవదినా, ఇందువల్ల నీకు నాయందు దయకలిగితే, ఇక నేను దుఃఖించవలసిన అవసరమేవుండదు.

వినోదిని:— సముద్రంనిండా నీళ్ళున్నాయి, కాని చాతకాలకు స్వాతి వాన పడనిదే దప్పితీరదు.

ఆశ ఇక ఆగలేకపోయింది. బలవంతంగా తనచేతుల్ని వినోదిని చేతుల్లోనుంచి లాక్కొని వెళ్ళిపోయింది. బిహారి కూడా లేచాడు.

"బిహారీబాబూ, మీమిత్రుని విషయమేమిటో చెప్ప గలరా?" అన్నది వినోదిని.

బిహారి ఈమాటలు విని నిలువబడి—"నాకేమీ తెలియదే! ఏమయినా జరిగిందా?" అన్నాడు.

"ఏమనేది బిహారీబాబూ, నాకు వారిలక్షణాలు బాగా లేవు." అన్నది వినోదిని.

బిహారి గుండెలు దడదడలాడ మొదలుపెట్టాయి. పూర్తి సమాచారం తెలుసుకోనడానికి చింతాసూచకంగా వినోదినివైపు చూస్తున్నాడు. ఆమె ఏమీ మాట్లాడకుండా కుట్టుకుంటూ ఉంది.

కొంచెంసేపు నిరీక్షించిన తర్వాత—"ఏమిటి విశేషం? మహేంద్రదాదా విషయంలో నీవేమైనా చూచావా, విన్నావా?" అని అడిగాడు బిహారి.

"నాకు వారిప్రవర్తన బాగుండలేదు, మరేంచెప్పేది. నాకు నా సఖివిషయమే చింతగావుంది." అని సాధారణ భావంతో ఒక దీర్ఘనిశ్వాసాన్ని విడిచి, కుట్టేకుట్టే దుప్పటి అక్కడవుంచి లేచివెళ్ళడానికి ప్రయత్నించింది వినోదిని.

"వదినా, కొంచెం కూర్చో." అన్నాడు బిహారి వ్యాకులంతో.

గది ద్వారాలన్నీ తెరచి లాంపువెల్తురు పెద్దదిచేసి వినోదిని ఒకమూలగా వెళ్ళి దుప్పటి కుట్టడానికి కూర్చొని—"బిహారిబాబూ, ఎల్లకాలం నేనిక్కడవుండను; నేను వెళ్ళిన తర్వాత మీరునాసఖికి దుఃఖం కలుగకుండా కనిపెట్టేఉండాలి."

అని తన ఉచ్ఛ్వాసాన్ని సమాళించుకోడానికాఅన్నట్లు ముఖం ప్రక్కకు త్రిప్పింది.

"వదినా, నీవిక్కడ ఉండకతప్పదు. నీకింతకంటె ముఖ్యమైన ఆ ప్తబంధువు లెవరూ లేరు, నీవు సహజంగా నీ సఖిని నీ పర్యవేక్షణలో ఉంచుకొనగలవు. నీవు విడిచిపెట్టి వెళ్ళేలాగుంటే, నాకు వేరేమార్గం కనిపించడంలేదు." అని ఆవేశంతో అన్నాడు బిహారి.

వినోదిని:— బిహారీబాబూ, నీకు ప్రాపంచిక విషయాలు బాగా తెలుసు. నేను శాశ్వతంగా ఇక్కడెలా ఉండగలను? లోకులేమంటారు?

బిహారి:—లోకులు ఏమయినా అననీ, నీవు మనసులో ఉంచుకోవద్దు. నీవొక దేవీరూపిణివి. సహాయంలేని ఆఅమాయకురాలిని ఈ సాంసారిక బాధలనుండి నీవు ఉద్ధరించాలి, ఇది నీ కర్తవ్యం. వదినా, నేను మొదట నిన్ను గుర్తించలేదు; ఇందుకు నన్ను క్షమించాలి. నేనుకూడా ఇతర సంకీర్ణ హృదయులవలె నిన్ను సందేహదృష్టితో చూచాను—నీవు ఆశ సుఖాల్ని చూడలేవని—ఆమెను ద్వేషిస్తావనీ ఒకప్పుడు భావించాను. నాల్కతో ఉచ్చరింపకూడని పాపపు మాటలకు మనస్సులో స్థానాన్ని ఇవ్వడంకూడా అన్యాయమే. తర్వాత ఆదినం నీ పవిత్రహృదయ పరిచయం నాకు లభించింది. నాకు నీమీద భక్తిశ్రద్ధలు కలిగాయి; ఈకారణంచేత నీఎదుట నా అపరాధాన్ని స్వీకరించకుండా ఉండలేకపోతున్నాను.

వినోదినివల్ల గగుర్పొడిచింది. ఆమె బిహారి విషయంలో కపటంగా ప్రవర్తిస్తున్నప్పటికీ, బిహారి అర్పించిన ఈ భక్తి కానుకను నిరాకరించలేకపోయింది. ఆమెకు అతడి సత్యసంధతలో, పవిత్రతలో, ఆవంతకూడా సందేహం కనిపించలేదు. ఇలాంటి వస్తువును ఆమె ఎప్పుడూ ఎవరివల్లనూ పొందలేదు. వాస్తవంగా తాను ఉన్నతమైన పవిత్రహృదయం కలదాననని ఒక్క గడియలో తెలుసుకొంది. ఆమెకు ఒక్కసారిగా ఆశ మీాద దయకలిగింది. కళ్ళనుండి భాష్పకణాలు రాలాయి. ఆ కన్నీటిని బిహారి చూడకుండా దాచడానికి ప్రయత్నించ లేదు. ఆ అశ్రుధారల్ని భక్తిశ్రద్ధలు చూపవలసిన ఒక యోగ్యవస్తువుగా భావించింది. ఒక విధమైన మోహానుభూతితో పరవశత్వాన్ని పొందింది.

వినోదిని దుఃఖించడంచూచి బిహారి తన అశ్రువేగాన్ని ఆపుకొంటూ లేచి మహేంద్రుని గదివైపు వెళ్ళాడు. బిహారికి ఇంతవరకు మహేంద్రుడు-'నేను కపటిని, నేను నీచుణ్ణి' అన్న మాటల భావం బోధపడలేదు. మహేంద్రుడు కూర్చొనే గదిలోకివెళ్ళితే అతడక్కడలేడు. బయట ఎక్కడో తిరగడానికి వెళ్ళాడనే సమాచారం తెలిసింది. ఇదివరకెన్నడూ మహేంద్రుడు అకారణంగా బయటికి వెళ్ళేవాడుకాదు. బాగా పరిచితమైన ఇంటిని, మనుష్యుల్ని విడిచిపెట్టి బయటికి వెళ్లడం అతడికి బాధ కలిగించేది. బిహారి ఆలోచిస్తూ తిన్నగా తనయింటికి వెళ్లాడు.

వినోదిని ఆశను తన గదిలోకిపిల్చి, హృదయానికి హత్తు కొని, అశ్రుధారలు ప్రవహిస్తూవుండగా "సోదరీ, చున్నీ, నేను చాలా దుష్టురాలను! రాక్షసిని!" అన్నది.

ఆశ వ్యాకులంతో ఆమెను గట్టిగా కౌగలించుకొని, స్నేహపూర్ణమైన స్వరంతో "అక్కా, యెందుకిలా అంటు న్నావు?" అన్నది.

పెద్దపెట్టున ఏడవడానికి సిద్ధంగావున్న బాలునిలాగా వినోదిని ఆశ ఒడిలో పడుకొని "నేను ఉన్న ప్రతిచోటకూడా చెడుగుతప్ప మంచి వుండదు. నన్ను వెళ్ళనీ అమ్మా, నేను పోయి నా అడవిలోనే ఉంటాను." అన్నది.

ఆశ ప్రేమతో ఆమె గడ్డంపట్టుకొని తలఎత్తి "అక్కా, అలా మాట్లాడవద్దు; నీవు లేకుండా నేను ఉండలేను." అన్నది.

ఇక్కడ మహేంద్రుడు కనిపించకపోవడంచేత బిహారి 'ఏదో పని పెట్టుకొని వినోదినివద్దకువెళ్ళి ఆశా మహేంద్రులకు బాధ కలిగించిన విషయం యేమిటో వివరంగా తెలుసు కొనడం మంచిది.' అనుకొన్నాడు.

'రేపు నాయింట మహేంద్రునికి విందుచేస్తాను, దయ యుంచి తప్పక రావలసిందని అతనితోచెప్పాలి—అని వినో దినితో అంటాను.' అని ఆలోచించి, తిరిగి వినోదినివద్దకు బయలుదేరాడు.

వినోదినివున్న గది గుమ్మంవద్దకువెళ్లి "పెద్దవదినా!" అని పిలిచాడు.

అతడు పిలుస్తూవుండగానే లాంపువెలుగులో చెలికత్తె లిద్దరు ఒకరినొకరు గాఢంగా కౌగలించుకొనడమూ, వారి కళ్ళనుండి అశ్రుధారలు ప్రవహించడమూ కనిపించాయి.

'బిహారి కఠినంగా మాట్లాడడమో, మర్యాద హీనంగా ప్రవర్తించడమో జరిగివుంటుంది. ఆమె వెళ్ళిపోతానని మళ్ళీ చెప్పడానికి ఇదేకారణంకావచ్చు. బిహారిబాబు ఈవిషయంలో చాల అన్యాయం చేస్తున్నాడు, అతడు నిర్మలహృదయుడు కాడు.' అనుకొంది ఆశ.

ఇలా అకారణంగా బిహారిమీద కలిగిన కోపంతో ఆమె అక్కడినుండి వెళ్ళిపోయింది.

బిహారికూడా వినోదినిమీద తనకున్న భక్తిప్రమాణాన్ని మరింత యెక్కువచేసుకొని గద్గదహృదయుడై యింటికి వెళ్ళిపోయాడు.

ఆనాటిరాత్రి మహేంద్రుడు ఆశతో—"చున్నీ, నేను రేపుప్రుదయం ప్యాసింజరుబండిలో కాశికి వెళ్ళుతాను." అన్నాడు.

ఆశకు గుండెల్లో రైళ్ళు పరుగెత్తసాగాయి; ఆమె భయంతో "ఎందుకు?" అని అడిగింది.

మహేం:— చాలాదినాలనుండి పిన్నమ్మను చూడలేదు, ఆమెను చూచివస్తాను.

ఇదివిని ఆశ సిగ్గుపడింది. ఈవిషయం ఆమెకే ముందుగా జ్ఞాపకంరావలసింది. ఆమె సుఖదుఃఖ జంజాటంలో పడి తనను ప్రేమించే పిన్నమ్మను మరచిపోయింది. మహేంద్రుడు

ప్రవాసంలోనున్న ఆ తపస్వినిని మరవలేదు—ఇలా అనుకొని ఆశ తన కఠినహృదయాన్ని నిందించుకొంది.

మహేం:— ఆమె తనజీవన సర్వస్వాన్ని నాకు వప్ప గించి పోయింది. ఆమెనొకసారి చూడడానికి నా హృదయం తొందరపడుతున్నది.

ఇలా అంటూవుండగా మహేంద్రుని కంఠం డగ్గుత్తిక పడింది. స్నేహపూర్ణమైన మూక ఆశీర్వాదంతోను, వ్యక్తం కాని శుభాకాంక్షలతోను అతడు ఆశ శిరస్సుమీద తన దక్షిణహస్తంతో మెల్లిమెల్లిగా నిమురడం మొదలుపెట్టాడు. ఒక్కసారిగా పెల్లుబికిన ఈ ప్రేమవిశ్వాసపు మర్మాన్ని ఆశ ఎంతమాత్రం గ్రహించలేకపోయింది; ఆమె కళ్ళనుండి ముత్యాలవంటి అశ్రుబిందువులు మాత్రం రాలుతున్నాయి. ఈ సాయంకాలం వినోదినికూడా తనయెడల ఇదేవిధంగా అత్యంత ప్రేమాదరణలు చూపింది. అనురాగ గద్గదమైన ఆమె మాటలుకూడ ఆశకిప్పుడు జ్ఞాపకంవచ్చాయి. కాని, మహేంద్రు డిలా మాట్లాడినదానికి, వినోదిని మాట్లాడినదానికి యేమ యినా సంబంధం వున్నదేమో ఆశకు అర్థంకాలేదు. కాని తనజీవితంలో ఇదొక క్రొత్తసూచన దొరికిందనిమాత్రం ఆమె తెలుసుకొంది. ఈసూచనఫలితం మంచిదో, చెడ్డదో ఎవరికెలా తెలుస్తుంది?

ఒకవిధమైన భయంతో ఆమెహృదయం వ్యాకుల పడింది, ఆమె రెండు చేతుల్తో మహేంద్రుని కౌగలించుకొంది. ఆశ అకారణ అనుమానం మహేంద్రుని యెదుట దాగలేదు.

"చున్నీ, పుణ్యాత్మురాలగు నీపినతల్లి ఆశీర్వాదం, ఆమె శుభకరమైన హస్తంలాగా నీమస్తకం మీాదవుంది. నీకు ఏవిధమైన భయమూలేదు. ఆమె నీసౌఖ్యంకొరకు తనసర్వస్వాన్ని త్యజించి వెళ్ళిపోయింది. నీకెంతమాత్రం కీడుజరుగదు." అన్నాడు మహేంద్రుడు.

ఆశ తన హృదయాన్ని దృఢపరచుకొని అన్ని సందేహాలు, భయాలు పోగొట్టుకొంది. ఆమె తనపతి ఇచ్చిన ఈ ఆశీర్వాదాన్ని అభేద్యకవచంలాగా ధరించింది. మనస్సులోనే ప్రణామంచేసి—'పిన్నమ్మా, నీ ఆశీర్వాద బలంచేత నాపతి దేవునికి శుభములు చేకూరుగాక.' అనుకొన్నది.

ఆ మరుసటి దినమే మహేంద్రుడు వెళ్ళిపోయాడు. వినోదినితో చెప్పలేదు.'తానే అన్యాయంచేశాడు, పైగా తానే కోపం వహించాడు; ఇలాంటి సాధుపురుషుణ్ణి నేనింతవరకు చూడలేదు! ఐతే ఇలాంటి సాధుత్వం కలకాలం నిలువలేదు.' అని తనలో అనుకొంది వినోదిని.

# 22

సంసార బంధాలనుండి విడివడి దైవప్రార్థన చేసుకొంటున్న అన్నపూర్ణ ఒక దినం కూలీ నెత్తిన సామాను పెట్టుకొని మహేంద్రుడు వస్తూవుండగా చూచింది. మహేంద్రుని చూడగానే ఆమె హృదయం ప్రేమతో నిండిపోయింది.

వెంటనే ఆశకొరకు తల్లితో పోట్లాడి ఆ ఫిర్యాదుతో నావల్ల సాంత్వన పొందడానికి వస్తున్నాడేమోననే భయంకూడా కలిగింది.

మహేంద్రుడు మొదటినుండికూడా ఏ విధమైన కష్టం కలిగినా వెంటనే పినతల్లివద్దకు పరుగెత్తుకొంటూ వచ్చేవాడు. అతడు యెవరితో పోట్లాడివచ్చినా శాంతపరచి పంపేది. దుఃఖంతో వస్తే సహనాన్ని ప్రబోధించేది. కాని అతడి వివాహమైన తర్వాత తను శాంతపరచలేనంత, ఓదార్చలేనంత కష్టం మహేంద్రుని జీవితంలో సంభవించింది. ఆ సంబంధంలో ఆమె ఏ భావంతో, ఏ వైపునుండి చేయిపెట్టినా చెడుగుతప్ప మంచిఫలితం కలిగేలాగాలేదు—పోట్లాటలు తొలగకపోగా ఎక్కువైపోయేలాగా కనిపించింది; వెంటనే తన చేతిని ఉపసంహరించుకొని సంసారంనుండి తొలగిపోయింది. డాక్టరు వ్యాధిపీడితుడైన బిడ్డకు నీరు ఇవ్వవద్దని చెప్పినప్పుడు, బిడ్డ నీరు ఇవ్వమని ఏడ్చేసమయంలో తల్లి దుఃఖంతో అచ్చటినుండి వెళ్ళిపోతుంది. సరిగ్గా అదే పరిస్థితుల్లో అన్నపూర్ణ ఇల్లు విడిచి కాశీకి వెళ్ళిపోయింది.

'ఇంతదూరం పుణ్యక్షేత్రవాసం చేయడానికి వచ్చి సత్కర్మల ననుష్టిస్తూ భగవద్భజనలో మునిగివున్నాను. సంసారబాధ లన్నింటినీ మరచిపోయాను; ఇప్పుడు మహేంద్రుడు మళ్ళీ ఆ సంసార చిక్కుల్లోకి లాగి మానిపోయిన, గాయాన్ని రేపడానికి వచ్చాడా?' అనిపించిందామెకు.

కాని ఆమె భావన వ్యర్థమైంది. మహేంద్రుడు తల్లితో పోట్లాడి భార్యపక్షం వహించి పినతల్లివద్ద ఫిర్యాదుచేయలేదు. 'ఆశను విడిచిపెట్టి కాలేజీకికూడా వెళ్ళజాలని మహేంద్రుడు ఆమెను విడిచి ఇంతదూరం నన్ను చూడడానికి ఎలావచ్చాడు? ఆశా మహేంద్రుల మనస్సులు కలియడంలేదా? వారి ప్రేమ బంధాలు సళ్ళిపోయినవా?' అని వేరొక చింతకూడా ఆమెను పీడిస్తూవుంది.

"ఏంరా మహేంద్రా, చున్నీ బాగావుందా? ఉన్న దున్నట్లుచెప్పు, నామీద ఒట్టుసుమా!" అని భయపూర్వకంగా అడిగింది అన్నపూర్ణ.

మహేం:— నీ చున్నీ హాయిగావుంది.

అన్నపూర్ణ:— చున్నీ ఏవిధంగా వుంటున్నది? మీరు వెనుకటిలాగానే పిల్లచేష్టలతో కాలంవెళ్ళదీస్తున్నారా లేక ఇంటిపనులు చూచుకొంటున్నారా?

మహేం:— పిల్లచేష్టలు ఒక్కసారిగా అదృశ్యమై పోయినాయి! ఇన్నితగాదాలకు మూలమైన ఆ 'శిక్షావళి' ఏమయిందో తెలీదు. స్త్రీలు విద్యాభ్యాసం విషయంలో ఎంత నిర్లక్ష్యాన్ని చూపాలో చూపుతారో నీవుంటే చూచి ఆనం దించేదానివే. ఆమెకు చదువెంతమాత్రం అంటలేదు.

అన్నపూర్ణ:— మహేంద్రా, బిహారి ఏమిచేస్తున్నాడు?

మహేం:— స్వంతపని తప్ప మిగత అన్నిపనులు చేస్తున్నాడు. తన గుమాస్తాలు, ప్రతినిధులు తనపని చూస్తూం టారు, కాని ఏ దృష్టితో చూస్తారో నేను చెప్పలేను. బిహారీ

స్థితి ఎప్పుడూ ఇంతే, వాడి స్వంతపనులు ఇతరులు చేస్తుంటారు వాడేమో ఇతరులపనుల్లో మగ్నమై వుంటాడు.

అన్నపూర్ణ:— సరే, వాడు వివాహం చేసుకోడా?

మహేంద్రుడు నవ్వి —“ఏమో, వాడా ప్రయత్నంలో లేడు.” అన్నాడు.

ఈవిషయం అన్నపూర్ణకు బాధ కలిగించింది. చున్నీని చూచి, మంచి ఉత్సాహంతో వివాహం చేసుకొనవలెనని ఉబలాటపడ్డాడు బిహారి. కాని ఆకస్మికంగా అతనిఉత్సాహాన్ని భంగంచేయడం జరిగింది. బిహారి ఆసమయంలో—“పినమ్మా, ఇకనాకు వివాహం చేసుకోమని చెప్పవద్దు.” అన్నాడు వ్యథా పూర్వకంగా. బిహారి అనిన ఆమాటలు అన్నపూర్ణకు జ్ఞాపకం వచ్చాయి. ఆమె ప్రియపుత్రునితో సమానుడైన బిహారిని ఆ స్థితిలో వదిలి వచ్చివేసింది—నిరాశతో భగ్నమైన అతని హృదయాన్ని ఓదార్చలేకపోయింది. ‘బిహారి యింతవరకు ఆశను మరువలేదా’అని పెద్దచింతతో—భయంతో ఆలోచింప సాగింది.

మహేంద్రుడు ఒకప్పుడు నవ్వుతూ మరొకప్పుడు గాంభీర్యాన్ని ప్రకటిస్తూ తనవిషయంలో ఆశ విషయంలో చాలా సంగతులు చెప్పాడు. వినోదిని విషయంలో యేమీ ప్రస్తావించలేదు.

ప్రస్తుతం కాలేజి తెరచివుంది. చదువుపోగొట్టుకొని కాశీకి వచ్చాడు మహేంద్రుడు; అందుచేత అతడిక్కడ చాలా రోజులు ఉండలేక పోయాడు. ఐతే రోగంతో చాలారోజులు

మంచానపడ్డమీదట ఆరోగ్యాన్ని వృద్ధిచేసే మంచిగాలి, మంచినీరు లభించేచోటవుంటూ, ఆరోగ్యం పొందడంవల్ల ఏసుఖం కలుగుతుందో, అలాంటి సుఖం అతనికి కాశీలో తన పినతల్లివద్ద లభిస్తూవుంది. ఇందుచేతనే ఒక్కటొక్కటిగా చాలారోజులు గడిచిపోయాయి. అతడి మనోబుద్ధుల మధ్య ఏర్పడిన విరోధభావం సమసిపోయింది. చాల రోజులవరకు ధర్మపరాయణ యగు పినతల్లియొక్క పవిత్రమూర్తిని చూస్తూ, ఆమె శాంతి పూర్వకమైన వాక్కులు వినడంచేత మహేంద్రుని కి ప్రపంచకర్తవ్యాలను పాలించడం అతిసహజంగాను, సుఖపూర్వకంగాను కనిపించింది. అతనిమనసులో ఒకవిధమైన ఆటంకంగా పరిణమించిన ఒక విషయాన్ని ఆలోచించి నవ్వుకొన్నాడు.—'వినోదిని విషయం ఏమంత గొప్పదికాదు.' అనుకొన్నాడు. తన మనోముకురంలో వినోదిని నీడకూడా స్పష్టంగా కనిపించడంలేదు. చివరికి మహేంద్రుడు ఎంతో దృఢభావంతో 'నాహృదయంలో ఆశ ఉన్నటిస్థానం నుంచి ఆమెను వెంట్రుకవాసికూడా తొలగించగలమనిషి ప్రపంచంలో ఎవ్వరూలేరు.' అనుకొన్నాడు.

"పిన్నమ్మా, చదువునష్టమౌతున్నది, వెళ్ళడానికి ఆజ్ఞయివ్వాలి. వీలుంటేతిరిగి ఎప్పుడైనావచ్చి దర్శనం చేసుకొంటాను." అన్నాడు మహేంద్రుడు అన్నపూర్ణతో.

మహేంద్రుడు ఇంటికివచ్చి తనపినతల్లి ప్రేమపూర్వకంగా ఇచ్చిన కానుకలు—కుంకుమబరిణ, గాజులజత—ఆశకు ఇవ్వగానే ఆమెకళ్ళనుండి జలజలా అశ్రువులు రాలసాగాయి.

తన పినతల్లియొక్క ప్రేమపూర్వకమైన ధైర్యమూ, తన కారణంగాను, తనఅత్తగారి కారణంగాను ఆమెకు సంభవిల్లిన ఆపదలూ స్మరణకు రావశంచేత ఆమెహృదయం చాల సంతాపపడింది. కళ్లవెంట అశ్రువులు బలబలకారసాగాయి. "నేను కూడా ఒకసారి నా పిన్నమ్మను చూచిరావాలని కోరికగావుంది." అన్నది ఆశ తనభర్తతో.

మహేంద్రునికి ఆశ హృదయాంతర్గతమైన వేదన అర్థమయింది. కొన్నిదినాలపాటు ఆమెను తన పినతల్లివద్దకు పంపడానికి అంగీకరించాడు; కాని, తన కాలేజిచదువు మరొకసారి నష్టపెట్టుకొని కాశీలో విడిచిపెట్టిరావడానికిమాత్రం అతడు మాట ఇవ్వలేకపోయాడు.

ఆశ:— మా పెదతండ్రిగారు కూడా కాశీకి వెళ్ళుతారట, వారివెంట వెళ్ళడం మంచిదికాదూ?

"అమ్మా, చున్నీ తనపినతల్లిని చూడడానికి కాశీకి వెళ్లుతుందట." అని తల్లివద్దకువెళ్ళి అన్నాడు మహేంద్రుడు.

"కోడలు వెళ్ళదలచుకొంటే ఇక తప్పేదేముంది! వెళ్లు, దాన్ని తీసికెళ్ళు." అని దెప్పిపొడుపుగా అన్నది రాజలక్ష్మి.

కొడుకు మళ్ళీ పినతల్లివద్దకు రాకపోకలు ప్రారంభించడం ఆమెకు బాగాలేదు. కోడలుకూడా వెళ్లుతుందని వినగానే లోలోపల ఇంకా కుళ్లిపోయింది.

మహేం:— నేను కాలేజికి వెళ్ళవలసివుంది, నేను తీసుకొని వెళ్ళడానికి వీలులేదు, ఆమె తన పెదతండ్రివెంట వెళ్ళుతుంది.

రాజలక్ష్మి:— ఇది ఇంకా మంచిమాట. వారు చాలా గొప్పవారు. మనలాంటి బీదలమార్గంలోకి వారుమాత్రంరారు. వారివెంట వెళ్ళడంవల్ల మనగౌరవం వృద్ధిపొందుతుందికూడా.

ఇలాంటి వ్యంగ్య సంభాషణలతో మహేంద్రుని మనస్సు ఇంకా కాఠిన్యం వహించడంచేత అక్కడినుంచి వెళ్ళిపోయాడు. అతడేమీ జవాబు చెప్పలేదు; తనమనసులో ఆశను కాశీకి పంపడానికి నిశ్చయంచేసుకొని వెళ్లిపోయాడు.

తర్వాత బిహారి రాజలక్ష్మివద్దకు వచ్చాడు. ఆమె బిహారితో—"బిహారీ, విన్నావా, కోడలు కాశీకి వెంచేయడానికి నిర్ణయించుకొంది." అన్నది రాజలక్ష్మి.

బిహారి:— ఏమిటి? మహేంద్రుడు చదువు పాడుచేసుకొని మళ్ళీ కాశీకి వెళ్ళుతాడా?

రాజలక్ష్మి:— లేదు లేదు, వాడెందుకు వెడతాడు? వాడు వెడితే బూబుఘాషన్‌కు జయజయధ్వానాలెలాలభిస్తాయి? వాడు ఇక్కడేఉంటాడు. వాడిభార్య పెదతండ్రితోపాటు కాశీకి వెళ్ళుతుంది. ఈకాలపు మగవాళ్ళు, ఆడవాళ్ళు 'దొరలు' 'దొరసానులు' అయికూర్చొన్నారు!"

బిహారి లోలోపల భయపడ్డాడు. ఈ కాలపు దొరలు దొరసానుల విషయంలో అతనికి భయం కలుగలేదు. ఈ వ్యవహారం ఏమిటా అని ఆలోచిస్తున్నాడు. మహేంద్రుడు కాశీకి వెళ్ళినప్పుడు ఆశ ఇక్కడే వుంది. అతడు ఇంటికి రాగానే యీామె కాశీకి తయారయింది! వీరిద్దరిమధ్య యేదో పెద్ద వ్యవహారం జరిగింది. ఈ విధంగా ఎన్నాళ్లు గడుస్తుంది?

మిత్రుణ్ణిఅయి వుండికూడా ఇందుకు తగిన మార్గం కనిపెట్టే యోగ్యతలేదా! నేను చూస్తూకూడా దూరంగా వుండవలసినదేనా? ఎంత అసమర్ధుణ్ణి? అని తనను నిందించుకొన్నాడు.

నేడు తల్లి వ్యవహరించిన పద్ధతి మహేంద్రునికి చాలా బాధ కలిగించింది. అతడు తన పడకటింటిలోకి వచ్చి కూర్చొన్నాడు. ఈ మధ్య వినోదిని మహేంద్రునివద్దకు రాలేదు. ఈ కారణంచేత దగ్గరగావున్న గదిగుండా అమెను మహేంద్రునివద్దకు తీసుకొని వెళ్ళడానికి ప్రయత్నిస్తూ వుంది ఆశ.

ఇదే సమయంలో బిహారివచ్చి "వదినగారు కాశీకి వెళ్ళడం నిర్ణయ మైపోయిందా?" అని మహేంద్రుని అడిగాడు.

మహేం:— అవును, దానికి ఆటంక మేముంది?

బిహారి:— ఆటంకం ఎవరు చెబుతారు? కాని అదాటుగా యీ ఆలోచన ఎందుకు కలిగింది?

మహేం:— పిన్నమ్మను చూడాలనే కోరిక, ప్రవాసంలో వున్న ఆత్మీయురాలిని చూడవలెననే ఆతురత! ఇందులో విచిత్ర మేముంది?

బిహారి:— వెంట నీవుకూడా వెళ్ళుతున్నావా?

ప్రశ్న వినగానే అర్థమయింది. పెదతండ్రి వెంట ఆశను పంపడం ఉచితం కాదని చెప్పడానికే వచ్చాడు బిహారి. ఎక్కువగా మాట్లాడడంవల్ల క్రోధావేశాలు పెరుగుతాయనే భయంతో "లేదు" అని ముక్తసరిగా సమాధానం చెప్పాడు మహేంద్రుడు.

మహేంద్రుని తత్వం బిహారికి బాగా తెలుసు. అతడు లోలోపల కోపపడుతున్నాడనే విషయం బిహారి తెలుసుకోన లేకపోలేదు. మహేంద్రుడు చేయదలచుకొన్న పనిని చేయ కుండా మానేవాడుకాడని, చేసేతీరుతాడనికూడా తెలుసు—అతడి హృదయాన్ని మార్పుచేయడం సామాన్య విషయం కాదు. ఇందుచేతనే అతడు మహేంద్రుని వెళ్ళమని చెప్పేవిష యంలో మరేమీ మాట్లాడలేదు. 'పాపం ఆశ ఏదయినా దుఃఖంచేత కాశీకి వెళ్ళుతున్నట్లయితే ఆమె వెంట వినోదిని కూడా వెళ్ళితే ఆమెకు కొంచెం ధైర్యంగా వుంటుంది' అను కొని "సరే, ఆశవెంట వినోదినికూడా వెళ్లితే బాగుంటుం దేమో?" అన్నాడు బిహారి.

ఈ మాట వింటూనే మహేంద్రుడు మండిపడుతూ—"బిహారీ, నీమనసులోమాట బహిరంగంగా ఎందుకు చెప్పవు? నావద్ద మోసంగా కపటంగా ప్రవర్తించవలసిన అవసరం ఏముంది? నేను వినోదినిని ప్రేమిస్తున్నానని నీవుభావిస్తున్నావు. ఇది అబద్ధం. నేనామె నెన్నడూ ప్రేమించడంలేదు. నారక్షణ కొరకు నీవు పహరా ఇవ్వవలసిన పనిలేదు. ముందు నిన్ను నీవు రక్షించుకో, వెళ్ళు. నీకు నామీద నిజమైన మిత్రభావం వుంటే నీ మనసులోని విషయం చక్కగా చెప్పేవాడవు; అదీ గాక నా అంతఃపురంలోకి ఇంత స్వేచ్ఛగా రావడం ఎప్పుడో మానుకొనేవాడవు. నేను నీ ముఖంముందు స్పష్టంగా చెప్తు తున్నాను, నీవు ఆశను ప్రేమిస్తున్నావు." అని పెద్దగా అరిచాడు.

బాధ పెడుతున్న కాలును మరొకడు త్రొక్కినప్పుడు, వెంటనే ఒక్క దెబ్బవేసి వాణ్ణి తొలగించడానికి ప్రయత్ని స్తాము. అలాగే కుర్చీలోనుంచి లేచి మహేంద్రునిమీదికి దూకాడు బిహారి—ఐతే వెంటనే సమాళించుకొని అగాడు. అప్పుడు అతనిస్థితి చాలా విచిత్రంగా వుంది. క్రోధావేగాన్ని ఆపుకొనడంతో కళ్ళలో గిర్రున నీళ్ళు నిండాయి, దుఃఖంతో అతని ముఖం మలమల మాడిపోయింది.

"ఈశ్వరుడు నిన్ను క్షమించుగాక, నేను వెళ్ళు తున్నాను" అని చాలా కష్టంతో బిహారి బయటికి వెళ్ళాడు. మహేంద్రుని గదిప్రక్కనే వున్న వేరొక గదిలో వుంది వినోదిని. అక్కడే ఆశకూడా ఉంది. వినోదిని వెంటనే బయ టికి వచ్చి—"బిహారీబాబూ!" అని పిలిచింది.

బిహారి గోడకు ఆనుకొని నిలబడి, చిన్నగా నవ్వడానికి ప్రయత్నిస్తూ "ఏం పెద్దవదినా!" అన్నాడు.

వినోదిని:— బిహారిబాబూ, 'కంటి మెరమెర'తో నేనుకూడా కాశీకి వెళ్ళుతాను.

బిహారి:— లేదు పెద్దవదినా, అలా జరుగ వీలులేదు. ఎంతమాత్రం అలా జరుగజాలదు. నేను నీకు నమస్కారం చేస్తున్నాను—నా మాటమీద నీ వేపని చేయవద్దు. నాకు ఇక్కడ యే సంబంధమూలేదు. నేనిక్కడి విషయాల్లో ప్రవే శించదలచుకోలేదు. నేను ప్రవేశించానా అది నాశనమే అవు తుంది. నీవు దేవివి, నీకేది ఉచితమనితోస్తే అదే చెయ్యి. నేను వెళ్ళుతున్నాను.

ఇలాఅని బిహారి ముందుకు సాగాడు. "బిహారీబాబూ, నేను చెవినికాను, కొంచెం విని వెళ్లండి. మీరు వెళ్లినందువల్ల యెవరికీ మంచి జరుగదు; తర్వాత నన్ను దూషింపవద్దు." అన్నది వినోదిని.

బిహారి వెళ్ళనే వెళ్ళాడు, మహేంద్రుడు తనగదిలో కూర్చొన్నాడు.

వినోదిని మహేంద్రునివైపు వజ్రకఠోరమైన - నిప్పులు గ్రక్కుతున్న దృష్టి బాణాల్ని ప్రయోగించి, తన గదిలోకి వెళ్లిపోయింది. ఆ గదిలో ఆశ లజ్జచేత అభిమానంచేత చచ్చి పోతూ వుంది. తన్ను బిహారీ ప్రేమిస్తున్నాడనేమాట మహేంద్రుని నోటినుండి వినబడడంచేత తల పైకి ఎత్తలేకపోయింది. ఆమె స్థితి చూచి వినోదినికి కొంచెంకూడా దయ కలుగలేదు. ఆ సమయంలో ఆశ తలఎత్తి వినోదినివైపు చూచివుంటే తప్పక భయపడిపోయేది. వినోదిని శరీరంలోని రక్తం వేడిమి వహించింది—'అసత్యం, నన్నెవ్వరూ ప్రేమించడంలేదు, మరి యీ అమాయక పిల్లను అందరూ ప్రేమిస్తున్నారు.' అని తనలో అనుకొన్నది వినోదిని.

మహేంద్రుడు మొదట ఆవేశంతో ఒకరోజు బిహారితో "నేను పాతకుడను, నీచుడను" అన్నాడు. కాని బుద్ధి కుదుట పడగానే తన మానసిక దుర్బలత్వం బిహారిముందు బయట పడడంచేత అతనికి చాలా దుఃఖం కలిగింది. అతని విషయా లన్నీ బయట పడిపోయినట్లు భావించాడు. మహేంద్రుడు వినోదినిని ప్రేమించడంలేదు; కాని అతడు ప్రేమిస్తున్నాడని

బిహారీ అనుకొంటున్నాడు. అందుచేత బిహారీమీద అతడు మండిపడ్డాడు. బిహారి తన ఎదుటికి వచ్చినప్పుడంతా తన హృదయంలోని విషయాలను తెలుసుకొనడానికి అతడెంతో కుతూహలంతో యత్నిస్తున్నాడని మహేంద్రునికి అనిపిస్తూ వుంది. లోలోపల ద్వేషాగ్ని ప్రజ్వలిస్తూ వుంది—నేడది కొంచెం దెబ్బ తగులగానే భగ్గుమంది.

కాని వినోదిని ఎంతో వ్యాకులంతో ప్రక్కగదినుండి పరుగెత్తింది, ఎంతో ప్రార్థనాపూర్వకంగా బిహారిని వెళ్ళ వద్దని ప్రాధేయపడింది, పైగా బిహారిమాట నిలబెట్టడానికి చున్నీతోకూడా కాశీ వెళ్ళడానికి తయారయింది.

ఇలా జరుగుతుందని మహేంద్రుడు వూహింపనుకూడా లేదు. ఈదృశ్యం మహేంద్రుని హృదయాన్ని తీవ్రంగా గాయపరచింది. ఆబాధతో అతడు విహ్వలుడైపోయాడు. మహేంద్రుడు నేను వినోదినిని ప్రేమించడంలేదని బిహారితో చెప్పాడు; కాని ఇప్పుడతడు చూచినదాన్నిబట్టి, విన్నదాన్ని బట్టి, అతడన్నమాట నిలబడేలాగాలేదు. వినోదిని చెప్పిన-చేసిన విషయాలనుగురించి ఆలోచించేకొద్దీ మహేంద్రునికి ఇంకా ఇంకా కష్టంకలుగుతూవుంది. 'నేనామెను ప్రేమించడం లేదని వినోదిని నానోటిమీదుగానే విన్నది' అనే భావంకూడా అతని హృదయంలో ప్రవేశించి, నిరర్థకమైన దుఃఖంతో బాధ పడుతున్నాడు మహేంద్రుడు.

# 23

"నేను వినోదినిని ప్రేమించడంలేదు, ఇదిఅసత్యం" అన్నాను. విషయం నిజమేఅయినప్పటికీ కూడా మాట కఠినంగావుంది. నేను ఆమెను ప్రేమించడంలేదు, నిజమే; కాని 'నేను ప్రేమించడంలేదు' అనేమాట చాలా కటువుగా, కఠోరంగావుంది. ఈమాటకు బాధపడని యువతిఎవరు? ఈవిషయం మీద ప్రతివాదంచేసే అవకాశం ఎప్పుడు, ఎక్కడ, ఎలా దొరుకుతుంది? నేను ప్రేమిస్తున్నాననిమాత్రం చెప్పడానికి వీలులేదు, కాని 'ప్రేమించడంలేదు' అనేవిషయాన్ని క్రిందు మీదుచేసి ఆమెకు వ్యధకలుగని విధంగా చెప్పేలాగుంటే బాగుంటుంది. వినోదిని మనస్సులో ఇలాంటి అసత్యవిషయం లేకుండా చేయవలసిన అవసరంఉంది. – అని ఆలోచింప సాగాడు మహేంద్రుడు.

ఇలా ఆలోచించి మెస్‌లో ఉండగా తనకు వ్రాయబడిన మూడు లేఖలను తనపెట్టెలోనుండి బయటికితీసి తిరిగి ఒక్కసారి చదివాడు. 'వినోదిని నన్ను ప్రేమిస్తున్నదనే విషయంలో సందేహంలేదు; కాని నిన్న బిహారివద్దకు ఎందుకు పరుగెత్తుకుంటూ వెళ్ళింది? నామాటలకు కోపంవచ్చి నాకు కోపంవచ్చేలాగా చేయడానికి ఇలాచేసింది. నేనామెను ప్రేమించడంలేదని స్పష్టంగా చెప్పివేసినప్పుడు ఇక నన్ను ఆమెకూడా ప్రేమించదు, ఈ విధంగా నావల్ల అవమానాన్ని

పొందిి, ఆమె బిహారిని ప్రేమిస్తుందంటేకూడా ఆశ్చర్యపడవల సిందేమీ లేదు.' అనుకొన్నాడు.

ఇలా ఆలోచన కలగడంచేత తనచంచలత్వాన్ని చూచుకొని .తనకుతానే విస్మితుడై భయభీతుడయ్యేంత బాధ మహేంద్రుని హృదయంలో కలిగింది.—'నేనామెను ప్రేమించడంలేదని అన్నమాట వినోదిని విన్నదేఅనుకో. ఇందులో దోషమేముంది? నేనామెను ప్రేమించడంలేదని విని, ఆమె నావైపు చూడకపోతే అందువల్ల నాకేమినష్టం?' అనుకొని తుపాను సమయంలో నావకు కట్టివున్నగొలుసు లంగరును లాగి పట్టుకొన్నట్లుగాను, మునిగిపోయేమనిషి తన అందికలోనున్న వస్తువును గట్టిగా పట్టుకొన్నట్లుగాను, మహేంద్రుడు వ్యాకులంతో శక్తికొలది ఆశను తన హృదయంలోకి తీసుకొనడానికి ప్రయత్నంచేశాడు. ఆరాత్రి మహేంద్రుడు ఆశను తనహృదయానికి హత్తుకొని—"చున్నీ, నీవు నన్నెంతగా కోరుతున్నావో, ఎంతగా ప్రేమిస్తున్నావో నిజంచెప్పు." అని అడిగాడు.

'ఇదేమిప్రశ్న? పగలు బిహారిమీద సిగ్గుమాలిన ఆరోపణజరిగింది, ఈప్రశ్నకు కూడా అదే మూలంకాదుకదా? నామీదకూడా సందేహంకలిగిందా?' అనుకొన్నది. ఆమె ప్రాణాలు ఆకాశమార్గాన ఎగిరిపోయినవి.—"ఛీఛీ, నేడిలాంటి ప్రశ్న మెందుకువేశారు? నేను మీకాళ్లమీద పడతాను. నాతో స్పష్టంగా చెప్పండి—మీరు నాప్రేమ విషయంలో ఎన్నడైనా లోపంవున్నట్లు చూచారా?" అన్నది ఆశ.

ఆశ నోటినుండి ఆమె ప్రేమప్రమాణాన్ని పొందవలె ననే వుద్దేశ్యంతో—"అలాగైతే నీవిప్పుడు కాశీకి వెళ్ళడం ఎందుకు?" అన్నాడు మహేంద్రుడు.

"నేను కాశీకి వెళ్ళగోరడంలేదు, నేనెక్కడికీ వెళ్ళను." అని వెంటనే జవాబు చెప్పింది ఆశ.

మహేం:— అప్పుడు నీవు నాతో కాశీకి వెళ్లుతానని చెప్పావుగా?

ఆశకు ఇది చాలా బాధకలించింది.—"నే నెందుకు వెళ్లుతానన్నానో మీరెరుగరా?" అని దీనంగా అన్నది.

మహేం:— నన్ను వదలితే పిన్నమ్మవద్ద ఎక్కువ సుఖంగా ఆనందంగా వుంటావనుకొంటాను!

ఆశ:— అలా ఎన్నడూజరుగదు, నేను సుఖసంతోషాలకొరకు వెళ్ళగోరడం లేదు.

మహేం:— నేను యదార్థం చెపుతున్నాను చున్నీ, నీవు నన్ను గాకుండా మరొకర్ని పెళ్ళాడివుంటే చాలా సౌఖ్యాన్ని పొందగలిగేదానివి.

ఇదివిని పతివ్రతయైన బాలిక ఆశ అభిమానంచేత, బాధ చేత మహేంద్రుని అంకంనుండి తొలగి తనముఖానికి దిండు అడ్డంగా పెట్టుకొని వెక్కివెక్కి ఏడ్వసాగింది. ఆమెను ఓదార్చడానికి తన ఒడిలోకి తీసుకోడానికి ప్రయత్నించాడు మహేంద్రుడు. కాని ఆమె ఆ దిండును విడిచిపెట్టలేదు. పతివ్రతయైన ఆమె అభిమానాన్ని చూచి అతనిహృదయంలో

ఒకవిధమైన సుఖమూ, గర్వమూ, తనప్రవర్తనకు ధికారమూ కూడా కలిగాయి.

లోలోపల ఆభాసరూపంలోవున్న విషయాలు ఒక్కసారిగా స్పష్టంగా బయటపడి అందర్నీ కుపితులయ్యేలాగా చలింపజేశాయి. 'బిహారి ఆశను ప్రేమించడంలేదు, బాగానేవుంది, అయితే మహేంద్రుడు అతడిమీద స్పష్టంగా దోషారోపణం చేసినప్పుడు, బిహారి దానికి ప్రతివాదం ఎందుకు చేయలేదు?' అని వినోదిని ఆలోచించడం మొదలుపెట్టింది.

బిహారి నామమాత్రపు ప్రతివాదం చేసినా వినోదిని సంతోషించేది. 'మహేంద్రుడు బిహారిని దెబ్బకొట్టడం బాగానే వుంది. బిహారి గొప్ప ధర్మబుద్ధిగలవాడు, ఆయన పరస్త్రీమైన ఆశను యెన్నడూ ప్రేమించకపోవచ్చు. కాని – ఆఁ ఈ దెబ్బతో బిహారి దూరమైపోవచ్చు, అదీమంచిదే; నాపీడ వదలింది,' అని మళ్లా అనుకొంది వినోదిని.

ఐతే వినోదిని హృదయంలో అంతర్భూతమైవున్న సేవాపరాయణమైన స్త్రీమూర్తి ఆ ఆర్తుని ముఖాన్ని చూచి ఎంతో వ్యాకులాన్ని పొందింది. ప్రేతాకారంతో కళావిహీనమైపోయిన బిహారిముఖం వినోదినికి ఏవిధంగాకూడా మరపుకు రావడంలేదు; ప్రతిక్షణం ప్రతి పనిలోకూడా తన కళ్ళకు కట్టినట్టు కనబడుతూవుంది. రోగంతోనున్న బాలుని చంకలో పెట్టుకొని ఇంట్లో అటూఇటూ త్రిప్పుతూ సంతోషపెట్టే తల్లిలాగా ఆమె ఆ దుఃఖాతురుని మూర్తిని తన హృదయంలో ఉంచుకొని పనిపాటలు చేసుకొంటూ తిరుగుతూవుంది.

బిహారియొక్క మానసిక బాధల్ని పోగొట్టి అతని సుందర ముఖంలో ఆ గులాబీవర్ణ ప్రకాశాన్ని, ఆ జీవకళను, ఆ చిరు నవ్వును మళ్లీ చూడవలెనని ఆమెకు ఒక తీవ్రమైన కోరిక కలిగింది. తిన్నతిన్నగా ఆకోరిక వృద్ధి పొంది, ధైర్యాన్ని కోల్పోయింది వినోదిని.

మూడు నాలుగు దినాలు ప్రతిక్షణం ఈ విధంగా బాధపడడంచేత ఆమె ఇక నిలువలేకపోయింది. బిహారిని ఓదారుస్తూ ఈ విధంగా ఒకలేఖ వ్రాసింది—

"బిహారీబాబూ, ఆ దినం దుఃఖంతో వున్న మీ ముఖ బింబాన్ని చూచి నాకు చాల కష్టం కలిగింది. అది మొదలు మీ మానసిక కష్టాల్ని పోగొట్టుకోనాలని, వెనుకటిలాగా మీరు ఆనందంగా ఉండాలని నేను కోరుతున్నాను—ఆ స్వహజ హాసరేఖ తిరిగి నేనెప్పుడు చూస్తానో, ఆ ఉదార మధుర సంభాషణల్ని నేనెన్నడు వింటానో – సెలవియ్యండి. మీరెలా వున్నారో రెండు పంక్తులు వ్రాయండి."

ఇట్లు
మీ వినోదిని.

వినోదిని వంటబ్రాహ్మడిద్వారా ఆ జాబును బిహారి ఇంటికి పంపింది.

'బిహారి ఆశను ప్రేమిస్తున్నాడు' అనేమాట, ఈవిధంగా, ఇంత అసహ్యాకరంగా మహేంద్రుడంటాడని బిహారి ఎన్నడూ భావించలేదు; ఎందుకంటే అతడెన్నడు ఈ విషయాన్ని తన

మనస్సులో స్పష్టంగా ఊహించనైనాలేదు. మొదట పిడుగు పాటు తిన్న మనిషిలాగా, రాయిలాగా నిలబడిపోయాడు; వెంటనే క్రోధంతోను అసహ్యవేదనతోను గిలగిల కొట్టు కొంటూ 'అన్యాయం, అసంగతం, ఆధారరహితం' అని గబగబ అనేశాడు. కాని ఒక చెడుమాట బయటికి వచ్చిందీ అంటే ఇక దానికి చావుండదు. దానిలో ఏకొంచెం సత్య మున్నా దాని బీజం చూస్తూచూస్తూ వుండగానే అంకురించ డం ప్రారంభమౌతుంది. బిహారి మహేంద్రునివెంట వధువును చూడడానికి వెళ్ళినప్పుడు ఆ సూర్యాస్తమయ సమయంలో, తోటలో వికసించిన కుసుమాల సుగంధంతో కలిసి వచ్చిన సమీర ప్రవాహంలో, లజ్జా సంకోచాలతో నిండిన బాలిక సుందరవదనాన్ని తనదేననే భావంతో – ఒక్కసారిగా పొంగి వచ్చిన ప్రేమతో–చూచిన ఘట్టమే మాటిమాటికి స్పష్టంగా అతనికి స్ఫురించడం మొదలుపెట్టింది. ఇంతవరకు తనలో అణగివున్న భావం ఇప్పుడు పొంగివచ్చింది. ఇంతవరకు తా నెన్నడూ ఊహించని విషయం మహేంద్రుడు అనడంచేత విశ్వరూపాన్ని ధరించి బిహారి లోపల వెలుపలకూడా నిండి పోయింది.

ఇక బిహారి తన్ను తానే దోషిగా భావించి, 'ఇప్పుడు క్రోధాన్ని ప్రకటించడం బాగాలేదు, ఒక్కసారి మహేం ద్రుని క్షమాపణ కోరి వారియింటికి రాకపోకలు మానివే యడం మంచిది. మహేంద్రుడు దోషియైనట్లూ, నేను విమర్శ కుడనైనట్లూ, వానిమీద కోపంతో వచ్చివేశాను. ఇది చాలా

పొరపాటు — నా యీ తప్పిదాన్ని మహేంద్రుని యెదుట అంగీకరించివస్తాను' అని నిర్ణయించుకొన్నాడు. ఆశ కాశీకి వెళ్ళివుంటుందని బిహారి భావించాడు. ఒక దినం సాయంకాలం అతడు తిన్నతిన్నగా తిరుగుతూ మహేంద్రుని ఇంటి గుమ్మం వద్దకు వచ్చాడు. దీననాథుడు (రాజలక్ష్మికి దూరపుచుట్టం, వరుసకు మేనమామ) వెలుపల కూర్చొని హుక్కా పీలుస్తున్నాడు. అతణ్ణిచూచి బిహారి "అందరు బాగావున్నారా?" అని అడిగాడు.

దీన:— ఆఁ, అంతా బాగానేవున్నారు.

బిహారి:— ఆశ కాశీకి ఎప్పుడు వెళ్ళింది?

దీన:— ఆమె వెళ్ళలేదు, ఇక వెళ్ళదుకూడా.

ఈమాట వినగానే బిహారి పెంకిగుర్రంలాగా ఆటంకాన్ని లక్ష్యంచేయకుండా లోపలికి వెళ్ళడానికి అటు ఇటూ మసలుతున్నాడు. పూర్వం అతడు సహజమైన ఆనందంతో వారిని తనవారుగా భావిస్తూ చకాచకా మెట్లమీదుగా ఎక్కి నిశ్చింతగా లోపలికి వెళ్ళుతూవుండేవాడు — అందరితో నవ్వుతూ తుళ్ళుతూ మాట్లాడేవాడు — యేమాత్రమూ సందేహం కలిగేదికాదు. ఆవిధంగా ఇప్పుడు వెళ్లడంగాని, నవ్వుతూమాట్లాడడంకాని అనుచితంగాను దుర్లభంగాను భావించికూడా. అతడి మనస్సు పిచ్చివానిలాగా ఐపోయింది. ఒక్కసారిగా వెనుకటిలాగానే లోపలికివెళ్ళి, ఇంటిపిల్లవానిలాగానే రాజలక్ష్మితో యేదో సంభాషించడం—మేలిముసుగు ధరించిన ఆశను 'వదినా' అని ఒకటిరెండు ఛలోక్తులు విస

రడం—బిహారికి పరమప్రార్థనీయమైన అప్రాప్యవస్తువులుగా కనిపించాయి.

దీననాథ్:— ఎందుకిక్కడ చీకట్లో నిల్చొన్నావు, లోపలికి పద.

బిహారి కొంతదూరం లోపలికివెళ్ళి మళ్ళీ వెనక్కి వచ్చాడు. "వెళ్ళుతున్నాను, ఒక అవసరమైన పనివుంది. ఇప్పుడు జ్ఞాపకంవచ్చింది." అని దీననాథునితో చెప్పి, త్వర త్వరగా వెళ్ళిపోయాడు.

వినోదిని ఇచ్చిన జాబును తీసుకెళ్ళిన వంటాయన బిహారి ఇంట్లో లేకపోవడంచేత తిరిగితెచ్చాడు. అప్పుడు ద్వారానికి ఎదురుగావున్న పూలతోటలో పచారు చేస్తున్నాడు మహేంద్రుడు.

అతడు వంటాయనను — "ఎవరిదాజాబు?" అని అడిగాడు. వంటాయన అంతా చెప్పివేశాడు. మహేంద్రుడు అతనివద్దనుండి జాబు తీసుకొన్నాడు.

మహేంద్రుడు యీ జాబును తీసుకొని వినోదిని చేతికి ఇద్దామని మొదట ఆలోచించాడు—మరేమీ మాట్లాడకుండా సిగ్గుపడివున్న ఆమె ముఖాన్ని ఒకపర్యాయం చూచి వద్దామని అనుకొన్నాడు. ఈజాబులో వినోదిని సిగ్గుపడవలసిన విష యాలు అనేకమున్నాయని అతడు భావించాడు. ఇదివరకు కూడా ఒకసారి బిహారిపేరుతో ఒకజాబు వెళ్ళినట్లు అతనికి జ్ఞాపకం వచ్చింది. ఈజాబులో యేమి వ్రాయబడి వుందో - తెలుసుకొనకుండా ఉండలేకపోయాడు.—'వినోదిని

నా ఆధీనంలో ఉంది, ఆమె మంచి చెడ్డలయెడల నాకు బాధ్యత ఉంది, కాబట్టి ఇలాంటి సందేహాత్మకమైన లేఖను చూడడమే నా కర్తవ్యం'అని తనకుతానే సమాధానం చెప్పుకొన్నాడు. 'వినోదినిని యెంతమాత్రము దుష్టపథంలో అడుగుపెట్ట నీయను.' అని నిర్ణయించుకొన్నాడు.

ఆ చిన్న లేఖను తెరచి చదివాడు మహేంద్రుడు. అది సహజ స్వభావంతో మృదువైన భాషలో వ్రాయబడివుంది— దానిలో నిజమైన సానుభూతి, వ్యాకులం తేటతెల్లంగా కని పిస్తూవున్నాయి. మహేంద్రుడు దాన్ని చాలాసార్లుచదివి ఆలోచనలో మునిగిపోయాడు. ఎన్నిసార్లో చదివికూడా వినోదిని మనఃప్రవర్తనం ఎలావుందో గమనించలేకపోయాడు. అతడన్న "నేను వినోదినిని ప్రేమించడంలేదు" అనేమాటను జ్ఞాపకానికి తెచ్చుకొని 'ఆమెను అవమానపరిచాను, ఆకారణం చేత ఆమె కళ్లుతో – కోపంతో నావైపువున్న తన దృష్టిని మరొకవంకకు మళ్ళించడానికి ప్రయత్నిస్తూవుం'దని అను కొన్నాడు. ఆమె ఖిన్నురాలై తనమీాది ఆశవదలుకొన్నదని భావించాడు.

ఈ భావం స్ఫురించడంతోటే మహేంద్రుడు ధైర్యాన్ని చిక్కబట్టలేకపోయాడు. తనకుతానే నాముందు ఆత్మార్పణం చేయడానికి వచ్చిన వినోదిని నా క్షణిక మూర్ఖత్వంవల్ల నాచేతినుండి జారిపోతూవుంది — అనే అభి ప్రాయం అతణ్ణి పిచ్చివాణ్ణిచేసింది.

'వినోని తనమనసులో నన్ను ప్రేమిస్తూవుండడం ఆమెకే మంచిది. ఆమె ఒకేస్థానంలో తనమనసు లగ్నంచేసి ఆనందంగా ఉండగలదు. నా మనస్థితి నాకు బాగా తెలుసు. అవసరమైతే నేనెంత నిగ్రహంగానైనా వ్యవహరించగలను. నే నెన్నడు ఆమెవిషయంలో అసభ్యంగా ప్రవర్తించను. ఆమె నిశ్చింతగా నన్ను ప్రేమించవచ్చు. నేను ఆశనే ప్రేమిస్తున్నానుగదా, అందుచేత ఆమె నన్నుగురించి ఎంతమాత్రం భయపడవలసిన అవసరంలేదు. కాని ఆమె మరొకదిక్కుకు కన్నెత్తి చూచిందా, ఆమె సర్వనాశనం అసంభవమేకాదు, పైగా అతి సహజంకూడా.' అని తనలో తాను అకొన్నాడు మహేంద్రుడు.

తనను తాను నైతికపతనాన్నుండి కాపాడుకొంటూ, వినోదినిని మళ్ళా తనవైపుకు ఆకర్షించడమే మంచిదనే నిర్ణయానికివచ్చాడు మహేంద్రుడు.

మార్గంలో నిల్చొని, వినోదిని, ఎవరికోరకో ప్రతీక్షిస్తున్నట్లు— మహేంద్రుడు లోపలికి వెళ్ళగానే కనిపించింది. వెంటనే అతడిహృదయంలో ఈర్ష్యాద్వేషాలు భగభగ మండిపోయి "ఏమండీ, ఇక్కడ వ్యర్థంగా నిల్చొన్నారు, వారు రారు, ఇదిగో మీలేఖ తిరిగివచ్చింది!" అని జాబు వినోదినికి ఇచ్చివేశాడు.

"దీన్ని తెరచిందెవరు?" అన్నది వినోదిని.

అతడు జవాబు చెప్పకనే వెళ్ళిపోయాడు. బిహారియే జాబు తెరచి చదువుకొని ఏ జవాబు ఇవ్వకుండా వాపసు

పంపివుంటాడని భావించింది వినోదిని. ఆమె వళ్ళు భగభగా మండిపోయింది. జాబు తీసికెళ్ళిన వంటాయననుు పిలిపించింది. అతడేదో పనిమీద బైటకు వెళ్ళాడు. మండుతున్న వ త్తి నుండి తైలబిందువులు రాలుతున్నట్లు మూసివున్నగదిలో కూర్చొన్న వినోదిని కళ్ళనుండి జ్వాలామయమైన అశ్రుబిందువులు టప్ టప్ మని రాలుతున్నాయి. వెంటనే ఆమె తన జాబును బలవంతంగా చించి ముక్కలుముక్కలు చేసివేసింది. ఐనప్పటికీ ఆమె హృదయజ్వాల శాంతించలేదు. సిరాతో వ్రాయబడిన ఆ మూడు నాలుగు లైనులు, భూత వ ర్తమాన కాలాల్లో ఒక్కసారిగా చెరిపివేయడానికి-కనుపించకుండాచేయడానికి - ఉపాయాంతరంలేదా? కోపంతో రెచ్చిపోయిన మధుమక్షికం ఎదుటపడ్డ ప్రతివానిని కాటువేస్తుంది. అదేవిధంగా వినోదిని ఆ క్రోధంతో త్రాచులాగా బుసకొడుతూ మహేంద్రుని ఇంటికి నిప్పు ముట్టించి నాశనంచేయడానికి సిద్ధపడింది. ఆమె దేనికి ప్రయత్నించినా విఘ్నం కలుగుతూవుంది. ఏ పనిలోకూడా, ఏవిధంగాకూడా ఆమె సత్ఫలితాన్ని పొందజాలదా? అవును, ఆమెకు సుఖం లభించనప్పుడు తనసుఖాలకు విఘ్నకారకుడైనవాణ్ణి సర్వసుఖాలతో తులదూగనిస్తుందా? అతణ్ణి వోడించి - బాధించి బదులుతీర్చుకొనడం తన వ్యర్థజీవితానికి క ర్తవ్యంగా భావించింది వినోదిని.

# 24

ఫాల్గుణమాసం ప్రవేశించింది, నవవసంతవాయువులు వీచనారంభించాయి. చాలా దినాలు గడిచాక ఇప్పుడు ఆశ మళ్ళీ మేడ పైభాగంలో మంచంమీద కూర్చొని ఒక మాసపత్రికను చేతితో పట్టుకొని దానిలో వరుసగా ప్రకటింప బడుతూవున్న ఒకకథను తదేకధ్యానంతో చదువుతూవుంది. కథానాయకుడు అధికంగా శలవుదినాలు రావడంచేత తన ఇంటికి వెళ్ళుతూవుంటే మార్గమధ్యంలో దొంగలు అతణ్ణి పట్టుకొన్నారు. ఈవాక్యం చదవగానే ఆశ హృదయం గడగడ వణికి పోయింది. మరొక వాక్యంలో 'సరిగ్గా అదేసమయంలో కథానాయకి ఒక దుష్టస్వప్నం రావడంవల్ల ఏడుస్తూ మేలుకొంది.' అనిచదివింది. ఆశ నేత్రాల నుండి అశ్రువులు ప్రవహింపసాగాయి. ఆమె అన్నికథల్నీ చదివి చాలా న్యాయబుద్ధితో వ్యాఖ్యానం చేయడంలో అద్వితీయురాలు. ఆమె చదివే అన్నికథలూ ఆమెకు చాలా మంచివిగానే కనిపిస్తాయి. అప్పుడప్పుడు వినోదినిపిల్చి చదవ మంటూవుంటుంది.—'అక్కా, నామీదఒట్టు. ఈనవల తప్పక చదవాలి. ఇది చాలా మంచినవల. ఇదిచదివితే కళ్ళనీళ్లు వస్తాయి.' ఐతే వినోదిని మంచిచెడ్డల్ని ఆలోచిస్తుంది, గుణ దోషాల్ని వెలికి తీస్తుంది. అందుచేత ఆశ ఉత్సాహానికి భంగం కలుగుతూవుంటుంది.

ఈకథను ఈరోజు మహేంద్రునిచేత చదివించాలని నిర్ణయించుకొంది. పత్రికమూసి అక్కడ పెట్టగానే మహేంద్రుడు వచ్చాడు. అతణ్ణి చూడగానే ఆశ ఆనందపరవశురాలయింది. మహేంద్రుడు వ్యాకులపడి తన వ్యాకులతను దాచుకొనడానికి నవ్వు నటిస్తూ—"ఒంటరిగా ఏభాగ్యశాలిని గురించి ఆలోచిస్తున్నావు?" అన్నాడు.

కథలోని నాయకీ నాయకులను గురించి పూర్తిగా మరచిపోయి "మీ మనస్సు బాగాలేదా?" అని అడిగింది.

మహేం:— బాగానే వుంది.

ఆశ:— ఐతే లోలోపల ఏదో ఆలోచిస్తున్నారే? విషయమేమిటి?

మహేంద్రుడు పాన్‌దానాలోనుండి ఒక ఆకునమలి— "పిన్నమ్మ పాపం నిన్ను ఎన్నిదినాలనుండి చూడలేదోచూడు. ఒక్కసారిగా నీవు ఆమె ఎదుటికి వెళ్ళితే ఆమె ఎంత ఆనందిస్తుందో! ఇదే నా ఆలోచన."అన్నాడు.

ఆశ జవాబు చెప్పకుండా మహేంద్రుని ముఖం నిరీక్షిస్తూవుంది. అతడీవిషయాన్ని తిరిగి ఎందుకు కదిలించాడు, అది ఆమెకర్థం కావడంలేదు.

ఆశ మౌనంగా తనవైపు చూడడంచూచి—"కాశీకి వెళ్ళడానికి నీహృదయం ఆవేదన పడడంలేదా?" అన్నాడు మహేంద్రుడు.

ఈ ప్రశ్నకు జవాబు చెప్పడం చాలా కష్టంగావుంది. పిన్నమ్మను చూడాలనే కోర్కె తేవుంది, కాని మహేంద్రుని విడిచి వెళ్లడానికి మనసొప్పడంలేదు.

ఆశ:— కాలేజీకి శలవులిచ్చి, మీరు రావడానికి వీలున్నప్పుడు మీ వెంట వస్తాను.

మహేం:— శలవుల్లోకూడా నేను రాలేనేమో, పరీక్ష దినాలువచ్చాయి. శలవుల్లోకూడా ఇంటివద్ద చదవవలసి వుంటుంది.

ఆశ:— ఐతే కానివ్వండి, తర్వాతనే చూద్దాము.

మహేం:— అలా వూరుకోవడ మెందుకు? వెళ్ళాలని కోరికవుండికూడా ఎందుకెళ్లవు?

ఆశ:— నాకు వెళ్లాలని ఎంతమాత్రమూ లేదు.

మహేం:— బాగుంది, ఆరోజు వెళ్ళాలని కోరావు. ఇప్పుడాకోరిక ఒక్కసారిగా ఎక్కడికి పోయింది?

ఆమె దీనికి జవాబు చెప్పలేకపోయింది; మౌనంగా నేలకుచూస్తూ కూర్చొంది. వినోదినితో కలిసికొనడానికి ఏవిఘ్నాలులేని అవకాశంకొరకు తొందర పడుతున్నాడు మహేంద్రుడు. జవాబు చెప్పకుండా మౌనంగా కూర్చొన్న ఆశమీద అతనికి అకారణంగా కోపంవచ్చింది. "నీ మనసులో నామీద ఏదయినా సందేహం కలిగిందా? అందుకేనా నన్ను నీకళ్ళఎదుట వుంచుకొని పహరాఇవ్వాలని ప్రయత్నిస్తున్నావు?" అన్నాడు మహేంద్రుడు.

ఆమె స్వాభావికమైన బిడియమూ, వినయమూ, ధైర్యమూ ఒక్కసారిగా అతడికి మహాఅసహ్యంగా కనిపించాయి. 'పిన్నమ్మవద్దకు వెళ్ళాలని కోరికవుంది, అలాంటప్పుడు ఏదోవిధంగా నన్ను పంపించమని ఎందుకు కోరదు? ఇలా కోరకుండా ఒకప్పుడు వెళ్ళుతానని, మరొకప్పుడు వెళ్ళనని అనడమూ; ఇంకొకప్పుడు మౌనంగా వుండడమూ ఎందుకు? ఇదంతా యేమిటి?' అనుకొన్నాడు మనసులో.

ఆకస్మికంగా మహేంద్రునిలో వచ్చిన ఈప్రళయ తాండవలాంటి క్రోధాన్ని చూచి ఆమెకు భయసంభ్రమాలు కలిగాయి. ఎంతప్రయత్నించినా ప్రత్యుత్తరం లభించలేదు. ఒకప్పుడు అమితంగా ప్రేమించడం, మరొకప్పుడు అమితంగా మండిపడడం దీనిభావం ఏమిటో ఆమెకు అర్థంకావడంలేదు. ఈవిధంగా మహేంద్రుడు ఆశకొక సమస్యలాగా అంతుపట్టకుండా వున్నప్పటికీకూడా, ఆమె భయకంపితమైన ప్రేమపూరిత హృదయం,అతణ్ణి తనవంకకు త్రిప్పుకోవాలని బాధపడుతూవుంది.

మహేంద్రుని సందేహించి ఆశ అతణ్ణి తనకళ్ళఎదుట ఉంచుకొని పహరా ఇవ్వగోరుతున్నదా? ఇది కఠినమైన పరిహాసమా; లేక నిర్దయాత్మకమైన సందేహమా? ఈవిషయాన్ని నవ్వులాటతో తేలగొట్టి వేయడం మంచిదా లేక ప్రమాణం చేసి ప్రతివాదంచేయడం మంచిదా?—అనేవిషయంలో ఆశ ఎంతఆలోచించినా ఒకనిర్ణయానికి రాలేకపోయింది.

కింకర్తవ్య విమూఢురాలైన ఆశ, ఇంకా మౌనంగా వుండడాన్నిచూచి, మార్గాంతరం లేక వెంటనే లేచి బయటికి

వెళ్ళిపోయాడు మహేంద్రుడు. ఇక ఆమె మాసపత్రిక ఏమై పోయిందో, కథానాయికా నాయకులు ఏదారిచూచుకొన్నారో అంతులేదు. సూర్యాస్తమయపు రేమెండలు అంధకారంలో లీనమైనాయి. సాయంకాలపు శీతల వసంతపవనాలు చల్లగా వీవనారంభించాయి. అలాంటి సమయంలో కూడా పడక మీద పొర్లిపొర్లి ఏడుస్తూవుంది ఆశ.

చాల ప్రొద్దుపోయినతర్వాత ఆశ తన పడకగదికివెళ్ళి చూచింది; మహేంద్రుడు వంటరిగా నిద్రపోతున్నాడు. 'నేను నాప్రేమపాత్రురాలైన పిన్నమ్మవద్దకు వెళ్ళకుండా వుండడం చేతనే వీరికి నామీద కోపంకలిగింది.' అని తలచింది. 'నిజంగా దోషంనాది; వీరు చేసిందంతా మంచిదే.' ఇలా భావించి తిన్నగా పక్కవద్దకు వెళ్ళి వెంటనే మహేంద్రుని రెండు పాదాలను పట్టుకొంది. అప్పుడిక మహేంద్రుడు ఆగలేక పోయాడు; ఆశను లేవనెత్తి తనరొమ్ముకవద్దకు తీసుకొనడానికి ప్రయత్నించాడు. కాని ఆశ అతనిపాదాలు విడిచిపెట్టక— "నావల్ల ఏదయినా అపరాధంవుంటే నన్ను క్షమించండి." అన్నది.

"నీ అపరాధం ఎంతమాత్రంలేదుచున్నీ, నేను చాలా నీచుణ్ణి. అందుచేత నేనే నీకు కష్టాలు కలిగిస్తున్నాను." అని రుద్ధకంఠంతో అన్నాడు మహేంద్రుడు.

ఆశ కళ్ళనుండి అశ్రుధార ప్రవహించింది. ఆ కన్నీటితో మహేంద్రుని పాదాలు తడిసిపోయినాయి. అతడు దుఃఖంతో లేచి కూర్చొన్నాడు. ఆమెను తన రెండుచేతుల్తో లేవనెత్తి

తనవద్ద పంపుకొనబెట్టుకొన్నాడు. ఆశ ఏడ్పుమానివేసి "పిన్నమ్మను చూడడానికి నాకుమాత్రం కోరికలేదా? ఐతే మిమ్ము విడిచి వెళ్ళడం నాకిష్టంలేదు. అందుచేత నేను వెళ్ళగోరడంలేదు; ఇందుకు మీరు నామీద కోపించకండి." అన్నది.

మహేంద్రుడు తడిసివున్న గులాబీరంగుగల ఆశ బుగ్గలను తిన్నతిన్నగా తుడుస్తూ "బాగుంది, ఇది కోపించదగిన విషయమా చున్నీ? నన్ను విడిచి వెళ్ళలేకపోతే నేను కోపించడమా? నీవెక్కడికీ వెళ్ళవద్దు!" అన్నాడు.

ఆశ:— అలాకాదు, నేను తప్పక కాశీకి వెళ్ళుతాను.

మహేం:— ఎందుకు?

ఆశ:— మీనోటిగుండా, నేను నామనసులో మిమ్మల్ని సందేహిస్తున్నట్టు విన్నాను. కొన్నాళ్లైనా కాశీలో వుండివస్తేగాని మీ అనుమానం తీరదు.

మహేం:— నా పాపానికి నీవు ప్రాయశ్చిత్తం చేసుకొంటావా?

ఆశ:—అది నాకు తెలీదు; తెలిసో తెలియకో నావల్ల కొంత పాపకార్యం జరిగివుంటుంది. అలాకాకపోతే ఇలాంటి అసంభవమైనమాట లెందుకొస్తాయి? నేను స్వప్నావస్థలో కూడా ఆలోచించని విషయాలు ఎందుకు వినవలసివస్తుంది?

మహేం:— నేనెంతనీచుణ్ణో, ఎంతఅధముణ్ణో నీకు తెలియకపోడమే దానికి కారణం.

"తిరిగీ అవేమాటలు! నేను మీకాళ్ళమీద పడతాను; నాముందు ఇలా మాట్లాడకండి." అని బాధతో అన్నది ఆశ.

మహేంద్రుడు మాట్లాడలేదు.

"ఏమైన ఈసారి తప్పకుండా నేను కాశీకివెళ్ళుతాను." అని ఆమె మళ్ళీఅన్నది.

"సరేవెళ్ళు, కాని నువ్వులేనప్పుడు నేను పాడైపోతే? ఇదేమైనా ఆలోచించావా?" అని నవ్వాడు మహేంద్రుడు.

"ఇందుకు మీరింత భయపడవలసిన పనిలేదు. దీన్ని ఆలోచించకుండానే నేనువెళ్ళాలని కంగారుపడుతున్నానా?"

"కాని నీవు జాగ్రతగా ఉండడంమంచిది. నీఅజాగ్రత వల్ల నీస్వామిని చెడిపోనిస్తే, తర్వాత అందుకు ఎవరినేమన గలవు?"

"మీమీద దోషం ఆరోపించను. దానికి మీరు చింతించకండి."

"అయితే అప్పుడాదోషాన్ని నీదిగా స్వీకరిస్తావా?"

"ఒకసారికాదు, వందసార్లు."

"మంచిది. రేపు మీ పెదతండ్రివద్దకువెళ్ళి మాట్లాడి నిర్ణయం చేసుకొని వస్తాను."

ఇలాఅని "చాలాప్రొద్దుపోయింది" అనిచెప్పి రెండవ ప్రక్కకుపొర్లి నిద్రపోవాలని కళ్ళు మూసుకొన్నాడు. కొంచెం సేపాగి ఒక్కసారిగా ఆశవైపుతిరిగి—"చున్నీ, అవసరంలేదు, నీవు వెళ్లవద్దు." అన్నాడు.

"మళ్ళా ఎందుకు వద్దంటున్నారు? ఇప్పుడునన్ను వెళ్ల నీయకపోతే మీ మాటలు నాహృదయాన్ని బాధిస్తూనే వుంటాయి. ఎక్కువకాలం వుండను, మూడు నాలుగురోజులు మాత్రమే వుండివస్తాను." అన్నది ఆశ.

మహేంద్రుడు "సరే"అని మరొకప్రక్కకు తిరిగి పడు కొన్నాడు. కాశీకి వెళ్ళే ముందురోజు, ఆశ వినోదినిని కౌగలిం చుకొని "సఖీ, కంటె మెరమెరా, నాశిరస్సుమీద నీ చేయివుంచి నాకొక్కమాటకు హామి ఇవ్వాలి." అన్నది.

వినోదిని ఆశగడ్డంపట్టుకొని—"దేనికి చున్నీ? నేనెన్న డైన నీమాటకు మీరిపోయానా?" అని ప్రేమపూర్వకంగా అన్నది.

ఆశ:— ఎవరికి తెలుసు అక్కా, ఎందుకోగాని ఇప్పుడు నీవు నాస్వామి ఎదుటికి రావడమేలేదు.

వినోదిని:— ఎందుకు రావడంలేదో నీవెరుగవా చెల్లెలా? ఆదినం నీస్వామి బిహారిబాబుతో అన్నమాట నీ చెవిలో పడలేదా? ఇలాంటిమాటలు వచ్చేలాగుంటే, నీవే చెప్పు, నేను అందరిఎదుటికి రావడంగాని నవ్వుతూ తుళ్లుతూ మాట్లాడడంగాని ఉచితంగా వుంటుందా?

ఉచితమో కాదో, ఆశకు ఈవిషయం బాగా తెలుసు. అలాంటిమాటలు బయటికి రావడంచేత కులస్త్రీలకు ఎంత లజ్జ కలుగుతుందో ఆమె ఇప్పుడిప్పుడే స్వయంగా అనుభవించివుంది. "లోకుల మాటలమీద ధ్యానముంచి తమ సహనాన్ని

కోల్పోయేలాగుంటే ఇక స్నేహమెందుకు? ఇక ఆమాటలు మరచిపో." అన్నది.

వినోదిని:— సరే, అలాగే మరచిపోతాను.

ఆశ:— అక్కా, నేనేమో రేపు కాశీకి వెళ్ళుతున్నాను. నేను వెళ్ళినతర్వాత నాస్వామికి ఏవిషయంలోను కష్టం కలుగనీయవద్దు. ఇప్పటిలాగా దూరదూరంగా ఉంటే పనిసాగదు; నీవు వారినెప్పుడూ సంతోషపెడుతూ వుండాలి.

వినోదిని మాట్లాడలేదు. ఆశ వినోదిని చేతినిపట్టుకొని "సఖీ, కంటిమెరమెరా, నామీదఒట్టు. నీవీపని తప్పక చేయవలసి వుంటుంది."

వినోదిని:— సరే.

# 25

ఒకవైపు చంద్రుడస్తమిస్తున్నాడు — రెండోవైపు సూర్యోదయం అవుతూవుంది. ఆశ వెళ్ళిపోయింది. ఐతే ఇప్పటికీ మహేంద్రునికి వినోదిని దర్శనం లభించలేదు. అతడు ఇటూ అటూ తిరుగుతున్నాడు, మధ్యమధ్య ఏదోనెపంతో వినోదినిని చూడడానికి తల్లిగదిలోకి వెళ్ళుతున్నాడు; కాని వినోదిని ఇతణ్ణి మాయచేసి తప్పించుకు పోతూవుంది; చేతి కందడంలేదు.

రాజలక్ష్మి చింతతో ముఖం వ్రేలాడవేసుకొని తిరుగుతూవున్న మహేంద్రుని చూచి, కోడలు వెళ్ళిపోవడం

చేత దిగులుగావున్నాడని అనుకొన్నది. ప్రస్తుతం మహేంద్రుడు తల్లిని ఏమాత్రమూ లక్ష్యపెట్టడంలేదు. ఇది తల్లికి చాలా దుఃఖంగావుంది. తల్లిలేకుండా వుండడం మహేంద్రునికి ఎంతమాత్రం కష్టంకలిగించలేదు. కాని భార్య రెండుదినాలు కనుపించకపోతే ఎంతబాధ పడుతున్నాడు–అనేవిషయం ఆమె దుఃఖాగ్నికి వాయువులాతోడైంది. ఐనా దుఃఖంతో ముఖం వాడిపోయిన పుత్రుని ముఖాన్ని చూడలేకపోయింది రాజలక్ష్మి. పుత్రుని దుఃఖంముందు తనదుఃఖాన్ని దిగమ్రింగుకొంది. అప్పుడు వినోదినిని పిల్చిచెప్పింది–"అమ్మాయీ, నాకు జ్వరం వచ్చిననాటినుండి నేను చాల బలహీనంగా వున్నాను. మాటిమాటికి మెట్లెక్కి పైకి వెళ్లిరావడం నావల్లకావడంలేదు. రొప్పు వస్తూవుంది. ఇక నీవేవెళ్ళి వాడికి అన్నపానీయాలు అమరుస్తూవుండాలి. వాడికెప్పుడూ ఒకమనిషి ప్రక్కనవుండి సేవచేస్తూవుంటేగాని వాడు వుండలేడు. ఇదొక అలవాటయిపోయింది. కోడలు వెళ్ళిపోయినప్పటినుండి వాడి ముఖం ఎలా వుందోచూడు. కోడలుకూడా ఎలావిడిచిపెట్టి వెళ్ళిందోచూడు, ఎంతఆడుది!"

వినోదిని ముఖం కొంచెం వంకరగాబెట్టి మౌనంగా పక్కమీదిదుప్పటి చివరదారాల్ని తెంపడం మొదలుపెట్టింది.

"ఏం కోడలా, ఏదో ఆలోచిస్తున్నావు? ఇందులో ఆలోచించవలసిన విషయమేముంది, లోకులేమైనఅననీ, నీవేమీ పరాయిదానివికాదు." అన్నది మళ్ళీరాజలక్ష్మి.

వినోదిని:— అత్తయ్యా, ఇది నావల్లకాదు.

రాజలక్ష్మి కొంచెం కోపంతో—"సరే పోనీలే, చేతనై నంతవరకు నేనే చేసుకొంటాను." అన్నది.

ఆమె వెంటనే మహేంద్రునిగది శుభ్రపరచడానికి బయలుదేరింది. వినోదిని వ్యాకులపడుతూ—"నీఆరోగ్యం బాగాలేదు, పడిపోతావు. నీవు వెళ్ళవద్దు. నేనేవెళ్ళుతాను. నన్ను క్షమించు అత్తయ్యా, నీ ఆజ్ఞప్రకారమే నడుచు కొంటాను."అన్నది.

లోకులమాటల్ని లక్ష్యపెట్టే స్వభావంకాదు రాజ లక్ష్మిది. తాను విధవరాలైనప్పటినుంచి, సంఘమన్నా ప్రపంచ మన్నా ఆమెయేమాత్రమూ సరకుచేయడంలేదు. ఆమెకు సర్వ స్వమూ మహేంద్రుడే. వినోదిని సంభాషణలో, మహేంద్రుని విషయంలో-సమాజనిందను గురించిన ధ్వని వినిపించింది. అది రాజలక్ష్మికి చెడ్డగా కనిపించింది. మహేంద్రుడు పసితనంనుండి ఆమెకు తెలుసు. అలాంటి సచ్చరిత్రుడు మరిలేడు. అలాంటి మహేంద్రునిమీద ఎవరైనా దోషారోపణచేస్తే వానినాల్క తెగిపడుతుంది. రాజలక్ష్మివద్ద ఒక స్వాభావికమైన పట్టుదల వుంది; ఆమెకు మంచివాడుగా కనిపించాడా ఇకమంచివాడే; ప్రపంచమంతా ముక్తకంఠంతో వాడు చెడ్డవాడని చెప్పగాక, ఆమె అంగీకరించదు.

ఈదినం మహేంద్రుడు కాలేజినుండి తిరిగివచ్చి తన గదికివెళ్లాడు. తలుపు తెరచి చూచాడు. అతడి ఆశ్చర్యానికి అంతులేదు. గదిఅంతా అగరువత్తులు వెలిగించడంచేత పరి మళంతో నిండివుంది. దోమతెరకు పైగా గులాబీరంగుగల

పట్టుజాలరు వ్రేలాడుతూ వుంది. నేలమీద శరచ్చంద్రికలాంటి తెల్లని దుప్పటి పరచబడివుంది. పడకమీద వెనుకటిదిండు లేదు; దాని స్థానంలో వివిధరంగులతో అందముగా నేయబడి పాశ్చాత్యపద్ధతిలో నాలుగు మూలలు అణచబడిన ఉన్నిదిండు ఉంచబడిఉంది—దానిమీద అతినైపుణ్యంతో గులాబి మొద లగు పుష్పాలు రంగురంగులలో కుట్టబడి వున్నాయి. ఇది వినోదిని స్వయంగాచేసిన పనితనం. "అక్కా, ఇంత శ్రమించి ఈదిండును అలంకరిస్తున్నావే ఎవరికోసం?" అని ఒకనాడు వినోదినిని అడిగింది ఆశ. "నామరణశయ్యమీదికి కుట్టుకొంటు న్నాను; మృత్యువుకంటె నాకు ప్రియుడెవ్వడు?" అని జవాబు చెప్పింది వినోదిని. మహేంద్రుని ఫోటో ఒకటి గోడమీద వ్రేలాడుతూవుంది. ఆ పటానికి నలుమూలలనున్న చట్రానికి రంగుగుడ్డ పీలికలతో అందముగా మడిచి అమర్చబడివుంది. ఆఫోటోకు ఇరువైపులానున్న దీపపుకొయ్యలమీద రెండుపూల పాత్రలలో పూలగుత్తు లుంచబడ్డాయి. దీనినిబట్టి ఒక అజ్ఞాత భక్తుడు అతనిచిత్రపటాన్ని పూజచేస్తున్నట్లు గోచరిస్తూవుంది. ఈవిధంగా ఆగదిరూపమే మారిపోయింది. మంచము వెనుకటి స్థానాన్నుండి కొద్దిగ జరుపబడింది. ఆగది రెండుగా విభజించ బడి, మధ్యలో ఒక త్రాడుకట్టి, దానిమీద ఒకవస్త్రాన్ని పరచి నిద్రించేస్థానం వేరుచేయబడింది. రెండవ విభాగంలో కూర్చొని చదువుకొనడానికి తగు ఏర్పాట్లు చేయబడ్డాయి. ఆగదిలో ఒక అద్దాలబీరువావుంది, దానిలో ఆశ కిష్టమైన వస్తువులు ఆట బొమ్మలు అలంకరించబడ్డాయి. దానిమీద ఒక ఎర్రని శాల్వ

కప్పబడివుంది. ఇప్పుడు ఆ బీరువాలోని వస్తువులేమీ పైకి కనిపించవు. ఆ ఇంట్లో పూర్వచరిత్రను స్ఫురణకు తెచ్చే వస్తు సముదాయమంతా క్రొత్త చేతుల్తో చేసిన నవ్యాలంకారాల వల్ల మరుగున పడ్డాయి.

అలసిపోయిన మహేంద్రుడు దోమతెరలోనున్న దిండు తీసుకొని స్వచ్ఛమైన వెన్నెలలో వెళ్ళి పండుకొన్నాడు. దిండుమీద తల వాల్చగానే దానిలోనుండి మనోహరమైన సువాసన వెదజల్లబడుతూవుంది. దిండులోనున్న దూదిలో నాగకేసరాల పుప్పొడి, అత్తరు కలుపబడివుంది.

మహేంద్రుని కళ్ళు వాటియంతట అవే మూతలు పడ్డాయి. ఈతలగడదిండుమీది చిత్రకళానైపుణ్యమును ప్రచురింపజేసిన మల్లెమొగ్గల్లాంటి ఆమె వ్రేళ్ళనుండి ఈ పరిమళం వస్తున్నదని అతడు భావించాడు.

ఇదే సమయంలో దాసి ఒక వెండి పళ్ళెరంలో పళ్ళు, మిఠాయీలు, గాజుగ్లాసులో మంచునీరుతో మిళితంచేయబడిన అనాసపర్బత్తు తీసుకొని వచ్చింది. అన్నివస్తువులూ రుచిలో, సువాసనలో నవనవలాడుతు క్రొత్త పద్ధతిలో వున్నాయి. వానివల్ల మహేంద్రునికొక క్రొత్తతృప్తి కలిగింది. మహేంద్రుడు జలపానం చేయగానే ఒక వెండిపాన్‌దానాలో సువాసనలు విరజిమ్మే తమలపాకు చిలుకలు, ఏలకాయలు మొదలైన సుగంధ ద్రవ్యాలు తీసుకొని తిన్నతిన్నగా గదిలోకి వచ్చింది వినోదిని. "చాలా దినాలనుండి మీభోజన సమయంలో ఇక్కడికి రాజాలనందుకు క్షమించాలి. నాసఖితో

ఈ విషయం చెప్పకండి, ఒట్టు పెట్టుతున్నాను. చేయగలిగినంత వరకు చేస్తున్నాను. ఏమిచేసేది; అన్ని ఇంటిపనులు నేనే చూచుకొనవలసి వస్తూవుంది." అన్నది వినోదిని.

ఇలాచెప్పి పాన్-దానా మహేంద్రుని ముందుగా వుంచింది. ఈవేళ ఆకులు ఒక క్రొత్తవిధమైన సుంగంధాన్ని క్రుమ్మరిస్తున్నాయి.

మహేం:— సేవలో ఈలాంటి విఘ్నాలుండడమే మంచిది.

వినోదిని:— ఏమిటామంచి; చెప్పండి కాస్త తెలుసుకొంటాను.

మహేం:— విఘ్నాలుంటే దావాచేసి వడ్డీతోసహా రాబట్టుకోవచ్చు.

వినోదిని:— సరే, సేట్ గారూ, వడ్డీఎంతఅయింది?

మహేం:— భోజనసమయంలో నీవు ఇక్కడహాజరు లేవు; భోజనం అయినతర్వాత హాజరైనప్పటికీకూడా ఆవడ్డీ తీరిపోదు; ఇంకా కొంతబాకీ ఉండేవుంటుంది.

వినోదిని:— మీరు లెక్కలు చాలాకఠినంగాచూస్తున్నారు. ఒక పర్యాయం మీతో సంబంధం పెట్టుకొంటే తిరిగి కోలుకొనడం దుర్లభంగా కనిపిస్తూవుంది!

మహేం:— లెక్కలు ఎలా చూచినప్పటికీ వసూలు మాత్రం పూర్ణానుస్వారంగానే వుంది.

వినోదిని:— వసూలు చేయదగింది నావద్ద అసలేముంది? ఐనప్పటికీ నన్ను మీరు మీబందిఖానాలోనే వుంచుకొన్నారు!

ఇలా అని ఆ నవ్వులాటలకు ఒక్కసారిగా గంభీరభావ రూపాన్ని ఇచ్చి తిన్నగా శ్వాస తీసుకొంది.

"ఐతే ఇది బందిఖానా అంటావా వినోదినీ?" అని గంభీరభావంతో అన్నాడు మహేంద్రుడు.

ఇదే సమయంలో నౌకరు లాంతరు వెలిగించుకొనివచ్చి ముక్కాలిపీటమీద వుంచి వెళ్ళిపోయాడు.

అదాటుగా కళ్ళకు వెలుగు తగులడంచేత వినోదిని తన కళ్లకు కొద్దిగా చెయ్యి అడ్డంపెట్టుకొని, నేలవైపు చూస్తూ—"నాకేం తెలుసు! మాటల్లో మిమ్మల్నెవరు జయిస్తారు! ఇక వెళ్లుతాను, పనివుంది." అన్నది.

మహేంద్రుడు వెంటనే ఆమె చెయ్యి పట్టుకొని "బంధాల్లో వున్నట్లు అంగీకరించావు. ఇంక ఎక్కడికి వెళ్లుతావు?" అన్నాడు.

"ఛీ ఛీ, విడిచిపెట్టు! పారిపోయేందుకు యెటూ మార్గం లేనిదాన్ని ఈవిధంగా బలవంతంచేయవలసినఅవసరంఏముంది?" అని వినోదిని గట్టిగా చెయ్యి విదిలించుకొని వెళ్లిపోయింది.

మహేంద్రుడు ఆపడకమీదనే సుగంధం వెదజల్లుతున్న దిండుమీద తనతలవుంచి పడుకొన్నాడు; అతని నాడుల్లో రక్తసంచారం తీవ్రమయింది. సంధ్యాసమయం, చుట్టుపట్ల అంతా నిశ్శబ్దంగావుంది. మైకంకలిగించే నవవసంత వాయు

వులు వీస్తున్నాయి. వినోదిని కొంచెంసేపట్లోనో ఇంకొంచెం సేపట్లోనో ఆత్మసమర్పణంచేస్తుంది అనిపిస్తూవుంది. అతడి మనస్సు మదగజంలాగా చరిస్తూవుంది. గబగబా దీపం ఆర్పివేసి తలుపువేశాడు. గొళ్ళానికి ఒకచిన్న ఇనుపమేకు తగిలించాడు. పడుకొనేవేళ కాకపోయినా పందిరిమంచం మీాదకు వెళ్ళి పడుకొన్నాడు.

ఇదికూడా వెనుకటి పడకకాదు. దుప్పటిక్రింద నాలు గైదు వరుసలుగా మెత్తలుపరవడంచేత వెనుకటికంటె మృదు వుగావుంది. దీనిలోనుండికూడా ఒకవిధమైన పరిమళం వస్తూనే వుంది. అది ఒట్టివేళ్ల సుగంధమో అగరుసుగంధమో బాగా అర్థంకావడంలేదు.

మహేంద్రుడు అనేకసార్లు అటూ ఇటూ పొర్లుతూ వున్నాడు. ఏదయినా పూర్వపు చిహ్నాలు కనిపిస్తాయేమో, వానిమీాద తనమనస్సు లగ్నంచేసి, చంచలచిత్తాన్ని ఏకాగ్రం చేద్దామని వెదుకుతున్నాడు. ఐతే ఒక్కటీ కనిపించలేదు.

రాత్రి తొమ్మిదిగంటలకు ఎవరో తలుపుమీాద దెబ్బ కొట్టారు. తలుపువేసివున్నట్లు తెలుసుకొని "మహేంద్రబాబూ, మీా భోజన పదార్థాలు వచ్చాయి, తలుపు తెరవండి." అని పిలిచింది వినోదిని.

మహేంద్రుడు ఆగలేకపోయాడు; ధ్వని వింటూనే తలుపు తెరవడానికి గొళ్ళెంమీాద చెయ్యిపెట్టాడు; ఐతే తెరవలేదు. తిరిగివచ్చి కుర్చీలో కూలబడి—"వద్దు, వద్దు. నాకు ఆకలిగాలేదు, భోజనంచేయను." అన్నాడు.

వెలుపలినుండి భయపడుతున్న ధ్వనితో—"ఆరోగ్యం బాగావుందా? మంచినీరిచ్చేదా? ఇంకేమైనా కావాలా?" అని అడిగింది వినోదిని.

మహేం:— వద్దు, ఏమీ అక్కర్లేదు.

వినోదిని:—నాముందు మీరిలా నటించవద్దు. నామీద ఒట్టుసుమా; ఆరోగ్యం బాగావుంటే తలుపుతీయండి.

మహేంద్రుడు దృఢచిత్తంతో — "వద్దు, తలుపు తెరవడానికి ఎంతమాత్రం వీలులేదు. నీవువెళ్లు." అన్నాడు.

ఇలా అంటూ వెంటనేలేచి మళ్ళా దోమతెరలోకివెళ్ళి పండుకొన్నాడు. మరచిపోయిన తనఆశను శూన్యంగానున్న శయ్యమీదను, చంచలమైన హృదయంలోను, అంధకారంలో వెదకుతున్నాడు.

ఏవిధంగాకూడా నిద్రపట్టకపోవడంచేత మళ్ళీ లాంపు వెలిగించి కలం సీరాబుడ్డి తీసుకొని ఆశకు జాబు వ్రాయడానికి కూర్చొన్నాడు. "చునీ, ఇంకఎక్కువరోజులు నన్ను వంటరిగా వుంచవద్దు. నీవు నా జీవనదేవతవు - నీవు నావద్ద లేకపోవడంచేత నాప్రవృత్తి—నావాసనలు తమ అన్నిబంధాల్ని త్రెంచుకొని నన్నెక్కడికి తీసుకువెళ్ళుతవో నాకర్థం కావడం లేదు. మంచిమార్గంలో ప్రవర్తించాలనే విషయం నాకు తెలుసు, ఐతే ఆ మార్గాన్నిచూపే వెలుగెక్కడిది? నీ విశ్వాసపూర్ణమైన రెండు నేత్రాలలోని జ్యోతియే ఆ వెలుగు. నీవు వెంటనే రావాలి. నీవే నాక్షేమాన్ని, ధర్మాన్ని, జీవనాన్ని, ప్రజ్వలనం చేసే ప్రకాశానివి. నీ విషయంలో

అణుమాత్రమైనా విశ్వాసఘాతకంగా ప్రవర్తించడంగాని, అన్యాయం చేయడంగాని ఘోరపాతకం. ఆ మహాపాతకాన్నుండి—నిన్ను క్షణమాత్రమైనా మరచిపోవడమనే భయంకర దృశ్యాన్నుండి – నన్ను ఉద్ధరించాలి.”

ఈవిధంగా ఆశఎదుట మరుగులేకుండా తన మానసిక స్థితిని విప్పి చెప్పుతూ, తన ప్రవర్తనకు తన్నుతాను నిందించుకొంటూ, చాలా ప్రొద్దుపోయేవరకు అనేక విషయాలు వ్రాశాడు మహేంద్రుడు. సమీపంగావున్న చర్చి ఘడియారం టంగ్-టంగ్-టంగ్ అని మూడు గంటలు కొట్టింది. అప్పుడు కలకత్తాలోని విశాల వీధుల్లో బళ్ళు వెళ్ళుతున్న చప్పుళ్ళు వినిపించడంలేదు. కొంతదూరంలో వున్న నాటకశాలలో ఒక స్త్రీ బిహాగ్ రాగం గానం చేస్తూవుంది. అదికూడా విశ్వవ్యాపిని యైన తత్కాలశాంతిలో, నిద్రలో ఒక్కసారిగా లీనమై పోయింది. ఏకాగ్రచిత్తంతో ఆశను జ్ఞాపకం తెచ్చుకొనడం చేత, ఆ దీర్ఘమైన లేఖలో అనేకవిధాలుగావున్న తనభయాన్ని-చంచలతను తేటతెల్లంగా వెల్లడించడంచేత, అతనికి కొంత శాంతి లభించింది. పక్కమీద పండుకొనడమే తడవుగా నిద్రపోయాడు మహేంద్రుడు.

ఉదయం అతడు నిద్ర లేచేసరికి బాగా ప్రొద్దు ఎక్కింది; కిటికీగుండా ఎండ వస్తూవుంది. మహేంద్రుడు వెంటనే లేచి కూర్చొన్నాడు. నిద్రనుండి మేల్కొంచడంచేత రాత్రి తాను మానసికంగా అనుభవించిన అలజడి, చిత్తచాంచల్యమూ కొద్దిగా శాంతించింది. పడకనుండి లేవగానే రాత్రి ఆశకు

పంపడానికై అతను వ్రాసిన లేఖ సిరాబుడ్డి, క్రింద ముక్కలై పీటమీద కనిపించాయి. దాన్ని మళ్ళీ చదివి మహేంద్రుడు 'భలేపని చేశాను; ఇది నాటకాల్లో, నవలల్లో వుండే పద్ధతి. ఈలేఖ పంపకపోవడం చాలా మంచిదయింది. చున్నీ ఇది చూస్తే ఏమనుకొంటుంది? ఆమెకు ఈలేఖలోని అధికభాగం అర్థమేకాదు' అని తనలో అనుకొన్నాడు. రాత్రి జరిగిన ఒక చిన్న ఘటనతో పెచ్చరిల్లిన హృదయావేగం ఇంత అసంగతంగా మించిపోయింది—ఇలా భావించి తనలోతాను సిగ్గుపడ్డాడు మహేంద్రుడు. ఆ జాబును ముక్కలుముక్కలుగా చింపివేసి, తిరిగి సామాన్యమైన భాషలో ఒక చిన్న జాబును ఇలా వ్రాశాడు-"నీవింకా ఎంత ఆలస్యం చేస్తావు? మీ పెదతండ్రి వెంటనే వచ్చే అవకాశం లేకపోతే నాకు వ్రాయవలసినది. నేనే వచ్చి తీసుకవస్తాను. నీవు లేకుండా నేనిక్కడ వుండడం బాగాలేదు."

## 26

మహేంద్రుడు వెళ్ళిన తర్వాత కొన్ని దినాలకే ఆశ కాశీకి రావడంచేత అన్నపూర్ణ మనసులో చాలా సందేహం కలిగింది. సంభాషణల్లో వినోదినిని గురించిన చర్చ కూడా వచ్చింది. "ఐతే చున్నీ, నీసఖి 'కంటి మెరమెర' అంత తెలివిగలదీ, అంత గుణవంతురాలూనా? అలాంటి స్త్రీ ప్రపంచంలోనే లేదా?"

"నిజం పిన్నమ్మా, ఆమె అలాంటిమనిషే. ఆమె బుద్ధికి అనుగుణంగానే రూపంకూడా వుంది. చాలా శుభ్రంగా అందంగా ఇంటిపనులు నిర్వహించడంకూడా బాగా తెలుసు."

"నీసఖి కాబట్టి అన్ని విషయాల్లో అద్వితీయురాలుగా భావిస్తావు. బాగానేవుంది, ఐతే ఇతరుల దృష్టిలో ఆమె ఎలా కనుపిస్తూవుందో చెప్పు."

"అత్తగారికి ఆమె అంటే మహా సంతోషం; ఎప్పుడు చూచినా ఆమెను ప్రశంసిస్తూనే వుంటుంది. ఆమె తన గ్రామానికి వెళ్ళడానికి ఎప్పుడు ప్రయత్నించినా అత్తగారు కంగారు పడుతూవుంటుంది. ఆమెలాగా ఎవ్వరూ సేవ చేయలేరు. ఇంట్లో దాసిగానీ, పనివాడుకానీ, ఎవరైనకానీ, జబ్బుపడితే తల్లిలాగా వారికి సేవ చేస్తుంది."

"ఆమె విషయంలో మహేంద్రుని భావం ఎలావుంది?"

"వారివిషయం నీకు తెలియనిదేముంది పిన్నమ్మా, తనకు నచ్చినమనిషితప్ప మరెవరి విషయమూ వారికి రుచింపదు. నా సఖిని అందరూ ప్రేమిస్తారు; ఐతే వీరికి ఆమెకు ఇంతవరకుబాగా మనసు కలవడంలేదు."

"ఎందుకని?"

"నేనెంతో శ్రమించి వారిద్దరు కలుసుకొనే ఏర్పాటు చేశాను; ఐతే చాలా తక్కువగానే మాట్లాడుతుంటారు. వారి స్వభావం నీకూతెలుసుగా. పైవాళ్ళందరూ వారిని గర్విష్టి అనుకొంటారు, ఐతే అదివాస్తవంకాదు పిన్నమ్మా, వారు ఒకరిద్దరితోతప్ప మరెవ్వరితోను కలిసి మెలిసివుండరు."

చివరివాక్యం ఆకస్మికంగా వెలికిచెప్పడంచేత ఆశ చాల సిగ్గుపడింది. ఆమె గులాబిరంగు చెక్కిళ్ళమీద ఎరుపుదనం కనిపించింది. అన్నపూర్ణ తనలోతాను సంతోషించి—"నిజమే, మహేంద్రుడు ఇక్కడికి వచ్చినప్పుడు వినోదిని ప్రస్తాపనకూడా తేలేదు." అన్నది.

"ఇదే వారిలోదోషం. వారు ప్రేమించని వారిని లెక్కలోకే తీసుకోరు. వారినెప్పుడు ఎరుగనట్లే - చూడనట్లే వుంటారు." అని చిన్నబుచ్చుకొన్నది ఆశ.

"ఎవరిని ప్రేమిస్తారో వారినేచూస్తారు, ఎరిగివుంటారు, వారినే తమ సర్వస్వంగా భావిస్తారు. అంతేనా చున్నీ!" అని నవ్వింది అన్నపూర్ణ.

ఆశ జవాబు చెప్పకుండా నేలవైపు చూస్తూవుంది; ఆమె అరుణాధరాలలో హాసరేఖ ప్రస్ఫుటమౌతూవుంది.

"చున్నీ, బిహారిస్థితి ఏమిటి ? అతడిక వివాహం చేసుకోడా?" అని మళ్ళీ ప్రశ్నించింది అన్నపూర్ణ.

ఈప్రశ్న వినగానే ఆశ పెదవులపైనున్న చిరునవ్వు గంభీరభావంలో లీనమై జవాబు చెప్పలేకపోయింది.

ఆశవల్ల ఏజవాబు లభించక పోవడంచేత అన్నపూర్ణ భయపడి—"నిజంచెప్పు చున్నీ, బిహారి క్షేమమేనా?" అని అడిగింది. అన్నపూర్ణకు బిడ్డా, పాపా ఎవరూలేరు. బిహారిని తన బిడ్డకంటె అధికంగా ప్రేమిస్తూవుంది. పారలౌకికాపేక్షచే ఈ పుణ్యతీర్థంలో ఉంటూవుంది; ఐతే బిహారి భార్యతో కాపురం చేస్తూవుండగా చూచి ఆనందించకపోతినే అనేచింత

ఇప్పటికీ ఆమెను పీడిస్తూనేవుంది. తనకున్న పరిమితమైన బంధు జాలంలో అందరు సౌఖ్యంగానేవున్నారు; ఆమె అభిలాషలన్నీ పూర్తిఅయినాయి; ఈ అభిలాషమాత్రమే తీరలేదు. బిహారి జ్ఞాపకం వచ్చినప్పుడంతా ఆమె చాలా వ్యాకులపడుతూ వుంటుంది.

ఆశ:— బిహారిబాబు విషయంమాత్రం నన్నడగవద్దు.

అన్నపూర్ణ ఆశ్చర్యంతో-"ఎందువల్ల?" అని అడిగింది.

"వారివిషయం నేను చెప్పలేను." అన్నది ఆశ.

ఇలాఅని ఆశ వేరొకగదిలోకి వెళ్లిపోయింది. అన్నపూర్ణ మౌనంగా ఆలోచింపసాగింది—'బిహారి చాలా శీలవంతుడు. ఈ కొద్దిదినాల్లోనే వాడింత దుష్టచరిత్రుడయినాడా? చున్నీ కూడా వానివిషయం చర్చించడానికి వెరచి వానిపేరు వింటూనే పరుగెత్తిపోయింది. ఇదంతా విధివైపరీత్యం, లేక పోతే వానితో చున్నీ వివాహ సంభాషణలు సాగడమెందుకు? మహేంద్రుడు హఠంచేసి చున్నీని లాక్కోవడమెందుకు?'

చాలా దినాలకు తర్వాత అన్నపూర్ణకళ్లనుండి తిరిగి అశ్రువులు రాలసాగాయి. - 'పాపం, బిహారి ఏదైనా అనుచితకార్యంచేసి వుండవచ్చు. తనకులభించలేదనే దుఃఖంతో మార్గాంతరంలేక చేసివుండవచ్చు; సహజంగా వాడు చాలా మంచివాడు.' అని తనలో అనుకొన్నది అన్నపూర్ణ. బిహారి దుఃఖాన్ని తన అంతరంగంలో చిత్రించుకొని వ్యాకులపడింది.

సంధ్యాసమయం. అన్నపూర్ణ డాబామీద కూర్చొని జపం చేసుకొంటూవుంది. ఇంతలో ఒకబండి ద్వారంవద్ద

ఆగింది. బండివాడు ద్వారంమీద ధ్వనిచేసి కేకవేశాడు. ఆమె వ్యాకులంగా—"ఇవ్వాళ అలహాబాదునుంచి మాఆడుబిడ్డ ఆమె కూతురు వస్తారని తెలిసింది. వారిబండివలెనే తోస్తుంది. లాంతరు తీసుకొని క్రిందికివెళ్లి తలుపుతియ్యి, నేను జపంచేసుకొంటున్నాను." అని ఆశతో చెప్పింది.

లాంతరుతీసుకొని క్రిందికివచ్చింది ఆశ. కాని తలుపు తెరవగానే బిహారి నిల్చొనిఉండడం కనిపించింది—"ఇదేమి వదినా, నీవు కాశీకి రావడంలేదనివిన్నానే"—అన్నాడు బిహారి.

ఆమె చేతిలోనిలాంతరు క్రిందపడిపోయింది! ఆమె ఒక భూతాన్ని చూచినట్లుగా త్రుటిలో మేడమీదికి పరుగెత్తింది. గడగడవణకుతూ "పిన్నమ్మా, నీపాదాలమీద పడతాను, ఇప్పుడే ఇక్కడినుండి వెళ్లిపొమ్మని వారితోచెప్పు." అన్నది.

అన్నపూర్ణ:— అదరిపడి "ఎవరితోచున్నీ, ఎవరితో?"

"బిహారిబాబు! ఇక్కడికి కూడా వచ్చాడు!" అంటూ ఆశ గదిలోదూరి లోపల గొళ్లెంవేసుకొని ధైర్యంగా కూర్చుంది.

బిహారి క్రిందవుండి అన్నిమాటలు వింటూనే వున్నాడు. అతడు వెంటనే వెనుకకు తిరిగాడు. ఇంతలో గోముఖం, జపమాల అక్కడేపారవేసి అన్నపూర్ణ క్రిందికివచ్చింది. తన శరీరంలోని బలమంతా ఎవరో అపహరించినట్లుగా బిహారి ద్వారంయెదుట నేలమీద కూర్చొన్నాడు.

ఆమె తనవెంట దీపంతీసుకొని రాలేదు; బండికి అమర్చివున్న గుడ్డిదీపపు వెలుగుమాత్రం బిహారి ముఖంమీద పడింది.

అందుచేత బిహారి ముఖస్థితి గమనించలేకపోయింది అన్న పూర్ణ. మెదడు గిరగిరా తిరుగుతూ వుండడంచేత ఆమెను చక్కగా చూడలేకపోయాడు బిహారి.

అన్నపూర్ణ తీవ్రస్వరంతో "బిహారీ!" అని పిలిచింది.

ఆరిభగవంతుడా, ఆ చిరపరచితమైన స్నేహపూరిత స్వరం ఏమయింది! దీనివల్ల కఠినమైన న్యాయవిచారణ జరిగే లాగా కనిపిస్తూవుంది. ఈ ధ్వని పిడుగుకంటేకూడా కఠినంగా వుందే! తల్లీ, అన్నపూర్ణా! మందభాగ్యుడైన బిహారి ఇలాంటి అంధకారంలో నీమంగళకరమైన పాదాలను ఆశ్రయించడానికి వచ్చాడు, నీ యీ తిరస్కారఖడ్గాన్ని ఎవరిమీద ప్రయోగిస్తున్నావు? ఆ కఠినధ్వని అశక్తుడైన బిహారిలో ఆపాదమస్తకం విద్యుచ్ఛక్తిలాగా ప్రసరించింది. "చాలు, పిన్నమ్మా, ఇంకేమీ చెప్పవద్దు! నేను వెళ్లుతున్నాను." అని దీనంగా చెప్పి, దూరాన్నుండే శిరస్సు నేలకు వంచి ప్రణామంచేశాడు; ఆమె పాదాలు తాకేధైర్యంకూడా అతనికి కలుగలేదు. తల్లి తన మృత శిశువును ఎలా గంగాప్రవాహంలో విసర్జించివేస్తుందో అలాగే అన్నపూర్ణ ఆ చీకటిరాత్రిలో బిహారిని మౌనంగా పంపివేసింది; ఒక్కసారి అతణ్ణి పిలువనుకూడా లేదు; బండి బిహారిని తీసుకొని చూస్తూచూస్తూ వుండగానే అదృశ్యమయింది.

ఆరాత్రే ఆశ మహేంద్రునికి జాబు వ్రాసింది—"నేటి సాయంకాలం అకస్మాత్తుగా బిహారిబాబు ఇక్కడికి వచ్చాడు.

మా పెదనాన్న కలకత్తాకు రావడం ఇంకా నిర్ణయం కాలేదు; మీరు వెంటనే ఇక్కడికి వచ్చి నన్ను తీసుకు వెళ్ళండి."

# 27

ఆదినం రాత్రిఅంతా మేల్కొనడంచేత మహేంద్రుని శరీరంలో ఒకవిధమైన శిథిలత్వం కనిపించింది. ఉద్వేగంవల్ల మనస్సులోకూడా ఒక విధమైన దుఃఖఛాయలు అలము కొన్నాయి. ఫాల్గుణమాసం, పగటిసమయం. వేడిగాడ్పులు ప్రారంభించాయి. మామూలుగా మహేంద్రుడు ప్రతిదినం ఉదయం టేబిలువద్ద పుస్తకం తీసుకొని చదవడానికి కూర్చొనే వాడు. ఈరోజు ప్రక్కమీద దిండు ఆధారంగా కూర్చొని ఆలోచనలో పడ్డాడు. ప్రొద్దెక్కినప్పటికీకూడా స్నానానికి లేవలేదు. వీధుల్లో కేకవేసి అమ్ముకొనేవాళ్ళు తమవస్తువులు తీసుకొని అమ్ముకొంటున్నారు. ఆఫీసులకు వెళ్ళేవారి బళ్ళు గబగబా వెళ్లుతున్నాయి. పొరుగున ఒక క్రొత్త ఇల్లు నిర్మాణ దశలో ఉంది. కూలీల బాలికలు దిమ్మిసలు కొడుతూ కలసి కట్టుగా గీతాలు పాడుతున్నారు. కొంచెం వేడిగానున్న దక్షిణ గాడ్పులు తగులడంచేత అసలే బాధపడుతున్న శరీరంలోని నరాలన్నీ ఇంకా శక్తిహీనము లవుతున్నాయి. నిజంగా ఈ వసంతదినాలు ఏ కఠినప్రతిజ్ఞకుగాని, ఏఅసాధారణమైన కార్యా నికిగాని, మానసికమైన ఆందోళనకుగాని తగినవికావు; ఈ దినాల్లో అన్నిపనులూవదలి ఆనందంగా పడుకోవాలనిపిస్తుంది.

ఇంతలో వినోదినివచ్చి—"మహేంద్రబాబూ, ఈరోజు మీస్థితి ఎలావుంది? స్నానంచేయరా? భోజనం సిద్ధంగావుంది. మీరింతవరకు పడుకొని నిద్రిస్తూనేవున్నారు! మీ ఆరోగ్యం బాగాలేదా? తల నొప్పిగావుందా?" అని పలుకరిస్తూ మహేంద్రుని శిరస్సుమీద తనచేయివుంచి చూచింది.

మహేంద్రుడు కళ్లు కొంచెంగా మూసుకొని బొంగురుపోయిన కంఠధ్వనితో—"ఈవేళ వంట్లో అంత బాగాలేదు. అదోలావుంది; స్నానంచేయను." అన్నాడు.

"స్నానంచేయరూ——సరేపోనీ; వచ్చి అన్నంతినండి." అని ఆమాటా యీమాటా చెప్పి సమ్మతిపరచి స్నానానికి తీసుకొనిపోయింది వినోదిని. స్నానంచేయగానే బ్రతిమలాడి భంగపడి భోజనంపెట్టింది.

భోజనం చేయగానే తిర్గిగి తనగదిలోకివచ్చి పడుకొన్నాడు మహేంద్రుడు. ఆమె తలగడదిక్కుగా కూర్చొని అతని తల తిన్నగా ఒత్తుతూవుంది. మహేంద్రుడు కళ్లుమూసుకొనే—"వినోదినీ, నీవింతవరకు ఏమీ భోజనం చేయలేదు; ఇకవెళ్లి భోజనంచెయ్యి." అన్నాడు.

ఎంతచెప్పినా వినోదిని వెళ్ళనేలేదు. సోమరితనాన్ని కలిగించే మధ్యాహ్నపు వేడిగాడ్పులచే గదిద్వారానికి వ్రేలాడగట్టబడివున్న పరదా ఎగురడం మొదలుపెట్టింది. గోడ వెంబడిగానున్న కొబ్బరిచెట్టు అర్థంలేకుండా అదేపనిగా మర్మరధ్వనులు చేస్తూవుంది. మహేంద్రునిగుండెలు దడదడ కొట్టుకొంటున్నాయి. వినోదిని దీర్ఘనిశ్వాసాలు మహేంద్రుని

మస్తకంమీది ఉంగరాలుతిరిగివున్న చిరువెంట్రుకలను తాళ గతిననుసరించి నాట్యంచేయిస్తున్నాయి. ఆమె నోటివెంట కూడా ఏమాటా రావడంలేదు. మహేంద్రుడు కళ్లుమూసు కొని—'ఇప్పటికే సీమారహితమైన అనంత సంసారప్రవా హంలో చాలాదూరం కొట్టుకొని వచ్చాను; ఈ జీవననౌక ఎప్పుడు ఎక్కడ ఒడ్డుపడుతుందో! దీనివల్ల ఎవరికైనా ఏమైనా ప్రయోజనముంటుందా?—అథవాఉంటే ఎంతకాలం?' అని ఆలోచిస్తున్నాడు.

తలగడదిక్కుగా కూర్చొని మహేంద్రుని తల ఒత్తుతూ ఒత్తుతూ దుస్సహమైన యవ్వనభారంచేత తిన్నతిన్నగా వినో దిని తల క్రిందికివంగింది. ఆఖరుకు నల్లత్రాచులాగా నాట్యం చేస్తున్న ఆమె కేశసముదాయపు కొనలు మహేంద్రుని చెక్కిళ్లమీద పడ్డాయి. గాలికి కదులుతూవున్న ఆ వెంట్రుకల కొనల కంపితకోమల స్పర్శవల్ల మహేంద్రుని శరీరమంతా గజగజ వణికిపోయింది. అతని ఉచ్ఛ్వాస నిశ్వాసాలు అతడి గుండెల్లోనే అణిగిపోయాయి; అవి బయటికి రావడానికి వున్న మార్గాలు ఎవరో మూసివేసినట్లయింది. అతడు గబగబా లేచి కూర్చొని, వినోదినివైపు చూడకుండానే నిల్చొని, "నాకు కాలేజివేళ అయింది, వెళ్ళుతున్నాను." అన్నాడు.

వినోదిని:— గాభరా పడకండి, మీ దుస్తులు తెచ్చి ఇస్తాను.

మహేంద్రుడు కాలేజికి వెళ్ళుతూ ధరించేబట్టలు తెచ్చి ఇచ్చింది వినోదిని. త్వరత్వరగా బట్టలు కట్టుకొని అతడు కాలేజికి

వెళ్లాడు; ఐతే అక్కడకూడా అతని మానసికస్థితి చక్కబడ లేదు. చాలాసేపు చదవడానికి వ్యర్థప్రయత్నంచేసి రెండు గంటలకే తిరిగి వచ్చాడు.

మహేంద్రుడు గదిలోకి వస్తూనే, గుండెలక్రింద దిండు పెట్టుకొని పడుకొని ఏదో పుస్తకం చదువుతూవున్న వినోదినిని చూచాడు. గుంపుగుంపుగా పోగుపడ్డ గండుతుమ్మెదల్లాగా నల్లని కేశసముదాయమంతా ఆమె వీపుమీద పరుచుకొని ఉన్నది. అతడి పాదరక్షల చప్పుళ్ళు ఆమె విన్నట్లేలేదు. మహేంద్రుడు చప్పుడుకాకుండా ఆమె వెనుకవైపుగా నిల బడ్డాడు. తదేక ధ్యానంతో చదువుతూచదువుతూ ఒక పెద్ద నిట్టూర్పు విడిచింది వినోదిని.

మహేం:— ఓ కరుణామయీ, కల్పిత పురుషుల కొరకు నీ సహానుభూతిని అనవసరంగా ఎందుకు వ్యర్థంచేస్తావు? ఏం చదువుతున్నావో-చెప్పు.

వినోదిని కంగారుతో లేచి కూర్చొని వెంటనే ఆపుస్త కాన్ని తన చెరగుచాటున దాచింది. మహేంద్రుడు దాన్ని లాక్కొని చూడడానికి ప్రయత్నిస్తున్నాడు. చాలాసేపు పోరాడిన తర్వాత ఆమె ఓడిపోయింది; అతడు ఆమె చెరగు చాటునవున్న పుస్తకాన్ని తీసుకొని చూచాడు. అది బంకిం బాబుగారి 'విషవృక్షం.' వినోదిని రోజుతూ, కోపంతో తన ముఖం ప్రక్కకు త్రిప్పి మాట్లాడకుండా కూర్చొంది.

మహేంద్రుని గుండెలు మహా తీవ్రంగా కొట్టుకొంటు న్నాయి. అతడు మహాప్రయత్నంతో నవ్వి అన్నాడు—

"ఛీ ఛీ, చాలా మోసం చేశావు! అది నేను చూడరాని వస్తువేమోనని ఆలోచించాను. ఇంతా కష్టపడి చూస్తే విష వృక్షమేనా!"

వినోదిని:— భలే, నావద్ద దాచతగిన వస్తువేముంది?

"నిజమే; కాని ఒకవేళ బిహారివద్దనుండి యేదైనాజాబు వచ్చిందే అనుకో..." అని వెంటనే అన్నాడు మహేంద్రుడు.

క్షణంలో వినోదిని కళ్ళలో విద్యుత్కాంతి మెరిసింది. ఇంతవరకూ ఇంట్లో ఏమూలనో కామదేవుడు తాండవం చేస్తున్నాడు. ఇప్పుడతడు మరొకసారి కాలి బుగ్గిఐపోయాడు. భగ్గున మండిన అగ్నిశిఖలాగా వినోదిని దూరంగా నిల్చొంది. మహేంద్రుడు ఆమెచేయి పట్టుకొని "నా పరిహాసానికి క్షమించాలి, నావల్ల అపరాధం జరిగింది." అన్నాడు.

వినోదిని తనచేతిని విడిపించుకొని—"ఎవర్ని పరిహాసం చేస్తున్నావు? నీకు వారితో మైత్రి నెరపగలిగిన యోగ్యతవుంటే పరిహాసాన్నికూడా నేను సహిస్తాను. నీ వా ఉన్నతస్థితికి తగినవాడవుకావు. వారిస్నేహం చేసేయోగ్యత నీకు లేనప్పుడు వారిని పరిహసింపవద్దు." అన్నది.

అమె బయటికివెళ్ళడానికి రెండడుగులువేసింది; మహేంద్రుడు రెండుచేతుల్తో ఆమెకాళ్లుపట్టుకొని అడ్డగించాడు.

ఇదే సమయంలో గోడమీద ఎవరిదో నీడకనిపించింది. మహేంద్రుడు వెంటనే వినోదిని కాళ్ళువదలి, అదరిపడి వెనుకకు తిరిగిచూచాడు, బిహారి నిల్చొని ఉన్నాడు!

బిహారి వేర్వేరుగా వారిద్దరిమీద దృష్టినిసారించి నెమ్మదిగా "వేళగానివేళ వచ్చాను, కాని ఎక్కువసేపు ఉండను. ఒక్కమాట చెప్పడానికే వచ్చాను. నేను కాశీకి వెళ్ళాను. వదిన అక్కడికి వెళ్ళిందని నాకుతెలీదు. నాకు తెలియకుండానే ఆమె దృష్టిలో అపరాధినయ్యాను; ఆమెను క్షమాపణకోరే అవకాశం నాకులేదు. ఆకారణంచేత మిమ్మల్ని క్షమాపణవేడడానికి వచ్చాను. — నామనసులో తెలిసో తెలియకో ఏదయినా పాపఛాయలు పడివుంటే, వాటివల్ల ఆమెకు ఏదుఃఖం కలుగనీయవద్దని మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను." అన్నాడు.

బిహారిమెదుట అదాటుగా తన బలహీనత ప్రకటం కావడంచేత మండిపడిపోయాడు మహేంద్రుడు. ఇది అతడు దయచూపవలసిన తరుణంకాదు. అతడు వ్యంగ్యంగానవ్వి— "గుమ్మడికాయల దొంగ ఎవరంటే వీపు తడవుకొన్నాడట— ఆసామెతగావుంది నీవ్యవహారం! నేను నిన్ను అపరాధం స్వీకరించమనీ కోరలేదు, వద్దనీకోరలేదు. అలాంటప్పుడు క్షమాపణ కోరి నీసాధుత్వాన్ని చూపించుకోడానికి వచ్చావా?"అన్నాడు.

బిహారి కొయ్యబారిపోయి, కొంతసేపు అలాగే నిలబడివున్నాడు—తర్వాత ఏదో మాట్లాడ ప్రయత్నించాడు, ఇంతలో వినోదిని అడ్డుతగిలి అన్నది — "బిహారీబాబూ, మీరేమీ జవాబీయవద్దు, మరేమీ మాట్లాడవద్దు! ఈ మనిషి తన నోటితో అన్నమాటలతో తన ముఖాన్నే అపయశాన్ని రుదుకొన్నాడు; ఆ అపకీర్తి మీ సమీపానికైనా రాలేదు."

వినోదిని అన్నమాటలు బిహారిచెవిలో పడ్డాయో లేదో, అది బాగాచెప్పలేము. నిద్రమత్తుతో లేచివెళ్ళేవానిలాగా అతడు తిరిగి ద్వారంగుండా మెట్లవైపు వెళ్ళాడు.

వినోదిని అతని వెనువెంటనేవెళ్ళి—"బిహారీబాబూ, నాకు చెప్పవలసినదేమీలేదా ? ఏమైనా చీవాట్లు పెట్టవలసి వుంటే పెట్టండి!" అన్నది.

బిహారి జవాబు చెప్పకుండా వెళ్ళుతున్నాడు. వినోదిని ముందుకు మిగిలి అతడి రెండుచేతుల్ని పట్టుకొంది. బిహారి ఎంతో అసహ్యంతో ఆమెను త్రోసివేసివెళ్ళిపోయాడు. ఆ త్రోపుతో ఆమెపడిపోయినసంగతి అతడికి తెలియనేలేదు.

ఆమె క్రిందపడ్డధ్వని వినిపించగానే మహేంద్రుడు పరుగెత్తుకొంటూ వచ్చాడు. వినోదినికి ఎడమమోచేయి చిట్లి పోయి గాయపడ్డది, రక్తం ప్రవహిస్తూవుంది.

మహేం:— అరె, పెద్దదెబ్బ తగిలిందే!

మహేంద్రుడు తన ధోవతిని చింపి గాయానికి కట్టు కట్టడానికి సిద్ధపడ్డాడు.

ఆమె వెంటనే చేతిని ప్రక్కకు త్రిప్పి—"వద్దు, వద్దు, ఏమీ చేయవద్దు, రక్తం కారనివ్వండి." అన్నది.

మహేం:— కట్టుకట్టి ఇప్పుడే మందు వేస్తాను. ఇక నొప్పి పెట్టకుండా మానిపోతుంది.

వినోదిని ప్రక్కకు తొలగి—"ఇది బాగుపడాలని నేను కోరడంలేదు; ఆగాయం అలాగే వుండాలి." అన్నది.

మహేం:— నేను నా పొరబాటు, తొందరపాటువల్ల ఇతరుల ఎదుట నీవు సిగ్గుపడేలాగా, అపకీర్తి పాలయేలాగా చేశాను. నా యీ అపరాధాన్ని క్షమింపలేవా?

వినోదిని:— క్షమాపణ నెందుకు కోరుతావు? నీవు మంచిపనే చేశావు. నేను ఇతరులకు భయపడతానా? నేనెవ్వరినీ లక్ష్యపెట్టను.నన్ను దెబ్బకొట్టి వెళ్ళేవారు నావాళ్ళూనూ, నాకాళ్లు పట్టుకొని నిల్పుకోదలచుకొన్నవారు పరాయి వాళ్ళూనా?

మహేంద్రుడు ఆనందంతో ఉబ్బిపోయి, గద్గదస్వరంతో "అలాగైతే నీవు నాప్రేమను గ్రహిస్తావా వినోదినీ?" అన్నాడు.

"శిరసావహిస్తాను. 'వద్దు' అని విదిలించే అంత అధిక ప్రేమను నాజీవితంలో పొందలేదు!"

అప్పుడు మహేంద్రుడు వినోదిని రెండు చేతులను పట్టుకొని "అలాగయితే రా, నాగదిలోకి రా. ఈవేళ నీకునేను చాలా కష్టం కలిగించాను; నీవుకూడా నామనస్సుకు బాధ కలిగించి వచ్చివేశావు; మనకష్టాలు - దుఃఖాలు ఒక్కసారిగా అదృశ్యం కాకపోతే ఎంతతిన్నా - ఎంత నిద్రించినా మనకు వంటపట్టదు - శాంతి లభించదు." అన్నాడు.

వినోదిని:— నేడుకాదు — ఈవేళకి నన్ను విడిచిపెట్టు. నేను నీకేమైనా దుఃఖాన్ని కలిగించివుంటే క్షమించు.

మహేం:— నీవుకూడా నన్ను క్షమించు, లేకపోతే రాత్రికి నిద్రకూడా పట్టదు.

వినోదిని:— క్షమించాను.

అంతట అధీరుడైన మహేంద్రుడు వినోదినిచేత క్షమా ప్రేమలకు నిదర్శనంగా చేతిలో చేయి వేయించుకోనాలని ఉద్విగ్నుడయాడు. కాని వినోదిని ముఖలక్షణాలు చూడగానే అలా అడగడానికి సాహసించలేకపోయాడు. స్తబ్ధుడై నిలబడి పోయాడు. వినోదిని మెట్లుగుండా దిగిపోయింది. మహేంద్రుడు తిన్నతిన్నగా మెట్లమీాదనుండి పైడాబామీాదికి వెళ్ళాడు. అక్కడ అటూఇటూ తిరుగ నారంభించాడు. బిహారి ఎదుట ఇవ్వాళ అంతా విస్పష్టమయిపోయిందనుకొన్నాడు. ఇందుకు మహేంద్రునికి దుఃఖం కలుగలేదు. ఇక నిశ్చింతగా వుండ వచ్చునని సంతోషించాడు. ఇలాంటి పనులు చాటుమాటుగా జరిపేవాళ్ళు తమ చేష్టలకు తామే అసహ్యించుకొంటారు. ఎవరో ఒకరికి తెలిసివుంటే ఆభయం, దుఃఖం, అసహ్యం చాలావరకు అన్నీ తొలగిపోతాయి.మహేంద్రుని పరిస్థితికూడా ఇలాగేవుంది. ఇప్పుడు నేను కల్లబొల్లిగా 'సచ్చరిత్రుడు' అనే పేరు పొందగోరడంలేదు. ఇప్పుడు నాధర్మం ప్రేమ; నేనామెను ప్రేమిస్తున్నాను; ఇది అసత్యంకాదు - అని తనలో అను కొన్నాడు మహేంద్రుడు.

తన ప్రేమమీాది గౌరవంతో అతడు తన దుష్ప్రవర్తనాన్ని తెలిసికొనికూడా, దాన్ని లెక్కచేయకుండా గర్వంతో పొంగి పోతున్నాడు.

అతడు ఆ ప్రశాంత సంధ్యాసమయంలో మౌనంగా తళతళలాడుతున్న నక్షత్ర సమూహంతో అలంకృతమైయున్న అనంతవిశ్వాన్ని తృణప్రాయంగా లెక్కకటి—'లోకం నన్ను

ఎంతచెడ్డవానిగానైనా భావించనీ, లేకదూషించనీ, నేను మాత్రం ప్రేమికుణ్ణి!' అని తనలో అనుకొన్నాడు.

తనమనసులో ప్రతిష్టించివున్న వినోదిని రూపంతో యావత్ప్రపంచాన్ని, ఆకాశాన్ని, తన సమస్త కర్తవ్యాల్ని కప్పివేశాడు మహేంద్రుడు. నేడు ఆకస్మికంగా బిహారివచ్చి మహేంద్రుని జీవనకళంకాలతో నిండివున్న సిరాపాత్రను తల క్రిందులుచేసి పగులగొట్టివేశాడు; వినోదిని నల్లని నేత్రాల లోను, నల్లని వెంద్రుకలలోనువున్న నలుపురంగు చూస్తూ చూస్తూ వుండగానే విస్తరించి మొదట కొంత తెలుపుగా కొంత నలుపుగావున్న చిత్రాన్ని ఏకాకారంగా అలికివేసింది—తన రంగులో లీనంచేసుకొన్నది.

# 28

మరుసటిదినం పడకనుండి నిద్రలేస్తూనే మహేంద్రుని హృదయం ఒకవిధమైన సుఖంతోకూడిన మధుర ఆవేశంతో నిండి పొంగిపొర్లుతున్నట్లనిపించింది. సువర్ణమయమైన ప్రభాత కాంతులు అతడి అన్ని అభిలాషల్ని, అన్ని ఆలోచనల్ని, సువర్ణమయంగా చేశాయి. పృథ్వి ఎంత సుందరంగావుంది, ఆకాశం ఎంత మనోహరంగావుంది, వాయువు పుష్పపరా గాన్నివలె తన మనస్సును ఎంతహాయిగా విహరింపచేస్తూవుంది!

ప్రొద్దు పొడవగానే ఒక భిక్షుకుడు ద్వారంలో కంజరి వాయిస్తూ పాడుతున్నాడు; నౌకరు అతణ్ణి వెళ్లమంటున్నాడు.

మహేంద్రుడు నౌకర్ను కోపించి భిక్షుకునికి ఒకరూపాయి యిచ్చిపంపాడు. నౌకరు గదిలోనుండి లాంతరు తెస్తున్నాడు; అజాగ్రత్తవల్ల లాంతరు క్రిందపడి ముక్కలు ముక్కలై పోయింది. నౌకరుభయంతో వణుకుతూ మహేంద్రునివైపు చూడసాగాడు; మహేంద్రుడేమీ మాట్లాడకుండా నవ్వుతూ గాజుముక్కలన్నీ జాగ్రత్తగా ఏరి వెలుపల పారవేయవల సిందిగా ఆజ్ఞఇచ్చాడు. అతడు ఈవేళ తనకుకలిగే యేచెడుగును చెడ్డగా భావించడమే లేదు.

ఇన్ని దినాలనుంచి ప్రేమ తెరచాటుగావుండి ఇంద్ర జాలం చేస్తూవుంది; నేడది ఎదుటికివచ్చి తెరతొలిగించింది. ప్రపంచాన్నంతా కప్పివేసిన తెర ఎగిరిపోయింది. ప్రతిదినమూ కనిపించే ప్రపంచంలోని అవినీతిఅంతా ఏమయిందో తెలియ డంలేదు. చెట్లూ ఆకులూ, పళ్ళూ ఫలాలు, పశుపక్షులు, మార్గంలోని జనసమూహం, పట్టణంలోని కోలాహలం, అన్నీ అందంగా కనిపిస్తున్నాయి. ఈ విశ్వ వ్యాపితమైన క్రొత్తదనం ఇంతకుముందు ఏమయింది?

వినోదిని ఈవేళ ఇతర దినాల్లోలాగా సాధారణభావంతో కనిపించదనుకొన్నాడు మహేంద్రుడు. నేటి సంభాషణలు కవితల్లో వ్రాయదగినవీ, భావసంగీతంలో ప్రకటింపతగినవి కూడా అవుతాయి.

మహేంద్రుడు ఈరోజును ఐశ్వర్యపూర్ణంగాను, సౌంద ర్యపూర్ణంగానుచేసి, సృష్టికంటె సంఘుంకంటె ఉత్కృష్టమైన 'అల్ఫలైలా' యొక్క 'అద్భుత దినం'గా మార్చివేయాలని

అనుకొంటున్నాడు. అది నిజంగానీ, స్వప్నంగానీ, దానిలో ప్రపంచపుకట్టుబాట్లు, బాధ్యతలు, వాస్తవికత ఏదీఉండజాలదు.

నేటి ఉదయాన్నుండి మహేంద్రుని మనస్సు చంచలంగాను, తొందరగాను, ఉత్సాహంగాను ఉంది. అతడు తన గదినుండి లేచి చాలాసేపు ఉద్యానవనంలో తిరుగుతూ వున్నాడు. ఈవేళ కాలేజికికూడా వెళ్ళలేకపోయాడు. ఆకస్మికంగా ఎప్పుడు కలిసికొనడం సంభవిస్తుందో; ఈలగ్నాన్ని ఏ పంచాంగకారుడు నిర్దేశింపకపోయాడు.

ఇంటి పనుల్లో మగ్నమైవున్న వినోదిని కంఠధ్వనులు ఒకప్పుడు వంటఇంటినుండి, మరొకప్పుడు సామానుగదినుండి వినిపిస్తున్నాయి. కాని మహేంద్రునికిది నచ్చడంలేదు. మహేంద్రుడు నేడు వినోదినిని ప్రపంచంనుండి తొలగించి తన మనసులో ప్రతిష్ఠించుకొన్నాడు.

ఏవిధంగాకూడా ప్రొద్దు గడవడంలేదు. అతడు స్నానం చేసి భోజనం చేశాడు. ఇంటి పనులన్నీ ముగిశాయి. మధ్యాహ్నమయింది, ఇంట్లో నిశ్శబ్దంగా వుంది, అప్పటికీ వినోదిని కంటబడలేదు. సుఖదుఃఖాలు, ఆశానిరాశలు మహేంద్రుని హృదయతంత్రుల నన్నింటినీ ధ్వనింపజేస్తున్నాయి.

నిన్న లాగుకొన్న 'విషవృక్షం' ప్రక్కమీదనే పడి వుంది. దాన్ని చూడగానే ఆ గింజులాట జ్ఞాపకం వచ్చి మహేంద్రుని శరీరమంతా గగుర్పొడిచింది. వినోదిని తన గుండెలక్రింద ఉంచుకొని పడుకొన్న దిండు తన తలక్రింద పెట్టుకొని 'విషవృక్షం' తీసి పేజీలు త్రిప్ప మొదలుపెట్టాడు.

పుటలు త్రిప్పుతూ త్రిప్పుతూ తన మనస్సును చదువులో లగ్నం చేశాడు; చదువుతూ చదువుతూ ఐదు గంటలయింది; కాని మహేంద్రుడది గ్రహించనేలేదు.

ఇంతలో ఒక పళ్ళెంలో పళ్ళు, మిఠాయీలు, మరొక పళ్ళెంలో తరిగి సువాసనగల పంచదార చిలకరించిన కర్బూజా ముక్కలు తీసుకొని వినోదిని గదిలోకి వచ్చింది. ఆ తెచ్చిన వన్నీ మహేంద్రుని ఎదుట వుంచి "ఏంచేస్తున్నారు మహేంద్ర బాబూ? ఇలా వున్నారేమిటి? ఐదు గంటలయింది, ముఖం కడుక్కోలేదు - బట్టలు మార్చలేదు. ఇంతవరకూ అలాగే పడుకొన్నారేమిటి?" అన్నది.

మహేంద్రుని మనసు చిన్నబోయింది. నేడు తాను అలావుండడానికి కారణం—వినోదిని అడుగవలసిన సంగతేనా? ఆమె ఆమాత్రం తాను ఊహించుకోలేదా? ఈ దినంకూడా మామూలు దినాలవంటిదేనా? అభిలాషలు చల్లబడిపోతా యేమోననే భయంచేత నిన్నటి సంగతుల్ని గురించి ఏమీ ప్రస్తాపించలేకపోయాడు మహేంద్రుడు.

అతడు ఫలహారం చేస్తున్నాడు. వెలుపల ఎండలో ఆరవేయబడిన మహేంద్రుని వస్త్రాలను తెచ్చి మడిచి పెట్టె లోను, అల్మైరాలోనూ పెడుతూవుంది వినోదిని. — "కొంచెం ఆగు, నేనూలేచి నీకు సహాయం చేస్తాను." అన్నాడు మహేంద్రుడు.

వినోదిని నవ్వుతూ—"మీకు నమస్కారం, మీరేమైనా చెయ్యండి, కాని సహాయంమాత్రం చెయ్యవద్దు." అన్నది.

మహేంద్రుడు త్వరత్వరగా లేచి చేతులు మూతి కడుక్కొని—"బాగావుంది! నీవు నన్ను బొత్తిగా నిష్ప్రయోజకునిగా భావిస్తున్నావే! సరే, ఇవాళ పరీక్షించుకో." అన్నాడు.

ఇలాఅని అవకతవకగా బట్టలు మడతపెట్టడానికి ప్రయత్నిస్తున్నాడు. అతడి చేతిలోని బట్టలు తీసుకొని—"అలా ఉండనీయండి. బాగా సహాయపడుతున్నారు, నాకింకా పని ఎక్కువ చేస్తున్నారు." అన్నది వినోదిని.

మహేం:— మంచిది. ఐతే నీవు చేస్తూవుండు, నేను చూచి నేర్చుకొంటాను.

అల్మేరాకుఎదురుగా వినోదినికి ప్రక్కగా క్రిందకూర్చొన్నాడు మహేంద్రుడు. ఆమె వస్త్రాలను విదిలిస్తున్నట్లుగా నటిస్తూ మహేంద్రుని మీదుగా వంగివంగి బట్టలుమడిచి అల్మేరలో పెడుతూవుంది. నేటికలయిక ఇలా ప్రారంభం అయింది. మహేంద్రుడు ఉదయాన్నుండికన్న కలల అపూర్వ చిహ్నలేమీ గోచరించడంలేదు. ఇలాంటి కలయికలో—కవితల్లో అల్లడానికి, సంగీతంలో గానంచేయడానికి, నవలల్లో వ్రాయడానికి తగిన సామగ్రి లభించదు.

అతడెంత ఆలోచించినా, తాను కల్పించుకొన్న మనోరథాన్ని ఎలా పూర్తి చేసుకోవాలో నిర్ణయించుకోలేక

పోయాడు.—ఎలా ఏర్పాటు చేయాలి, ఏ సంభాషణలు జరుగుతాయి, ఏయే భావాలు ప్రకటించవలసి వుంటుంది, సహజ సద్గుణాలనన్నిటినీ ఏమారుమూల నలిపి నాశనం చేయాలి—ఏమీ అర్థంకావడంలేదు. ఈవిధంగా బట్టలు విదిలించి మడిచిపెడుతూ—పరిహాసంచేస్తూ, తన అసంభవమైన వూహింపరాని గూఢస్వప్నాలనుండి విముక్తిపొందిస్వాస్థ్యాన్ని పొందాడు.

ఇదే సమయంలో రాజలక్ష్మి ఆగదిలోకి వచ్చింది— "అమ్మాయి బట్టలు మడుస్తున్నది, నీవిక్కడ కూర్చొని ఏమి చేస్తున్నావు?" అని మహేంద్రుని అడిగింది.

వినోదిని:— చూడు అత్తయ్యా, అనవసరంగా ఇక్కడ కూర్చొని నాపనికూడా సాగనివ్వడంలేదు.

మహేం:— బాగుంది, నేనుకూర్చొని ఎంత సహాయం చేస్తున్నాను.

రాజ:— నిజమేరా నాయనా! నా అదృష్టం! నీవు చాలా సహాయంచేస్తావు! అమ్మా, వీడికి చిన్ననాటినుండి ఇదేఅలవాటు. అమ్మా పిన్నమ్మలకు ముద్దుబిడ్డ కావడం చేత ఏపనీ తానుగాచేయలేదు. ఇలాఅని పనిపాటులు చేతగాని తన బిడ్డవైపు తల్లి ప్రేమపూర్ణమైన దృష్టితో చూచింది. ఆమె నిష్ప్రయోజకుడైన, తన ప్రేమకు పాత్రుడైన ముద్దు బిడ్డను ఏవిధంగాను కసుగందనీయరాదని వినోదినిని ఎప్పుడూ కోరుతూవుంటుంది. పుత్రునికి సేవచేసే కార్యభారాన్ని ఆమెకు అప్పగించి రాజలక్ష్మి చాలా సుఖంగాను, చింతారహితంగాను

ఉంది. ఇప్పుడు మహేంద్రుడు వినోదినిని గౌరవిస్తున్నాడని, వెళ్ళకుండా నిరోధిస్తున్నాడని ఆమెకు చాలా ఆనందం కలిగింది. "అమ్మాయీ, ఈవేళ మహేంద్రుని శీతాకాలపుదుస్తులు ఎండలో వేశావు, ఇవాళ రేపు క్రొత్త రుమాళ్ళమీద వాడి పేర్లు కుట్టు. నిన్నిక్కడికి తెచ్చి సుఖపెట్టలేకపోతున్నాము; పైగా రాత్రింబగళ్ళు పనులు చేయించి కష్టపెడుతున్నాము!" అని మహేంద్రుడు వినేలాగా అన్నది. రాజలక్ష్మి.

వినోదిని:— అత్తయ్యా, మీరిలా అనేలాగుంటే నన్ను మీరు పరాయిదాన్నిగా చూస్తున్నారని అనుకోవలసి వస్తుంది."

రాజలక్ష్మి ప్రేమతో "లేదమ్మా, నీలాంటి స్వంత మనుష్యులు నాకెక్కడ లభిస్తారు!" అన్నది.

వినోదిని అన్ని బట్టలూ పెట్టినతర్వాత "పాకుపట్టె మిఠాయి చెయ్యాలి; వెళ్ళి పొయ్యి వెలిగించనా, లేక ఇంకేమయినా పని వుందా?" అన్నది రాజలక్ష్మి.

వినోదిని:— లేదత్తయ్యా, ఇక మరేమీ పనిలేదు. పద మిఠాయి తయారు చేద్దాము.

మహేం:— అమ్మా, ఇప్పుడే వినోదినిచేత పనిచేయించి కష్టపెడుతున్నానని దుఃఖించావు, మళ్ళీ పని చేయడానికి లాక్కెళ్ళుతున్నావు!

రాజలక్ష్మి వినోదిని గడ్డంతాకి—"నాకోడలు సాక్షాత్ లక్ష్మివంటిది, ఆమెకు పనిచేస్తూ వుండడమే బాగుంటుంది." అన్నది.

మహేం:— ఇవాళ సాయంత్రం నాకు పనేమీలేదు, వినోదిని కేదయినా పుస్తకం చదివి వినిపిద్దామనుకొన్నాను.

వినోదిని:— అత్తగారూ, ఇది బాగావుంది, సాయంకాలం మనమిద్దరమూ వద్దాము.

'మహేంద్రుడు ప్రస్తుతం వంటరిగా గడుపుతున్నాడు; మేమందరం చేరి వాణ్ణి సంతోషపెట్టాలి' అనుకొని, రాజలక్ష్మి— "సరే, మంచిదే, మిఠాయి చేసినతర్వాత రాత్రివంటచేసి నేను కూడా వస్తాను. పుస్తకం చదువుతావా మహేంద్రా?" అని అడిగింది.

క్రీగంటితో మహేంద్రునివైపు చూచింది వినోదిని.

"ఆఁ చదువుతాను." అన్నాడు మహేంద్రుడు. కాని అతడివుత్సాహం ఒక్కసారిగా వెలవెల బారింది. వినోదిని కూడా రాజలక్ష్మితో వెళ్ళిపోయింది.

'నేనుకూడా ఈవేళ సాయంత్రం షికారుకువెళ్ళి ఆలస్యంగా వస్తాను.' అనుకొని మహేంద్రుడు వెంటనే బట్టలు వేసుకొనడం మొదలు పెట్టాడు. కాని బయటికి వెళ్ళలేక పోయాడు. చాలాసేపు డాబామీద తిరుగుతూ మధ్యమధ్య మెట్లవైపు చూస్తున్నాడు. ఆఖరుకు గదిలోకివెళ్ళి కుర్చీలో కూలబడ్డాడు. 'నాకు ఇంతసేపుకాగితే అందులోతీపి చచ్చి మిఠాయి బాగుండదనిచెప్పి, ఈవేళమిఠాయి తినడం మానేస్తాను.' అని తనలోతాను కోపంతో అనుకొన్నాడు.

ఈవేళ భోజనసమయానికి రాజలక్ష్మినికూడా వెంటబెట్టుకొని వచ్చింది వినోదిని. మెట్లెక్కి రావడంచేత రాజ

లక్ష్మికి అలసటకలుగుతూ వుంటుంది. అందువల్ల చాలా తక్కువగానే ఆమె పైకివస్తూవుంది. ఈదినం చాలా బలవంతం చేసి వినోదిని ఆమెను వెంటతీసుకొని వచ్చింది.—మహా కోపంతో గంభీరంగా కూర్చొని భోజనం చేస్తున్నాడు మహేంద్రుడు.

వినోదిని:— ఇదేమి మహేంద్రబాబూ, ఈవేళ తినడమే లేదే!

"ఆరోగ్యం బాగా లేదా?" అన్నది తల్లి.

వినోదిని:— నేనింతకష్టపడి మిఠాయి తయారు చేశాను; తప్పక తినాలి—కాని, బాగా లేనట్లుగావుంది. సరే, అలాగైతే వుండనీ! వద్దు, బలవంతంగా తినవలసిన అవసరం లేదు; అలాపడివుండనీ!

"బాగానేవుందే నీవుచెప్పేది! పాకం మిఠాయి నాకు చాలాఇష్టం, బాగా కుదిరిందికూడా; నీవువద్దంటే నేనువినేవాణ్ణి కాను." అని మిఠాయి పూర్తిగా తినివేశాడు మహేంద్రుడు; ఒక్కముక్కకూడా మిగల్చలేదు.

భోజనమైన తర్వాత వారుముగ్గురూ గదిలో కూర్చొన్నారు; కాని పుస్తకం చదివేవిషయం ప్రస్తావించనేలేదు మహేంద్రుడు!

"అరే మహేంద్రా, నీవిప్పుడు పుస్తకంచదివి వినిపిస్తానని చెప్పావు, చదవవూ; ఏపుస్తకం చదువుతావు?" అన్నది రాజలక్ష్మి.

"ఐతే ఆపుస్తకాల్లో రామకృష్ణులను గురించిగాని, దేవీ దేవతలను గురించిగాని ఏమీ వుండదు. అవి నీమనస్సుకు సంతోషాన్ని కలిగించవు." అన్నాడు మహేంద్రుడు.

సంతోషం కలుగదు? ఏవిధంగానైనా ఆనందించడానికే వచ్చి కూర్చొన్నది రాజలక్ష్మి. అతడు అరబ్బీభాషలో చదివి నప్పటికీ ఆమెకు సంతోషమే! ఆహా, పాపం మహేంద్రుడు ఒంటరిగా పడివున్నాడు, కోడలు కాశీకి వెళ్ళిపోయింది—అతడికి ఇష్టమైనది తల్లికి యెందుకు ఇష్టంకాదు? ఇష్టంకాకపోతే పనెలా సాగుతుంది?

"ఒక్కపని చెయ్యి మహేంద్రబాబూ, అత్తగారిగదిలో తులసీరామాయణంవుంది, దాన్ని తెచ్చి చదివివినిపించు. అది అత్తగారికి సంతోషమూ కలిగిస్తుంది; రామకీర్తనం చేసినట్లూ అవుతుంది." అన్నది వినోదిని.

మహేంద్రుడు కరుణాపూర్ణమైన దృష్టితో వినోదిని వైపు చూచాడు. ఇదే సమయంలో దాసివచ్చి "అమ్మా, చందూతల్లి వచ్చి మీగదిలో వున్నది." అని చెప్పింది.

చందూతల్లికి రాజలక్ష్మికి చాలా స్నేహంవుంది. ప్రొద్దుక్రుంకిన తర్వాత ఆమెతో సంభాషించకుండా ఉండడం దుస్సాధ్యం. ఐనప్పటికీ "ఈవేళ మహేంద్రునివద్ద ఎవ్వరూ లేరు. కొంచెం అతడితో మాట్లాడవలసిన విషయాలున్నాయి, రేపు తప్పక రావలసిందని ఆమెతో చెప్పు." అని దాసీతో అన్నది రాజలక్ష్మి.

"ఎందుకమ్మా, నీవామె నెందుకు చూచిరావు!" అని వెంటనే అన్నాడు మహేంద్రుడు.

"అవసరం లేదత్తా, నీవిక్కడే వుండు, నేను వెళ్ళి ఆమెదగ్గర కూర్చొంటాను." అన్నది వినోదిని.

చందూ తల్లివద్దకు పోకుండా వుండలేకపోయింది రాజలక్ష్మి. "నేను రెండు మూడు మాటలు మాట్లాడి ఆమెను పంపి వస్తాను; అంతవరకు నీవిక్కడే వుండు." అని వినోదినితో అని "మహేంద్రా, నా కొరకు ఎదురుచూడక చదవడం ప్రారంభించు." అని కొడుక్కి చెప్పింది. తల్లి వెళ్ళగానే ఆక్రోశం పట్టలేకపోయాడు మహేంద్రుడు. "వినోదినీ, నీవు బుద్ధిపూర్వకంగా నన్ను పీడిస్తావెందుకు?" అన్నాడు.

"బలేవారండీ, నేను మిమ్మల్నేమిబాధించాను? నేనిక్కడ ఉండడంవల్ల మీకు కష్టంగావుంటే ఇదిగో నేనిప్పుడే వెళ్లుతున్నాను." అని విస్మితురాలై మహేంద్రునితో అని, విచార సూచకమైన ముఖంతో లేచి బయలుదేరింది వినోదిని.

మహేంద్రుడు ఆమె చెయ్యిపట్టుకొని "ఇలాగే నీవు నన్ను బాధిస్తూ ఉడికిస్తున్నావు!" అన్నాడు.

వినోదిని:— బలే, నాలో ఇంత తీక్ష్ణం వుందని నాకు తెలీదు! కాని నీ హృదయంకూడా అంత తక్కువ కఠినం కాదు, బాగా ఓర్చుకొంటావు! నీ ముఖం చూస్తే నీవు ఉడికిపోతున్న లక్షణాలేవీ కనిపించడంలేదు!

"ముఖలక్షణాలు చూచి నీవేమి తెలుసుకొంటావు?" అని వినోదిని చేతిని బలవంతంగా లాక్కొని తన వణకుతున్న గుండెమీద పెట్టుకొన్నాడు.

"ఊఁహూఁ" అని అరిచింది వినోదిని. వెంటనే చేతిని విడిచిపెట్టి భయపడుతూ "ఏం తగిలింది?" అన్నాడు.

ఆ దినం వినోదినిచేతికితగిలిన గాయంనుండి రక్తం కారుతుండడం చూచాడు మహేంద్రుడు. "మరిచిపోయాను, నావల్ల గొప్ప అపరాధం జరిగింది. చెయ్యి తే మందు వేస్తాను." అన్నాడు దుఃఖంతో.

వినోదిని:— ఎందుకు, దానంతటదే మానిపోతుంది. నేను దానికి వైద్యం చెయ్యను.

మహేం:— ఎందుకని?

వినోదిని:— ఎందుకేమిటి, ఆగాయం ఉన్నదున్నట్లుగానే ఉండాలి.

వినోదిని వినోదం యేమో కొంచెంకూడా బోధ పడడం లేదు. ఆడుదాని మర్మం నిజంగా దేవుడుకూడా తెలుసుకోలేదు. మానవులేం తెలుసుకొంటారు! – అనుకొన్నాడు.

వినోదిని వెలుపలికి బయలుదేరింది. మహేంద్రుడు అభిమానం అడ్డు తగలడంచేత ఆమె నడ్డగించకుండా "ఎక్కడికి వెళ్లుతున్నావు?" అని అడిగాడు.

"పనివుంది" అని తిన్నగా వెళ్ళిపోయింది వినోదిని.

ఒక్క నిముషం కూర్చొని వినోదినిని మళ్ళీ తీసుక రావడానికి లేచి నిల్చున్నాడు; కాని మెట్లవరకు వెళ్ళి తిరిగి వచ్చి గది ఎదురుగా పచార్లు చేస్తున్నాడు.

వినోదిని నిత్యం తన వైపుకు అతణ్ణి ఆకర్షిస్తూవుంది, కాని దగ్గరకు రానీయడంలేదు. మరెవ్వరూ అతణ్ణి జయింప లేరని మహేంద్రునికి చాలా గర్వం. ఈసారి అతడి గర్వం కాస్తా బుగ్గిపాలైపోయింది; కాని, ప్రయత్నం చేస్తే ఇతరులను తన వశం చేసుకోగలననే గర్వంకూడా వున్నదతనికి; ఆ గర్వా నైనా నిలుపుకోగలడా? ఈవేళ అతడు ఓడిపోయాడేకాని ఓడించలేకపోయాడు; తన హృదయం విషయంలో చాలా వున్నతమైన భావాలున్నాయి మహేంద్రుడికి. అతడెవరినీకూడా తనంత ఉన్నతహృదయం గలవాడని అంగీకరించడు. కాని ఈవేళ ఆ భావం తలక్రిందులైపోయింది. ఉన్నత హృదయుడ ననే అభిమానాన్ని వదలుకోవలసివచ్చింది! తన శ్రేష్టత్వాన్ని పోగొట్టుకొనికూడా తాను గడించిందీలేదు. ముష్టిదొరకని ఫకీరై పోయాడు.

ఫాల్గుణ చైత్రమాసాల్లో బిహారికి వారి ఇలాకావాళ్ళ నుంచి చాలా తేనె వస్తూవుంటుంది. ప్రతి సంవత్సరం అందులో కొంత రాజలక్ష్మికి పంపుతూ వుంటాడు. ఈ సంవత్సరంకూడా బిహారి తేనె పంపాడు.

వినోదిని స్వయంగా తేనెపాత్ర తీసుకొని రాజలక్ష్మి వద్దకు వెళ్ళి "బిహారిబాబు తేనె పంపారు." అన్నది.

తేనె సామానుకొట్లో పెట్టమని చెప్పింది రాజలక్ష్మి. తేనె అక్కడ పెట్టి వినోదిని తిరిగి రాజలక్ష్మివద్దకు వచ్చి—"బిహారిబాబు ఎప్పుడూ మిమ్మ మరవడంలేదు. పాపం వారికి తల్లిదండ్రు లెవ్వరూ లేనందువల్ల మిమ్మే తల్లిగా భావిస్తు న్నారు." అన్నది.

రాజలక్ష్మి దృష్టిలో బిహారి మహేంద్రునికి నీడవంటి వాడు. మహేంద్రుని ఎదుట అతడు తన విషయాలు ఆలోచించలేడు; అతడు వారికి అమూల్యమూ, అయాచితమూనైన సహాయకుడు. కాని ఇప్పుడు వినోదినివచ్చి తల్లిలేని బిహారికి తల్లివని చెప్పగానే రాజలక్ష్మియొక్క పుత్రవంచితమైన స్నేహమయ హృదయంలో అదాటుగా బిహారి స్ఫురణకు రావడంవల్ల దుఃఖంచేత కంపించిపోయింది. నిజంగా బిహారికి తల్లిలేదు, వాడు నన్నే తల్లిగా భావిస్తున్నాడని ఒక్కసారిగా తన మనసుకు వచ్చింది.

రోగంలో, దుఃఖంలో, కష్టాల్లో అయాచితంగా వచ్చి శ్రద్ధతో సేవచేశాడు. ఆసేవను యేసంకోచం లేకుండా స్వీకరించింది రాజలక్ష్మి. ఆసేవనుగురించి యెవరిముందుకూడా కృతజ్ఞత ప్రకటించడమనే విషయమే ఆలోచనకురాలేదు. కాని బిహారిని గురించి ఆలోచించే వాళ్లెవరైనా ఉన్నారా?

అన్నపూర్ణ వుండగా బిహారిని కాస్తవిచారిస్తూవుండేది; కాని ఆమె బిహారిని తనచెప్పుచేతుల్లో వుంచుకొనడానికి కపట ప్రేమను ప్రకటిస్తూవుందని ఆరోపిస్తూవుండేది రాజలక్ష్మి.

'నిస్సందేహంగా బిహారి నాబిడ్డవంటివాడే.'అని ఒక్క-శ్వాస తీసుకొని, ఈవేళ ఒకనిర్ణయానికి వచ్చింది రాజలక్ష్మి.

బిహారి తనకు తనకుమారునికంటె ఎక్కు-వగా సేవ చేస్తున్నాడని, భక్తిగా వుంటున్నాడని, తనసేవకు ప్రతిఫల మేమీ లభించకపోయినా, చెడ్డగా భావించడంలేదని - అతడి శ్రద్ధ తగ్గడంలే'దనీ అనుకొని, ఆమె ఒక్క-నిట్టూర్పువిడిచింది.

"బిహారిబాబుకు నీచేతి భోజనం చాలా రుచిగా వుంటుంది." అన్నది వినోదిని.

"పులుసు మరెవరుచేసినా వాడికి రుచింపదు." అన్నది రాజలక్ష్మి ప్రేమగర్వంతో వుబ్బిపోతూ.

ఇలా మాట్లాడుతూ బిహారి చాలాదినాలనుండి రావడం లేదని స్మరణకు వచ్చింది. "సరేకాని, అమ్మాయీ, ఇప్పుడు బిహారి బొత్తిగా కనిపించడంలేదే?" అని వినోదినిని అడిగింది.

"నేనూ ఇదే యోచిస్తున్నానత్తయ్యా, నీకొడుకు పెళ్ళయినప్పటినుంచి భార్యావ్యవహారంలో పడిపోయాడు—ఇక ప్రియమిత్రులు వచ్చి ఏంచేస్తారు?" అన్నది వినోదిని.

వినోదిని ఆరోపణ రాజలక్ష్మికి సక్రమంగానే కనిపించింది. భార్య రాగానే మహేంద్రుడు తన హితచింతకులను దూరం చేసుకొంటున్నాడు. బిహారికి ఇది చెడ్డగాతోచవచ్చు-అతడెందుకు వస్తాడు? బిహారికూడా తనస్థితిలోనే వుండడం చూచి, బిహారిమీద సానుభూతి వృద్ధిపొందింది రాజలక్ష్మి హృదయంలో.—"చిన్నతనాన్నుండి స్వార్థరహితంగా మహేం

ద్రునికి మేలుచేస్తున్నాడు, వాడికోరకు అనేకసార్లు అనేక ఇక్కట్లకు గురి అయ్యాడు." అన్నది.

ఈవిధంగా బిహారిని అడ్డంగాపెట్టుకొని "రెండు దినాలు భార్య తనదగ్గర వున్నంతమాత్రాన చిరకాల బంధువును ఈ విధంగా నిరాకరించడం మహేంద్రుని పొరబాటు, అన్యాయమూ, అధర్మమూకూడా." అని తన అభియోగాన్ని సమర్థించుకొన్నది రాజలక్ష్మి.

"అత్తయ్యా, రేపు ఆదివారంకదూ, బిహారిబాబును విందుకుపిలిస్తే చాలా సంతోషిస్తాడు." అన్నది వినోదిని.

"నీఆలోచన చాలా బాగుందమ్మా, ఐతే మహేంద్రుని పిలిపిస్తాను, వాడు జాబువ్రాసి ఆహ్వానం పంపుతాడుబిహారీకి."

"వద్దు అత్తయ్యా, నీవుస్వయంగా ఆహ్వానంపంపించు."

"నీవలే నాకేమైనా చదువువచ్చా, ఏమిటి?"

"నీవు వ్రాయలేకపోతే నీబదులు నేనే వ్రాస్తాను." అని వినోదిని రాజలక్ష్మి పేరుతో జాబువ్రాసి మనిషిచేతికిచ్చి బిహారికి పంపింది.

ఆదివారం మహేంద్రునికి అమూల్యమైన దినం. శనివారం రాత్రినుంచి గాలిమేడలు నిర్మిస్తుంటాడు. రేపేం చెయ్యాలనే విషయాన్ని ఆలోచిస్తూ వుంటాడు. తన నిర్ణయాలకు అనుగుణంగా ఎన్నడూ జరిగిందేమీ లేకపోయినప్పటికీ, ఆదివారపు ఉదయం చాలా అందంగా మనోహరంగా వుంటుందతనికి; నగరవాసులు మేల్కొన్నందువల్ల వినిపించే కోలాహలం మనోహరగానంవలె అతడి వీనులకువిందుచేస్తుంది.

ఇదేమి చిత్రం? అమ్మ ఈవేళ ఏదయినా వ్రతంగాని, పూజగాని చేస్తుందా? రోజూలాగా ఈవేళ ఒకచోట కూర్చో లేదు, వినోదినితోపాటు ఆమెకూడా పనులు చేస్తూవుంది.

పనిపాటల హడావిడిలో పది గంటలయింది. ఇంతవరకూ వినోదినిని ఏకాంతంగా కలుసుకోడానికి వీలే చిక్కలేదు. పుస్తకం చదవాలని ప్రయత్నిస్తున్నాడు; కాని అతడి మనసు చదువులో నిమగ్నం కావడంలేదు. అప్పుడు వార్తాపత్రిక తీసి ఒక అనవసరమైన ప్రకటన చదువుతూ పది పదిహేను నిమిషాలు గడిపాడు.

ఇక వుండలేకపోయాడు మహేంద్రుడు. క్రిందికి వెళ్ళి చూచాడు; వసారాలో కూర్చొని ఇనుపపొయ్యిమీద అనేక విధాలైన తినుబండారాలను చేస్తూవుంది తల్లి. నడుముకు చెంగు బిగించి సామాలు తీసుకరావడం ఆమెకు అందించడంలో మగ్నమైవుంది వినోదిని.

"ఏమిటి ఈవేళ విశేషం? ఇంత హడావిడిగా పని చేస్తున్నారేమి?" అని అడిగాడు మహేంద్రుడు.

"అమ్మాయి నీకు చెప్పలేదా ? ఈవేళ బిహారిని విందుకు పిలిచాను." అన్నది రాజలక్ష్మి.

'బిహారికి విందు!' అతని శరీరమంతా అగ్నిజ్వాలలతో దహింపబడుతున్నట్లనిపించింది — "కాని, అమ్మా, నేను మాత్రం వుండను." అన్నాడు.

"ఏమి? ఎక్కడికి వెళ్ళుతావు?" అన్నది రాజలక్ష్మి చింతతో.

"నేను ఒక మిత్రునివద్దకు ఒక అవసరమైన పనిమీద వెళ్ళుతున్నాను."

"భోజనం చేసి మరీవెళ్ళు. ఆలస్యమేమీలేదు."

"నాకు అక్కడ విందువుంది."

మహేంద్రునివైపు ఒక్కమారు క్రీగంట చూచి "విందు వుంటే వారిని వెళ్ళనియ్యత్తయ్యా, పోనీ బిహారిబాబు ఈవేళ వంటరిగానే భోజనం చేస్తారు." అన్నది వినోదిని.

కాని తన చేతితో వండిన పదార్థాలు కొడుకు తినక పోతే ఆమెకు తృప్తి ఎలా కలుగుతుంది? ఆమె వెళ్ళవద్దని చెప్పేకొద్దీ అతడి హఠం ఎక్కువయింది. "చాలా అవసరమైన విందు, నేను తప్పక వెళ్ళాలి. బిహారిని పిలిచేముందు నాకు చెప్పితే బాగుండేది." అన్నాడు.

మహేంద్రుడుకోపంతో తల్లిని ఏడిపించాలనుకొన్నాడు. ఆమె ఉత్సాహమంతా కర్పూరంలాగా హరించిపోయింది. ఆమెకు ఎక్కడివక్కడ పారేసి, పోయి పడుకోవాలనిపించింది.

"అత్తయ్యా, నీవు చింతించవద్దు, అనవసరంగా బెదిరిస్తున్నాడు మహేంద్రబాబు; నీకెందుకు చూస్తూవుండు; ఈవేళ వారు వెలుపలికి విందుకు వెళ్ళనేవెళ్ళరు." అన్నది వినోదిని.

"నీకు తెలీదమ్మా, వాడు పట్టినపట్టువదలడు, అనుకొన్నది చేయకమానడు." అని తలఅడ్డంగాత్రిప్పి అన్నది రాజలక్ష్మి.

మహేంద్రుని విషయం రాజలక్ష్మికంటె ఎక్కువగా వినోదినికే తెలుసుననేవిషయం రూఢిఅయింది. అమ్మతో చెప్పి

బిహారిని వినోదినియే విందుకు పిలిపించిందని భావించాడు మహేంద్రుడు. అందువల్ల అతడికి ఈర్ష్య ఎక్కువయింది. బయటికి వెళ్ళిపోదామనే సంకల్పంకూడా శిథిలంకావడం మొదలుపెట్టింది. బిహారి యేమిచేస్తాడో — వినోదిని యేమి చేస్తుందో — ఇదిచూడకుండా ఎలా వుండగలడు? అదంతా చూచి బాధపడవలసివచ్చినా చూడకతప్పదు!

ఇన్నాళ్ళకు ఆత్మబంధువులాగా మహేంద్రుని ఇంటిలో అడుగుపెట్టాడు బిహారి. ఇది అతనికి చిరపరచితమైనఇల్లు; ఈ యింటిలో ఒకప్పుడు యింటిబిడ్డలాగా నానాఅల్లరి చేశాడు. ఈ మాటలనుకొంటూ జనానా గదిద్వారంలో ఒక్క క్షణ కాలం స్తబ్ధభావంతో నిలబడిపోయాడు. అతడికళ్ళలో నీళ్ళు నిండాయి. చాల కష్టంమీద కన్నీటిప్రవాహాన్ని ఆపుకొని, చిరునవ్వు నవ్వుతూ ఇంట్లోకిచొరబడి, అప్పుడే స్నానంచేసి తల ఆరవిప్పుకొంటున్న రాజలక్ష్మి పాదాలమీద తనశిరస్సు వుంచాడు. ప్రతినిత్యం వస్తూ పోతూవుండేరోజుల్లో ఎన్నడు యీవిధంగా నమస్కారం చేసేవాడుకాడు. ఈవేళ విదేశాల్లో వుండివచ్చినవాడిలాగా ప్రణామం చేశాడు. నమస్కారంచేసి లేచేసమయంలో అతడిశిరస్సుమీద చెయ్యివుంచి ఆశీర్వాదంచేసింది రాజలక్ష్మి.

ఆమె ఈవేళ తనహృదయంలో గుప్తంగావున్న ప్రేమ వల్ల, మామూలుకంటే అధికంగా ఆదరసత్కారాలు చేస్తున్నది బిహారికి. “బిహారీ, నీవు ఇన్నిరోజులనుండి ఇక్కడికెందుకు

రాలేదు? నేను రోజూ ఇదిగో ఈవేళ వస్తావు—ఇదిగో ఈవేళ వస్తావనే అనుకొంటున్నాను." అన్నది.

"అమ్మా, రోజూ నేను వస్తూనేవుంటే నన్నునీవు జ్ఞాపకంచేసుకోవడం ఎలాగ?" అనినవ్వి—"మహేంద్రదాదా ఎక్కడ?" అని అడిగాడు బిహారి.

"మహేంద్రునికి ఈవేళ ఎక్కడో విందట; అదిచాలా ముఖ్యమయిందట; అందువల్ల వెళ్ళాడు." అన్నది చింతాసూచకంగా రాజలక్ష్మి.

ఈమాట విని బిహారికి చాలా బాధకలిగింది. 'బాల్యమైత్రికి ఇదేనా పర్యవసానము?' అనుకొని ఒక దీర్ఘనిశ్వాసం విడిచి, తనదుఃఖాన్ని మరిచిపోవడానికి ఇలాఅడిగాడు—"అమ్మా, నాకొరకు ఈవేళ ఏమేమిచేశావో చెప్పు—కొంచెం వింటాను."

ఒక్కటొక్కటిగా తనకిష్టమైన పదార్థాలనన్నింటిని గురించి అడిగాడు. రాజలక్ష్మి వంటచేసినప్పుడంతా ఆవంటకాల రుచినిగురించి గోరంతలు కొండంతలుగా వర్ణించడం బిహారికి పరిపాటి. ఈవిధంగా ఆమె మాతృప్రేమను చూరగొని సుఖానుభూతిని పొందేవాడు. ఈదినంకూడా తాను వండిన పదార్థాలవిషయంలో బిహారి ప్రకటించిన ఉత్సాహం, ప్రపన్నతవల్ల ఆమె మహదానందాన్ని పొంది నవ్వుతూ నవ్వుతూ తన బిడ్డవంటి అతిథిని ఆశ్వాసించింది.

ఇదే సమయంలో మహేంద్రుడు వచ్చి "ఏం బిహారీ, ఎలావున్నావు?" అని నీరసభావంతో అడిగాడు.

"ఏం మహేంద్రా, నీవువిందుకు వెళ్లలేదా?" అని అదరి పడి అడిగింది రాజలక్ష్మి.

మహేంద్రుడు సిగ్గుపడ్డాడు; కాని తనసిగ్గును దాచ ప్రయత్నిస్తూ "వెళ్లలేకపోయాను, 'నాకు ఒకఅవసరమైన పని కలిగింది, రాజాలను' అని జాబువ్రాసి పంపాను." అన్నాడు.

ఇంతలో వినోదిని స్నానంచేసి వచ్చింది. ఆమెను చూచి బిహారి ఏమీ మాట్లాడలేదు. ఆరోజున ఆ గదిలో తాను చూచిన వినోదిని మహేంద్రుల ప్రవర్తన బిహారి యే మాత్రం మరచిపోలేదు.

వినోదిని బిహారివద్దకు వచ్చి "ఏం బిహారీబాబూ, నన్ను కొంచెంకూడా గుర్తించినట్లేలేదే!" అని తన సహజ కోమలస్వరంతో అడిగింది.

"ఎంతమందినని గుర్తించగలుగుతాను?"

"ఎందుకు గుర్తించలేరు! కాస్త ఆలోచించి వ్యవహ రించినట్లైతే చక్కగా గుర్తించవచ్చు."

మహేంద్రుడు, బిహారి భోజనానికి కూర్చున్నారు. రాజ లక్ష్మి దగ్గరగా కూర్చొని చూస్తూవుంది, వినోదిని వడ్డిస్తున్నది.

మహేంద్రుని మనస్సు భోజనంమీద లేదు. అతడు 'వడ్డనలో పక్షపాతం'మీద మాత్రమే తన మనస్సును లగ్నం చేశాడు - బిహారికి వడ్డించి అతడు తింటూవుంటే వినోదిని ఎక్కువగా ఆనందాన్ని పొందుతున్నట్లుగా మహేంద్రునికి అనిపించింది. 'బిహారి పళ్ళెంలో అంత పులుసు అంత కిస్ మిస్ కూర ఎందుకు పెట్టింది?' ఈ యారోపణకు ఆమెవద్ద తగిన

జవాబు సిద్ధంగానే వుంది — మహేంద్రుడు ఇంటివాడు, బిహారి ఆహ్వానంమీద వచ్చినవాడు.

రాజలక్ష్మి అప్పడాలు చాల రుచిగా తయారుచేస్తుంది. మిగిలిన ఒక్క అప్పడాన్ని బిహారి పళ్లెంలో వేయబోతూవుంది వినోదిని. బిహారి అడ్డుపడి "వద్దు వద్దు, మహేంద్రునికి అప్పడాలంటే మహాఇష్టం. అతనికి వెయ్యి." — అన్నాడు.

"ఊహుం, నాకక్కర్లేదు." అన్నాడు మహేంద్రుడు తీవ్రమైన అభిమానంతో.

వినోదిని తిరిగి బలవంతపెట్టలేదు. ఆ అప్పడాన్ని బిహారి పళ్లెంలో వేసింది. భోజనమైన తర్వాత మిత్రులిద్దరు లేచి బయటికి వెళ్లారు.

వినోదిని పరుగెత్తుకొంటూ వచ్చి "బహారీబాబూ, అప్పుడే వెళ్లకండి. కొంచెం పైకివెళ్ళి కూర్చోండి." అన్నది.

బిహారి:— నీవు భోజనానికి వెళ్ళవా?

వినోదిని:— వెళ్ళను; ఈవేళ ఏకాదశి.

కఠోరమైన వెటకారంతోకూడిన ఒక చిరునవ్వు తునక బిహారి ముఖంలో కనిపించింది. 'ఇటు ఏకాదశీవ్రతాల్తో ధర్మం నాలుగుపాదాలా నడిపిస్తూవుంది, అటు ఆవ్యవహారం కూడా'-అనేభావం ఆనవ్వులో గోచరిస్తూవుంది.

ఆవెటకారంతోకూడిన నవ్వులోని మర్మం వినోదినికి తెలియకపోలేదు. కాని వెనుక చేతికి తగిలినదెబ్బ నెలాగైతే భరించిందో, అలాగే ఇప్పుడీ కత్తివేటునుకూడా మౌనంగా

ఒప్పుకొన్నది. "నామీద ఒట్టుసుమా, కొంచెంసేపు పైకి వెళ్ళి కూర్చోండి." అని ఎంతో దీనభావంతో ప్రార్థించింది వినోదిని.

అసంగతమైన దుష్ట భావోద్రేకంతో మహేంద్రుడు "మీకు కొంచెంకూడా తెలివిలేదు—పని ఉండనీ లేకపోనీ, ఇష్టమున్నా లేకపోయినా కూర్చోక తప్పదు. ఇంతగా అధిక ఆదరాన్ని చూపడంలో అర్థమేమో నాకు గోచరించడం లేదు." అన్నాడు ఆకస్మికంగా.

వినోదిని పెద్దగానవ్వి అన్నది—"బిహారీబాబూ, మీ దాదా మాటలు వింటున్నారా! ఆదరానికి అర్థం ఆదరమే. శబ్దకోశంలో యీ శబ్దార్థాన్ని తెలుపడానికి మరొకశబ్దం వ్రాయబడి వుండలేదు. (మహేంద్రునితో) 'అధికంగా ఆదరించడం' అనేదానికి అర్థం చిన్నతనాన్నుంచి నీవేవిధంగా అనుకొంటున్నావో ఆవిధంగా మరెవ్వరు భావించకపోవచ్చు."

బిహారి వినోదినికి జవాబు చెప్పకుండానే మహేంద్రునితో—"దాదా, నీతో ఒక్కమాట చెప్పవలసి వుంది, కొంచెం విను." అని మహేంద్రుని తీసుకొని బయటికి వెళ్లాడు. వినోదిని మాట్లాడకనే పంచలో నిల్చొని శూన్యాకాశంలోకి తన శూన్య దృష్టులతో చూస్తూవుంది.

బిహారి వెలుపలికి వచ్చి—"మహేంద్రదాదా, మన మైత్రికి ఇక ఇక్కడితో భరతవాక్యం పలికినట్లేనా?" అన్నాడు.

ఆసమయంలో మహేంద్రుని హృదయం మండిపోతూ వుంది. విషయుతమైన బాణాల్లాగా వినోదిని వ్యంగ్యవాక్యాలు అతడి హృదయాన్ని ఛేదిస్తున్నాయి. "మైత్రికి భరతవాక్యం

పలకడంవల్ల నీవుకోరే సదవకాశం నీకులభించవచ్చు; నేను మాత్రం ఈమైత్రి ఇక్కడితో అంతంకావడాన్ని అంత వాఛనీయ విషయంగా భావించడంలేదు. నేను నా స్వవిషయాల్లో వెలుపలివ్యక్తులు ప్రవేశించడం అంగీకరించను—అంతఃపురాన్ని అంతఃపురంగానే వుంచగోరుతున్నాను.”

బిహారి బదులు పలుకకుండా వెళ్ళిపోయాడు.

మహేంద్రుని శరీరం—మనస్సు ఈర్ష్యతో తుకతుకలాడి పోతున్నాయి. ‘ఇక వినోదినితో కలవకూడదు—మాట్లాడకూడదు’ అని ప్రతిజ్ఞచేశాడు; కాని కొంచెంసేపు తర్వాత వినోదినిని కలుసుకోవడంకోసం పొంచి చూస్తూ లోపలికి వెలుపలికి పైకి క్రిందికి వ్యగ్రుడై తారట్లాడడం మొదలు పెట్టాడు.

# 29

“పిన్నమ్మా, నీకెన్నడైనా మా చిన్నాయన జ్ఞాపకం వస్తాడా?” అని ఒకరోజున అన్నపూర్ణను అడిగింది ఆశ.

అన్నపూర్ణ:— నేను పన్నెండేళ్ళ వయస్సులోనే విధవనయ్యాను. వారిరూపం ఛాయామాత్రంగానే జ్ఞాపకం వుంది.

ఆశ:— అలాగైతే నీ వెవర్ని ధ్యానించడం?

అన్నపూర్ణ చిరునవ్వి “ఇప్పుడు నాస్వామి ఎవరిలో విలీనమై వున్నాడో ఆ జగదీశ్వరుని ధ్యానిస్తున్నాను.”అన్నది.

ఆశ:— ఇందువల్ల నీకు శాంతి లభిస్తుందా?

అన్నపూర్ణ ప్రేమతో ఆశ తలమీద నిమురుతూ—"నా మనసులోని ఈ విషయాన్ని నీ వెలా తెలుసుకోనగలవమ్మా, అది నా మనస్సుకే తెలుసు, ఇంకా నేను నిరంతరం ధ్యానించే ఆ యీశ్వరునికే తెలియాలి." అన్నది.

'నావల్ల రాత్రింబగళ్ళు ధ్యానింపబడేవారు నా మనసులోని విషయాన్ని తెలుసుకోనడంలేదా? నాకు జాబు వ్రాయడం బాగా రాదు; కాని వారు జాబువ్రాయడం ఎందుకు మానివేశారు?' అని తనలో అనుకొంది ఆశ.

ఇక్కడ ఆశకు మహేంద్రునివద్దనుండి జాబు రాలేదు. ఒక్క నిట్టూర్పు విడిచి ఆమె మనసులో ఇలా అనుకొన్నది—'నా చెలికత్తె ఇప్పుడు నావద్ద నున్నట్లైతే చక్కగా ఉత్తరం వ్రాసిపెట్టేదికదా!' వంకరటింకర అక్షరాలతో తాను జాబు వ్రాస్తే తనస్వామి ఆదరణను పొందదనే విశ్వాసంతో జాబు వ్రాయడానికి ఆశకు చేయి రావడంలేదు. ఒకవేళ గుండె రాయిచేసుకొని వ్రాయడానికి ప్రయత్నించినా ఆమె అక్షరాలు ఎగుడుదిగుడుగా అష్టావక్రంగా తయారవుతున్నాయి. తన మనసులోని విషయాలను ఎంత ఆలోచించి వ్రాయగోరినా అవి చిక్కులలో తగుల్కొని పెకలి రావడంలేదు. ఆమె తన లేఖలో 'శ్రీచరణేషు' అని వ్రాసి, చేనాలు చేయడంవల్ల అంతర్యామియైన దేవతలాగా తన మనసులోని భావాల నన్నింటిని మహేంద్రుడు తెలుసుకొనేలాగుంటే, ఆమె లేఖ వ్రాయడం సార్థకం కాగలదు - ఆహా! ఈశ్వరుడు ఆశనింత

ప్రేమాన్వితమూర్తిగా చేసికూడా దానిని ప్రకటింపగల చక్కని భాష నెందుకీయలేదు?

సాయంత్రం గోపాలకృష్ణునికి కర్పూరహారతి సమర్పించినపిమ్మట ఆశ తిరిగి అన్నపూర్ణదగ్గరకు వెళ్లి కూర్చొని మెల్ల మెల్లగా ఆమె పాదాల నొత్తసాగింది. చాలసేపు మౌనంగా గడచిన తర్వాత—"పిన్నమ్మా, భర్తను దేవతగా భావించి వారికి సేవజేయడం స్త్రీకి ధర్మమని చెప్పావు; తన భర్తృసేవ ఏలా చేయవలెనో యెరుగని అజ్ఞానయైన మూర్ఖురాలు ఏమి చేయాలి?" అని అడిగింది.

అన్నపూర్ణ కొంతసేపు ఆశ ముఖాన్ని పరికించింది; తర్వాత సానుభూతి పూర్వకంగా ఒక ఉఛ్వాసాన్నితీసుకొని— "అమ్మా, నేనూ మూర్ఖురాలనే, ఐనప్పటికీ భగవంతునికి సేవచేస్తున్నాను, వారి భజన చేస్తున్నానుకూడా." అన్నది.

ఆశ:—వారికి నీ మనస్తత్వము తెలుసు, అందుచేత ప్రసన్నుడవుతున్నాడు, కాని స్వామి మూర్ఖురాలి సేవవల్ల ప్రసన్నుడు కాడనుకో, అప్పుడు?

అన్నపూర్ణ:— అందరిని ప్రసన్నులనుగా చేసుకొను శక్తి అందరికి వుండదమ్మా! అంతరికశ్రద్ధ, భక్తికలిగి ప్రయత్నంతో స్వామిసేవ, గృహకార్య నిర్వహణం చేస్తూ వున్న భార్య సేవలను తన స్వామి నీచంగా భావించి స్వీకరించక పోతే, ఆ జగదీశ్వరుడే ఆ సేవలను స్వయంగా గ్రహిస్తాడు.

ఆశ ఇక మాట్లాడలేదు. పినతల్లి మాటలవల్ల వూరట చెందవలెనని ప్రయత్నించింది, కాని ఆమెకు 'స్వామి

తుచ్ఛంగా భావించి తృణీకరించినదానిని ఆజగదీశ్వరుడే సార్థకంగా భావించి స్వయంగా స్వీకరిస్తాడు' అనే విశ్వాసం కుదరలేదు. యథాప్రకారంగా పినతల్లి పాదాలు ఒత్తుతూవుంది.

అప్పుడు అన్నపూర్ణ ఆశ చేతిని పట్టుకొని తనకు దగ్గరగా తీసుకొని, శిరస్సు ముద్దుపెట్టుకొన్నది; తన రుద్ధమైన కంఠాన్ని ప్రయత్నపూర్వకంగా సవరించుకొని—"చున్నీ, దుఃఖానుభవంవల్ల – కష్టానుభవంవల్ల లభించే శిక్షణ ఆ దుఃఖాన్ని గురించిన కష్టాన్ని గురించిన కబుర్లు వినడంవల్ల లభించజాలదు. ఒకప్పుడు నేనుకూడా నీయీడులోనే కాపురపు వ్యవహారాలు నిర్వహించుకొనవలసిన స్థితి యేర్పడ్డది. అప్పుడు నేనుకూడా నీవలెనే "నేనెవరికి సేవచేస్తున్నానో ఆసేవ వారికి సంతోషాన్నెందుకు కలిగించదు? నేనెవరిపూజ చేస్తున్నానో వారి ప్రసాదాన్ని నేనెందుకు పొందలేను? నేనెవరి మంచికోసం ప్రయత్నిస్తానో, వారు నా ప్రయత్నాల్ని మంచి దృష్టితో ఎందుకు చూడరు?" అని భావిస్తూ వుండేదాన్ని. కాని అలా ఎంతమాత్రము జరుగజాలదని అడుగడుగుకు రుజువైపోయింది. నేను చేసినదంతా మన్నులో కలిసిపోయిందని తెలిసికొని, ఒకనాడు చాలా అసహ్యంవేసింది. వెంటనే నాకుగల సంసార సంబంధాలను త్రెంచివేసుకొని ఇక్కడికి చేరాను. కాని నా కృషి కొంచెంకూడా నిష్ఫలం కాలేదని, వ్యర్థం కాలేదని ఇప్పుడు బోధపడుతూవుంది. అమ్మా, మనతో నిజమైన లావాదేవీలు సంబంధం కలిగివున్నవాడు, ఈ ప్రపంచానికి మూలపురుషుడు, అగు జగదీశ్వరుడే నా సేవలనూ, పూజలనూ,

సత్కర్మలనూ గ్రహిస్తూవున్నాను. ముందే నేనీజ్ఞానాన్ని పొందగలిగివుంటే, నా పనుల నన్నింటినీ వారివిగానే భావించి చేస్తున్నట్లయితే, వారి అభిప్రాయాల కనుగుణంగా నా హృదయాన్ని ప్రపంచానికి సమర్పించి వున్నట్లయితే, నన్నెవరు దుఃఖింపజేయగలరు?" అన్నది.

అర్ధరాత్రివరకు అలాగే పడుకొనివుండి అనేక విషయాలనుగురించి ఆలోచిస్తూనేవుంది ఆశ. కాని ఆమెకు బాగా అర్థంకాలేదు. ఐతే పుణ్యాపరాయణయగు పినతల్లిమీద ఆమెకు అంతులేని భక్తిశ్రద్ధలున్నాయి. అందువలన పినతల్లి చెప్పిన విషయం చక్కగా అర్థంచేసుకోనలేకపోయినా అది తనకు శిరోధార్యంగా అంగీకరించింది. పినతల్లి ప్రపంచమంతటిలోనూ తన హృదయంలోను స్థానాన్నిఇచ్చి వున్నట్టి, ఆయీశ్వరునికి ఆ అంధకారంలో ప్రక్కమీద పడుకొని, కూర్చొని, లేచి కూడా మాటిమాటికి ప్రణామంచేసి ఇలా ప్రార్థించింది—"నేను బాలికను, మిమ్మెరుగను, నాకు నా స్వామి మాత్రమే తెలుసు. ఇదే అపరాధకారణమయితే నన్ను క్షమించాలి. ప్రభూ, నేను నాస్వామికి అర్పించే పూజలను గ్రహించవలసినదిగా నా స్వామికి చెప్పండి. వారు నాపూజలను గ్రహించకపోయినా—కాళ్ళతో త్రోసివేసినా నాకు మరణమే శరణ్యము. నేను నాపిన్నమ్మలాగా కేవలం మీ ఆశ్రయాన్నిపొంది జీవించజాలినంత పుణ్యాత్మురాలను కాను." ఈవిధంగా ఆశ చేతులు జోడించి మాటిమాటికి జగదీశ్వరునికి ప్రణామంచేసింది.

ఆశ పెదతండ్రి తిరిగి కలకత్తాకు ప్రయాణమైనాడు. ప్రయాణం కావడానికి ముందురోజు సాయంకాలం అన్నపూర్ణ ఆశను తనఒడిలో కూర్చొనబెట్టుకొని—"చిన్నీ, ఈ సంసార దుఃఖాలనుండి అశుభాలనుండి ఎల్లప్పుడూ నిన్ను కాపాడేశక్తి నాకులేదు. నీకు ఎవరివల్ల ఏకష్టంకలిగినా నీవు నీవిశ్వాసం మీద - నీభక్తిమీద - నీధర్మంమీద నిశ్చలంగా నిలవాలి! ఇదే నీకు నాఉపదేశము." అని చెప్పింది.

పిన్నమ్మ పాదధూళి తనశిరస్సున ధరించి "పిన్నమ్మా, నీ ఆశీర్వచనంవల్ల అలాగే కాగలదు." అన్నది ఆశ.

# 30

కలకత్తాకు తిరిగివచ్చింది ఆశ. వినోదిని ముఖం ముడుచుకొని, "ఇన్నిరోజులు పరదేశంలో ఉన్నావు. ఒక్క ఉత్తరంకూడా వ్రాయలేకపోయావే?" అన్నది.

"నీవెందుకు వ్రాయకూడదు?" అన్నది ఆశ.

"నేనెందుకు ముందువ్రాయాలి? నీవే ముందువ్రాయ వలసివున్నది." అన్నది వినోదిని.

ఆశ వినోదినిని కౌగలించుకొని, తన తప్పిదాన్ని అంగీకరించింది. "నాకు బాగా వ్రాయడంరాదని నీకు తెలుసుగదా అక్కా! ముఖ్యంగా నీలాంటిచదువుకొన్న సుందరికి ఉత్తరం వ్రాయడం నాకు లజ్జగావుంటుంది." చూస్తూ చూస్తుండ గానే చెలికత్తెలిద్దరి పరస్పరారోపణలు సమసిపోయినాయి. ఇద్దరూ ప్రేమపురస్సరంగా కౌగలించుకొన్నారు.

"రాత్రింబగళ్లు దగ్గరేవుంటూ నీవు నీస్వామి ప్రవర్తన నంతా తెరచివేశావు. ఎల్లప్పుడూ ఒకమనిషి ఆయనవద్ద కూర్చొననిదే వుండలేకపోతున్నాడు."

"అందుకోరకే వారిని నీకు అప్పగించింది. వెంటవుండే విధానమేమో నాకంటే నీకు బాగా తెలుసు."

"పగలుమాత్రం వారిని కాలేజికి పంపివేసి నిశ్చింతగా వుండేదాన్ని. కాని రాత్రిపూట ఏమి చేయవలెనో తోచేది కాదు. ఎప్పుడూ మాట్లాడుతూనే వుండాలి – పుస్తకాలు చదివి వినిపిస్తూ వుండాలి-అంటూ విడిచిపెట్టేవారుకారు."

"ఎంత ప్రయాసపడ్డావు! సఖీ, ఇతరులను మోహింపజేసే శక్తి నీకు వున్నది. ఇక నిన్నెందుకు విడిచిపెడతారు చెప్పు?"

"జాగ్రత్త సఖీ, నీభర్త నాతో చొరవజేసుకొని అధికంగా మాట్లాడడం కలిసిమెలిసివుండడంచూస్తే నేనువశీకరణ విద్యను కలిగివున్నానా అనే సందేహం కలుగుతూవుంది."

"అవును, ఆ విద్యలో నీకంటే తెలిసిన వారెవరు? నీవు ప్రవీణావైన ఈవిద్య కొంచెమైనా నాకు తెలిస్తే చాలా ధన్యురాలనవుతాను." అన్నది ఆశ నవ్వుతూ.

"ఎందుకు? ఎవరిని నాశనం చెయ్యదలచుకొన్నావు? ఇంట్లోవారిని కాపాడుకో, ఇతరులను మోహింపజేసే ప్రయత్నం వద్దు! చాలా చిక్కులు వస్తాయి!"

ఆశ వినోదిని నోరు మూస్తూ—"నోరు మూసుకో, ఏమిటావాగుడు?" అన్నది.

కాశీనుంచి తిరిగివచ్చిన తర్వాత మొదటి సమావేశంలో- "నీవు పిన్నమ్మవద్ద చాల సుఖంగా గడిపినట్లున్నావు, అందుచేతనే బాగా బలిశావు." అన్నాడు మహేంద్రుడు.

ఈ మాట ఆశకు చాలా సిగ్గుకలిగించింది. 'నేను బలవకుండావుంటే బాగా వుండేది. నేను చాలా మూర్ఖురాలను, నా పనులలో ఒక్కటీ మంచిదికాదు. నా మనసెంత బాగులేకపోయినా ఈపాడు శరీరం లావెక్కిపోయింది. అసలే నా మనసులోని భావం వెల్లడించుకొనే మాటలు చేతకావడంలేదు నాకు. ఈ పాడుశరీరం మాత్రం బలిసిపోయి నాకు వ్యతిరేకమైన భావాల్ని తెలియజేస్తోంది.' అనుకొన్నది ఆశ.

"మీరెలా వున్నారు?" అని మెల్లగా అడిగింది.

పూర్వపు దినాలలో మహేంద్రుడు కొంత హాస్యం కొంత అభిమానంకూడిన మాటలతో 'చస్తున్నాను' 'ప్రాణాలుపోయినంత పనయింది' అనేవాడు. కాని ఈవేళ అలా పరిహాసంగా మాట్లాడలేదు; నవ్వుతూ నవ్వుతూ ఆగిపోయాడు. సాధారణ భావంతో - "బాగానే వున్నాను. చెడుగేమీ లేదు." అన్నాడు.

ఆశ మహేంద్రునివైపు కన్నెత్తిచూచింది. అతడు వెనుకటికంటె బలహీనంగా కనిపించాడు, ముఖంలో నవకం లేదు, శరీరకాంతి పసుపురంగుగామారింది, కళ్ళలోకి ఒకవిధమైన మెరుపువచ్చింది. ఉదరంలో ఒకవిధమైన ఆకలిచిచ్చు రగుల్కొని, ఆచిచ్చు అతణ్ణి లోలోపలదహించి తినివేస్తున్నదా అన్నట్లున్నాడు.

ఆశ హృదయంలో చాలా బాధకలిగి—'ఆహా, నేను లేకపోవడంచేత నాస్వామికి చాలకష్టంకలిగింది! నేను కాశీకి వెళ్ళకపోయినా బాగుండేది!' అనుకొన్నది. తనస్వామి రోగీ, దుర్బలుడు అయినాడు. తాను బలిసిపోయింది. ఈకారణంచేత కూడా తనను తాను నిందించుకొన్నది.

కొంతసేపటివరకు ఏమి మాట్లాడడమాయని ఆలోచించి "పిన్నమ్మ బాగావుందా?" అన్నాడు మహేంద్రుడు.

ఈప్రశ్నకు సమాధానంగా పిన్నమ్మ కుశలవార్త విన్నాడు. ఇక ఎక్కువగా మాట్లాడడం కష్టమైపోయింది మహేంద్రునికి.

ఏమాట మాట్లాడడానికి తోచలేదు. ఆసమీపంలో ఒక చిరిగిపోయిన పాత వార్తాపత్రికపడివున్నది. దానిని చేతికి తీసుకొని భావనారహితమైన మనస్సుతో చదువసాగాడు. 'ఇన్నిరోజులకు తర్వాత కలుసుకొన్నప్పటికి వీరు నాతో హృదయ పూర్వకంగా మాట్లాడలేదు; కనీసం నావైపు చూపులో చూపుకలిపి చూడనుకూడా లేదు. ఏమిటికారణం? నేను జాబు వ్రాయనందుకు కోపంకలిగిందా? లేక పిన్నమ్మ మాట తీసివేయలేక ఇన్నిదినాలు కాశీలోవున్నందుకు కోపమొచ్చిందా?' అని ఆశ తలవంచుకొని, తన అపరాధంవల్లనే మహేంద్రునిలో ఈమార్పువచ్చినట్లు భావించి, వ్యాకులంతో కుమిలిపోయి, తనహృదయంలోనే ఆ అపరాధాన్ని పరిశోధించడానికి పూనుకొంది.

మహేంద్రుడు కాలేజికి వెళ్ళి తిరిగివచ్చాడు. సాయంకాలం మిఠాయిలు పళ్ళు మొదలయినవి తీసుకొని స్వయంగా రాజలక్ష్మి వచ్చింది. ఆశకూడా మేలిముసుగుతో కొంచెం దూరంలో తలుపుపట్టుకొని నిల్చున్నది. మరెవ్వరూలేరు.

రాజలక్ష్మి వ్యాకులంతో — "ఈవేళ నీఆరోగ్యం బాగాలేదా?" అని అడిగింది మహేంద్రుణ్ణి.

"లేకేమీ? ఆరోగ్యం బాగానేవుంది." అన్నాడు అన్యమనస్కభావంతో మహేంద్రుడు.

"అలాగైతే ఏమీ తినడంలేదెందుచేత?"

"బాగుంది, తినకేంజేస్తున్నాను?" అన్నాడు మహేంద్రుడు చిరాగ్గా.

ఎండాకాలం వచ్చింది. సాయంకాలం ఒక పల్చని పట్టు ఉత్తరీయం పైనవేసుకొని మహేంద్రుడు డాబామీద అటూయిటూ తిరుగుతున్నాడు. నియమంగా చదువుతూవున్న పుస్తకం చదవడం – నేడుకూడా సాగుతుందని చాలా ఆశపడుతున్నాడు. "ఆనందమఠం"దాదాపు పూర్తి కావచ్చింది. ఇంకా రెండుమూడు పరిచ్ఛేదాలు మాత్రమే మిగిలివున్నాయి,— 'వినోదిని యెంత నిర్దయురాలైనా ఆ రెండుమూడు పరిచ్ఛేదాలు చదివి వినిపించగలదు' అనే అనుకొంటున్నాడు. కాని సాయంకాలం అయింది, రాత్రి అయింది, వచ్చి చదివి వినిపించి వెళ్ళిపోయే సమయం దాటింది, అతని కోర్కె ఫలవంతం కాలేదు; బరువైన నిరాశాభారంతో అణిగిపోయి, నిద్రించడానికి పక్కమీదికి వెళ్ళవలసివచ్చింది మహేంద్రునికి.

లజ్జావతియైన ఆశ అలంకరించుకొని మెల్లమెల్లగా పడకగదికిచేరింది. పక్కమీద మహేంద్రుడు పడుకొనివున్నట్లు చూచింది. అప్పుడు ముందడుగు వేయడానికి కొంచెం బిడియం వేసింది. వియోగం తర్వాత తిరిగి కలవడంలో మొదట కొంత సేపటివరకు నవసంగమానికి ఇలాంటి లజ్జ వుంటుంది. వేరయి వెళ్ళినట్టి స్థలంలో, తిరిగి కలసికొనడానికి ముందు, ఒకరివలన వేరొకరు నవీనప్రేమ సంభాషణలను ఆశించడం సహజం.

నేడు ఆశ తన చిరపరిచితమైన ఆ శయ్యమీదికి పిలువకుండా ఎలా వెళ్ళగలదు? ఆమె ద్వారంలో చాలాసేపు నిల్చొనే వుంది – కాని మహేంద్రుడు మేల్కొన్న చిహ్నలేవీ కనిపించలేదు. చాలా మెల్లగా అడుగులు లెక్కపెడుతూ ముందుకు సాగింది. దైవయోగంవల్ల సంభవించే ఏదైనా అజాగ్రతవల్ల ఆమె ఆభరణం ఏదైనా స్పందించినప్పుడు ఆశకు చచ్చేటంత సిగ్గు కలుగుతూవుంది. దడదడ కొట్టుకొంటూ వున్న హృదయాన్ని తన చేతితో అదిమి పట్టుకొని తిన్నగా దోమతెర దగ్గరకు చేరింది. మహేంద్రుడు నిద్రిస్తున్నట్లుగా కనిపించింది. అప్పుడు తాను చేసుకొన్న శృంగారమంతా తననుచుట్టుముట్టి పరిహసిస్తున్నట్లనిపించిందామెకు. త్వరత్వరగా పరుగెత్తి వేరొకచోట ఎక్కడైనా పడి నిద్రపోతే బాగుండనిపించింది. ఆశ తన శరీరాన్ని వీలయినంతగా ముడుచుకొని తిన్నగా సెజ్జమీద కాలు పెట్టేసరికి మహేంద్రుడు నిజంగా నిద్రపోతున్నాకూడా మేల్కొనేటంతగా ఆ మంచం వూగిసలాడింది. కాని అతడు కళ్ళు తెరవలేదు. మహేంద్రుడు

నిద్రించలేదు, మేల్కొనే వున్నాడు. అతడు మంచముమీద ఒక చివరకు తన ముఖాన్ని అటు త్రిప్పి పడుకొన్నాడు; ఆశ అతనివీపువైపు ముఖంపెట్టి మెదలకుండా పడుకొన్నది. మహేంద్రుడు వేరొక దిక్కుకు ముఖంత్రిప్పి పడుకొన్నప్పటికీ, ఆశ మౌనంగా తనకళ్ళనుండి అశ్రుధారలను ప్రవహింపజేస్తున్నదనే విషయాన్ని గుర్తించకపోలేదు. అతని కాఠిన్యం తిరుగలిలాగా అతని మనస్సును పిండిపిండిగా జేసి బాధ కలిగిస్తూవుంది; కాని యెంత ఆలోచించినా ఆశను యెలా ప్రేమించాలో; ఎలా ఆదరించాలో, ఏ విధంగా యేమని ఆమెతో మాట్లాడాలో-మహేంద్రునికి బోధపడలేదు. అతడు లోలోపల తనను తానే నిందించుకొంటున్నాడు. ఇందువల్ల తాను బాధపడడమే తప్ప మార్గం కనిపించలేదు. 'తెల్లవారిన తర్వాత నిద్ర నటించలేనుగదా! తప్పక ఎదుట పడవలసివస్తుంది, అప్పుడామెముఖం ఎలా చూచేది? ఏమని మాట్లాడేది?' అని ఆలోచించడం మొదలుపెట్టాడు.

ఆశ తానే స్వయంగా అతణ్ణి ఈ అపాయంనుండి తప్పించింది. ఆమె చాలా పెందలకడనే నిద్రలేచి అవమానింపబడిన తన శృంగారాన్ని కూడాతీసుకొని వెళ్ళిపోయింది; ఆమెకూడా తన ముఖాన్ని మహేంద్రునికి చూపలేకపోయింది.

## 31

'ఇలా ఎందుకు జరిగింది? నా అపరాధమేమిటి?' అని ఆశ ఆలోచింపసాగింది. ఈ ఆపద నిజంగా ఎటునుండివచ్చిందో

అటువైపు ఆమెదృష్టి పోనేలేదు. మహేంద్రుడు వినోదినిని ప్రేమించగలుగుతాడనే ఊహకూడా ఆమెకు కలుగలేదు. ప్రపంచవ్యవహారాలలో ఆమెకు బొత్తిగా అనుభవంలేదు. ఇంతే కాకుండా పెళ్ళి జరిగినప్పుడు తన స్వామిని తానెలా భావించిందో దానికి విరుద్ధంగా ఆమె ఎంతమాత్రము ఊహింపజాలదు.

ఈదినం వేళకు ముందుగానే కాలేజికివెళ్ళాడు మహేంద్రుడు. వెనుకటిరోజుల్లో అతడు కాలేజికి బయలుదేరగానే గది కిటికీదగ్గరికివచ్చి నిల్చొని చూస్తూవుండేది ఆశ, అతడు కూడా ఒకసారి బండినుంచి తొంగిచూచేవాడు. ఇదివారి దిన చర్య. ఆ అభ్యాసం ప్రకారమే నేడుకూడా బండివచ్చిన ధ్వని వినిపించగానే మరబొమ్మలాగా ఆశ ఆ కిటికివద్దకు హాజరయింది. మహేంద్రుని కళ్ళుకూడా అభ్యాసవశంచేత ఒకసారి పైకిచూచాయి. ఆమెనిల్చొనివున్నదనీ, ఇంతవరకు స్నానం చేయలేదనీ, దుస్తులు మాసివున్నాయనీ, శిరోజములు చెదరివున్నాయనీ, ముఖం వాడివున్నదనీ, గ్రహించాడు. మరు క్షణంలో చూపు క్రిందికిమార్చి తనచేతిలోని పుస్తకం చదవ మొదలుపెట్టాడు. నేడు ఆ నేత్రచతుష్టయంలోని రసాన్వితమైన మానసంభాషణ లేమైనాయో, ఆభావపూర్ణమైన చిరునవ్వు లేమైనాయో అంతులేవు.

బండి వెళ్ళిపోయింది; ఆశ అక్కడే నేలమీద పడివుంది. ఈభూమి—దానిమీది ప్రతివస్తువూకూడా కళాహీనంగాను, సారహీనంగాను అయిపోయింది. కలకత్తాలో పని పాటలనే

ప్రవాహంలో ఉప్పెనవచ్చే సమయమది. పదిగంటలయింది, ఆఫీసులకువెళ్ళే బళ్ళు వరుసవరుసలుగా పోతున్నాయి. ఒక దానివెనుక వేరొకటిగా ట్రాముబళ్ళు వెళ్ళుతున్నాయి. ఆ మహావేగ కార్యకలాపాల సందడికి సమీపంలోనే ఆ పరిసరాలలో ఎవ్వరికీలేనంత వేదనతో-వాడిపోయిన హృదయంతో-నిశ్చేష్టమైపడివుంది ఆశ.

'ఆఁ తెలిసింది! నేనక్కడవుండగా ఒకసారి బిహారి కాశీ వచ్చాడు, ఇది తెలియడంవల్లనే వీరికి నాయందు కోపం వచ్చింది. ఇంతకు మినహా యీమధ్యకాలంలో వీరికి ఆగ్రహం కలిగించేపని వేరేమీ జరుగలేదు; కాని దానికిమాత్రము నా తప్పేముంది?' అని ఒకఆలోచన మెరుపులామెరిసింది ఆశ మనస్సులో.

ఈఘటననుగురించి ఆలోచిస్తూవుండగా ఆకస్మికంగా ఒకనిమిషంసేపు ఆమె హృదయచలనం ఆగిపోయింది. బిహారి కాశీకివెళ్ళడంలో ఆశకుకూడా ఏదో సంబంధమున్నదని, ఉభయుల అంగీకారంతోనే ఇదిజరిగిందని — మహేంద్రునికి సందేహం కలిగివుంటుందని—శంకించింది ఆశ. ఛీఛీ, ఎలాంటి సందేహం! ఎంతలజ్జాకరం! అసలు బిహారిపేరుతోకలిపి తన పేరు ఉచ్చరింపబడుతున్నందుకే సగం చచ్చిపోతున్నది, ఇక మహేంద్రునికి యిలాంటి అనుమానంకూడా కలిగిందంటే తాను ప్రాణత్యాగం చేయవలసిందే. ఒకవేళ అతనికి యీ అనుమానమే వున్నదనుకో, స్పష్టంగా ఎందుకు చెప్పరాదు! ఏదయినా అపరాధం చేసినట్లయితే తగు శిక్షవిధించేయేర్పాటు

చేయరాదు! కాని, మహేంద్రుడు ఏ విషయాన్ని మెత్త కుండా ఆశ కంటపడకుండా ముఖందాచుకొంటూ తిరుగుతున్నాడు. ఇందువల్ల మహేంద్రుడు తప్పక తనమనసులో సందేహానికిచోటిచ్చి, తర్వాత తానే అన్యాయంచేసినట్లు భావించాడని, తనయెదుట స్వయంగా ఆ అన్యాయాన్ని స్వీకరించడానికి లజ్జపడుతున్నాడని ఆశకు పదేపదే స్ఫురిస్తూవుంది. అలాకాకపోతే నేరస్తుడిమాదిరిగా వారి ముఖలక్షణాలు చింతాసూచకంగా—అనుమానాస్పదంగా ఎందుకున్నాయి? క్రుద్ధునిలో ఇలాంటి భీరులక్షణాలు కనిపించవు!

మహేంద్రుడు బండిలోనుంచి ఒక్కక్షణకాలం వాడిపోయిన ఆశముఖాన్ని చూచివెళ్ళాడు. దాని ప్రతిబింబం ఆపగలంతా అతనిహృదయంలో అంటిపెట్టుకొనే వున్నది. కాలేజిలో లెక్చరువినేసమయంలో వరుసలుతీర్చివున్న విద్యార్థులమధ్య - చెదిరిన వెంద్రుకలతో, మలిన వస్త్రాలతో, వ్యథితవ్యాకులదృష్టితో, మాటిమాటికి స్పష్టమైనరూపంతో మహేంద్రుని హృదయపటంమీద - కనిపిస్తూనేవుంది ఆశ.

కాలేజిపని ముగించుకొని మహేంద్రుడు దిగుడుబావి ఒడ్డున మెల్లమెల్లగా పచారుచేస్తున్నాడు. ఇంతలో సాయంకాలం అయిందది,కాని ఆశతో యేవిధంగా ప్రవర్తించాలి—అనేవిషయం ఇంకా నిర్ణయించుకోలేకపోయాడు—దయతో కూడిన మోసంతోనా? లేక నిష్కపటమైన క్రూరత్వంతోనా? ఏది ఉచితము?

ఇప్పుడుకూడా ఆశమీద తనకున్న ప్రేమ వేరొక స్త్రీకి లభించజాలదని తన మనసుకు సమాధానం చెప్పుకొన్నాడు మహేంద్రుడు. ఆ స్నేహాన్ని—ఆప్రేమను పొంది ఆశ యెందుకు తృప్తిపడదు? తనవద్ద వినోదినికి ఆశకు, వుభయులకూ స్థానాన్నివ్వగలిగిన ప్రశస్తమైన హృదయమున్నది. వినోదినితో అతనికి పవిత్రమైన ప్రేమసంబంధమున్నది, దానివల్ల తన దాంపత్యనీతి కేమీ భంగం కలుగజాలదు.

ఈవిధంగా తనకుతానే సమాధానం చెప్పుకొని, తన హృదయభారాన్ని తగ్గించుకొన్నాడు. వినోదిని – ఆశలలో ఏవరినీకూడా త్యజించకుండా, రెండు చంద్రబింబాలతో శోభిల్లుతున్న గ్రహంలాగా, తాను తన జీవితాన్ని సౌఖ్యవంతంగా గడుపుకొనగలడు—ఇలా ఆలోచించి మహేంద్రుడు చాలా సంతసించాడు; అతని మనస్సు వికసించింది. ఈ రాత్రి అంతా పడకమీద ప్రేమాదరాలతోను, స్నేహసల్లాపాలతోను, ఎకచకాలతోను ఆశకు కలిగిన మనోవ్యథనంతా కడిగివేస్తాను—అని నిశ్చయించుకొని మహేంద్రుడు వెంటనే బండియెక్కి—యింటికి వెళ్లాడు.

భోజన సమయంలో ఆశ రాలేదు. నిద్రపోవడానికి వస్తుంది లెమ్మని మహేంద్రుడు వెళ్ళి మంచంమీద పడుకొన్నాడు. కాని ఆ శూన్యకోటరంలో, ఆ శూన్యమైన శయ్యమీద ఎవరినిగురించిన స్మృతి మహేంద్రుని హృదయంమీద అధికారం వహించింది? ఇదివరకు ఆశతో జరిగిన నిత్యనూతనమైన ప్రేమలీలల స్మృతులే ఆ అధికారాన్ని వహించినవా?

లేదు! దినకరుని ప్రకాశంలో శీతకిరణునికి అస్తిత్వమే లేనట్లు అతని హృదయంలో పూర్వానురాగస్మృతి వెలవెలబోయింది. అచ్చట ఒక ప్రకాశవంతమైన స్త్రీమూర్తి నవకోమలమగు ఒక ముద్దరాలి లజ్జాపూర్ణమైన మధురకాంతులను కప్పివేసి, తన అధికారాన్ని స్థాపించుకొన్నది!

ఆ దినం 'విషవృక్షము' కొరకు వినోదినితో పెనుగులాడిన దృశ్యం మహేంద్రునికి జ్ఞాపకానికి వచ్చింది. ప్రొద్దు గ్రుంకిన పిమ్మట వినోదిని 'కపాలకుండల' చదివి వినిపిస్తూ వుండేది. తిన్నతిన్నగా రాత్రి చాలా గడచిపోతూవుండేది. ఆ రాత్రిపూట, శూన్యంగావున్న గదిలో — ఆ నిశ్శబ్దంలో వినోదిని కంఠస్వరం ఒక విధమైన ఆవేశంతో అతికోమలమవుతూ రుద్ధమైపోతూ వుండేది. ఆకస్మికంగా ఆమె తనను సమాళించుకొని పుస్తకం క్రిందబెట్టి లేచినిల్చొనేది. మహేంద్రుడు "నిన్ను మెట్లదిగువదాకా విడిచివస్తాను." అనేవాడు. ఈ విషయాలన్నీ మాటిమాటికి జ్ఞాపకానికి రావడంచేత మహేంద్రుని శరీరం గగుర్పొడిచింది. చాలా ప్రొద్దుపోయింది; ఇక ఆశ వస్తుందని అతని మనసులో ఆశపుట్టింది; కాని ఆమె రాలేదు.

'నేను నా కర్తవ్యపాలనకు సిద్ధంగావున్నాను. ఆశ నిరర్థకమైన అభిమానంవల్ల రాలేదు, అందుకు నేనేంచెయ్యాను?' అని తనలోతాను అనుకొన్నాడు మహేంద్రుడు.

ఇలా అనుకొని అర్ధరాత్రిసమయంలో అతడు తిరిగి వినోదిని ఆలోచనలో తీవ్రంగా పడిపోయాడు.

గడియారంలో ఒంటిగంటకొట్టింది. ఇక మహేంద్రుని శరీరం మంచంమీద నిలువలేదు; అతడు వెంటనే దోమతెరను తొలగించి వెలుపలికివచ్చాడు. డాబామీదకువచ్చిచూచాడు. ఎండాకాలపు వెన్నెలరాత్రి చాల మనోహరంగావుంది. తరగలులేని సాగరునిలాగా కలకత్తానగరం నిశ్శబ్దమైన నిద్రారాజ్యాన్ని స్థాపించుకొన్నది. ఆ అసంఖ్యాకమైన భవనపంక్తుల మీదుగా వాయుదేవుడు ఆ మహానగరవాసులనిద్రను ఇంకా ఘనీభూతంచేస్తూ మెల్లమెల్లగా సంచారం చేస్తున్నాడు.

అనేక దినాలుగానున్న ఆకాంక్షను మహేంద్రుడు ఇక సమాళించుకోలేక పోయాడు. ఆశ కాశీనుండి వచ్చిననాటి నుండి వినోదిని అతని కంటపడలేదు. వెన్నెలమదంతో విహ్వలమైయున్న ఆ నిస్తబ్ధరాత్రి మహేంద్రుని మోహింపజేసి వినోదినివైపు త్రోసుకొని తీసుకపోతూవుంది. అతడు మెట్లుదిగి క్రిందికివెళ్ళాడు. వినోదినిగది పంచలోకివచ్చి చూచాడు; తలుపు తెరచివుంది; లోపలికి వెళ్ళిచూడగా పక్కపరచి వున్నదేకాని యెవరూ నిద్రపోవడంలేదు. ఇంట్లో అడుగులచప్పుడు విని దక్షిణ దిక్కుగానున్న డాబామీదినుండి "ఎవరు?" అని అడిగింది వినోదిని.

మహేంద్రుడు గద్గదస్వరంతో "వినోదినీ, నేను." అన్నాడు దీనంగా. ఇలా అంటూనే ఒక్కఉరకతో వినోదిని దగ్గరకు వెళ్ళాడు.

ఎండాకాలపు రాత్రి కావడంచేత డాబామీద చాప పరచుకొని వినోదినితోబాటు పడుకొన్నది రాజలక్ష్మి. ఆమె

వెంటనే "మహేంద్రా, ఇంత ప్రొద్దుపోయి నీవిక్కడికెందుకు వచ్చావు?" అన్నది.

వినోదిని తన దట్టమైన కనుబొమల క్రిందనుండి మహేంద్రునిమీద వజ్రకఠోరమైన అగ్నిబాణాలను కురిపించింది. మహేంద్రుడు మారాడకుండా అక్కడినుండి వెళ్ళిపోయాడు.

# 32

మరురోజు ఉదయాన్నుండి మింటమబ్బులు క్రమ్మి సాగాయి. అనేక దినాలుగా సహింపరాని యెండలచే మండి పోతూవున్న ఆకాశమండలము స్నిగ్ధశ్యామల మేఘాలచే ఆవరించబడి చల్లగావుంది. నేడుకూడా వేళకు ముందుగానే కాలేజికి వెళ్ళాడు మహేంద్రుడు. అతడు విడిచిన వస్త్రాలు దణ్ణెంమీద చిల్లాకొల్లలుగా పడివున్నాయి. ఆశ మహేంద్రుని మాసిన వస్త్రాలు లెక్కించి నోటుబుక్కులో వ్రాసి చాకలికి వేస్తూవుంది.

మహేంద్రుడు స్వాభావికంగా అజాగ్రతపరుడు, ఆలోచనలేని మనిషి; అందువల్ల 'చాకలికి బట్టలు వేసేముందు జేబులన్నీ జాగ్రత్తగా పరిశీలించి చూచి మరీ వేయా'లని పూర్వమెప్పుడో ఆశకు చెప్పివుంచాడు. ఆ అభ్యాసవశంగా ఆశ అతని కోటుజేబులో చేయి పెట్టగానే దానిలో ఒక జాబు కనిపించింది. ఈ జాబు ఒక విషయుతమైన సర్ప రూపాన్నిపొంది వెంటనే ఆశను కరచివేస్తే బాగావుండేది;

ఎందుకంటే భయంకరమైన సర్పవిషం శరీరంలో ప్రవేశించి ఐదు నిముషాలలోనే ప్రాణాలు తీసివేస్తుంది. కాని యీ విషం శరీరంలో ప్రవేశించి మరణయాతన కలిగిస్తుందేకాని, మరణాన్ని కలిగింపదు. ఆశ తెరచియున్న జాబును వెలుపలికితీసి చూచింది. అది వినోదినిచే వ్రాయబడినట్టిది! క్షణంలో ఆశ ముఖం వెలవెల బారింది. ఆ జాబును తీసుకొని మరొక గది లోకివెళ్ళి తనగుండె నదిమిపట్టుకొని చదువ మొదలుపెట్టింది. దానిలో ఇలా వున్నది—

"రాత్రి మీరు చేసిన దుండగంతో యింకా తృప్తి కలుగలేదా? ఈవేళ మళ్ళీ దొంగతనంగా దాసీచేత నాకు జాబు పంపారు! ఛీ ఛీ, ఆ దాసి తన మనసులో ఏమనుకొంటుంది? మీరు నన్ను ప్రపంచంలో యెవ్వరికీ ముఖంచూపే యోగ్యత లేకుండా చేయదలచారా?

"మీరు నన్ను కోరేదేమిటి? ప్రేమ? మీ కీ భిక్షాటనం మీదికి బుద్ధి యెందుకు మళ్ళింది? పుట్టినప్పటినుండి నేటివరకూ నిరంతరమూ ప్రేమింపబడుతూనే వున్నారు. ఇంకా మీ లోభము మీ లాలస చావలేదా?

"ప్రపంచంలో నేను ప్రేమించగలిగినవారుగాని, నా ప్రేమను పొందగలవారుగాని ఎవ్వరూ లేరు. అందుకనే నేనుఆట పాటలతో ప్రేమదుఃఖాన్ని పోగొట్టుకొంటున్నాను. మీకవసరమైనప్పుడు మీరుకూడా ఈ కపటఖేలనంలో పాల్గొన్నారు. కాని యీఆటవిడుపుకు అంతంలేదా? శలవులు ఐపోయినవి; ఇక మీ యింట్లోనుంచి మీకు పిలుపు వచ్చింది, ఇంకా

యీఆటస్థలంలోకి' అటూయిటూ దిక్కులు చూడడమెందుకు? ఇక దుమ్ము దులుపుకొని యింటికి వెళ్ళండి. నాకు యిల్లూ వాకిలీ లేవు, అందుచేత నేను వంటిగా కూర్చొని ఆడుకొంటాను, మిమ్మ పిలువను.

"మీరునన్ను ప్రేమించమని వ్రాశారు. ఆటలసమయంలో ఇలాంటిమాటలు వినబడుతుంటాయి—కాని నన్ను నిజమడిగితే దానిని విశ్వసించలేను. ఒకనాడు మీరు ఆశను ప్రేమిస్తున్నట్లు భావించారు; అది కల్లయని తేలింది—ఇప్పుడు నన్ను కోరుతున్నట్లు-ప్రేమిస్తున్నట్లు భావిస్తున్నారు; ఇదికూడా పూర్ణానుస్వారమే. మీరు స్వలాభాన్నే కోరుకొంటున్నారు-అంతే!

"ప్రేమ పిపాసవల్ల నా ఆపాదమస్తకమూ యెండిపోయింది—ఆ పిపాస పోగొట్టడానికి, ఆకలి శమింపజేయడానికి ఉచితమైనసామగ్రి మీవద్ద లోపించింది; ఈవిషయాన్ని నేను ఆమూలాగ్రము పరికించాను. నన్ను విడిచిపెట్టమని మిమ్మ అనేకసార్లు హెచ్చరించాను. నన్ను వెంటాడవద్దన్నాను. సిగ్గుమాలినతనంతో నన్ను అవమానపరచకండి. ఇక ఆటలాడవలెననే నా ఆశకూడానశించింది. ఇక బొబ్బలుపెట్టినా మీకు నావల్ల ప్రత్యుత్తరం లభింపదు. మీ లేఖలో నన్ను క్రూరురాలినిగా వర్ణించారు—ఇది నిజమేకావచ్చు; కాని నాయందు కొంత దయకూడావున్నది — ఈ కారణంచేతనే ఇప్పుడు మిమ్మ దయతలచి వదలివేస్తున్నాను. ఈలేఖకు మీరు జవాబు ఇచ్చేలాగుంటే, ఇక ఇక్కడినుండి వెళ్ళిపోనిదే నీ చేతుల్లోనుంచి నాకు ముక్తి లేదని భావిస్తాను."

ఉత్తరంచదవగానే తనకు నలుదిక్కులావున్న ఆధరవులన్నీ విరిగిపోయినట్లూ, వంట్లోవున్న నాడులన్నీ ఒక్కసారిగా రక్తహీనమై శిథిలావస్థనుపొందినట్లు, శ్వాసించడానికికూడా శక్తిలేనట్లు, సూర్యభగవానుడు తనకళ్ళయెదుటినుంచి తన ప్రకాశాన్నంతా వుపసంహరించుకొన్నట్లు అనిపించింది ఆశకు. మొదట గోడను-తర్వాత అల్మేరాను-అటుతర్వాత పీటను-ఆధారంచేసుకొంటూ నేలమీద కూలబడ్డది. కొంతసేపటికి స్పృహవచ్చి ఆమె తిరిగి జాబు చదవడానికి ప్రయత్నించింది; ఐతే భ్రాంతచిత్తయైన ఆశ ఆలేఖలోని అర్థాన్ని గ్రహించలేకపోయింది — ఆలేఖలోని నల్లని అక్షరాలు ఆమె కళ్ళయెదుట నృత్యం చేస్తున్నాయి. ఇదేమిటి! ఇదేమైవుంటుంది! ఇది యెలా జరిగింది! ఇది పూర్తిగా సర్వనాశనమేనా! ఆమె ఏమిచేస్తుంది, ఎవరిని పిలువగలదు, ఆమెకెంతమాత్రము అర్థంకాలేదు. నీటిలోనుంచి బయటపడ్డ చేపలాగా వ్యాకులపడుతూవుంది, అలాగే ఆమె హృదయంకూడా గిలగిలకొట్టుకొంటూవుంది. ప్రవాహంలో మునిగిపోతూవున్నవ్యక్తి యేదైనా ఆధారం దొరుకునేమోయని మాటిమాటికి పైకి చేతులుచాచుతూ శూన్యాకాశంలో వ్యర్థప్రయత్నం చేస్తాడు. అలాగే ఆశ కూడా యేదైనా ఆధారం దొరుకుతుందాయని తనహృదయంలో వెదకడానికి ప్రయత్నిస్తూవుంది; కాని ఒక్కటీ చేతికందలేదు—అన్నిప్రయత్నాలు వ్యర్థమైనాయి. చివరకు గుండెనదిమిపట్టుకొని, ఒకదీర్ఘనిశ్వాసంతోపాటు-"పిన్నమ్మా!" అని కెవ్వున కేకపెట్టింది.

ఆ స్నేహ పూర్వకమైన పిలుపు ఉచ్ఛ్వాసంతో పాటు వెలుపలికిరాగానే ఆశకళ్ళనుండి అశ్రుధారలు జలజల ప్రవహింపసాగినవి. క్రిందకూర్చొని చాలాసేపు ఏడ్చినతర్వాత 'ఈజాబు తీసుకొని నేనేమిచేసేది?' అని ఆలోచిస్తూవుంది.

'ఈ జాబు నాచేతిలో పడ్డదని స్వామికి తెలిస్తే చాలా సిగ్గుపడతాడు.' అందువల్ల స్వామికి కలిగే మనోవ్యథను వూహించి చాల బాధపడ్డది. 'ఈ జాబును తిరిగి ఆకోటు జేబులోనే పెట్టి కోటు మేకుకుతగిలిస్తాను. చాకలికి వెయ్యను.' అని నిశ్చయించుకొన్నది.

ఇలా నిశ్చయించుకొని జాబు చేతిలో పట్టుకొని ఆశ తన పడకగదిలోకి వచ్చింది. ఇక్కడ చాకలి మాసిన గుడ్డల మూట నానుకొని నిద్రపోయింది. ఆశ మహేంద్రుని కోటుతీసి జేబులో జాబు పెడుతుండే సమయంలో "కంటి మెరమెరా!" అనే పిలుపు వినవచ్చింది.

ఆశ వెంటనే జాబును కోటును మంచముమీద పడవేసి వానిమీద కూర్చొన్నది. వినోదిని లోపలికివచ్చి "చాకలి యింటిలో బట్టలు చాలా మారుపడుతున్నాయి. గుర్తులు లేని వాటికి గుర్తులు వేయడానికి తీసుకవెళ్ళుతాను." అన్నది.

ఆశ వినోదినివైపు కన్నెత్తి చూడలేకపోయింది. ముఖ లక్షణాలవల్ల తన మనసులోని విషయాలు బయట పడిపోతాయేమోననే భయంతో ఆమె కిటికీలోనుంచి ఆకాశంవైపు పరికిస్తూ వుంది. కళ్ళనుండి కన్నీరు వస్తుందేమోనని పెదవులు రెండు బిగించుకొని కూర్చొన్నది.

వినోదిని ఆశవైపు చూచి కొద్దిగా ఉలికిపడింది. 'ఓహో! నిన్నరాత్రివిషయం తెలుసుకొన్నట్లున్నది. తప్పంతా నాదే అయినట్లు క్రోధమంతా నామీదనే ప్రయోగిస్తున్నదే!' అనుకొన్నది తనలో.

వినోదిని ఆశతో మాట్లాడడానికి ప్రయత్నించలేదు. ఆమె కొన్ని వస్త్రాలు యేరుకొని త్వరత్వరగా తన గదికి వెళ్ళిపోయింది. ఆశ యింతవరకు వినోదినితో సదుద్దేశ్యంతో మైత్రి నెరపుతూ వున్నది. ఆ మైత్రివల్ల కలిగిన లజ్జయే యీ భయంకరమైన దుఃఖంమీదకూడా తన ఆసనాన్ని అమర్చుకొన్నది. తన సఖి విషయంలో తనకున్న నిశ్చితాభిప్రాయాలతో అన్వయించుకొంటూ ఆ పాడువుత్తరాన్ని మరొకసారి చదువవలెనని కోరిక కలిగింది.

జాబు తెరచి చదువుతూవుంది ఆశ. ఇంతలో గబగబా మహేంద్రుడు గదిలోకి చొరబడ్డాడు. ఆకస్మికంగా యేదో జ్ఞాపకానికి రావడంవల్ల అతడు కాలేజిలో లెక్చరు వినడంకూడా విడిచిపెట్టి యింటికి వచ్చివేశాడు.

ఆశ ఆ వుత్తరాన్ని తన చీరచెరగు మాటున దాచుకొన్నది. మహేంద్రుడుకూడా గదిలో ఆశను చూచి కొంచెమాగి వ్యాకులంతో అటుఇటు చూస్తున్నాడు. అతడు వెదకుతున్నదేమో ఆశకు తెలుసు; కాని అతనికి తెలియకుండా ఆజాబును యథాస్థానంలో వుంచడమేలాగో అక్కడినుండి తప్పించుకొనడమేలాగో ఆమెకు తోచలేదు.

మహేంద్రుడు అచ్చట మాసిన వస్త్రాలను ఒక్కొక్కటిగా పైకెత్తి పరీక్షిస్తున్నాడు. అతడు పడుతున్న యీనిష్ఫలమైన ప్రయాస చూచి ఆశ వుండబట్టలేకపోయింది; ఆకోటును జాబును నేలమీద విసరివేసి తన కుడిచేతితో మంచపుకోడును పట్టుకొని ఆ చేతినే తనముఖానికి చాటుచేసుకొన్నది. మహేంద్రుడు మెరుపు మెరిసినట్లు ఆ జాబును లాక్కొని నిముషం నిస్తబ్ధుడై ఆశవైపు చూచాడు. అటు తర్వాత మహేంద్రుడు త్వరత్వరగా మెట్లు దిగిపోతున్న చప్పుడు ఆశకు వినిపించింది. వెంటనే చాకలి "అమ్మగారూ, బట్టలు వేయడానికి యింకా యెంత ఆలస్యముంటుంది? చాలా దూరం వెళ్ళాలి. చాలా సేపయింది." అని కేక పెట్టింది.

# 33

రాజలక్ష్మి నేటి ఉదయంనుండి వినోదినిని పలుకరించలేదు. వినోదిని మామూలుగానే వంటయింటిలోకి వెళ్ళింది. రాజలక్ష్మి ఆమెవైపు కన్నెత్తికూడా చూడలేదు.

అది మనసులో వుంచుకొని వినోదిని "అత్తయ్యా, మీ ఆరోగ్యం బాగాలేనట్లున్నది. అది సహజమే. నిన్నటిరాత్రి మహేంద్రబాబు అటువంటి పనేచేశాడు! అమాంతం పిచ్చెత్తినట్లుగా వచ్చివేశాడు. తర్వాత నాకు నిద్ర రానేలేదు." అన్నది.

రాజలక్ష్మి ముఖం వ్రేలాడవేసుకొని అవుననికాని, కాదనికాని అనలేదు. "బహుశా చున్నీతో ఏదో కీచులాట జరిగివుంటుంది. అందువల్ల తెల్లవారేవరకు ఆగలేక వెంటనే నా తీర్పుకొరకు వచ్చి వుండవచ్చు! అత్తయ్యా, నీవేమైనా చెప్పు, మీ కుమారునివద్ద ఎన్ని సద్గుణాలైనా వుండవచ్చు; కాని చిన్నమెత్తుకూడా ధైర్యంలేదు. అందుచేతనే నాకు వారికికూడా సరిపడడంలేదు." అని మళ్ళీ అన్నది వినోదిని.

రాజలక్ష్మి కోపంగా "వినోదినీ, ఏమిటీ అబద్ధపు వాగుడంతా—ఈవేళ నా మనసేమీ బాగులేదు." అన్నది.

వినోదిని:— అవునత్తయ్యా, నాకుకూడా ఈవేళ మనస్సేమీ బాగులేదు. ఇంతవరకూ నీకు దుఃఖం కలుగుతుందేమోననే భయంతో కల్లబొల్లిమాటలతో నీబిడ్డ దోషాలను దాచడానికి ప్రయత్నించాను. కాని ఇక దాగే పరిస్థితి దాటిపోయింది.

"నా బిడ్డ గుణదోషాలు నాకు బాగా తెలుసు. కాని నీవింత మాయావిని వనిమాత్రం తెలియదు." అని కోపంతో అన్నది రాజలక్ష్మి.

వినోదిని మొదట ఏదో అనడానికి సిద్ధపడింది; కాని వెంటనే సమాళించుకొని—"ఇది నిజమే, ఎవ్వరినీ, ఎవ్వరూ ఎరిగివుండరు. అందరికి తమ మనసులోని విషయాలు మాత్రం పూర్తిగా తెలుస్తాయా? నీవు నీకోడలిమీద కోపంతో యీ మాయావినిద్వారా నీకొడుకును మరపించగోరలేదా? కొంచెంయోచించి చూడు!" అన్నది.

రాజలక్ష్మికి ఈమాటతో వళ్ళుమండిపోయింది. "అభాగ్యురాలా, బిడ్డవిషయంలో తల్లికి యిలాంటి కళంకాన్ని రుద్దచూస్తున్నావా? నీ నాల్క తెగిపోను!" అని పెద్దగా గర్జించింది.

వినోదిని ఏమాత్రమూ చలించలేదు. "అత్తయ్యా, మన స్త్రీజాతియేమాయావినిజాతి. నాలోవున్న మాయ యేమిటో నాకు బాగా తెలియడంలేదు; కాని నీవు తెలుసుకొనగలిగావు. అలాగే నీలోవున్న మాయయేదో నీకూ తెలియదు; అది నేను తెలుసుకొన్నాను. ఇది నిజంగా మాయే కావచ్చు; లేకపోతే ఇలాంటి వ్యవహారాలెందుకు జరుగుతాయి. నేనుకూడా కొంత తెలిసీ కొంత తెలియక ఉచ్చులు పన్నాను. నీవుకూడా కొంత తెలిసీ కొంత తెలియక ఉచ్చులు పన్నావు. మన జాతిధర్మమే ఇలాంటిది — మనము మాయావినులము." అన్నది.

కోపం ఎక్కువకావడంచేత రాజలక్ష్మికి నోటినుండిమాట రాలేదు; ఆమె ఆ గదినుండిలేచి త్వరత్వరగా వెళ్లిపోయింది.

వినోదిని ఆగదిలో కొంతసేపటివరకు స్థిరభావంతో వంటరిగా నిల్చొనివుంది. ఆమెకళ్లనుండి నిప్పులుకురుస్తున్నాయి.

ఉదయపు పనిపాటలు పూర్తిచేసుకొని మహేంద్రునికి కబురుపెట్టింది రాజలక్ష్మి. నిన్నటిరాత్రిజరిగిన వ్యవహారాన్ని గురించి విచారణ జరుగుతుందని భావించాడు మహేంద్రుడు. అదే సమయంలో వినోదినివద్దనుండి తనజాబుకు జవాబు వచ్చింది. ఆజవాబు చదవడంవల్ల అతనిమనస్సు చిరాకుగాను చింతగానువుంది. ఒకబడ్డనుతాకినతరగ కొంచెం వెనుకకుతగ్గి

తిరిగి ఆదిక్కుకే వడివడిగా వెళ్ళుతున్నట్లు, వివిధములైన ఆలోచనా తరంగాలతో పొంగివున్న మహేంద్రుని చంచల హృదయం, వినోదినివల్ల దెబ్బతిని, క్షణం వెనుకకుతగ్గి మళ్ళీ ద్విగుణీకృతమైన వేగంతో ఆమెవైపుకే వెళ్ళుతూవుంది. 'అమ్మ, వినోదినివద్దకు సమయంగాని సమయంలో నేను వెళ్ళ డాన్నిగురించి ప్రస్తావించి, వినోదినిని బెదరిస్తుంది. అప్పుడు వినోదిని తన సహజ విద్రోహబుద్ధితో తన హృదయంలోని సంగతులన్నిటిని వెంటనే నిష్కర్షగా బయటపెడుతుంది. ఇలా ఆమె అన్నివిషయాలు వెల్లడించగానే ఇంట్లో గగ్గోలుపుట్టు తుంది.' ఇదంతా మహేంద్రునికి బాగా తెలుసు. ఇక యింట్లో వుండక బయటికివెళ్ళి యీ విషయాలనుగురించి బాగా ఆలో చించాలి అనుకొని, వెంటనే నౌకరునుపిలిచి "నేనీవేళ ఒక అవసరమైనపనిమీద కాలేజికి తొందరగా వెళ్ళుతున్నాను. తిరిగివచ్చాక వస్తానని అమ్మతో చెప్పు." అన్నాడు.

చదువుకు దొంగయైనపిల్లవాడు చదువకుండా బడినుండి పరుగెత్తి పోయేలాగా అతడు అన్నంకూడా తినకుండా త్వర త్వరగా బట్టలుకట్టుకొని యింట్లోనుంచి వెళ్ళిపోయాడు. వినోదిని వ్రాసిన ఆక్రూరమైన జాబును ఈవేళ ఉదయం నుండి మాటిమాటికి చదువుతూ జేబులోపెట్టుకొని తిరుగు తున్నాడు. బయటికి వెళ్ళిపోయే తొందరలో ఆ జాబు తాను విడిచిన కోటుజేబులోనే వుండిపోయింది.

కొంతసేపు బాగా వర్షంకురిసి ఆగిపోయింది; కాని ఆకాశంలో మేఘాలు క్రమ్మేవున్నాయి. ఈవేళ వినోదిని

మనసు చీకాకుగావుంది—ఆమెహృదయంలో చిచ్చురగుల్కొ-న్నట్లున్నది. మనసు బాగాలేనప్పుడు ఆమె వూరికేకూర్చోదు; పనిపాటల్లో ఆమెకింకా శ్రద్ధయెక్కు-వవుతుంది. ఈవేళకూడా యింట్లోవున్న బట్టలన్నీ ప్రోగుచేసి, వానిమీద సిరాగుర్తులు వేస్తూవుంది వినోదిని.

ఆశవద్దనుండి బట్టలు తెచ్చుకోనడానికివెళ్ళి ఆమె భావాన్ని చూడడంచేత వినోదినిమనస్సు యింకా పాడై పోయింది. ఒకవేళ ప్రపంచంయెదుట అపరాధినిగా నిలువవలసి వస్తే,. ఆ అపరాధఫలితంగా కలిగే కష్టానుభవంమాత్రమే నేనెందుకనుభవించాలి?—ఆ అపరాధానికి మూలమైనసుఖాలు నేనెందుకనుభవించరాదు?—అని ఆలోచిస్తూవుంది వినోదిని.

జోరున వర్షం కురుస్తూవుంది. తనగదిలో నేలమీద కూర్చొనివుంది వినోదిని. ఎదురుగా బట్టలు కుప్పవేసి వున్నాయి. దాసి ఒక్కొ-క్క-బట్ట అందిస్తూవుంది. సిరాతో బట్టలకు గుర్తులు వేస్తూవుంది వినోదిని.

పిలువాపెట్టకుండా ఆకస్మికంగా లోపలికి చొరబడ్డాడు మహేంద్రుడు. అతణ్ణి చూడగానే బట్టలు వదలివేసి ముసుగు సవరించుకొంటూ వెళ్ళింది దాసి.

వినోదిని తన చేతితోని బట్టను విసరికొట్టి, మెరుపు మెరిసినట్లు లేచి నిల్చొని – "వెళ్ళిపో, యీ గదిలోనుంచి వెళ్ళిపో!" అన్నది.

"ఎందుకు? నేనేంచేశాను?" అన్నాడు మహేంద్రుడు.

"ఏం చేశావా? పిరికిపందా! పౌరుషం లేనివాడవు, నీవేంచేయగలవు? ప్రేమించడమూ చేతకాదు, కర్తవ్యాన్ని పాలించేధైర్యమూ లేదు, ఇక నాకెందుకు చెడుపేరు తెస్తావు?" అన్నది వినోదిని.

"నేను నిన్ను ప్రేమించడంలేదూ? ఎంతమాటన్నావు?" అని దీనంగా అన్నాడు మహేంద్రుడు.

"ఔను, అదే నేననేది. దొంగతనంగా, చాటుమాటుగా ఒకసారి యిటు, ఒకసారి అటు – ఇలాంటి నీ దొంగనడత చూచి నీమీద నాకు అసహ్యం కలిగింది. ఇక బాగుండదు గాని, అవతలకు వెళ్ళు."

"నన్ను అసహ్యించుకొంటున్నావా వినోదినీ?" అని ఒక్కసారిగా మోహంలో పడ్డట్టుగా అన్నాడు మహేంద్రుడు.

"ఔను, అసహ్యించుకొంటున్నాను!"

మహేంద్రుని భావం మారిపోయింది–"వినోదినీ, ఇంకా ప్రాయశ్చిత్తం చేసుకొనే అవకాశం వుంది. నేను రెండు విధాలుగా ప్రవర్తించకుండా సమస్తమూ త్యజించి వచ్చేలాగుంటే నీవు నావెంట రావడానికి సిద్ధంగావున్నావా?" అంటూ వినోదిని రెండు చేతులు పట్టుకొని ఆమెను తన వైపుకు బలవంతంగా లాగుకొన్నాడు.

"విడిచిపెట్టు, నాకు బాగాలేదు." అన్నది వినోదిని.

"లేకపోతే పోయింది, చెప్పు, నావెంట వస్తావా?"

"రాను! ఎంతమాత్రమూరాను!"

"ఎందుకు రావు? నీవే నా సర్వనాశనానికి దారి చూపావు, ఇక నీవు నన్ను విడిచిపెట్టలేవు, నీవు రాకతప్పదు!" అని బలవంతంగా వినోదినిని తన గుండెదగ్గరికి లాగుకొని అలాగే అదిమి పట్టుకొని "నీఅసహ్యంకూడా యిక నన్ను వెనుకకు మరల్చజాలదు, నిన్ను తప్పక తీసుకొని వెళ్ళుతాను, యెలాగైనా సరే, నీవు నన్ను ప్రేమించక తప్పదు!" అన్నాడు.

వినోదిని తనశక్తికొలది ప్రయత్నించి మహేంద్రుని బాహుపాశాలనుండి విడిపించుకొంది.

"నీవు నాలుగువేపులా చిచ్చుముట్టించావు, ఇక దానిని చల్లార్చనూలేవు, తప్పించుకొని వెళ్ళనూలేవు." అని అంటూ వుండగా మహేంద్రుని కంఠస్వరం ఉచ్ఛస్థితికి పోయింది. "వినోదినీ, నీవు యిలాంటి ఆట యెందుకుఆడావు? ఇకదాన్ని ఆటయని త్రోసిపుచ్చడంవల్ల నీకు విముదల లభించదు! ఇక నిప్పుడు నీవు నేను ఒక్కసారిగా చావవలసిందే!" అన్నాడు.

ఇంతలో రాజలక్ష్మి వచ్చి "ఏమి చేస్తున్నావు మహేంద్రా?" అన్నది.

అతడు తన ఉన్మత్తదృష్టిని వినోదినివైపునుండి తల్లి వైపుకు మరల్చాడు; వెంటనేతిరిగి వినోదినివైపు చూచి— "నేను నా సర్వస్వమూ వదలిపెట్టి పోతున్నాను, చెప్పు, నీవు నావెంట వస్తావా రావా?" అన్నాడు.

కోపంతో తుకతుకలాడిపోతున్న రాజలక్ష్మి ముఖం వైపు ఒకసారి చూచింది వినోదిని. అటుపిమ్మట ముందుకుసాగి

స్థిరచిత్తంతో మహేంద్రుని చెయ్యిపట్టుకొని "వస్తాను!" అని చెప్పింది.

"ఐతే ఇవాళవుండు, నేను వెళ్ళుతున్నాను, రేపటి నుండి నీకంటె నావారు మరొకరుండరు!" అని మహేంద్రుడు వెళ్ళిపోయాడు.

ఇదే సమయంలో చాకలివచ్చి "అమ్మగారూ, ఇకనేను కూర్చోలేను. ఇవ్వాళ మీకు తీరికలేకపోతే మళ్ళీ రేపువచ్చి బట్టలు తీసుకవెళ్ళుతాను." అన్నది వినోదినితో. దాసీవచ్చి "అమ్మగారూ, గుర్రపువాడు దానా అయిపోయిందని అంటున్నాడు." అన్నది.

వినోదిని యేడురోజుల కొకసారి దానాతూచి గుర్రపుసాలకు పంపి గుర్రానికి దానాపెట్టే సమయంలో కిటికిదగ్గరగా నిల్చొని కనిపెడుతూ వుండేది.

నౌకరువచ్చి—"అమ్మగారూ, శంభు (రెండవనౌకరు) ఇవ్వాళ బాబుగారితో (దీననాథ్‌తో) పోట్లాడుతున్నాడు. నూనెపీపా లెక్కచూచుకొంటే నేను దొరగారివద్ద నౌకరీ చాలించుకొని మరొకచోట నౌకరీ చూచుకొంటానని అంటున్నాడు." అని చెప్పాడు.

ఈవిధంగా కుటుంబ వ్యవహారాలు—ఇంటి వ్యవహారాలు—వెనుకటిలాగానే సాగిపోతున్నాయి.

# 34

బిహారికూడా మెడికల్ కాలేజీలో చదువుతున్నాడు. సరిగ్గా పరీక్షల సమయంలో చదువు మానివేశాడు. ఇలా చేశావేమని యెవరైనా విస్మయంతో అడిగినప్పుడు "డాక్టరు నయి యితరుల స్వాస్థ్యాన్ని చూచేకంటే, ఇప్పుడు నా స్వాస్థ్యాన్ని నేను చూచుకోనవలసిన అవసరం యెక్కువగా వుంది."—అంటూవుంటాడు.

అసలు విషయమేమంటే బిహారికి ఒక్కటే పనిగాదు. ప్రతి క్షణమూ యేదో ఒక పని చేయనిదే వుండలేడు; కాని కీర్తిదాహం, ధనలోభం, జీవితం యెలా గడుస్తుందోననే చింత అణుమాత్రంకూడా అతనికి లేవు. కాలేజి డిగ్రీపొంది మొదట శివపురం కాలేజిలో ఇంజనీరింగు చదవడానికి వెళ్లాడు. అతడు అనుకొన్న ప్రకారం తగిన జ్ఞానం లభించగానే తిరిగి మెడికల్ కాలేజిలో చేరాడు. బిహారి కాలేజి డిగ్రీపొందడానికి ఒక సంవత్సరం ముందుగానే మహేంద్రుడు కాలేజి డిగ్రీ సంపాదించి మెడికల్ కాలేజిలో చేరాడు. కాలేజిలో బిహారీ మహేంద్రుల మైత్రి ప్రసిద్ధిపొందింది. సహాధ్యాయులు పరిహాసంగా వారిని—"అపురూప సహోదరులు" అని పిలుస్తూండే వారు. గడచిన సంవత్సరం పరీక్షలలో ఫేలయ్యాడు మహేంద్రుడు. మిత్రులిద్దరు ఒకే క్లాసులోకి రావడంచేత సహపాఠులు కూడా అయినారు. ఈ మధ్యలో యీ జంట యెందుకు విడిపోయింది-ఈ రహస్యాన్ని యేవిద్యార్థికూడా తెలుసుకోలేక

పోయాడు. మహేంద్రుడు తనతో కలుస్తాడనితోచే చోట్లకు వెళ్ళడం మానివేశాడు బిహారి. విధిలేక వెళ్ళవలసివస్తే త్వరగా తనపని ముగించుకొని వచ్చేవాడు. వారిద్దరు కలిసికొనడం సంభవిస్తే వారి ప్రవర్తన వెనుకటిలాగా వుండదని, ఇది చూచి లోకులు పరిహాసం చేస్తారని అతని వుద్దేశ్యం. ప్రొఫెసర్లు, విద్యార్థులుకూడా బిహారి ప్రథమశ్రేణిలో ప్యాసవుతాడని, గొప్ప గౌరవాన్ని – బహుమతుల్ని పొందుతాడని అనుకొన్నారు; కాని మధ్యలోనే అతడు చదువు మానివేశాడు. పరీక్షకు హాజరు కానేలేదు.

బిహారి యింటి సమీపంలోని ఒక కుటీరంలో ఒక బీద బ్రాహ్మణుడు నివసిస్తూవున్నాడు. అతడొక ముద్రణాలయంలో కంపోజిటరుగా వుంటూ నెలకు ఇరవై రూపాయలు తెచ్చుకొని దానితోనే పొట్ట గడుపుకొంటున్నాడు.

"మీ అబ్బాయిని నాదగ్గర వుంచండి. నేను వాడికి చదువు చెపుతాను." అని ఆ బీదబ్రాహ్మణునితో అన్నాడు బిహారి.

ఆ బ్రాహ్మణుడు చాల సంతోషించి తన యెనిమిది సంవత్సరాల యీడుగల వసంతుణ్ణి బిహారికి వప్పగించాడు. బిహారి తన పద్ధతిప్రకారం విద్య చెప్పడం ప్రారంభించాడు. "నేను పది సంవత్సరాల ప్రాయం వచ్చేవరకు పుస్తకం చదివించను; భాషమాత్రమే నేర్పుతాను." అని అతని తండ్రితో చెప్పివేశాడు.

ఆవసంతుని వెంటబెట్టుకొని ఆడుకొంటూ—కోటమైదానంలోనూ, ఆలిపూర్ పశుశాలలోను, శివపూర్ పార్కులోను, మ్యూజియంలోను తిరుగుతూ దినాలు గడుపుతున్నాడు బిహారి. అతడు పగలంతా ఆంగ్లభాష మాట్లాడడం నేర్పుతున్నాడు. మాటల్లోనే ముఖ్యమైన చారిత్రక విషయాలు భోధిస్తున్నాడు. అనేక విధాలుగా బాలుని మనస్సు ఎక్కువగా ఏ విద్యమీదికి పోతుందో పరీక్షించి, దానిని విశేషంగా భోధించి ఉత్సాహం కలిగిస్తూ, బాలుని ఉన్నతికి తీసుకొనిరావడం బిహారి తన కర్తవ్యంగా భావించాడు. అతడు గడియ కూడా విశ్రమించడంలేదు.

ఆరోజు సాయంత్రం బయటికి వెళ్ళడానికి వీలుగాలేదు. మధ్యాహ్నం రెండునిమిషాలుమాత్రమే వర్షం తెరపియిచ్చింది; మళ్ళా ఒంటిగంటనుండి తిరిగి వర్షం కురవడం ప్రారంభించింది. తనయింటి రెండవభాగంలో లాంపువెలిగించి కూర్చొని తన నవీనపద్ధతిలో వసంతునికి విద్యగరపడం మొదలుపెట్టాడు.

బిహారి:— వసంత్, ఈ యింట్లో యెన్ని దులాలున్నాయి? వెంటనేచెప్పు—లెక్కపెట్టకూడదు.

వసంతుడు:— ఇరవై.

బిహారి:— నీవు ఓడిపోయావు—పద్దెనిమిదే వున్నాయి. సరే, యీ కిటికీకి యెన్ని కమ్ములున్నాయి?

వసంతుడు:— ఎనిమిది.

బిహారి:— నీవు గెలుపొందావు.

ఈ బెంచి యెంత పొడుగువుంటుంది? — ఈ పుస్తకం యెంత బరువుంటుంది?—ఈ విధంగా ప్రశ్నించి వసంతుని ఊహాశక్తిని జ్ఞాపశక్తిని వృద్ధిచేస్తూవున్నాడు. ఈ సమయంలో నౌకరువచ్చి "బాబుగారూ, ఒకస్త్రీ—"అని యేదో చెప్ప బోతున్నాడు. ఇంతలో లోపలికి చొరబడ్డది వినోదిని.

బిహారి ఆశ్చర్యపడి "ఏమి విశేషం పెద్దవదినా?" అన్నాడు.

వినోదిని:—ఇక్కడ మీయింట్లో ఆడవారెవ్వరూ లేరా?

బిహారి:— ఇంటివారు బయటివారు యెవ్వరూలేరు. ఒక మేనత్తమాత్రమే వుంది; అమెకూడా మాయిల్లు కనిపెట్టు కొనివుంది, మా గ్రామంలో.

వినోదిని:— ఐతే నన్ను మీ గ్రామంలో మీయింటికి పంపండి.

బిహారి:— ఎవరని చెప్పి నిన్ను మాయింటికి తీసుక వెళ్ళేది?

వినోదిని:— దాసీ అని చెప్పండి. అక్కడ యింటి పను లన్నీ చేస్తాను.

బిహారి:— మా మేనత్త ఆశ్చర్యపడుతుంది. ఆమె దాసీని తీసుకురమ్మని నాకెన్నడూ చెప్పలేదు. సరే, ముందు ఇలా యెందుకు తలచుకొన్నావో చెప్పు? వసంత్, నీవు వెళ్ళి పడుకో.

వసంతుడు వెళ్ళిపోయాడు. "బాహ్య విషయాలను విని మీరు అంతర్విషయాలు తెలుసుకోలేరు." అన్నది వినోదిని.

బిహారి:— తెలుసుకొనలేకపోయినా లేక తప్పుగా అర్థం చేసుకొన్నా నష్టమేముంది?

వినోదిని:— సరే, మీరు యెలాగైనా భావించండి. మహేంద్రుడు నన్ను ప్రేమిస్తున్నాడు.

బిహారి:— ఇది క్రొత్త విషయంకాదు, తిరిగి వినాలనే కోరిక పుట్టేదికూడాకాదు.

వినోదిని:— మాటిమాటికి మీకు చెప్పవలెననే కోరిక నాకూలేదు. ఇందుకే నేను మీవద్దకు వచ్చాను. నాకు ఆశ్రయం యివ్వండి.

బిహారి:—నీకు కోరికలేదూ? ఐతే యీ కష్టం యెవరి వల్ల సంభవించింది? మహేంద్రుడు వెళ్ళే మార్గంనుంచి అతణ్ణి భ్రష్టునిగా చేసిందెవరు?

వినోదిని:— నేనే చేశాను. ఇది మీ యెదుట దాచ బోవడంలేదు. నేను చెడుదాన్నే కానీ మరేమైనాకానీ, ఒక సారి నా పక్షంలోవుండి నా హృదయస్థితిని అర్థం చేసుకొన డానికి ప్రయత్నించండి. నా హృదయజ్వాలలతోనే మహేం ద్రుని యింటికి నిప్పుముట్టించాను. ఒకసారి నేను మహేంద్రుని ప్రేమిస్తున్నట్లు భ్రమపడ్డాను. కాని అది పొరపాటు.

బిహారి:— ఇది నేనుకూడా యెరుగుదును. ప్రేమించే వాళ్ళు ఇలా నిప్పు ముట్టించలేరు!

వినోదిని:— బిహారీబాబూ, ఇది మీ శాస్త్రంలోని విషయం. ఇప్పుడుకూడా నాబుద్ధికి యీ విషయాలనన్నింటినీ వినే యోగ్యత కలుగలేదు. మీ ధర్మశాస్త్రాలు ఒకప్రక్కనునెట్టి

ఒక్కసారి అంతర్యామిలాగా నా హృదయాన్ని పరిశీలించండి. నేను నామంచిచెడ్డ లన్నింటినీ మీ యెదుట విప్పి చెప్పగోరుతున్నాను.

బిహారి:— వదినా, నేను శాస్త్రాలను యేకరువు పెడుతున్నానంటావా? హృదయాన్ని దాని నియమాలప్రకారం తెలిసికొనేభారం ఆ అంతర్యామిమీదనే వుండనీ. మనము శాస్త్రాలు చదివి తదనుసారంగా నడుస్తూవుంటే చివరికి మోసగింపబడడం సంభవించదు.

వినోదిని:— బిహారీబాబూ, వినండి. నేనిప్పుడు సిగ్గువిడిచి చెప్పుతున్నాను. మీరు నన్నీపనినుండి అడ్డగించగలరు. మహేంద్రుడు నన్ను ప్రేమిస్తున్నాడు, కాని అతడు పూర్తిగా గ్రుడ్డివాడు—నన్ను గుర్తించడం లేదు. మీరు నన్ను గుర్తించినట్లు ఒకసారి భావించాను. ఒకసారి మీరు నన్ను శ్రద్ధాభావంతో చూచారుకూడా; అవునా కాదా? నిజం చెప్పండి; ఇప్పుడా విషయాన్ని దాచడానికి ప్రయత్నించకండి.

బిహారి:— నిజమే చెబుతాను, ఆ రోజు నిస్సందేహంగా నీమీద శ్రద్ధ కలిగింది.

వినోదిని:— మీరు తప్పుచేయలేదు బిహారీబాబూ, కాని మీరు నన్ను గుర్తించికూడా, శ్రద్ధాదృష్టితో చూచికూడా, అక్కడే యెందుకుఆగిపోయారు? నేను నేడు సిగ్గువిడిచి మీవద్దకు వచ్చాను, సిగ్గువిడిచే అడుగుతున్నాను—మీరుకూడా నన్నెందుకు ప్రేమించలేదు? నాఅదృష్టం ఇలా మండిపోయింది. మీరుకూడా ఆశమీది కోరికలో మునిగిపోయారు—

లేను, మీరు కోపపడకండి బిహారీబాబూ, కూర్చోండి. మీ యెదుట నేను యేమాట దాచుకోను. మీరు ఆశాలతను ప్రేమిస్తున్నారు—ఈ విషయాన్ని మీరు స్వయంగా తెలుసుకొనజాలనప్పటికూడా, నేను తెలుసుకొనగలిగాను. కాని ఆమెలో యే మంచిచెడ్డలున్నాయో తెలుసుకొన ప్రయత్నించారా? విధాత పురుషులకు రెండే కళ్ళు యిచ్చాడా? ఆంతరిక దృష్టి యివ్వనేలేదా? మీరు దేనిని యెంతగాచూచి మోహితులవుతున్నారు? 'మీరందరూ అమాయకులు, హృదయాంధులు!' అనే నేను భావిస్తున్నాను.

బిహారి లేచి నిలబడి—"ఈవేళ నీవుచెప్పేది పూర్తిగా వింటాను, కాని అనకూడని మాటలను నాలుకమీదికి తేవద్దు. ఇదే నిన్ను నేను ప్రార్థించేది." అన్నాడు.

వినోదిని:— బిహారీబాబూ, మీకు బాధకలిగించేదేవో నాకు తెలుసు—కాని నేనెవరిశ్రద్ధను పొందివున్నానో, ఎవరిప్రేమ సంపాదనవల్ల నాజన్మ సార్థకమని భావిస్తున్నానో, అలాంటి మీ యెదుటికి ఏవ్యథతో యీ అర్ధరాత్రి సమయంలో భయము, సిగ్గు, శంకలనువిడిచి పరుగెత్తివచ్చానో, ఆ వ్యథ యెంత అగాధమైనదో తెలుసుకొని కొంచెం ధైర్యం వహించండి. మీరు ఆశను ప్రేమదృష్టితో చూడకున్నట్లైతే, నావల్ల ఆమెకు యీవిధంగా సర్వనాశనం జరిగివుండదు.

బిహారి ముఖం కళావిహీనమయింది—"ఆశకేమిజరిగింది? ఆమెకేమైనా హాని చేశావా?" అన్నాడు.

వినోదిని:—— మహేంద్రుడు తన సర్వస్వాన్ని విడిచి పెట్టి రేపు నన్ను వెంటతీసుకొని పోవడానికి సిద్ధంగావున్నాడు.

బిహారి గర్జిస్తున్నట్లుగా - "అలా జరగడానికి వీలులేదు, అలా ఎన్నటికీ ఏమాత్రమూ జరగడానికి వీలులేదు." అన్నాడు.

వినోదిని:—— ఎందుకు జరుగదు? మహేంద్రుని యిప్పు డెవరడ్డగించగలరు?

బిహారి:—— నీవే ఆపగలవు.

వినోదిని కొంతసేపు మౌనంగావుంది. తర్వాత బిహారి కళ్ళలోనికి తన దృష్టినిపోనిచ్చి - "నేనెందుకు అడ్డగించాలి? మీ ఆశ కొరకా? నాకు సుఖదుఃఖాలు లేవా? మీ ఆశ మేలు కొరకు, మీ మహేంద్రుని యింటిలోని శాంతి సౌఖ్యాల కొరకు, నాశాంతి సౌఖ్యాలకు తిలాంజలి యివ్వవలసిందేనా? ఈరకపు ధర్మశాస్త్రాన్ని ఇంత అధికంగా నేను అభ్యసించనూ లేదు, నేనంతటి త్యాగినీకాను——దీనికి ప్రతిఫలంగా నాకేమి లభిస్తుంది?

బిహారి ముఖం క్రమక్రమంగా కాఠిన్యాన్ని పొందింది. "నీవనేక విషయాలు స్పష్టంగా చెప్పడానికి ప్రయత్నించావు. ఇక నేనుకూడా ఒక్క విషయం స్పష్టంగా చెప్పివేస్తున్నాను. ఈ రోజు నీవు చేయించినపని, యిప్పుడు నీవు చెప్పేమాటలు చాలావరకు నీవు చదివిన సాహిత్యాన్నుండి దొంగిలించినవే. ఇందులో పన్నెండు వీసాలు నాటకంలాగా నవలలాగా కను బడుతూవుంది.

వినోదిని:—— నాటకము! నవల!

బిహారి:— అవును, నాటకమూ-నవలే! అదికూడ ఉత్తమశ్రేణికి చెందినదికాదు. ఇదంతా నీస్వంతమని భావిస్తున్నావు - కాని అది నిజంకాదు. ఇదంతా చౌకబారు సాహిత్యానికి ప్రతిబింబం! నీవు పూర్తిగా అమాయిక మూర్ఖ సరళ బాలికవైనప్పటికీకూడా ప్రపంచంలో ప్రేమింపబడకుండా ఉండలేవు. నాటకంలోని నాయికలు స్టేజిమీదమాత్రమే శోభిస్తారు; వారికి గృహంలో స్థానంలేదు.

తీవ్రమైన వినోదిని తేజస్సు, దుస్సహమైన దర్పము క్షణంలో యేమయిందో తెలియదు. ఆమె మంత్రబద్ధమైన సర్పంలాగా తలవంచి మాట్లాడలేదు. చాలాసేపటికి బిహారి వైపు చూడకుండానే శాంతంగా నమ్రభావంతో "మీరు నన్నేమి చెయ్యమంటారు?" అని ప్రశ్నించింది.

బిహారి:— ఏ అసాధారణమైన పనినీ చేయతలపెట్టవద్దు వినోదినీ, సాధారణ స్త్రీల సద్బుద్ధి యేమని చెపుతుందో అదే చెయ్యి. లక్షణంగా మీవూరు వెళ్ళిపో.

వినోదిని:— ఎలా వెళ్ళను?

బిహారి:— జనానా బండిలో కూర్చోబెట్టి మీ గ్రామ స్టేషనువరకు విడిచిపెట్టి వస్తాను.

వినోదిని:— ఐతే యీ రాత్రికి యిచ్చటే నిద్రించనా?

బిహారి:— వద్దు, నామీద నాకింత విశ్వాసంలేదు.

ఈ మాట వింటూనే వినోదిని బిహారి పాదాలమీద పడిపోయింది. అతని రెండు పాదాలు గట్టిగా హృదయానికి అదుముకొని "ప్రాణనాథా, ఇంత పిరికితనం వదలిపెట్టు, ఒక్క-

సారిగా శిలామయమైన దేవతా విగ్రహంలాగా కఠోర పవిత్రుడవు కాబోకు; చెడును ప్రేమించి కొంచెం చెడువాడవుకూడా అవు!" అన్నది.

ఇలాఅని వినోదిని మాటిమాటికి అతని పాదాలను ముద్దుపెట్టుకోనడం మొదలుపెట్టింది. ఆకస్మికంగా వినోదిని చేసిన యీ వూహింపరాని వ్యవహారంవల్ల ఒక్కక్షణం తన్ను తాను సమాళించుకొనలేకపోయాడు బిహారి. అతని శరీరంలోను మనసులోనువున్న నరాలన్నీ పట్లుతప్పి ఒక్కసారిగా సళ్ళిపోయినాయి. బిహారి యిటువంటి స్తబ్ధ - విహ్వాలస్థితిలో వున్నట్లు గమనించి, వినోదిని అతని కాళ్ళు విడిచిపెట్టి మోకాళ్ల మీదలేచి, ముక్కాలి పీటమీద కూర్చొనివున్న బిహారి మెడలో తన రెండు చేతులను వేసి-"ఓ నా జీవనసర్వస్వమా! నాకు తెలుసు, నీవు యెల్లకాలము నావాడవు కాలేవు. కాని నేడు ఒక్కగడియమాత్రమే నన్ను ప్రేమించు. తర్వాత నేను నా కారడవిలోకి వెళ్లిపోతాను. నేనుఎవరినుండీ ఏమీ ఆపేక్షించను. ప్రియతమా, నేను మరణించేవరకు జ్ఞప్తి వుంచుకోనడానికి మాత్రమే యీవస్తువును కోరుతున్నాను." అన్నది వినోదిని. ఆమె యిలా మాట్లాడుతూ మాట్లాడుతూ తన అరుణకపోలాలను అరుణాధరాల్ని ముందుకు చాచింది. ఒక్క గడియ యిద్దరు నిశ్చలులైనారు. గది నిస్తబ్ధమయింది. తర్వాత ఒక దీర్ఘమైన శ్వాస తీసుకొని తిన్నతిన్నగా తన మెడలోనున్న వినోదిని రెండు చేతులను తొలగించి, మరొక కుర్చీమీదికి వెళ్ళి కూర్చొన్నాడు బిహారి.

"రాత్రి ఒంటిగంటకు ఒక పాసింజరుబండి వెళ్ళుతుంది" అన్నాడు తన రుద్ధకంఠాన్ని సమాళించుకొంటూ బిహారి.

వినోదిని ఒక్కక్షణం ఆగి, మెల్లగా అస్పష్టస్వరంతో- "ఆబండిలోనే వెళ్ళుతాను." అన్నది.

ఇదేసమయంలో నట్టికాళ్ళతో వివస్త్రుడైన వసంతుడు, పరిపుష్టమైన పసిడిరంగుగల సుందర శరీరంతో బిహారి కుర్చీ వద్దకువచ్చి గంభీరభావంతో వినోదినివైపు చూస్తూ నిల్చొన్నాడు.

"నిద్రపోలేదా?" అని అడిగాడు బిహారి.

వసంతుడు జవాబు చెప్పకుండా అలాగే నిల్చొన్నాడు.

వినోదిని వానివైపు తన రెండుచేతులను చాచింది. వసంతుడు మొదట కొంచెం సందేహించాడు. తర్వాత మెల్ల మెల్లగా వినోదివద్దకు వెళ్లాడు. వినోదిని రెండు చేతులతో అతనిని తన హృదయానికి హత్తుకొని అశ్రుధారను ప్రవహింప జేసింది.

# 35

అసంభవమైనది సంభవం కావచ్చు, అసహ్యమైనది సహ్యమూ కావచ్చు. అలా కానిచో మహేంద్రుని యింట్లో ఆరాత్రి గడిచేదికాదు. సాయంత్రం వినోదినిచేత తనవెంట వచ్చేలాగా మాటతీసుకొని యింటినుండి వెళ్ళిపోయి, ఆరాత్రి తన మిత్రునితోపాటు కాలేజి బోర్డింగు హాస్‌లో

ఆగిపోయాడు మహేంద్రుడు. ఇంటికి రాలేదు. ఆరాత్రే ఆతడు వినోదిని పేర ఒకజాబు వ్రాసి పోస్టులో వేశాడు. వెంట రావడానికి సిద్ధంగా వుండమని ఆలేఖలో వ్రాశాడు, అంతకంటే మరేమీ లేదు.

ఆజాబు మరుసటిదినం మహేంద్రుని యింటికి చేరింది. ఆశకు లేవడానికికూడా శక్తి లేదు; మంచంలోనే పడివుంది. నౌకరు జాబుతీసుకొని వచ్చి — "అమ్మగారూ, జాబు" అన్నాడు.

ఆశ హృదయంలో పెద్ద దెబ్బతగిలినంత బాధకలిగింది. ఒక్కమాటుగా అనేక విధాలైన భావతరంగాలు పొంగి వచ్చాయి. వెంటనే తలయెత్తి జాబు చేతికి తీసుకొంది. తీరా చూస్తే అది వినోదిని పేరిట వ్రాయబడిన మహేంద్రుని జాబు. వెంటనే ఆశశిరస్సు దిండుమీద పడిపోయింది, మరేమీ చెప్పకుండా ఆజాబును నౌకరుకు యిచ్చివేసింది.

నౌకరు:— ఈజాబు యెవరికివ్వాలి?

ఆశ:— నాకు తెలియదు.

రాత్రి ఎనిమిది గంటలయింది, తుపానులాగా విసురుకొంటూ వినోదిని గదియెదుటికివచ్చి నిల్చొన్నాడు మహేంద్రుడు. ఇంట్లో దీపంలేదు; అంధకారం అలముకొని వుంది. జేబులోవున్న అగ్గిపెట్టెనుతీసి ఒకపుల్ల వెలిగించాడు. ఇల్లు శూన్యంగావుంది. వినోదినిలేదు; ఆమె వస్తువులు సామానుకూడా కనిపించలేదు. దక్షిణంవైపుగావున్న పంచ

పంచపాళీలోచూస్తే అక్కడా ఎవ్వరూ కనిపించలేదు. "వినోదినీ!" అని పిలిచాడు మహేంద్రుడు. జవాబులేదు.

'నేను చాలాపిచ్చివాణ్ణి. చాలా తెలివితక్కువపని చేశాను. అప్పుడే వెంటతీసుకొని వెళ్ళివుంటే బాగావుండేది. అమ్మ అనరానిమాటలు అనివుంటుంది. వినోదిని ఆ మాటలు విని భరించలేక వెళ్ళివుంటుంది.' అని జరిగిన పొరబాటుకు పశ్చాత్తాపపడ్డాడు మహేంద్రుడు.

ఈ ఆలోచన మనసులో కలగగానే ఇదేనిజమని అతడు నిశ్చయించుకొన్నాడు. వెంటనే వ్యాకులంతో అమ్మగదిలోకి వెళ్ళాడు. ఆగదిలోకూడా వెల్తురులేదు—ఐతే రెండోవైపు తలుపు తెరచి వుండంచేత ఆ అంధకారంలోకూడా రాజలక్ష్మి మంచంమీద పడుకొని వున్నట్లు కనిపించింది — "అమ్మా, నీవు వినోదినిని యేమైనా అన్నావా?" అని ఒక్కసారిగా క్రోధంతో అరిచాడు.

"నేనేమీ అనలేదు." అన్నది రాజలక్ష్మి.

"ఐతే ఆమె యెక్కడికి వెళ్ళింది?" అని వుద్రేకంతో అడిగాడు మహేంద్రుడు.

"నాకేమి తెలుసు?"

"నీవెరుగవూ? సరే, నేనే తెలుసుకొంటాను—ఆమె యెక్కడైనావుండనీ, తప్పక వెదకి తీసుకొనివస్తాను." అని తల్లిమాటలమీద నమ్మకంలేనట్లుగా అని వెంటనే అక్కడినుండి వెళ్ళిపోయాడు మహేంద్రుడు.

రాజలక్ష్మి "మహేంద్రా, అరే మహేంద్రా, ఇదిగో, నాదొక్కమాటవిని వెళ్ళు." అంటూ అతని వెంటబడ్డది.

ఒక్కక్షణంలో బయటికివెళ్ళి వెంటనే వెనుకకు తిరిగి వచ్చి "వినోదిని ఎక్కడికివెళ్ళింది?" అని నౌకరును అడిగాడు మహేంద్రుడు.

"మాకేమీ చెప్పి వెళ్ళలేదు, మాకు తెలియదు." అన్నాడు నౌకరు.

"తెలియదా?" అని గద్దించాడు మహేంద్రుడు.

"లేదు బాబూ, మాకేమీ తెలియదు." అని తిరిగి అన్నాడు నౌకరు.

ఇదంతా చూచి, అందరు కుట్రపన్ని వినోదినిని పంపి వేశారని, ఆ సమాచారము నాకు తెలుపకుండా తగు కట్టుదిట్టాలు చేసుకొన్నారనీ భావించి—"సరే, చూద్దాము." అన్నాడు.

అప్పుడు కలకత్తానగరిమధ్యంలో విద్యుత్కాంతులవల్ల లుప్తమైపోతున్న అంధకారంలో తమతమ వస్తువుల నమ్ముకొంటూ తిరుగుతున్నారు బేరగాళ్ళు. మార్గంలో అటూ యిటూ తిరిగే జనం గుంపులు గుంపులుగా వున్నారు. ఆ కోలాహలపూర్ణమైన సందడిలో చొరబడి చూస్తూచూస్తూ వుండగానే అదృశ్యమైనాడు మహేంద్రుడు.

# 36

బిహారికి చీకటి రాత్రిలో వంటరిగా కూర్చొని ఆలోచించే అలవాటు లేదు. అతడు తన వ్యవహారాలను గురించి గాని, తన జీవితాన్నిగురించిగాని ఆలోచించలేడు. ఎల్లప్పుడు చదువులోనే మగ్నమై వుంటాడు. అవసరంగా తోచినప్పుడే తన పనులలోగాని ఇతరుల పనులలోగాని ప్రమేయం కలిగించుకొంటాడు. ఇందువల్లలభించే కాలాన్ని బంధుమిత్రుల యోగక్షేమాలకు వినియోగిస్తూ వుంటాడు. స్వవిషయాలకంటె యిరుగుపొరుగువారి విషయాలకు ప్రాధాన్యాన్నిచ్చి ఆనందం పొందుతుంటాడు. కాని, ఆకస్మికంగా ఆనాడు అనుభవానికి వచ్చిన దెబ్బవల్ల వారందరినుండి విడివడి వేరై పోయాడు. ఆ ప్రళయాంధకారంలో ఆకాశం అంటుతూవున్న వేదనా పర్వతశిఖరంమీద యేకాకియై నిలువవలసివచ్చింది. అప్పటి నుండి తాను వంటరిగా వుండడానికి భయపడుతున్నాడు. అందువల్ల తన నెత్తిన కొన్ని పనులు బలవంతంగా వేసుకొని తనకు తోడుగావున్న మనస్సుకు స్వేచ్ఛగా తిరిగే అవకాశం లేకుండా చేయవలెనని భావించాడు.

కాని నేడు తన హృదయవాసినియైన ఆత్మను యే విధంగాకూడా మోసం చేయలేకపోయాడు. నిన్న వినోదినిని ఆమె యింటికి పంపివేశాడు, అప్పటినుంచి అతడేపనిలో నిమగ్నమై వున్నప్పటికీ, యేమనిషివెంట వున్నప్పటికీ, అతని

వేదనావ్యాకులమైన హృదయం అతణ్ణి తన నిగూఢమైన నిర్జనస్థానంలోకి నేరుగా యీడ్చుకొని పోతూనేవుంది.

అలసటవల్ల దుఃఖంవల్ల యీవేళ బిహారి తన ఓటమిని అంగీకరింపవలసివచ్చింది. రాత్రి తొమ్మిది గంటలై వుండ వచ్చు. బిహారి యింటికి ముందుభాగంలో డాబామీద సాయం కాలం కావడంచేత గ్రీష్మఋతువులోని చల్లని పిల్లవాయు వులు చాలా ఆనందకరంగా వీస్తున్నాయి. చంద్రోదయంలేని అంధకారంలో ఆ డాబామీద కుర్చీలో కూర్చొన్నాడు బిహారి.

నేటి సాయంకాలం తన విద్యార్థికి విద్యగరపలేదు; సాయంకాలం కాగానే వెళ్ళి పడుకొమ్మని ఆజ్ఞయిచ్చాడు. నేడు తల్లి విడిచిపెట్టిన బిడ్డలాగావున్న అతని హృదయాన్ని వోదార్చడానికి, తోడుగావుండడానికి, తనకు చిరకాలాభ్యస్త మైన ప్రేమసుధాస్నిగ్ధ జీవనంకొరకు, విశ్వవ్యాపినియైన అంధ కారంలో తన రెండుచేతుల్ని యెత్తి దేనినో వెతుకుతున్నాడు. నేడు ఆ ప్రేమసుధాప్రవాహం, ఘోరనియమాలతోకూడి దృఢంగావున్న అడ్డుకట్టను త్రెంచుకొని ప్రవహించింది. ఇక యోచించనేకూడదని ప్రతిజ్ఞచేసుకున్న విషయం వైపుకు ఈవేళ అతని హృదయం పరుగులుతీస్తూవుంది; నేడు దాని మార్గాన్ని నిరోధించేబలం అతనిలో పూర్తిగా లోపించింది.

మహేంద్రునికి తనకు వున్న బాల్యస్నేహం మొదలు కొని ఆస్నేహం అంతం అయినంతవరకుగల అన్నివిషయాలు అమూలాగ్రంగా యోచించ మొదలుపెట్టాడు బిహారి. అనేక

రంగులతోను సీటిపట్టులతోను భూప్రదేశాలతోను, నదులు పర్వతాలుతోను కూడివున్న దేశపటంలాగా తన మనస్సులో చుట్టచుట్టుకొనివున్న దీర్ఘమూ విశాలమూనైన కథాచిత్రాన్ని తెరచి చూస్తున్నాడు. ఒక చిన్న భూఖండంలో అతడు నిర్మించిన జీవనభవనం యెక్కడ యేదుష్టగ్రహంతో యెదురు తాకి విచ్ఛిన్నమైపోయింది? మొట్టమొదటిసారిగా అందులో వెలుపలినుంచివచ్చి ప్రవేశించినవారెవరు?—అని ఆచిత్రంమీద ధ్యానముంచి చూడడం మొదలుపెట్టాడు. ఈప్రశ్న వుద యించగానే అతని అంధకారమయమైన హృదయంలో తనకు పరిచితమైన సాంధ్యారుణకాంతులతో నిండిన లజ్జాలలితమైన ఆశాలత ముఖం కనిపించింది. అటుపిమ్మట వివాహమహో త్సవంలోని మంగళకరమైన పవిత్ర శంఖధ్వనులు ఆతని చెవులలో వినిపించాయి. ఈ శుభగ్రహం (ఆశ), అదృష్టా కాశంలోని అజ్ఞాతప్రాతంనుంచివచ్చి మిత్రులిద్దరి మధ్య ఆటంకంగా నిల్చి, వారిద్దరిమధ్య అంతరం యేర్పరచినట్లయింది. ఇదిగాక ఆమె ఎక్కడినుంచోగాని నోట వుచ్చరించరాని, హృదయంలో స్థానమీయరాని ఒక రహస్యవేదనను తెచ్చి యెదురుగావుంచింది. అయినప్పటికీ ఆ అంతరము, ఆ వేదన అపూర్వస్నేహంచేత అలంకరించబడిన మనోహర కిరణాలచే కప్పబడి పరిపూర్ణతను పొందింది.

ఆ తర్వాత ఉదయించిన శనిగ్రహం, ఆ ప్రబంధువుల ప్రణయాన్ని – పతిపత్నుల ప్రేమను–కుటుంబములోని శాంతిని పవిత్రతను ఒక్కసారిగా అంతంచేసింది. బిహారి పట్టరాని

కోపంతో ఆ శనిగ్రహరూపిణియైన వినోదినిని తన అంతస్థలం నుండి నెట్టివేయాలని ప్రయత్నించాను. అదేమాశ్చర్యమో కాని అతడు కొట్టినదెబ్బ దూదిపింజలాగా తేలిపోయింది; అది వినోదినికి తగులనేలేదు. ఆ 'పరమసుందరీ సమస్య' తన దుర్భేద్యమూ రహస్యపూర్ణమూనైన అనిమేష దృష్టితో కృష్ణపక్ష అంధకారంలో బిహారి యెదుట స్థిరభావంతో నిల్చొంది. ఎండాకాలపు రాత్రియందు వీస్తూవున్న దక్షిణపు గాలి ఆ వినోదినియొక్క పెద్ద నిశ్వాసంవలెనే కనుపిస్తూవుంది. క్రమక్రమంగా ఆ అనిమేష దృష్టులలోని జ్వాలామయమైన వెలుగు మాసిపోసాగింది. హృదయదాహంతో యెండిపోయిన ఆ చూపు అశ్రుధారలతో తడుపబడి స్నిగ్ధమై చూస్తూ చూస్తూ వుండగానే గంభీరరసంతో నిండిపోయింది. క్షణంలో ఆ మూర్తి బిహారి పాదాలమీద పడి అతని రెండు పాదాలను గట్టిగా తన హృదయానికి హత్తుకొంది. అటుపిమ్మట ఆమె లతవలె అప్పటికప్పుడే బిహారిని చుట్టివేసి ముందుకుసాగి క్రొత్తగా వికసించిన సుగంధిలమైన పుష్పమంజరిలాగా ఉన్ముఖమైవున్న ముఖాన్ని చుంబనాపేక్షతో బిహారి పెదవులదగ్గరకు తెచ్చివుంచింది. బిహారి కళ్ళు మూసుకొని ఆ ముఖాన్ని స్మృతిలోకంనుంచి తొలగించివేయాలని ప్రయత్నించాను. ఐతే ఆమెను తొలగించడానికిగాను—ఆమె కేవిధమైన బాధను కలిగించడానికిగాని, గాయపరచడానికిగాని బిహారికి చెయ్యి లేవలేదు. ఒక అసంపూర్ణమైన వ్యాకుల

చుంబనం యెదురుగానే వుంది. బిహారి శరీరమంతా గగుర్పొడిచింది.

ఆ నిశ్శబ్దమైన అంధకారంలో ఇక వుండలేకపోయాడు బిహారి. తన మనసును మరొక వంకకు మరల్చేవుద్దేశ్యంతో వెలుగుతో నిండివున్న గదిలోకి వెళ్ళిపోయాడు.

ఒక మూలగావున్న ముక్కాలిపీటమీద ఒక చిత్రపటం పట్టువస్త్రంతో కప్పబడి వుంది. ఆపట్టు వస్త్రాన్ని తొలగించి ఆపటాన్ని చేతిలోకి తీసుకొని లాంపు యెదుట కూర్చొని తదేక దృష్టితో చూస్తున్నాడు బిహారి.

అది ఆశామహేంద్రుల చిత్రపటము; వివాహమైన కొద్ది దినాలకు ఆ ఛాయాచిత్రం తీయబడింది. ఆ చిత్రానికి క్రింది భాగంలో 'మహేంద్రుడు' 'ఆశాలత' అని వారి వారి హస్తాక్షరాలు వ్రాయబడి వున్నాయి. ఆ చిత్రపటం ఆ నవవివాహపు ఆనందోత్సవాన్ని జ్ఞాపకానికి తెస్తూవుంది.

మహేంద్రుడు ఒక కుర్చీమీద కూర్చొని వున్నాడు; అతనిముఖంలో నవవివాహితునికి సహజమైన ఒకక్రొత్త సరస భావాల పొంగు కనిపిస్తూవుంది. దగ్గరగా నిల్చొనివుంది ఆశ. ఫొటోగ్రాఫరు ఆమెను ముసుగు వేసుకోనీయక పోయినప్పటికీ, ఆమె ముఖంలోని లజ్జాచిహ్నాలు తొలగలేదు. నేడు మహేంద్రుడు తన సహచారిణియైన ఆశను యేడ్పించి యెంతదూరం వెళ్ళుతున్నాడు? కాని ఆ నిర్జీవమైనచిత్రం మహేంద్రుని ముఖంనుండి ఆ నవీనప్రేమను యేమాత్రంకూడ మార్చనీయ లేదు. అది తన జడతాకారణంచేత ప్రస్తుతపరిస్థితుల్ని

యేమాత్రము తెలుసుకొనలేక మూఢభావంతో అదృష్టంచేసే పరిహాసానికి శాశ్వత చిహ్నమయింది.

ఆ చిత్రపటాన్ని తనచేతిలోకి తీసుకొని వినోదినిని ధిక్కారంతో తనహృదయంలోనుండి తొలగించి వేయాలని ప్రయత్నించాడు బిహారి. కాని ప్రేమవిహ్వాలమైన వినోదిని కోమలహస్తాలు అతని పాదాలను పట్టుకొనే వున్నాయి. 'ఇలాంటి సుందరమైన ప్రేమికుల సంసారాన్ని నీవు నాశనం చేశావు' అని తనలోఅనుకొన్నాడు బిహారి. కాని వినోదిని యొక్క ఆ వ్యాకులముఖంలోని చుంబన నివేదనం "నేను మిమ్మే ప్రేమిస్తున్నాను, ప్రపంచమంతటిలోను మిమ్మొక్కరినే ఎన్నుకొన్నాను." అని మౌనంగా చెప్పుతూవుంది.

కాని బిహారి మాటకిది ప్రత్యుత్తరమౌతుందా? యీ మాట ఒక వికలమైపోయిన కుటుంబంనుండివచ్చిన దారుణమైన ఆర్తనాదాన్ని దాచగలదా? అని లోలోపల ఆలోచించి "పిశాచీ!" అని వినోదినిని దూషించాడు బిహారి. ఈ 'పిశాచీ' అనేమాటను బిహారి పూర్తిగా విఘుడై అన్నాడా లేక దీనితో పాటు కొంత ఆదరణభావంకూడా ఆమాటలో కలిసివుందా?

బిహారి తనకుగల ప్రేమాధికారా లన్నింటినుండి వంచింపబడి, జీవితాంతంవరకు దరిద్రునివలె – బిచ్చగానివలె సంసారపథంలో నిల్చొని వున్నాడు. ఇలాంటి సమయంలో అత డీ అయాచితమైన–అనంతమైన ప్రేమకానుకను ఎలా ఉపేక్షించి నిరాకరించగలడు? ఇలాంటి ప్రేమోపహారాన్ని బిహారి యింతవరకు మెన్నడైనా పొందగలిగాడా? అతను యింతవరకు

తన జీవితాన్ని యితరులకర్పించి, ప్రేమ భాండారంలోని చిరుతునకలను మాత్రమే యాచించి సంతుష్టిపొందుతూ వచ్చాడు. ఇప్పుడు ప్రేమమూర్తియైన అన్నపూర్ణాదేవి బంగరుపళ్ళేరాన్ని నింపి అతనికొరకే పంపింది; మందభాగ్యుడైన బిహారి యే సందేహాలకోలోనై అపూర్వ మధురపదార్థాన్ని త్యజించగలడా?

బిహారి తనమనస్సును యేకాగ్రంచేసి చిత్రపటం చేతుల్లోకి తీసుకొని పైవిధంగా ఆలోచిస్తూవున్నాడు. ఇంతలో యెదుట యేదో శబ్దంకావడంచేత వులిక్కిపడ్డాడు—కళ్ళు తెరచి చూచేసరికి మహేంద్రుడు ప్రత్యక్షమయాడు. బిహారి అదరిపడి లేచి నిల్చొన్నాడు. చేతిలో నున్న చిత్రపటం అతనికి తెలియకుండానే క్రిందపడిపోయింది.

మహేంద్రుడు వస్తూనే "వినోదిని యెక్కడ?" అని అడిగాడు.

బిహారి ముందుకు సాగి ఆతనివద్దకు వెళ్ళి చెయ్యి పట్టుకొని "మహేంద్రదాదా, కొంచెం కూర్చో, నేను నీతో చాలా విషయాలు మాట్లాడాలి." అన్నాడు.

"నాకు కూర్చొడానికి మాట్లాడడానికి అవకాశంలేదు. చెప్పు వినోదిని యెక్కడున్నది?"

"నీవడిగే ప్రశ్నకు యింత ముక్తసరిగా జవాబీయ వీలులేదు, దీని జవాబుకొరకు కొంచెం స్థిరంగా కూర్చోవలసే వుంటుంది."

"నాకు వుపదేశం చేస్తావా? ఈ వుపదేశాలు చిన్న తనంలోనే చదివాను."

"లేదు, నేను వుపదేశమివ్వగోరడంలేదు. నీకు వుపదేశాన్నిచ్చే అధికారంగాని, యోగ్యతగాని నాకులేదు."

"ఐతే నన్ను బెదరిస్తావా? — భయపెడతావా? నేను గర్విని, నీచుణ్ణి, నరాధముణ్ణి, కపటిని అని నాకు తెలుసు. ఇంకా నీవేమైనా అనేలాగుంటే అంగీకరించడానికి సిద్ధంగా వున్నాను. కాని వినోదిని యెక్కడవున్నదీ నీకు తెలుసునా లేదా? - చెప్పు."

"నాకు తెలుసు."

"నాకు చెప్పుతావా లేదా?"

"చెప్పను."

"నీవు చెప్పక తప్పదు. నీవామెను మోసంచేసి తెచ్చి దాచావు. ఆమె నాది. నాదాన్ని నాకిచ్చివెయ్యి."

బిహారి క్షణకాలం మౌనంగా వుండి "ఆమె నీదికాదు, నేనామెను మోసంచేసి తేలేదు, ఆమె తనంతటతానే నావద్దకు వచ్చింది." అన్నాడు స్థిరభావంతో.

"అబద్ధమాడుతున్నావు"అని గర్జించాడు మహేంద్రుడు.

వెలుపలికి వచ్చి అతడు తలుపులు మూసివున్న వేరొక గదివద్ద మాటిమాటికి తలుపుమీద గుద్దుతూ "వినోదినీ! వినోదినీ!" అని కేకలు పెట్టడం మొదలుపెట్టాడు.

అతనికి లోపల యెవరో యేడుస్తున్న శబ్దం వినిపించింది- "వినోదినీ, ఎంతమాత్రమూ భయంలేదు. నేను మహేంద్రుణ్ణి,

నిన్ను విడిపించుకొని వెళ్ళడానికే వచ్చాను. నిన్నెవ్వరూ బంధించి వుంచలేరు.” అని అరుస్తూ తలుపులమీద అమాంతం విరుచుకుపడ్డాడు. తలుపులు దభీమని తెరుచుకు పోయినాయి. త్వరత్వరగా లోపలికి వెళ్ళాడు మహేంద్రుడు. అంతా అంధకారంగా వుంది. కనిపించీ కనిపించని నీడలాగా మంచంమీద యెవరో భయంతో ముడుచుకొని వెక్కి వెక్కి ఏడుస్తూ దిండుకు చుట్టుకొని వున్నారు.

బిహారి గబగబా గదిలోకివచ్చి వసంతుని వళ్ళోకి తీసుకొని “భయంలేదు వసంత్, ఏం భయంలేదు నాయనా! ఏడవబోకు!” అని ఓదార్చసాగాడు.

మహేంద్రుడు అక్కడినుండి బయలుదేరి, పైనా క్రిందా అటూాయిటూ అంతా వెదకడం మొదలుపెట్టాడు; ఎక్కడా వినోదిని కనిపించకపోవడంవల్ల నిరాశతో యథాస్థానికి వచ్చాడు. అప్పటికీ వసంతుడు భయంచేత పొగిలి పొగిలి యేడుస్తూనేవున్నాడు. బిహారి, గదిలో లాంపువెలిగించి అతణ్ణి మంచంమీద పడుకోబెట్టి, వీపు నిమురుతూ అతణ్ణి నిద్రపుచ్చ డానికి ప్రయత్నిస్తున్నాడు.

“వినోదినిని యెచ్చటదాచావు?” అని మళ్ళీ అడిగాడు మహేంద్రుడు.

“దాదా, అల్లరిచేయవద్దు. అనవసరంగా యీ పిల్ల వానిని హడలగొట్టావు. వీడి ఆరోగ్యం పాడయేలాగా వుంది. వినోదిని సమాచారంతో నీకేమి సంబంధంలేదు.” అన్నాడు బిహారి.

మహేంద్రుడు పళ్ళు పటపట కొరుకుతూ—"ఓ సాధు పురుషా, ఓమహాత్మా, సాధుపురుషుడనిపించుకొనే ప్రయత్నం ఇకనైనావదలిపెట్టు. నాభార్య చిత్రపటం తీసుకొని యేదేవతను ధ్యానిస్తూ యేపవిత్ర మంత్రాన్ని జపిస్తున్నావు? పాపీ! మోస గాడా!" అన్నాడు మహేంద్రుడు.

ఇలా అంటూనే ఆ పటాన్ని నేలమీద విసరికొట్టి, చెప్పు కాళ్ళతో బాగా త్రొక్కివేశాడు; దానిమీది అద్దం ముక్కలు ముక్కలై పోయింది. చివరకు అందులోని చిత్రాన్ని తీసి ముక్కలు ముక్కలుగా చించి బిహారి ముఖానకొట్టాడు.

మహేంద్రుని యీ వున్మత్తవ్యవహారాన్ని చూచి భయంతో పెద్దగా యేడ్చాడు బిహారి. క్రోధం, బాధ, దుఃఖం ఒక్కుమ్మడిగా పొంగిరావడంచేత అతనికంఠం బొంగురు పోయింది. అతడు గుమ్మంవైపుగా చూపించి"వెళ్లు!"అన్నాడు.

మహేంద్రుడు అతివేగంతో బయటికి వెళ్ళిపోయాడు.

# 37

ఇటు వినోదిని యాత్రికులులేని జనానా బండిలో కూర్చొని ప్రయాణం చేస్తూవుంది. దారిలో వరుసగావున్న పొలాలలో చెట్లమధ్యగావున్న ఒకపల్లెను చూడగానే తన పూర్వపు గ్రామ్యజీవనం స్మృతిపథంలోకి వచ్చింది. నేను యీ దట్టమైన వృక్షాల నీడలలో నిర్మించుకొన్న గూళ్లలో, నాకిష్ట మైన పుస్తకాలుతీసుకొని, నగరనివాసంవల్ల కలిగిన యావత్తు క్షోభనుండి—మంటనుండి—గాయపుబాధలనుండి విముక్తిపొంది

కొంతకాలంవరకు సుఖశాంతులతో వుంటాను—అని తన మనసులో అనుకొంది.

పైరుపచ్చలులేక కనుచూపుమేర నల్లగా విస్తరించి వున్న యెండాకాలపు విశాలమైన పొలాలలో దినరాజు అస్తమించుతున్న దృశ్యాన్నిచూచి 'సరే, ఇంకేమీవద్దు' అని తన మనసులో అనుకొంది. ఇలాంటి సువర్ణ రంజితమైన ప్రశాంత విశాల శాంతిలో మునిగి అన్నింటినీ మరచి కళ్ళు మూసుకొంటాను—ఎవరివల్లనూ ప్రయోజనంలేదు; యీ జీవననౌకను వివిధములైన తరంగాలచే ఆందోళితమౌతున్న సుఖదుఃఖాలతోకూడిన సముద్రపుఒడ్డుకు తీసుకొనివెళ్ళి ప్రశాంత సంధ్యాసమయంలో కదిలీ మెదిలాడనీ ఒక వటవృక్షంక్రింద బంధించి వేస్తాను—అని ఆలోచిస్తూవుంది.

బండిత్వరత్వరగా పోతూవుంది. అక్కడక్కడ మామిడితోటలలోనుంచి పోతూవుంటే, ఆ చెట్లమీదినుంచి వచ్చే సుగంధం వినోదిని మనస్సులో విచిత్రమైన భావాలను కలిగిస్తూ, పల్లెజీవితంలోని శాంతి సౌహార్దాలతో ఆమె హృదయాన్ని నింపివేస్తోంది. ఆమె మనోభావాలు మారిపోసాగినాయి.—'మంచి పనే జరిగింది, ఈ జీవనసుఖాలకొరకు నేనిక పోరాడలేను. ఇక అంతా మరచిపోతాను — చింత వదలి సుఖంగానిద్రిస్తాను; పల్లెటూరి సాధారణ అమాయిక స్త్రీలాగా ఇంటి పనులలో గ్రామపనులలో సంతోషంగా - సుఖంగా - నా జీవితాన్ని గడుపుతాను.' అని తనలో అనుకొంది.

కణకణ కాగుతున్న హృదయంలో యిలాంటి శాంతిని కాంక్షిస్తూ తన కుటీరంలో అడుగుపెట్టింది వినోదిని. కాని, అయ్యో, శాంతి యెక్కడిది? ఏవంక చూచినా శూన్యంగా వున్నది; దారిద్ర్యం తాండవిస్తూ వుంది. నలుదిక్కులావున్న వస్తుసముదాయం జీర్ణావస్థలో, అస్తవ్యస్తంగా, అనాదరంగా ధూళి ధూసరితమైవుంది. చాల దినాలుగా యిల్లు మూయబడి వుంది; అదాటుగా తీసి లోపలికి అడుగుపెట్టగానే ఆయింటి లోని దుర్గంధంవల్ల ఆమె వుక్కిరిబిక్కిరై పోయింది. ఇంట్లో వున్న కొద్దిపాటి వస్తువులుకూడా పురుగులుపట్టి యెలుకలు కొరికి దుమ్ము కొట్టుకొని మన్నులో కలిసిపోయినాయి.

వినోదిని యింటికి చేరేసరికి సాయంకాలమయింది; ఇల్లు నిరానందంగా—అంధకారబంధురంగా వుంది. ఎలాగో అవస్థపడి ఒక ప్రమిదలో ఆవనూనెతో దీపం వెలిగించింది. దాని పొగతోకూడిన గుడ్డి వెలుగులో ఆ యింటి దైన్య పరిస్థితిని గురించి మరికొంత సమాచారం తెలుసుకోగలిగింది. ఇప్పుడా యిల్లు చాలా అసహ్యంగా వుంది. విద్రోహస్వభావినియైన వినోదిని అంతఃకరణం, యిక్కడ ఘడియకూడా నిలువరాదని దృఢంగా చెప్పింది. గూట్లో ఒకటి రెండు పాతపుస్తకాలు, మాసపత్రికలు పాడై పడివున్నాయి. వాటిమీద సేర్లకొలది దుమ్ము క్రమ్మకొని వుంది; వాటిని తాకడానికికూడా ఆమెకు బుద్ధి పుట్టలేదు. సమీపంగా వున్న మామిడితోటలోనుండి కీచురాళ్ళ ఝుంకారధ్వనులు,దోమల ఘీంకారధ్వనులు చెవులు చిల్లులు పడేలాగా వినిపింపసాగాయి. ఊపిరి ఆడడమే లేదు.

వినోదినివద్ద మొదట్లో ఒక ముసలమ్మ వుండేది. ఆమె యీ యింటికి తాళంవేసి, తన కూతురును చూడడానికి అల్లుని వద్దకు వెళ్ళింది. వినోదిని, యింట్లో వంటరిగా వుండలేక పోయింది. ఆమె తన యిరుగుపొరుగు యిళ్ళకు వెళ్ళింది. వినోదినిని చూచి వారు చాలా ఆశ్చర్యపడ్డారు. "అమ్మో, యీమె తెల్లవాళ్ళలాగా తయారయిందే, తళతళలాడే బట్టలు యీమె మిసమ్మ అయిపోయింది!" అని వారు ఒకరికొకరు చెవుల్లో చెప్పుకోసాగారు. వారిలోవారు కనుసన్నలతో వినోదిని విషయాన్ని చెప్పుకొంటున్నారు. లోకు లనుకొన్నదానికి తగినట్లుగానే ఆమెలో లక్షణాలుకూడా కనిపించాయి! తన గ్రామానికి తాను చాలా దూరమైనట్లు అడుగడుగుకు అనిపిస్తూవుంది వినోదినికి. ఇప్పుడు తన గ్రామంలో, తన యింటిలోకూడా ఆమెకు స్థానంలేదు; ఎక్కడా ఆమెకొక్క క్షణం సుఖం కలుగడంలేదు.

వృద్ధుడైన పోస్టుజవానును ఆమె చిన్నతనంనుండి యెరిగియేవుంది. మరుసటిరోజు చెరువులో స్నానమాడడానికి వెళ్ళింది వినోదిని. ఇంతలో పోస్టుబంట్రోతు తోలుసంచి మెడలో తగిలించుకొని ఆవైపుకు వచ్చాడు. అతణ్ణి చూడగానే వినోదిని యిక ఆగలేకపోయింది. బట్టలు చెరువుఒడ్డునే పెట్టి, అతనివద్దకు వెళ్ళింది.—"ఓ కల్లూ కాకా, నాపేరుతో యేమైనా జాబు వుందా?" అని అడిగింది.

వృద్ధుడు ముక్తసరిగా "లేదు" అన్నాడు.

"కొంచెం చూస్తానుండు ఉందేమో" అని వ్యాకులంతో అతని చేతిలోని పదిపన్నెండు జాబులు తీసుకొని వాటిని తిరుగ వేసి బోర్లావేసి చూచింది. ఆమె కే జాబూ రాలేదు. చింతతో వినోదిని రేవువద్దకు వెళ్ళగానే అక్కడి చెలికత్తె "యేమే వినోదినీ, జాబులకొరకు యింతవ్యాకులపడుతున్నా వెందుకు?" అని నవ్వుతూ అడిగింది. మరొక మాటకారియైన యువతి "ఆహాహా, పోస్టునుండి జాబులు రావడం యెంత అదృష్టం! మాయింటివారు, మరది, అన్న అందరు పరదేశాల్లోవున్నారు; కాని పోస్టు బంట్రోతు ఒక్కసారైనా మామీద దయ చూపించడు!" అన్నది.

ఈవిధంగా ప్రతి మాటలో వ్యంగ్యభావాలు వాడి చూపులు స్పష్టంగా కనిపింపసాగాయి. వినోదిని ప్రతిరోజు అవకాశం లేకపోతే వారానికొక జాబైనా వ్రాయమని, యే సమాచారాలు లేకపోతే 'క్షేమం' అని రెండు అక్షరాలైనా వ్రాసి పంపమని బిహారిని ప్రార్థించివచ్చింది. నేడు బిహారివద్దనుండి జాబువచ్చే ఆశ లేశమాత్రంగానే వున్నప్పటికీ, ఆమె వాంఛాప్రాబల్యం ఆ ఆశాలేశాన్నికూడా విడిచిపెట్టలేక పోయింది. ఆమెకు అప్పుడే కలకత్తా విడిచిపెట్టి సంవత్సరాలు గడిచిపోయినట్లుగా వుంది.

ఆ గ్రామంలోని శత్రువుల దయచేతనూ మిత్రుల దయ చేతనూ, మహేంద్రునికి యీమెకు అనుచిత సంబంధం వున్న దనే అసత్యపు అపవాదు, గ్రామంలో యింటింటికి తెలిసి

పోయిందనికూడా ఆమె తెలుసుకొన్నది. పాపం ఆమెకు యిక్కడకూడా శాంతిలేదు!

వినోదిని తనను గ్రామంలోని యితరులెవరితోనూ సంబంధంలేకుండా దూరంగా వుంచుకొనవలెనని తలచింది. ఇది ఆగ్రామవాసులకు మరింతకోపకారణంగా పరిణమించింది. వారు ఆమెను దుష్టురాలుగా భావించడం, దగ్గరకు రాగానే ఏహ్య భావంతో చూడడం, ఎత్తిపొడుపుమాట లనడం, ఆమెను బాధించి ఆనందించడం మానలేకపోయారు.

పట్టుమని పదైనా చెప్పుకోదగ్గ యిళ్ళులేని యీ చిన్న గ్రామంలో తాను ఎవరితోనూ సంబంధంలేకుండా నిర్లిప్తంగా వుండగోరడం వృథాప్రయత్నం. ఇక్కడ, దెబ్బతిని గాయ పడిన హృదయాన్ని పెట్టుకొని, ఏదో ఒకమారుమూల—అంధ కారంలో—ఏకాంతంలో దానికి సేవచేయడం అసంభవం; ఎందుచేతనంటే — నలుదిక్కులనుండి గ్రామీణులందరి తీక్ష్ణ దృగ్బాణాలు, వంగ్య వాగ్బాణాలు సూటిగా పాత గాయం మీదనేపడి మరింతగా గాయపరుస్తాయి.

వినోదినిచిత్తం బుట్టలోని చేపలాగా కొట్టుకొనేకొద్దీ చుట్టూవున్న సంకీర్ణ వాతావరణం మరింత యెదురుదెబ్బ కొట్టి, ఆమెకు బాధ కలిగిస్తూవుంది. గ్రామాల్లో యెవరికీ స్వతంత్రంగా తమబాధల్ని తాము అనుభవించే అవకాశం కూడా వుండదు.

రెండవరోజు జాబు వచ్చేసమయం దాటగానే యింటి తలుపుబిగించి జాబు వ్రాయడం మొదలుపెట్టింది వినోదిని.—

"బిహారీబాబూ, భయపడకండి, నేనుమీకు ప్రేమలేఖ వ్రాయవలెనని కూర్చోలేదు; మీరు నా క్షేమాభిలాషులు; మీకు ప్రణామంచేస్తున్నాను. మీరు నా పాపానికి తగిన దండన విధించారు. మీనోటినుండి వెలువడగానే దానిని ఆదర పూర్వకంగా స్వీకరించాను. ఆదండన యెంత కఠిన మైనదో మీరు చూడలేకపోతిరే అనేదే నాదుఃఖం. ఒకవేళ చూచేవుంటే—లేదా తెలుసుకొనేవుంటే—మీకు దయ కలిగేదే. నే నా దయనుకూడా అనుభవించలేనంత మంద భాగ్యురాలను. మిమ్ము స్మరించి మానసికంగా మీ పాదాల మీద నాశిరస్సువుంచి, నేను దీనినికూడా యెలాగో సహించు కొంటాను. కాని ప్రభో, బందిఖానాలోని ఖైదీకి ఆహారం యివ్వడం ధర్మంకాదా? పంచభక్ష్య పరమాన్నాలు లభించక పోయినా, కనీసం ప్రాణాలు నిలుచునంతవరకైనా ఆహారం లభించడంలేదు! మీరు వ్రాసే రెండుపంక్తులజాబు నా యీ ద్వీపాంతరవాసశిక్షలో నాకు ఆహారంతో సమానం. అది కూడా లభించకపోతే, నాథా, నీవు విధించిన యీ ద్వీపాంతర వాసశిక్ష మరణదండనకంటే మించిపోతుంది. ఓ దండదాతా! నన్నింతకంటె పరీక్షించకండి.

"నా యీ పాపిష్టిమనస్సుకు అంతులేని అహంకార ముంది. ఒకవ్యక్తియెదుట నేనిలా తల వంచవలసివస్తుందని యెన్నడు వూహించలేదు. ప్రభో, మీరు జయించారు; నేనిక ద్రోహంచెయ్యను; కాని నామీద దయవుంచండి - నన్ను బ్రతుకనివ్వండి; ఈ కారడవిలో వుండడానికి కొద్దో గొప్ప

సహాయం చేస్తూవుండండి. ఆమాత్రం సహాయం లభిస్తూవుంటే ఇక నన్నెవ్వరూ మీ శాసనాన్ని అతిక్రమింపచేయజాలరు. ఈ దుఃఖవిషయాన్నిమాత్రమే మీకు తెల్పి జాబు ముగిస్తున్నాను. ఇంకా నామనసులోవున్న అనేక విషయాలను చెప్పడానికి నావ్యాకుల హృదయం ప్రీలిపోతున్నది. ఐతే ఆ విషయాలను మీకు తెలుపరాదని ప్రతినపట్టాను.

మీ పెద్దవదిన
వినోదిని.

జాబు పోస్టుబాక్సులో వేసింది వినోదిని. ఆచుట్టుప్రక్కల నున్నవాళ్ళు ఇదిచూచి ఛీఛీయని వ్రేళ్ళు కొరుక్కోనడం మొదలుపెట్టారు. ఇంటితలుపు వేసుకొని జాబు వ్రాస్తున్నది; జాబులకోసం పోస్టుజవాను ప్రాణాలు తీస్తూవుంది; నడిబజారులో వాడికోసం కాపలావేస్తుంది—రెండురోజులు కలకత్తాలో వున్నదో లేదో సిగ్గు బిడియాలమీద నీళ్ళుచల్లి పూర్తిగా చెడిపోయింది——అనుకోవడం సాగిచారు.

మూడవ రోజుకూడా బిహారివద్దనుండి జాబురాలేదు. పగలంతా కొయ్యబొమ్మలాగా మౌనంగా కూర్చొంది; ఆమె ముఖభావం కఠినంగా మారిపోయింది. లోపల వెలుపల నాల్గు దిక్కులకూడా దెబ్బలు తిని, ఆ అవమానం పొందడంవల్ల కలిగిన ఆందోళనతో వినోదిని హృదయంలోని అంధకారం భయంకరమైన సంహారక శక్తిగా మారి, అడుగునుంచి పైకి రావడానికి ప్రయత్నిస్తూవుంది. ఆ భయంకరమైన సంహారక

శక్తి అవతరించనున్నదని తెలుసుకొని, భయకంపితమైన వినోదిని, ద్వారం బంధించి వేసుకొన్నది. వెలుపలికి రాకపోకలు మానివేసింది.

వినోదినివద్ద బిహారిని గుర్తుకు తెచ్చే వస్తువులేమీ లేవు. అతని చిత్రపటంగాని అతడు వ్రాసిన జాబుకాని లేదు. ఆమె యీ శూన్యంలో ఒక పట్టుకొమ్మను - ఒక ఆధారాన్ని వెదక నారంభించింది. ఆమె బిహారిని జ్ఞాపకం తెచ్చే యేదైనా చిహ్నాన్ని. తన హృదయంలో వుంచుకొని, తన యెండిన కళ్ళలోకి నీళ్ళు తెచ్చుకొనడానికి ప్రయత్నిస్తూవుంది. ఆ అశ్రుజలాలతో తన లోపలి కాఠిన్యాన్ని కరిగించి, ఆ జలంతోనే తన మానసికమైన ద్రోహచింతనాగ్నిని ఆర్పివేసి, బిహారి ఆజ్ఞను తన హృదయంలోని అతిమృదువైన ప్రేమ మయ సింహాసనంమీద అధిష్టింపజేయవలెనని కోరుతూవుంది. కరువు సంవత్సరంలో మధ్యాహ్నపు ఆకాశం మండుతూ వున్నట్లు ఆమె హృదయంకూడా భగభగ మండిపోతూవుంది; ఎంతదూరం వెదకినా ఒక్క అశ్రుబిందువైనా వున్న లక్షణం కనిపించడంలేదు.

తన మనసు యేకాగ్రంచేసి ధ్యానంచేస్తూ పిలుస్తూ వుంటే తనవల్ల ధ్యానింపబడే వ్యక్తి, తప్పక దగ్గరకు వస్తాడని, నిరాకరించడం అతనికి సాధ్యంకాదని, వినోదిని యెప్పుడో విన్నది. అందువల్ల చేతులు జోడించి కళ్ళు మూసుకొని—
"నా జీవనం శూన్యంగా వుంది, హృదయం శూన్యంగావుంది, నలుదిక్కులా అంతా శూన్యమే—ఈ శూన్యంలోకి మీరొక

సారి రండి, మీరు రాకతప్పదు, మిమ్మెంతమాత్రం విడిచి పెట్టను." అని పిలుస్తూవుంది బిహారిని.

ప్రాణాలొడ్డి యిలా అనడంవల్ల వినోదిని హృదయంలో నిజంగా బలం వచ్చింది. ఈ 'పేమ' బలం, ఈ 'పిలుపు' బలం ఎన్నడూ వృధాకాదనిపించిందామెకు.

ఊరికే స్మరించడంవల్ల దురాశమీద మొదటిలోనే తన హృదయంలోని రక్తాన్ని చిందింపజేయడమూ, ఆ హృదయం శిథిలంకావడమూ మాత్రమే జరుగుతుంది. కాని యీవిధంగా యేకాగ్రమనస్కురాలై ధ్యానించి ప్రాణపణంతో శక్తికొలది తన కోరికకు ప్రయత్నిస్తూవుంటే ఒక తోడు-ఒక సహాయకుడు తన వెంట వున్నట్లుగా అనిపిస్తూవుంటుంది. ప్రపంచంలోని అన్ని వస్తువులను విడిచిపెట్టి, తాను కోరిన వస్తువును మాత్రమే దృఢమైన కోరికతో తనవైపుకు లాగుకొంటూ వున్నట్లైతే, క్షణక్షణానికి ఆవస్తువు కొంచెం కొంచెంగా దగ్గరకు వస్తున్నట్లు గోచరిస్తుంది.

సంధ్యాసమయంలో బిహారిని గురించిన ధ్యానంలో లగ్నమైవుండగా, ఆ దీపంలేని అంధకార బంధురమైనగృహం మరింత అంధకారమయమవుతూవుంది — వినోదిని దృష్టికి గ్రామము, సమాజము, ప్రపంచము, అంతేకాదు — యీ బహ్మాండమంతాకూడా ప్రళయంలో లీనమైపోతున్నట్లు అని పించింది.—అదేసమయంలో యెవరో తలుపుతట్టారు. ఆ ధ్వని వింటూనే వినోదిని లేచి నిల్చొంది. సంశయరహితమైన విశ్వాసంతో పరుగెత్తి ద్వారం తెరుస్తూనే "ప్రభూ, వచ్చారా?"

అన్నది. ఈ సమయంలో ఇతరుడెవ్వడూ తన గుమ్మంలోకి రాలేడని ఆమెకొక గట్టినమ్మకం. "ఆఁ, వచ్చాను వినోదినీ!" అని ఆవేశంతో జవాబు చెప్పాడు మహేంద్రుడు.

వినోదిని ద్వేషంతో మండిపోయి - "వెళ్ళు వెళ్ళు, ఇక్కడినుంచి వెళ్ళిపో, తక్షణంవెళ్ళిపో." అని ధిక్కారంతో అన్నది.

మహేంద్రుడు చకితుడై స్తంభీభూతుడై పోయాడు! ఇంతలో "అవునే వినోదినీ, మీఅత్తమేనత్త ఒకవేళ రేపు—" అంటూ పొరుగింటి ప్రౌఢవనిత ఒకతె వినోదిని ద్వారంవద్దకు వచ్చింది; ద్వారంలో మహేంద్రునిచూస్తూనే "అమ్మయ్యో" అంటూ నిండా ముసుగు ముందుకులాక్కొంటూ త్వరత్వరగా వెళ్ళిపోయింది.

# 38

ఆ వీధికి వీధే అల్లరితో నిండిపోయింది. గ్రామంలోని వృద్ధులంతా దుర్గాలయంలోచేరి సమాలోచనలు జరుపుతున్నారు-ఇది యెంతమాత్రము సహింపరానిది. కలకత్తాలో యేమి జరుగుతూవుండేదో—విన్నా వినకపోయినా దానివల్ల మనకేమీ నష్టంలేదు; కాని మనకళ్ళముందు ఈ విధంగా జాబుమీద జాబు వ్రాసి మహేంద్రుని పిలిపించుకొని, బట్ట బయలుగా యింతసాహసం—ఇంత సిగ్గుమాలినతనం—సహింప వీలులేదు.

వినోదిని యీరోజు బిహారినుండి తప్పక జాబువస్తుందనే వూహించింది; కాని ఆమెకోర్కె ఫలవంతంకాలేదు. "నా మీద బిహారికి యేవిషయంలో యెలాంటి అధికారంవుంది? నేను వారిఆజ్ఞను యెందుకు విని అంగీకరించాను? నేను వారి యెదుట వారు నాకొరకు చేసే యేర్పాట్లను అంగీకరిస్తానని యెందుకు మాటయిచ్చాను? అతనికి తన ప్రియురాలైన ఆశను రక్షించేవరకేనా నాతోగల సంబంధం? అందువల్ల నేను పొందదగినదేమీలేదా? నాకే హక్కూ లేదా? అతి సాధారణమైన రెండు అక్షరాలున్న జాబుకుకూడా నేను నోచుకోలేదా?—నేనింత తుచ్ఛురాలనా, ఇంత ఘృణితవస్తువునా?" అని తనలో అనుకొంటున్నది వినోదిని.

అప్పటికప్పుడే వినోదిని హృదయం భయంకరమైన ఈర్ష్యా విషంతో నిండిపోయింది. 'మరెవరికొరకైనా అయితే యెంత కష్టాన్ని—దుఃఖాన్నికూడా సహిస్తాను; ఆశ కొరకు నేనంతగా సహించలేను. ఈ దీనత్వం - ఈ వనవాసం- ఈ లోకనింద - ఈ అనాదరణ - యీజీవనంలోని అన్ని విధాలైన అసంతృప్తి-ఒక్క ఆశకొరకు నేను సహింపవలసిందేనా? ఘడియఘడియకు అడుగడుగుకూ భరింపవలసిందేనా? ఇంత గొప్ప మోసంలో నాకై నేనే యెందుకు చిక్కుకొన్నాను? సర్వనాశనం చేయడానికి సంకల్పించిన నా వ్రతాన్ని యెందుకు వదలివేసి వచ్చాను? నేను పిచ్చిదాన్ని, తెలివితక్కువదాన్ని. నేను బిహారినెందుకు ప్రేమించాను? అతనికెందుకు ఆత్మ సమర్పణం చేశాను?' అనుకొన్నది.

వినోదిని కొయ్యబొమ్మలాగా కాఠిన్యాన్ని వహించి యింట్లో కూర్చొనివుంది; అదే సమయంలో ఆమె అత్త మేనత్త – ముసలమ్మ – తన కుమార్తెను చూచి తిరిగివచ్చింది. "ఏమే తుచ్ఛురాలా, కళంకినీ, లోకమంతా యిలా అంటున్నారేమిటే?" అని వస్తూనే అన్నది.

"ఉన్నమాటే అంటున్నారు." అన్నది వినోదిని.

"ఈ అపకీర్తితో నీవు యీ పల్లెకు రావలసిన అవసరమేమొచ్చింది? ఇక్కడి కెందుకు వచ్చావు?"

వినోదిని హృదయం గందరగోళంగా వుంది. ఆమె తన మనోవ్యథను సహించి వూరుకొంది. "ఇక నీవిక్కడ వుండజాలవు – నేను గట్టిగా చెపుతున్నాను. నా దురదృష్టంవల్ల నావాళ్ళందరు చచ్చిపోయారు. నేనీ దారుణమైన దుఃఖాన్ని సహించికూడా జీవిస్తున్నాను. ఐనా యిక యీ మాటలు మాత్రం సహించలేను. ఛీ ఛీ, నీవు నన్ను నలుగురిలో తల యెత్తుకోడానికి వీలులేకుండా చేశావు. ఇప్పుడే యిక్కడనుంచి వెళ్ళిపో." అన్నది ముసలమ్మ.

"నేనిప్పుడే వెళ్ళిపోతున్నాను." అన్నది వినోదిని.

ఇదే సమయంలో స్నానపానాదులు లేక యెండిపోయి, సంస్కారం లేక యెగుడుదిగుడుగా వున్న వెంట్రుకలతో, భయంకరమైన ముఖంతో, పిచ్చివానిలాగా ఆకస్మికంగా అక్కడికి వచ్చి చేరాడు మహేంద్రుడు. రాత్రి పూర్తిగా నిద్ర లేకపోవడంవల్ల ఆతనికళ్ళు యెర్రగావున్నాయి, ముఖం వాడిపోయింది. వేకువఝామున బాగా చీకటి వుండగా మరొకసారి

వెళ్ళి వినోదినిని తన వెంట తీసుకొని వెళ్ళాలని మొదట వుద్దే శించాడు. కాని గడచిన రోజున జరిగిన వ్యవహారంవల్ల-ఆవిడ ప్రకటించిన ఊహింపరాని అసహ్యంవల్ల మహేంద్రునికి చాలా బాధ కలిగింది. అతడు తన మనసులో అనేక విధాలుగా ఆలో చింపసాగాడు. ప్రొద్దుయెక్కి రైలుబండి వేళ సమీపించడం చేత యిక నిలువలేకపోయాడు. అతడు అన్ని సంకోచాలు-అన్ని సందేహాలు విడిచిపెట్టి, స్టేషన్ వెయిటింగ్ రూమునుండి బయలుదేరి బండి యెక్కి ఒక్కసారిగా వినోదిని యింటివద్ద హాజరైనాడు.

సిగ్గువిడిచి విచ్చలవిడిగా యేదైనా సాహస కార్యంలో ప్రవేశించడంవల్ల ఒకవిధమైన పిచ్చిపట్టుదల, పిచ్చిబలము కలు తాయి. ఆ బలావేశంలో మహేంద్రుడు పిచ్చివానిలాగా ఆనందించాడు. అతనికి శారీరకంగాను, మానసికంగాను వున్న దౌర్బల్యం పూర్తిగా తొలగిపోయింది. గ్రామప్రజలు కుతూ హలంగా అతనివైపు చూడసాగారు. ఉన్మత్తుడైన మహేం ద్రుని దృష్టిలో వారు నిర్జీవమైన మట్టిబొమ్మల్లాగా కనిపిస్తు న్నారు. అతడక్కడ వున్నవారివైపు చూడనైనాలేదు. నేరుగా వినోదినివద్దకువెళ్ళి "వినోదినీ, నేనిలాంటి పిరికివాణ్ణి కాను. నినిక్కడ లోకనింద, అవమానం సహించమని వంట రిగా విడిచిపెట్టి వెళ్ళలేను. ఏ విధంగానైనా నినిక్కడినుండి తీసుకొని వెళ్ళడానికి నిశ్చయించుకొన్నాను. నీవెప్పుడు యెలా కోరితే అలాగే జరుపుతానని ప్రమాణంచేసి చెప్పుతున్నాను. దయాదృష్టితో చూచావా జీవిస్తాను. దయచూపవా నీ దారికి

నేను అడ్డురాక దూరంగా వెళ్ళిపోతాను. నేను ప్రపంచంలో అనేక అవిశ్వాసకరమైన పనులుచేశాను. కాని నీవు ఈరోజున నన్ను అవిశ్వాస దృష్టితో చూడవద్దు. మనం ప్రళయముఖద్వారంలో నిలబడివున్నాము. ఇదిమనం మోసంగా కపటంగా ప్రవర్తించే సమయంకాదు.'' అన్నాడు.

"నన్ను మీవెంట తీసుకొని వెళ్ళండి." అని నిశ్చలంగా అతిసహజంగా చెప్పివేసి, "మీబండి వున్నదా?" అని అడిగింది వినోదిని.

"వున్నది'' అన్నాడు మహేంద్రుడు.

ఇంతలో ఆ వృద్ధురాలు బయటికివచ్చి మహేంద్రునితో —"మహేంద్రా, నీవు నన్ను గుర్తించలేదు; కాని నీవు మావాడవే, పరాయివాడవుకాదు. మీ అమ్మ రాజలక్ష్మి కూడా మావూళ్ళోనే పుట్టింది. వరుసప్రకారం నేనామెకు పిన్నమ్మనౌతాను. నాయనా, నీ యీ వ్యవహారం యేమిటి? నీయింట్లో నీభార్యవుంది, తల్లివుంది, నీవిలానీచుడవై పిచ్చివాని లాగా తిరుగుతావెందుకు? నలుగురు పెద్దమనుష్యులముందు తలయెత్తుకొని యెలా తిరుగగలవు?'' అన్నది.

మహేంద్రుని ఉన్మత్తవ్యవహారంమీద ఈ సంభాషణ ఒక దెబ్బకొట్టింది. అతనికి భార్యవుంది, అమ్మవుంది, పెద్ద మనుష్యులతోకూడిన సమాజంవుంది. ఈ సమాజ విషయం ఒక క్రొత్తనమూనాలో అతడికి కనిపిస్తూవుంది. ఎన్నడూ యెరుగని ఈ దూరగ్రామంలో ఒకానొక వ్యక్తినోటినుండి యిలాంటిమాటలు వింటానని అతడు యెన్నడూ వూహించ

లేదు. భార్యవుండి, తల్లివుండి, నలుగురు పెద్దమనుష్యులతో కూడిన సమాజంవుండికూడా, పట్టపగలు - గ్రామమధ్యంలో నిల్చొని, ఒక గొప్పయింటి విధవకోడలిని అతడు లేవదీసుకొని పోతున్నట్లు—మహేంద్రుని జీవితచరిత్రలో ఒక అధ్యాయం రచింపబడివుంది. ఔరా! విధివిలాసం! జవాబు చెప్పకుండా నిల్చొన్నాడు మహేంద్రుడు.

"వెళ్ళదలచుకొంటే యిప్పుడే వెళ్ళు, తక్షణం వెళ్ళిపో! యింటి వాకిట్లో నిల్చోవద్దు! చాలు, ఇక నిముషంకూడా ఆలస్యం చేయవద్దు!" అని చెప్పి ఆవృద్ధురాలు తలుపు బిగించుకొంది. స్నానం భోజనం లేకుండానే, మాసిన వస్త్రాలతో, ఖాళీచేతులతో ద్వారంలో నిల్చొన్న మనిషి వున్నదున్నట్లుగానే బండిలో యెక్కి కూర్చొంది వినోదిని. మహేంద్రుడు బండిమీద యెక్కే సమయంలో "వద్దు, స్టేషన్ దగ్గర్లోనే వుంది, మీరు మెల్లగా నడిచిరండి." అన్నది.

"అలాగైతే నన్ను గ్రామస్థులంతా చూడరూ?"

"ఇంకా మీకు లజ్జాభిమానాలు మిగిలివున్నాయా?" అని, "బండి స్టేషనుకు పోనివ్వు." అని బండివానితో చెప్పి, బండి తలుపు మూసింది వినోదిని.

"మీరు రారా బాబూ?" అని బండివాడు మహేంద్రుని అడిగాడు.

మహేంద్రుడు అటూయిటూ తిరగడం మొదలుపెట్టాడు. గ్రామంమధ్యనుంచి వెళ్ళే ధైర్యం సన్నగిలుతూవుంది.

బండి వెళ్ళిపోగానే గ్రామంవెలుపల పొలాల్లోగుండా తలవంచు కొని ఆలోచిస్తూ స్టేషను వైపుకు బయలుదేరాడు.

అప్పుడా గ్రామంలోని ఆడుపడుచులు-కోడళ్ళు స్నానం చేయడం భోజనం చేయడం అయిపోయింది. ఇంతవరకు పని పాటల్లో నిమగ్నులై వున్న వృద్ధస్త్రీలు, ఆ పనులనుండి విముక్తి పొంది, బట్టాపాత బిందెలు చెంబులు తీసుకొని, యేకాంతంగాను నిర్జనంగాను, మామిడిపూ గుత్తుల పరిమళంతో, మనోహర మైనచల్లని చెట్లనీడలతో, సుశోభితమైన జలాశయంలో స్నానం చేయడానికి వెళ్లుతున్నారు.

# 39

మహేంద్రుడు యెక్కడికో వెళ్ళిపోయాడు — ఈ దుఃఖంతో నిద్రాహారాలు మరచిపోయింది రాజలక్ష్మి. మహేంద్రునికొరకు వూరూరు గాలిస్తున్నాడు దీననాథుడు. అతడెన్నడూ వెళ్ళనిస్థలాల్లోకూడా వెదుకుతున్నాడు. ఇదే సమయంలో వినోదినితోకూడా మహేంద్రుడు కలకత్తాకు తిరిగివచ్చాడు. అతడు 'పటల్‌డాంగా'లో ఒక 'యిల్లు అద్దెకు తీసుకొని ఆయింట్లో వినోదినినివుంచి యింటికివచ్చాడు.

తల్లివుండే గదిలోకి వెళ్ళిచూచాడు; అంధకారం అలముకొనివుంది. యేదో కొద్దిగా వెల్తురు రావడానికి లాంతరు వెలిగించి చాటుగా పెట్టబడివుంది. రోగిలాగా మంచంమీద పడివుంది రాజలక్ష్మి. కాళ్ళకాడగా కూర్చొని

మెల్లమెల్లగా ఆమెపాదాలు వొత్తుతూవుంది ఆశ. ఇన్ని దినాలకు యింటికోడలు స్వయంగా అత్తగారి పాదాలవద్ద కూర్చొంది.

మహేంద్రుడు రాగానే ఆశ అదరిపడి లేచినిల్చొని, వెంటనే ఆ గదిలోనుంచి వెళ్ళిపోయింది. "అమ్మా, నాకిక్కడ చదువు బాగాసాగదు. కాలేజివద్ద ఒకయిల్లు అద్దెకు తీసుకొన్నాను, అక్కడేవుంటాను." అని నిశ్శంకగా అన్నాడు మహేంద్రుడు.

"మహేంద్రా, కొంచెం కూర్చొని మరీవెళ్ళు." అని తలగడదిక్కుగా సంజ్ఞచేస్తూ మహేంద్రునితో అన్నది రాజలక్ష్మి.

అతడు సందేహిస్తూ పక్కమీద చివరగాకూర్చొన్నాడు.

"నాయనా, నీవెక్కడ వుండదలచుకొంటే అక్కడే వుండు, కాని నాకోడలిని కష్టపెట్టవద్దు!" అన్నది రాజలక్ష్మి. మహేంద్రుడేమీ మాట్లాడలేదు. "ఇంతవరకు నాదౌర్భాగ్యంవల్ల ఇలాంటి సుశీలమైన కోడలిని గుర్తించలేకపోయాను. (ఇలా అంటూవుండగా ఆమెగొంతు మూసుకపోయింది.) నీవింత తెలిసికూడా ఆమెను యింత దుఃఖాల్లో యెలా త్రోశావు?" ఇలా అంటూ ఇక ఆగలేకపోయింది రాజలక్ష్మి; ఆమె కళ్ళనుండి అశ్రుధార ప్రవహించింది. అతడు అక్కడినుండి వెళ్ళిపోయినట్లైతే బ్రతికిపోయేవాడు; కాని వెంటనే లేవలేకపోయాడు—అమ్మ మంచపు అంచున ఆ చీకట్లో ముడుచుకొని మౌనంగాకూర్చొని వున్నాడు.

"ఈరాత్రికి యిక్కడేవుంటావుగా?"అన్నది రాజలక్ష్మి.

"వుండను."

"ఎప్పుడు వెళ్ళుతావు?"

"ఇప్పుడే."

రాజలక్ష్మి బలవంతంగా లేచికూర్చొంది—"ఈ పూట కోడలితో ఒకసారి మనసిచ్చి మాట్లాడనైనా మాట్లాడవా?" అన్నది.

మహేంద్రుడు మాట్లాడలేదు.

"కోడలు యీ రెండు మూడుదినాలు యెలా గడిపిందో నీవు తెలుసుకొనలేవు. ఓరి సిగ్గుమాలినవాడా, నీ కాఠిన్యం చూచి నాగుండెలు ప్రీలిపోతున్నాయి!" అన్నది రాజలక్ష్మి.

ఆమె వెంటనే వృక్షాన్నుండి తెగగొట్టిన కొమ్మలాగా మంచంమీద పడిపోయింది. అతనికి వెళ్ళిపోవడానికి అవకాశం దొరికింది. మంచంమీదినుంచిలేచి తిన్నతిన్నగా అడుగులు వేస్తూ మాట్లాడకుండా మెట్లెక్కి తనగదివైపుకు వెళ్ళాడు. ఆశవద్దకు వెళ్ళాలనేకోరిక ఏమాత్రమూ లేదు.

మహేంద్రుడు మెట్లెక్కి డాబామీద అడుగుపెట్టగానే గది యెదురుగావున్న పంచక్రింద నేలమీద పడుకొనివున్న ఆశ కనిపించింది. మొదట అడుగులచప్పుడు వినిపించలేదు. మహేంద్రుడు అదాటుగా ఆశయెదుట కనిపించాడు. ఇది చూచి ఆశ, బట్టపాత చుట్టుకొని లేచి నిల్చొంది.

ఇప్పుడు అతడొకసారి 'చునీ' అని పిలిచివుంటే ఆమె మహేంద్రుని అపరాధాలన్నింటినీ తనవిగా భావించడమేగాక

క్షమాపణ కోరే అపరాధినిలాగా అతని రెండుకాళ్ళకు చుట్టు కొని తన జీవితంలో యేడవవలసిన యేడుపంతా యేడ్చేసేది. కాని మహేంద్రుడా ప్రియనామాన్ని నాలుకమీదకు తేలేక పోయాడు. 'చున్నీ' అని పిలువడానికి యెంత ప్రయత్నించినా యెంత కోరినా దానికనేక రెట్లు బాధమాత్రమే అనుభవించాడు. నేడతడు ప్రేమించకుండా — ఆదరించకుండా పేరు పెట్టి పిలువడం నిరుపయోగము, యెగతాళి చేయడము తప్ప మరేమీ కాదని అతనికి తోచింది. వినోదినిని విడిచిపెట్టే మార్గాన్ని నాకై నేనే మూసివేసుకొన్నప్పుడు, మోసపు మాటలతో ఆశకు ధైర్యం చెప్పబూనడంవల్ల లాభమేముంది?

ఆశ సిగ్గుతో చచ్చిపోతున్నది. లేచి నిల్చొనడం, వెళ్లి పోవడం అలావుంచి – శ్వాసించడానికికూడా ఆమెకు సిగ్గు వేస్తున్నది. మహేంద్రుడామెతో యేమీ మాట్లాడలేదు. అతడు మెదలకుండా డాబామీద పాదచ్ఛాయలు వేస్తున్నాడు. అది కృష్ణపక్షం, ఆకాశంలో చంద్రబింబం యింకా కనిపించడంలేదు. మేడమీద ఒక మూలగా ఒక చిన్న కుంపటిలో "రేరాణి" మొక్క నాటబడివుంది. దాని రెండు రెమ్మలకు రెండు పూలు పూచివున్నాయి. డాబామీద అంధకారమయమైన ఆకాశంలోని యీ నక్షత్రాలు, యీ సప్తర్షులు అనేక నిస్తబ్ధనిశలలో ఆశా మహేంద్రులు అనుభవించిన ప్రేమ కలాపాల వింతలను చూచారు. నేడుకూడా వారందరు వీరిద్దరివైపు మౌనంగా తదేకదృష్టితో చూస్తూనే వున్నారు.

'ఇన్ని దినాలుగా జరిగిన ఈ అల్లరినంతను ఈ అంధ కారంలో నలిపి నాశనంచేసి, వెనుకటి దినాల్లోలాగానే, నేను ఈ డాబామీద చాపవేసుకొని, ఆశవద్ద, నాపూర్వపుస్థానంలో వెళ్ళి కూర్చొంటే, మరేప్రశ్న రాదు—మరేడుత్తరదాయిత్వమూ వుండదు; అదే ప్రేమ-అదే విశ్వాసము-అదే సహజానందము తిరిగి వస్తుందిగదా!' అని ఆలోచిస్తున్నాడు మహేంద్రుడు.

ఆహా! మహేంద్రునికి ఈవిశాల ప్రపంచంలో ప్రతిచోట స్థానం వున్నప్పటికీ, ఆచిన్న స్థానాన్ని ఇక్కడ పొందడానికి యిప్పుడు అవకాశంలేదు! ఈ డాబామీద ఆశకు సమీపంలో, ఆ చాపమీద ఒకమూల చిన్న చోటు దొరకడం మహేంద్రునికి అసంభవంగా వుంది; ఆ అవకాశాన్ని అతడు తన చేతులార పోగొట్టుకొన్నాడు.

ఇంతవరకు వినోదినిని ప్రేమించడానికి - కోరడానికి - మహేంద్రుని కొక విధమైన స్వతంత్ర సంబంధం వుండేది; అందులో అతడికి ఒక పిచ్చిసుఖం వుండేది; కాని ఆమెనుండి వేరుకాజాలనంత – త్రెంచి వేసుకోలేనంత – దృఢసంబంధం మాత్రంలేదు. అతడు ఇప్పుడు వినోదినిని సమాజంనుండి వేరుచేసి తెచ్చాడు. ఇప్పుడు వినోదినిని ఎక్కడ వుంచడానికి-ఎక్కడికి త్రిప్పి పంపడానికి స్థానంలేదు. మహేంద్రుడే ఆమెకు యేకైక ఆధారం. ఇప్పుడు, యిష్టముండనీ—లేకపోనీ అతడు వినోదిని భారమంతా తన నెత్తిమీద మోయకతప్పదు.

ఇలా ఆలోచించి, మహేంద్రుని హృదయం లోలోపల క్రుళ్ళి పోసాగింది. అతనికి యీ డాబామీద విశ్రాంతిగా కూర్చొనడం, యీ శాంతి, యీ బాధావిహీనమైన ఏకాంత ప్రేమకలయిక రాత్రులు—ఒకప్పుడు సుఖశాంతులకు వుపకరణాలుగా కనిపించాయి. ఐతే, నేడు తనకొక్కనికే అధికారం వున్న ఆ సహజసులభమైన సుఖవిశ్రాంతులే-అతడు దురాశావశుడై కోరుకొంటున్న వస్తువులవలె కనిపించసాగాయి. శాశ్వత రూపంలో మహేంద్రుడు తననెత్తిన యెత్తుకొన్న బరువును క్షణకాలం యెక్కడైనాదించి, శ్వాస తీసుకొనడం కూడా అసాధ్యమైపోయింది.

ఒక దీర్ఘ నిశ్వాసాన్ని తీసుకొని ఆశవైపు చూచాడు మహేంద్రుడు. బలవంతంగా నిరోధింపబడిన అశ్రువులతోను, యేడ్పుతోను, ఆమె హృదయం అంచులవరకు నిండివుంది. ఆమె యెంతమాత్రము కదలకుండా—మెదలకుండా కూర్చొంది. నిశాంధకారం తల్లి చీరచెరగులాగా ఆమెలజ్జను దుఃఖాన్ని కప్పిపెట్టింది.

మహేంద్రుడు అటూయిటూ తిరుగుతూ, ఏమి చెప్పడానికోగాని ఆశ సమీపానికివెళ్ళి నిల్చొన్నాడు. ఇదిచూచి ఆశ శరీరంలోని రక్తమంతా ఆమె చెవులవద్దచేరి ధ్వనిచేయసాగింది; ఆమె కళ్ళుమూసుకొంది. మహేంద్రుడు మాట చెప్పడమాలావుంచి, యేమిచెప్పడానికి వచ్చాడో అది సరిగా నిర్ణయించుకోలేక పోయాడు. కాని ఏమీ చెప్పకుండా తిరిగి

వెళ్ళలేకపోయాము. ఆఖరుకు "తాళపుచెవులగుత్తి యెక్కడుంది?" అని అడిగాడు.

తాళపుచెవులగుత్తి మంచంమీద పరుపుక్రిందవున్నది. ఆశ లేచి గదిలోకివెళ్ళింది; మహేంద్రుడుకూడా ఆమె వెనువెంటనే వెళ్ళాడు. పరుపుక్రిందనున్న తాళాలగుత్తితీసి ఆశ అతని యెదుటవుంచింది. అతడాగుత్తినితీసి తన అల్మేరా తాళానికి ఒక్కటొక్కటిగావేసి త్రిప్పి చూస్తున్నాడు. ఆశ చూస్తూ వూరుకోలేక పోయింది. "యీ అల్మేరాతాళం నా వద్దలేదు." అని మెల్లగా చెప్పింది.

దాని తాళపుచెవి యెవరివద్దవున్నదో తన నోటితో చెప్పలేకపోయింది ఆశ. కాని మహేంద్రుడు అర్థం చేసుకొన్నాడు. మహేంద్రుని యెదుట తన యేడుపు పొంగివస్తుందేమోననే భయంచేత ఆమె గదిలోనుండి బయటికి వెళ్ళిపోయింది. చీకటిరాత్రిలో ముఖం ఒకగోడమూలగాపెట్టి తనలోనుంచి పొంగివస్తున్న యేడ్పును బలవంతంగా అణచిపెట్టి శబ్దంకాకుండా కన్నీటినిమాత్రం కార్చివేస్తూవుంది.

ఆకన్నీరుకూడా యెంతోసేపు కారలేదు; మహేంద్రుడు భోజనంచేసే వేళయిందని ఆకస్మికంగా జ్ఞాపకానికి వచ్చింది. త్వరత్వరగా క్రిందికి దిగిపోయింది ఆశ.

"అమ్మా, మహేంద్రు డెక్కడవున్నాడు?" అని అడిగింది రాజలక్ష్మి.

"పైన వున్నారు."

"నీ వెందుకు క్రిందికి వచ్చావు?"

ఆశ తలవంచి "వారికి భోజనం—"

మాట కడ్డంవచ్చి "అన్నపానాలు నేను తీసుకొని వస్తాను. నీవు ముఖం కడుగుకొని, నూనె రాచుకొని, మంచి వస్త్రాలు వేసుకో. ఆ బనారస్‌చీర కట్టుకొని త్వరగా రా, నేను నీకు జడ అల్లుతాను." అని చెప్పింది రాజలక్ష్మి.

అత్తగారి ఆదరణను నిరాదరించలేకపోయింది ఆశ; కాని ఈ శృంగార ప్రస్తావనవల్ల ఆమె లోలోపల సిగ్గుతో కుమిలిపోయింది. భీష్మపితామహుడు మృత్యువుమీది కోరికతో కదిలీమెదలకుండా బాణవర్షాన్ని సహించినట్లుగా ఆశ కూడా అత్తగారు చేసిన ఈ శృంగారాన్ని తన శరీరంమీద ధరించింది.

అలంకరణం పూర్తికాగానే మెల్లమెల్లగా చప్పుడు కాకుండా మెట్లమీదుగా పైకి వెళ్ళింది. మహేంద్రుడు డాబా మీద లేడు. మెల్లగా తలుపుదగ్గరికి వెళ్ళి లోపలికిచూస్తే గదిలోకూడా లేడు. అన్నపు పళ్ళెం అలాగే వుంది; అందులో నుంచి ఒక్క కబళంగాని — ఒక్క వస్తువుగాని ముట్టుకొన్నట్లే లేదు.

తాళపుచెవి లేకపోవడంచేత బలవంతంగా అల్మారా తాళాన్ని పగులగొట్టి అవసరమైన బట్టలు, పుస్తకాలు తీసుకొని ఎక్కడికో వెళ్ళిపోయాడు మహేంద్రుడు.

మరుసటిదినం యేకాదశి. అనారోగ్యంతో బాధపడుతూ మంచంలో పడివుంది రాజలక్ష్మి. ఆకాశంలో మేఘాలు క్రమ్మివున్నాయి. పెద్ద తుపానువచ్చేలాగా కను

పిస్తూవుంది. ఆశ నెమ్మదిగా అత్తగారిదగ్గరకువెళ్ళి ఆమె పాదాలు నిమురుతూ "అత్తయ్యా, మీకొరకు పాలు, పండ్లు సిద్ధంగా వుంచాను—తీసుకురానా?" అని అడిగింది.

కరుణామయియైన కోడలుచేసే అలవాటులేని సేవా ప్రయత్నంచూచి రాజలక్ష్మి రెండుకళ్ళలో నీళ్ళు నిండాయి. ఆమె మెల్లగాలేచి ఆశను తనదగ్గరకి తీసుకొని కన్నీటితో తడసిన ఆశ కపోలాలను ప్రేమతో మాటిమాటికి ముద్దాడి— "అమ్మాయీ, మహేంద్రుడు యేమిచేస్తున్నాడు?" అని అడిగింది రాజలక్ష్మి.

ఆశ యీ మాటవిని సిగ్గుపడి "వారు వెళ్ళారు." అన్నది మెల్లగా.

"యెప్పుడు వెళ్ళాడు? నాకు తెలియనేలేదే!"

"నిన్నరాత్రే వెళ్ళిపోయారు." అన్నది ఆశ తలవంచి.

ఈ మాటవినగానే ఆమెలోని కోమలత్వం మాయమై పోయింది—కోడలు ఆదర పూర్వకంగా చేసేసేవలో కొంచెం కూడా ఆనందం లభించడంలేదు. ఆశ దీనిని గ్రహించి తిర స్కృతవలె తలవంచుకొని అక్కడినుండి వెళ్ళిపోయింది.

# 40

ఆ మొదటి రాత్రి వినోదినిని 'పటల్‌డాంగా' లోని యింట్లో విడిచిపెట్టి, పుస్తకాలకొరకు తన యింటికి వెళ్లాడు మహేంద్రుడు. అప్పుడు వినోదిని మానవారణ్యంలాగా కనిపించే

కలకత్తాలో ఒంటరిగా కూర్చొని తన విషయం యోచించడం మొదలుపెట్టింది. ఆమెకు యెన్నడూ భూమిమీద యథేచ్ఛగా వుండడానికి వీలైన ఆశ్రయం లేకపోయినప్పటికీ, ఒక ప్రక్కనుండి వేరొక ప్రక్కకు మెదలడానికైనా కొంత స్థానం వుండేది; కాని యిప్పుడామెవున్న స్థానం చాల కష్టభూయిష్టమైనది. ఆమె యిప్పుడు ఈ కాలప్రవాహాన్ని యీదడానికి యెక్కిన నావ చాలా తేలికపాటిది; కొంచెం యిటూ అటూ వూపినట్లైతే అది తలక్రిందులుగాపడి తానుకూడా మునిగియే ప్రమాదం వుంది. ఇప్పుడు స్థిరచిత్తంతో సావధానంగా తెడ్డు వేయవలసివుంది. ఏకొంచెం పొరవడినా, అటు ఇటూ కదిలినా అనర్థం తప్పదు.

ఇలాంటి స్థితిలో యేనారీహృదయం కంపింపదు? ఇతరుల మనసును అన్ని విధాలుగా తన ఆధీనంలో వుంచుకొనడానికి యెన్ని నాటకాలాడాలి? యెంత చాటుమాటుగా వ్యవహరించాలి? అందుకు యీ సంకీర్ణస్థానంలో అవకాశం యెక్కడిది? మహేంద్రునికి అత్యంతసమీపంలో, వేయికళ్ళతో కనిపెట్టుతూ తన జీవితం గడపవలసివుంటుంది. మహేంద్రుడెలాగో వద్దు పట్టుకొని తన స్థానాన్ని పొందగలుగుతాడు; కాని వినోదినికి ఏ ఉపాయం లేదు. ఇదీ — వారిద్దరిస్థితిలో భేదం.

వినోదినికి తన ఈ అసహాయస్థితి విస్పష్టంగా కనిపించే కొద్దీ, తన మనసులో బలాన్నికూడా తీసుకొనడం మొదలుపెట్టింది. ఆమె యేదో వుపాయం ఆలోచించవలసిందే; యీ విధంగా వుండజాలదు.

తాను బిహారియెదుట తన ప్రేమను ప్రకటించిననాటి నుండి ఆమె ధైర్యం సళ్ళిపోయింది. తాను ఆనాడు బిహారి పెదవుల సమీపంనుంచి వెనుకకు తీసుకవచ్చిన చుంబనానికి ప్రపంచంలో మరొకచోట స్థానంలేదు. వినోదిని దానిని పవిత్రమైన అర్ఘ్యంలాగా రాత్రింబగళ్ళు తన ఆ యిష్టదేవతకొరకు భద్రపరచుకొని తిరుగుతూవుంది. ఏ పనికూడా ఒక్కసారిగా విడిచిపెట్టే స్వభావం వినోదినికిలేదు. ఆమె హృదయం పూర్తిగా నిరాశ చెందడాన్ని యెరుగదు. ఆమె మనస్సు యెల్లప్పుడూ 'నేను చేసే ఈ పూజను బిహారి స్వీకరించక తప్ప' దని ప్రాణపణంతో ధైర్యంగా చెప్తూతూవుంది.

వినోదినికి ఈ గాఢమైనప్రేమతోపాటు ఆత్మరక్షణావకాశంకూడా లభించింది. ఆమెకు బిహారికంటే మరొక ఉపాయంలేదు. వినోదినికి మహేంద్రుని లక్షణాలన్నీ బాగా అర్థమైనాయి; అతనిమీద భారంవేసినట్లయితే అతడాభారాన్ని భరించలేడు. అతణ్ణి విడిచిపెడితే వెంటపడతాడు, పట్టుకుంటే పరుగెత్తిపోతాడు. స్త్రీకి కావలసిన స్థిరమైన, విశ్వసింపదగిన, నిరాపదమైన ఆశ్రయాన్ని బిహారి మాత్రమేయివ్వగలడు. నేడు బిహారిని విడిచిపెట్టితే వినోదినికి అన్నీ కష్టాలే సంభవిస్తాయి.

వినోదిని తనగ్రామం విడిచివచ్చేరోజు ఆగ్రామ స్టేషన్ వద్దనున్న పోస్టాఫీసువద్దకు మహేంద్రునిపంపి, తనపేరిట వచ్చే లేఖలనన్నింటిని కలకత్తాలోని తన క్రొత్త చిరునామాకు పంపవలసినదిగా కట్టడి చేయించింది. తాను వ్రాసినజాబుకు బిహారి తప్పకుండా తిరుగుజాబు వ్రాయకపోడని ఆమెకు గట్టినమ్మకం.

'ఒక్క వారందినాలపాటు ధైర్యం వహించి జవాబుకు నిరీక్షి స్తాను.' అని నిశ్చయించుకొంది వినోదిని.

అంతట వినోదిని అక్కడినుండిలేచి చీకటితో నిండి వున్న గదివెలుపలిద్వారాన్ని తెరచి పరధ్యానంగా వీధివైపు చూస్తూవుంది. వీధిలో గ్యాసులైట్ల వెలుగు ప్రకాశిస్తూవుంది. ఈ సంధ్యాసమయంలో బిహారి ఈ పట్టణంలోనే వున్నాడు; ఇక్కడినుండి ఒకటిరెండు వీధులు దాటివెళ్ళితే బిహారి దర్వాజావద్దకు చేరవచ్చు. దర్వాజా లోపలికివెళ్ళితే జల యంత్రమమర్చబడివున్న వొక చిన్నముంగిలి కనిపిస్తుంది. అక్కడే మెట్లున్నాయి. పైభాగంలో పరిశుభ్రమైన గది వెలుగుతో ప్రకాశిస్తూ మనోహరంగావుంది. అది యేకాం తంగా బిహారిగడిపేగది. ఆగదిలోనే ప్రశాంతంగా ఒంటరిగా కూర్చొని బిహారి చదువుకొంటూ వుండవచ్చు. అతనిప్రక్క ఆ బ్రాహ్మణబాలుడగు వసంతుడు – ఆ చంద్రబింబంలాంటి ముఖంతో – సుందరమైన గౌరవర్ణ శరీరంతో – విశాల నేత్రా లతో—ఆ అమాయక బాలుడు – బొమ్మలపుస్తకం చేతపట్టు కొని తన యిష్టప్రకారం పేజీలు త్రిప్పుతూవుంటాడు.

ఇలా క్రమక్రమంగా ఆనాటి సంపూర్ణచిత్రం తన కళ్ళ యెదుటికి రాగానే ప్రేమ తరంగాలతో వినోదిని హృదయం నిండిపోయింది — రోమకూపాలు గగుర్పొడిచాయి. తలచు కొంటే యిప్పుడే వెళ్ళవచ్చునని ఆమెకు వూహకలిగింది. ఇలా అనుకోగానే ఆమె తనకు యిష్టమైన ఈ కోరికను తన హృదయంలో దాచుకొని దానితో ఆటలాడుకొంటూ వుంది.

వెనుకటి దినాల్లోఅయితే తనకోరికను పూర్తిచేసుకొనడానికి వెంటనే ముందుకుసాగేది; కాని యిప్పుడది బాగా ఆలోచించవలసిన విషయం. ఈ సమయం కోరికలు పూర్తిచేసుకొనడానికి, వాసనలను తృప్తిపరచుకొనడానికి తగినదికాదు – ఒక అభిప్రాయానికి రావడానికి మాత్రమే యిదితగినది. 'బిహారిబాబు నాజాబుకు ప్రత్యుత్తర మేవిధంగా యివ్వగలడో ముందుచూడాలి; తర్వాత యేమార్గంలో వెళ్ళడం బాగా వుంటుందో, ఏది అవసరమో అప్పుడు నిశ్చయించుకొంటాను.' అని తనలో అనుకొంది వినోదినీ. ముందుగా సమాచారం తెలుసుకొనకుండా బిహారికి కోపంకలిగించే విధంగా వెళ్ళడానికి ఆమె సాహసించలేకపోయింది.

రాత్రి పది గంటలు కొట్టేవరకు యిలా ఆలోచిస్తూ వుంది; అప్పుడే వచ్చాడు మహేంద్రుడు. మూడు నాలుగు దినాలనుండి వేళకు తిండిలేక, నిద్రలేక చాలా పట్టుదలగా పనిచేసి, వినోదినిని ఆమె యింటినుండి తనవద్దకు తెచ్చి, కృతకార్యుడైనాడు. అతనికి ఒక విధమైన అలసట యేర్పడడంచేత అనారోగ్యంగా వున్నాడు. ప్రపంచంతోను–తన కష్టాలతోను పోరాడేశక్తిని కోల్పోయాడు. భారంవల్ల అణచబడివున్న తన భవిష్య జ్జీవనానికి సంబంధించిన బాధలు, చింతలు ముందటికంటె పైకి లేచాయి.

మూసిన ద్వారంవద్ద నిల్చొని తలుపు నెట్టుతూవుండగా మహేంద్రునికి చాలా సిగ్గు కలిగింది. ప్రపంచమంటే లెక్కలేకుండా ప్రవర్తించేలాగా చేసిన మత్తు యిప్పుడేమయిందో

తెలియదు. మార్గంలో వచ్చేపోయే—తెలియనివారి యెదుట కూడా ఈ సిగ్గు యెక్కడనుండి వస్తున్నదో తెలియదు.

నౌకరు క్రొత్తవాడు, అతడు లోపలనిద్రపోతున్నాడు. దర్వాజా తెరవడానికి యెంతగానో కేకలు పెట్టి తలుపు ధ్వని చేయవలసివచ్చింది. పరిచయంలేని క్రొత్త యింట్లో అంధకారంలో ప్రవేశించగానే మహేంద్రుని మనస్సు ఆరిపోయింది. అతడు ధనవంతుల యింటిబిడ్డ, తల్లికి ప్రియపుత్రుడు. అతని సాధనసామగ్రి చాలా విలువగలిగినట్టిది. వారి యింట్లో ముగ్గురు కూలీలు పంకాలు లాగుతూ వుంటారు. కాని ఈ క్రొత్తయింటిలో ఒక్క విలాసవస్తువూ లేదు. అప్పుడు తనకు అభ్యాసంగా వున్న వస్తువులు లేకపోవడంవల్ల చాలా దుఃఖపడ్డాడు మహేంద్రుడు. 'ఇక్కడి లోపాలన్నీ పూర్తిచేయాలి. ఇంట్లో అన్ని వ్యవహారాల భారాన్ని నేను మోయకతప్పదు.' అనుకొన్నాడు.

మహేంద్రుడు తన సుఖంకొరకుగాని, పరాయివాళ్ళ సుఖంకొరకుగాని చింతించడంలేదు—నేటినుండి ఒక నవనిర్మితమైన గృహనిర్వాహణాన్ని తన నెత్తికి యెత్తుకొనవలసి వచ్చింది. మెట్లమీద ఒక కిరసనాయిల్ దీపం అంతులేని పొగలు గ్రక్కుతూ మిణుకుమిణుకు మంటూవుంది. రేపు దీని స్థానంలో ఒక మంచి లాంతరు సిద్ధపరచవలసివుంటుందని ఆలోచించాడు. పంచదాటి మెట్లవద్దకు పోయేమార్గం పంపునీరు పడడంవల్ల లసలసలాడుతూవుంది. మేస్త్రిని పిలిపించి ఆభాగాన్ని సిమెంటుతో బాగుచేయించవలెనని అనుకొన్నాడు. ఆ ఇంట్లో

వీధివైపు రెండు దుకాణాలున్నాయి, అవి చెప్పులంగళ్ళు. ఈ యింట్లో దుకాణాలుండడం మంచిదికాదు, రేపు యింటి యజమానిని పిలిపించి రెండుమూడు దినాల్లో దుకాణాలు ఖాళీ చేయించమనీ, ఆ బాడుగకూడా తానే యిస్తాననీ, గట్టిగా చెప్పివేద్దామని వూహించాడు.

ఈ పనులు నేనే చేయాలి - అనుకోగానే, అతని అలసట-భారం యెక్కువయింది. అతడు మెట్లవద్ద కొంతసేపాగి, తన్ను సమాళించుకొని, వినోదినిమీద తనకున్న ప్రేమను వృద్ధిచేసుకొన్నాడు. ఇన్ని దినాలుగా ప్రపంచాన్ని లెక్కచేయకుండా, తానుకోరిన సుందరిని సంపాదించగలిగానని—తనకుతాను సమాధానం చెప్పుకొన్నాడు. ఇక మా యిద్దరి మధ్య యే అడ్డంకి లేదు——ఇది ఆనందింపదగినరోజు. కాని యేబాధా లేకపోవడంకూడా యీ నాడు అన్నిటికంటె బాధాకరంగా వున్నది. తనకుతానే బాధాకరంగా తయారయాడు.

అతడు వస్తూవున్నట్లు మార్గమధ్యంలోనే చూచింది వినోదిని. ఆమె ధ్యానాసనంనుండి లేచి, లాంపు వెలిగించి, ఒక బట్టమీద రంగుదారాలతో కుట్టుపని చేస్తూవుంది. కుట్టుపనియే ఆమెకు కంచుకోట, దాని చాటుననే ఆమెకు గొప్ప ఆశ్రయం లభిస్తూవుంది.

"వినోదినీ, నీకిక్కడ అనేక విధాలైన యిబ్బందులు కలుగుతూ వుండవచ్చు!" అని లోపలికి వస్తూనే అన్నాడు మహేంద్రుడు.

"నా కేమీా యిబ్బందిగా లేదు." అన్నది వినోదిని బట్ట మీాద పూలు కుట్టుతూ.

"నేను రెండు మూడు దినాల్లోనే అన్ని సామానులు తెస్తాను. అంతవరకు యేదో కొంత కష్టపడక తప్పదు."

"వద్దు, యేమీా తేవద్దు; యిప్పుడున్న వస్తువులే అవసరానికి మించి చాలా అధికంగా వున్నాయి."

"ఈ అభాగ్యుడుకూడా అవసరానికి మించేవున్నాడా?" అని కొంచెం భయపడుతూ అతడు తన రసికతను వెల్లడించాడు.

"మిమ్ము మీారు అంత గొప్పగా భావించకండి—కొంచెం నమ్రతకలిగి వుండడం మంచిది!"

ఆ నిర్జన స్థానంలో లాంపుయెదుట తల వంచుకొని తన పనిలో లగ్నమైవున్న వినోదిని మూర్తిని చూడగానే మహేంద్రుని మనసులో తిరిగి మోహం సంచారం చేయసాగింది.

నేడు తన యింట్లోనే అయితే, అతడు పరుగెత్తి వినోదిని కాళ్ళవద్దకు వచ్చివేసేవాడు. కాని ఇది తన యిల్లుకాదు, వినోదిని అసహాయురాలై వుంది. ఆమె పూర్తిగా మహేంద్రుని చేతులలో చిక్కివుంది. ఇప్పుడు తానొక హద్దులలో మెలగక పోతే అది చాలా నీచంగాను - నామర్దాగాను వుంటుంది.

"మీారు మీా పుస్తకాలు బట్టలు యిక్కడికెందుకు తెచ్చారు?"

"వాటిని నా అవసరమైన వస్తువులుగా భావిస్తూ వున్నాను. 'అవసరానికి మించినవస్తువులు' వాటిలోలేవు."

"తెలుసు. అయితే వాటిని ఇక్కడికెందుకు తెచ్చారు?"

"నిజమే—అవసరమైన వస్తువుయేదీ యిక్కడ శోభిం చదు. వినోదినీ, ఈ పుస్తకాలన్నింటినీ విసరి వీధిలో పార వేయి, నేమీమాట్లాడను; కాని వాటితో పాటు నన్నుకూడా విసరికొట్టవద్దు సుమా!"

ఇలాఅని, ఈ నెపంతో కొంచెంగా ముందుకు జరిగి, పుస్తకాలకట్ట వినోదిని కాళ్ళముందు పెట్టాడు మహేంద్రుడు.

"మహేంద్రబాబూ, మీరిక్కడ వుండడానికి వీలులేదు." అని తలమెత్తకుండానే బట్టమీద డిజైనులుకుట్టుతూ గంభీర భావంతో అన్నది వినోదిని.

తనలో కలిగిన కోరికకు అప్పటికప్పుడే ముఖం పగిలి పోయేఅంత దెబ్బతగిలినట్లనిపించి, వ్యాకులపడ్డాడు మహేం ద్రుడు. అతనిగొంతుక పూడిపోయింది. "ఎందుకు వినోదినీ, నీవు నన్నెందుకు దూరంగా వుంచగోరుతున్నావు? నీకొరకు అన్నీ వదలుకొని ఇదేనా నేననుభవించగలిగేది?" అన్నాడు.

"నేను నా కొరకు మిమ్ము మీ సర్వస్వం పోగొట్టు కొననీయను."

"ఇక యిది నీ చేతులలోని వ్యవహారంకాదు. నలు దిక్కులనుండి నా పరివారము, నా సంసారము పూర్తిగా, నా నుండి దూరమైపోయింది. వినోదినీ, నాకు ఉన్నదంతా ఇప్పుడు నీ వొక్కదానివే వినోదినీ! వినోదినీ!" అంటూ విహ్వలుడై బోర్లాపడి వినోదిని రెండుకాళ్ళను ముద్దుపెట్టుకొనడం మొదలు పెట్టాడు మహేంద్రుడు.

వినోదిని బలవంతంగా కాళ్ళు విడిపించుకొని లేచి నిల్చొని—"మహేంద్రబాబూ, నీ వేమని ప్రతిజ్ఞచేశావు—జ్ఞాపకం లేదా?" అన్నది.

మహేంద్రుడు దృఢచిత్తంతో తన్నుతాను సమాళించుకొని "జ్ఞాపకముంది. నీ యిష్టప్రకారం ప్రవరిస్తానని ప్రమాణం చేశాను. నే నా ప్రమాణాన్ని పాలించడానికి సిద్ధంగావున్నాను. చెప్పు యేం చెయ్యమంటావో." అన్నాడు.

"మీరు మీ యింటికి వెళ్ళివుండండి."

"నేనే నీకిష్టంకాని వస్తువునా వినోదినీ? ఇదే నిజమైతే నన్ను నీవెంట యింతవరకూ యెందుకు యీడ్చుకొని వచ్చావు? — నీ వనుభవింపరాని వస్తువును వేటాడవలసిన అవసరమేముంది? నిజంచెప్పు, నేను నా బుద్ధిపూర్వకంగా నీవల్ల బంధింపబడడానికి వచ్చానా, లేక నీవే బుద్ధిపూర్వకంగా నన్ను బంధించావా? నన్ను లోబరచుకొని యీ విధంగా ఆటలాడుతున్నావా? ఇదికూడా నేను సహించవలసినదేనా? సరే, యేమైనప్పటికి నామాటమీద నిలుస్తాను; నేను బుద్ధిపూర్వకంగా కాలదన్నివచ్చిన నాస్థానికే వెళ్ళివుంటాను."

నేలమీద కూర్చొని మాట్లాడకుండా రంగుదారంతో కుట్టుతూవుంది వినోదిని.

మహేంద్రుడు కొంతసేపటివరకు వినోదినివైపు తదేకదృష్టితో చూచి—"క్రూరురాలా, వినోదినీ! నీవెంత క్రూరురాలవు! నేను చాలా మందభాగ్యుణ్ణి,నిన్నుచూచి మోహంలో పడిపోయాను." అన్నాడు.

వినోదిని దారము పైకితీస్తూ ఒక 'తప్పు' వేసి దాన్ని లాంపువద్దకు తీసుకువెళ్ళి చాలా కష్టంతో సరితీస్తూవుంది. ఈ వినోదిని రాతిహృదయాన్ని తన దృఢమైన పిడికిలిలోకి తీసుకొని నలిపివేయాలని, ఈ నిర్దయతోకూడిన ఆమె వుపేక్షను - మౌనాన్ని ఒక్క చావుబెబ్బ కొట్టి, బాహు బలంతో ఓడించివేయాలని అనిపించింది మహేంద్రునికి.

గదినుండి బయటికివెళ్ళి తిరిగి లోపలికి వచ్చి "సరే, నేను వుండను, నీవు వంటరిగా వుండేలాగుంటే నీకిక్కడ రక్షణ యెక్కడిది? నీకు భయం కలుగదా?" అని అడిగాడు మహేంద్రుడు.

"ఇందుకు మీరు భయపడకండి. మేనత్తగారు మీ యింటిదాపీని మాన్పించివేసింది, ఆమె వచ్చి నిన్నటినుండి నావద్ద వుంది. వీధి తలుపుకు తాళం బిగించి మేము యిద్దరం నిశ్చింతగావుంటాము." అన్నది వినోదిని.

వినోదినిమీద కోపపడుతూ - చీదరిస్తూ వుండేకొద్దీ, మహేంద్రుని మనస్సు ఆమెవైపుకు అధికంగా ఆకర్షింపబడుతూ వుంది. ఆ నిశ్చలమైన మూర్తిని తన వజ్రతుల్యమైన హస్తాలతో బలపూర్వకంగా హృదయానికి హత్తుకొని నుగ్గు నుగ్గు చేసివేయవలెనని కోరిక పుడుతూవుంది. ఆ భయంకరమైన కోరికనుండి విముక్తి పొందదలచి వెంటనే అతడు యింట్లోనుంచి బయటికి వెళ్ళిపోయాడు.

మార్గాన వెళ్ళుతూ వెళ్ళుతూ వినోదిని చూపిన యీ వుపేక్షకు బదులుగా తానుకూడా నిర్లక్ష్యంగా నడుచుకొంటూ

నని ప్రతిజ్ఞ చేసుకొన్నాడు. మహేంద్రుడే యేకమాత్ర ఆధా రంగావున్న యీ స్థితిలోకూడా, ఆమె అతణ్ణి యీ విధంగా మౌనంగా - నిశ్చింతగా - దృఢంగా—ఉపేక్షిస్తూ వుంది! స్వీక రించడంలేదు! ఆహా, ఎన్నడూ యే పురుషునికీ యింత ఘోర మైన అవమానం కలిగివుండదు!

మహేంద్రుని గర్వం ఖండఖండాలైపోయి కూడా *నలుబదితొమ్మిదిమంది మరుద్గణములాగా చావలేదు. ఆ గర్వం అతని హృదయాన్ని పీడిస్తూ బాధ పెడుతూవుంది. నేనింత నీచుణ్ణయూనా? నాతో యిలా ప్రవర్తించడానికి ఆమెకు యెలా ధైర్యం వచ్చింది? ఇప్పుడామెకు నాకంటె సహాయకులెవరు?'' అనుకొన్నాడు.

ఆలోచించగా ఆలోచించగా జ్ఞాపకంవచ్చింది—బిహారి వున్నాడు! ఆకస్మికంగా అతని హృదయంలోని రక్తమంతా

---

*దైత్యుల తల్లి దితి ఇంద్రుని హతమార్చవలెననే కోరి కతో గర్భధారణం చేసింది. ఇంద్రుడు యుక్తితో దితిదగ్గర వుండి ఆమెకు సేవ చేయసాగాడు. ఒక దినం ఇంద్రునికి అవ కాశం లభించింది. అతడు వెంటనే తన యోగబలంచేత దితి గర్భంలో ప్రవేశించి, ఆ బాలకుణ్ణి సప్తఖండాలుగా ఖండించి వేశాడు; ఐనప్పటికీ అవికూడా చావలేదు. ఒక్కొక్క ఖండాన్ని మళ్ళీ సప్తఖండాలుగా ఖండించాడు; అవికూడా దితి పుణ్యాబలంచేత చావలేదు. వారు నలుబదితొమ్మిదిమంది మరుద్గణముగా ప్రసిద్ధిపొందారు — భాగవతం.

గడ్డకట్టిపోయింది. వినోదినికి బిహారియే ఆధారం; ఆమె అతణ్ణే ప్రేమిస్తూవుంది; నేను ఉపలక్ష్యాన్నిమాత్రమే—లక్ష్యం బిహారి మీదనేవుంది. నేనామెకు మేడమెట్లలాంటివాణ్ణి; ఆమె కాళ్ళు పెట్టడానికి అడుగడుగుకూ తన్నులు తన్నడానికి నేను స్థలాన్ని. ఈ సాహసంతోనే ఆమె నన్ను నిరాదరణ చేస్తూవుంది! బిహారికి వినోదినికి పత్రవ్యవహారం జరుగుతూవున్నదని, వినోదినికి ఆ దిక్కునుండియే ఆశ్రయం లభించిందని అతడు సందేహించాడు.

అప్పుడు మహేంద్రుడు బిహారి యింటివైపుగా బయలుదేరాడు. బిహారి యింటివద్దకువెళ్ళి అతడు తలుపుకొట్టాడు. అప్పటికింకా యెక్కువ ప్రొద్దుపోలేదు. చాలా దెబ్బలు కొట్టినతర్వాత పనివాడు లేచి తలుపు తెరచి "బాబుగారు యింట్లోలే"రని చెప్పాడు.

అదరిపడ్డాడు మహేంద్రుడు. నేను తెలివితక్కువగా అటూయిటూ తిరుగుతున్నాను. బిహారి తప్పక వినోదిని వద్దకు వెళ్ళివుంటాడు. అందువల్లనే అంత నిర్దయగా నన్నవమానించింది. నేనుకూడా దెబ్బలుకొట్టి వెళ్ళగొట్టబడ్డ గాడిదలాగా పరుగెత్తివచ్చాను! మహేంద్రుడు డా చిరపరిచితుడైన పనివాణ్ణి—"భజ్జూ, బాబు యింటినుండి యెప్పుడు వెళ్ళారు?" అని అడిగాడు మళ్ళీ.

"వారు యిక్కడినుండి వెళ్ళి నాలుగైదు దినాలైంది. పడమటి దేశంలో యెక్కడో తిరగడానికి వెళ్ళారు." అన్నాడు భజ్జూ.

ఈమాట వినగానే మహేంద్రుడినికి ప్రాణాలు లేచి వచ్చాయి. 'అమ్మయ్యా! ఇప్పుడు కొంచెం సుఖంగా నిద్ర పోవచ్చు; రాత్రిఅంతా తిరుగుతూ గడపనక్కర్లేదు.' అనుకొని, పైకివెళ్ళి బిహారిగదిలో సోఫామీద పడుకొని కళ్ళు మూసుకొన్నాడు మహేంద్రుడు. వెంటనే నిద్రపట్టింది.

మహేంద్రుడు బిహారివద్దకువచ్చి అల్లరిచేసివెళ్ళిన మరుసటిరోజున, ఫలానాచోటికని నిర్ణయించుకొనకనే పడమటి ప్రాంతానికి వెళ్ళిపోయాడు బిహారి. ఇక్కడ వుండడవల్ల యింతవరకు మైత్రితో మెలగుతూవుండే మిత్రులమధ్య ఏదో ఒకరోజు భయంకరమైన జగడం సంభవింపకపోదని, తర్వాత తన జీవితం దుర్భరంగా పరిణమించకపోదని, అతడు భావించాడు.

మరుసటిదినం మహేంద్రుడు నిద్రలేచునప్పటికి మధ్యాహ్నం పదకొండు గంటలయింది. కళ్ళు తెరుస్తూనే అతనిచూపు యెదుటనున్న ముక్కాలిపీటమీదికి పోయింది. వినోదిని దస్తూరితో బిహారి చిరునామాతోవున్న ఒకజాబు 'పేపర్ వెయిట్' క్రింద పెట్టబడివుంది. వెంటనే ఆ జాబును పైకితీసి చూచాడు. జాబు కవరులోవుంది; కవరు తెరవబడలేదు. ఆ లేఖ ప్రవాసంలోవున్న బిహారికొరకు నిరీక్షిస్తూవుంది. వణకుతూ వణకుతూ మహేంద్రుడు లకోటా తెరచి చదవడం ప్రారంభించాడు. ఇది వినోదిని పల్లెటూరినుండి వ్రాసినజాబు. ఆమె యింతవరకు దీనికి జవాబును పొందలేదు.

ఆ లేఖలోని అక్షరాలన్నీ కందురీగల్లాగా మహేంద్రుని ముఖంచుట్టూ ముసురుకొని పొడిచేస్తున్నట్లున్నాయి. బిహారి మొదటినుండి మహేంద్రునిచాటున పెరిగి పెద్దవాడయినాడు. ప్రపంచంలో ప్రేమస్నేహాలకు సంబంధించినంతవరకు మహేంద్ర దేవునికి పూజ చేయబడిన యెండిన నిర్మాల్యాన్ని అనుభ వించడమే అతడు తన అదృష్టంగా భావించేవాడు. ఇప్పుడు మహేంద్రుడు ఆమె ప్రేమను అర్థిస్తున్నాడు, ఆ ప్రేమకు విముఖుడుగా వున్నాడు బిహారి. మహేంద్రుని త్రోసివేసి అరసికుడైన బిహారిని ప్రేమిస్తూవుంది వినోదిని. ఆమెవద్దనుండి మహేంద్రునికికూడా ఒకప్పుడు ఒకటి రెండు లేఖలు చేరాయి; కాని బిహారికి వ్రాసిన జాబు చదివినతర్వాత అవి పూర్తిగా కపటంగాను, మూర్ఖుని మరపించడానికి ప్రత్యేకంగా పన్నిన తంత్రంగాను కనుపిస్తూవున్నాయి.

వినోదినిని మహేంద్రుడు ఆమె గ్రామంనుండి తీసుకొని వస్తున్నప్పుడు ఆమె పోస్టాఫీసులో తన క్రొత్త అడ్రసు చెప్పి రావడానికి యెందుకు తొందరపడ్డదీ - యిప్పుడు బాగా అర్థ మయింది. వినోదిని తన మనస్సును శరీరాన్నికూడా అర్పించి, బిహారి జవాబుకు యెదురుచూస్తూవుంది!

వెనుకటి ఆచారంప్రకారం, యజమాని లేకపోయినప్ప టికీ, భజ్జూ తేనీరు సిద్ధపరచి తెచ్చాడు. జలపానం చేయడానికి బజారునుండి మిఠాయి కూడా తెచ్చాడు. తేనీరు త్రాగడం భోజనం చేయడం పూర్తిచేశాడు మహేంద్రుడు; ఐతే, స్నానంచేయడం మరచిపోయాడు. మలమలమాడుతున్న

యిసుక నేలమీద త్వరత్వరగా అడుగులువేస్తున్న పథికునిలాగా మండింపజేస్తున్న వినోదిని లేఖమీద క్షణక్షణమూ తనదృష్టిని చిందులు త్రొక్కిస్తున్నాడు మహేంద్రుడు.

ఇక యెన్నడు వినోదినితో మాట్లాడరాదని అతడు ప్రతిజ్ఞ చేసుకొన్నాడు. కాని తన జాబుకు జవాబుకొరకు రెండు మూడు రోజులు నిరీక్షించిన తర్వాత వినోదిని బిహారి యింటి వద్దకు వస్తుంది. అతడు అచ్చటలేడని తెలియగానే ఆమెకొక విధమైన ఓదార్పు కలుగుతుంది. — ఈ ఓదార్పు కలగడం మహేంద్రునికి అసహ్యంగా కనిపించింది. వెంటనే ఆజాబును జేబులో పెట్టుకొని, అతడు వినోదినివున్న యింటివద్దకుచేరాడు.

కళావిహీనమై ముడుచుకొనివున్న అతని ముఖాన్ని చూడగానే వినోదినికి దయకలిగింది. అతడు రాత్రి అంతా వీధులవెంట తిరుగుతున్నాడని భావించింది. "నిన్నరాత్రి యింటికి వెళ్ళలేదా?" అని మహేంద్రుని ప్రశ్నించింది.

"వెళ్ళలే"దన్నాడు మహేంద్రుడు.

"ఐతే మీరింతవరకు అన్నపానీయాలేమీ తీసుకో లేదా?"—అని బాధపడుతూ అడిగింది వినోదిని. ఇలా అడిగి సేవాపరాయణమైన వినోదిని వెంటనే భోజనానికి తగిన యేర్పాట్లు చేయడానికి సిద్ధపడింది.

"వద్దు వద్దు, నేను భోజనంచేసి వచ్చాను."

"ఎక్కడ?"

"బిహారి యింట్లో."

ఒక్కక్షణం వినోదిని ముఖం వెలవెలపోయింది. పిమ్మట కొంచెం మౌనంగా వుండి, తన్ను సమాళించుకొని "బిహారి బాబు బాగా వున్నారా?" అని అడిగింది.

"బాగానే వున్నాడు, పడమటిదేశం యాత్రకు బయద్దేరాడు." అని—బిహారి నేడే బయటికి వెళ్ళినట్లు బోధపడేలాగా చెప్పాడు మహేంద్రుడు.

వినోదిని ముఖం మరొకసారి కళావిహీనమయింది. మళ్ళీ తనను సమాధానపరచుకొని "ఇలాంటి చపలచిత్తుణ్ణి ఎక్కడా చూడలేదు. మన సమాచారమంతా ఆయనకు తెలిసినట్లుంది. ఆయన చాలా కోపపడ్డారా?" అని అడిగింది.

"అలాగే వుంది, లేకపోతే యీరోజుల్లో యెవడైనా విదేశ సంచారానికి వెళ్ళుతాడా?"

"వారు నన్నుగురించికూడా యేమైనా మాట్లాడారా?"

"మాట్లాడడానికేముంది? ఇదిగో బిహారి వుత్తరం—" అని ఆ జాబును వినోదిని చేతికిచ్చి, తీవ్రదృష్టితో ఆమె ముఖభావాలను పరిశీలిస్తున్నాడు మహేంద్రుడు.

వినోదిని గబగబా జాబును పరిశీలించింది — జాబు తెరవబడివుంది. కవరుమీద తన దస్తూరితో బిహారి పేరు వ్రాయబడివుంది. కవరులోనుంచి జాబును తీసి చూచింది,— అది ఆమె వ్రాసినదే, తిరుగవేసి బోర్లవేసి చక్కగా చూచినా అందులో బిహారి వ్రాసినది ఒక్కఅక్షరంకూడ కనిపించలేదు. ఆమె కొంతసేపు మౌనంగావుండి "జాబు మీరు చదివారా?" అని అడిగింది.

వినోదిని ముఖలక్షణాలను చూచి భయపడి వెంటనే "చూడలేదు." అని అసత్యం చెప్పాడు మహేంద్రుడు.

ఆమె ఆ జాబును ముక్కలు ముక్కలుగా చించివేసింది; తిరిగీ ఆ ముక్కలను ఇంకా పొడుంపొడుంగా చేసి కిటికీగుండా బయటికి విసరివేసింది.

"నేను యింటికి వెళ్ళుతున్నాను." అన్నాడు మహేంద్రుడు.

వినోదిని జవాబు చెప్పలేదు.

"నీవెలా చెప్పితే అలా నడచుకొంటాను. వారంరోజుల వరకు నేను మా యింట్లోవుంటాను. కాలేజికి వెళ్ళే సమయంలో రోజూ ఒక్కసారివచ్చి దాసీద్వారా యిచ్చటి యేర్పాట్లన్నీ చేయిస్తాను. నీ వద్దకువచ్చి నీకు యిబ్బందికలిగించను." అని మళ్ళీచెప్పాడు మహేంద్రుడు. అతని మాటలేమైనా వినోదినికి వినిపించాయో లేదో చెప్పలేము; కాని ఆమె యే ప్రత్యుత్తరమూ యివ్వలేదు. ఆమె తెరచివున్న ద్వారంలోనుంచి అంధకారమయమైన ఆకాశంవైపు నిరీక్షిస్తూవుంది.

అతడు తన సామానులమూట తీసుకొని వెళ్లిపోయాడు.

ఆమె చాలాసేపు చేతనారహితమైన కొయ్యబొమ్మలాగా కూర్చొనివుంది. తర్వాత ఆమె బలవంతంగా తన్ను తాను తిరిగి చైతన్యవంతంగా చేసుకొనడానికి తన రవికను చించుకొని గుండెలమీద గభీ గభీమని కొట్టుకొనడం మొదలు పెట్టింది.

గుండెలమీాద కొట్టుకొంటున్న దెబ్బలధ్వనినివిని దాసి మేడమీాదికి వచ్చింది.

"ఏమిటమ్మా, ఆ పని?" అని అడిగింది దాసి.

"నీవు వెళ్ళిపో." అని పెద్దగా అరచింది వినోదిని.

దాసి మెల్లగా క్రిందికి వెళ్ళిపోయింది. వినోదిని లేచి, దభీమనీ తలుపులు దగ్గరగావేసి, వెంటనే నేలమీాదపడి అలుగు వ్రేటుతిన్న జింకపిల్లలాగా పొర్లిపొర్లి యేడ్వసాగింది. ఈ విధంగా తన్నుతాను అలసటవచ్చేలాగా చేసికొని, మూర్ఛపోయి, ఆరాత్రి అంతాకూడా ఆ తెరచివున్న ద్వారంవద్ద పడివుంది.

ఉదయం సూర్యునివెల్తురు లోపలికి రాగానే 'బిహారి నిజంగా వెలుపలికి వెళ్ళాడా, లేక మహేంద్రుడు అబద్ధం చెప్పాడా?' అని వినోదినికి సందేహం కలిగింది.

వెంటనే దాసీని పిలిచి "నీవు యిప్పుడే బిహారిబాబు వద్దకువెళ్ళి వారివిషయం తెలుసుకొనిరా." అని చెప్పింది.

ఒక గంట తర్వాత దాసీవచ్చి "బిహారిబాబు యిల్లు పూర్తిగా మూాయబడివుంది. తలుపుమీాద ధ్వనిచేయగా చేయగా బాబుగారు యింట్లోలేరు, పశ్చిమదిక్కుగా పర్యటనానికి వెళ్లారని లోపలినుంచి పనివాడుచెప్పాడు." అనిచెప్పింది.

ఇక వినోదినికి సందేహించే అవసరం కలుగలేదు.

# 41

ఆ రాత్రికే మహేంద్రుడు వెళ్ళిపోయాడనే కబురువిని రాజలక్ష్మికి కోడలిమీద కోపంవచ్చింది. కోడలేదో అసభ్యంగా మాట్లాడి వుంటుందని, అందుచేత కోపంతో మహేంద్రుడు వెళ్ళివుంటాడని ఆమె భావించింది.

"నిన్న రాత్రే యెందుకు వెళ్ళాడు?" అని మళ్ళీ అడిగింది రాజలక్ష్మి.

"నేనెరుగను." అని తలవంచుకొని చెప్పింది ఆశ.

ఇదికూడా అభిమానంతో చెప్పినమాటే - అని ఆలోచించి "నీకు తెలియకపోతే మరెవరికి తెలుస్తుంది? నీవేమైనా కఠినంగా మాట్లాడావా?" అని కోపంతోఅడిగింది రాజలక్ష్మి.

"లేదు" అనిమాత్రమే అన్నది ఆశ.

ఈ 'లేదు' అనే మాటమీద ఆమెకు విశ్వాసం కలుగ లేదు—ఇది యేమీ అనకుండా వుంటుందా! ఇలా యెక్కడైనా జరుగుతుందా? – అనుకొని - "వా డేసమయంలో వెళ్లాడు?" అని అడిగింది రాజలక్ష్మి.

"ఇదికూడా నాకు తెలియదు." అని సంకోచిస్తూ అన్నది ఆశ.

రాజలక్ష్మికి క్రోధం మించిపోయింది. "నీకేమీ తెలియదు! బొత్తిగా పసిబిడ్డవు! నీ తెలివంతా చూపించుకొంటు న్నావు." అని బెదరించింది.

ఆశ ప్రవర్తనవల్లనే మహేంద్రుడు యిల్లువిడిచి వెళ్ళి పోయాడని ప్రచారం చేసింది రాజలక్ష్మి. తల వంచుకొని యీ బెదరింపును-అపవాదాన్ని సహించింది ఆశ. ఆమె కిమ్మనకుండా తన గదిలోకి వెళ్ళి యేడ్వసాగింది. 'నా భర్త ఒకప్పుడు నన్నింతగా యెందుకు ప్రేమించాడో తెలియదు, యే వుపాయంవల్ల తిరిగి ఆ ప్రేమను పొందగలుగుతానో తెలియదు' —అనుకొని ఆమె హృదయం రెపరెపలాడిపోయింది.

తనను ప్రేమించేవ్యక్తిని యేవిధంగా సంతోషపెట్టవలెనో - తన హృదయమే తనంతటతానుగా చెప్పివేస్తుంది; కాని తనను ప్రేమించని పురుషుని మనస్సును - మర్యాదను యెలా వుంచవలెనో ఆశకేమి తెలుస్తుంది. ఇతరులను ప్రేమించే పురుషునినుండి ప్రేమాదరాలను సంపాదించవలెనని ప్రయత్నించడం లజ్జాకరమైన విషయం; ఆశ యిలాంటి ప్రయత్నం యెట్లు చేయగలుగుతుంది?

సాయంసమయంలో ఇంద్రజాల — మహేంద్రజాల — మారణ-సమ్మోహన-వశీకరణ-ఉచ్చాటనాదుల్లో సిద్ధహస్త యని ప్రసిద్ధిపొందిన-తమ సోదరిని వెంటబెట్టుకొని పురోహితుల వారు వేంచేశారు. అబ్బాయి మనసును మంచి మార్గంలోకి త్రిప్పడానికి, గ్రహశాంతి చేయించడానికి, వారిని పిలిపించింది రాజలక్ష్మి. ఆశ జన్మపత్రికను పరిశీలించమని ఆమె హస్తసాముద్రికం చెప్పమని పురోహితులను కోరింది. వెంటనే ఆశను పిలిపించింది. పరాయివారి యెదుట తన దౌర్భాగ్యం పరిశీలింపబడుతుందనే లజ్జతో—బాధతో బలవంతంగా తన చేతిని

చాచిందిఆశ. ఇదే సమయంలో తన గదికి ప్రక్కగావున్న వరండాలో యెవరో మెల్లగా అడుగులు పెడుతున్నట్లు చప్పుడు వినిపించింది. ఎవరోగుట్టుగా వెళ్లుతున్నట్లు అనుమానం కలిగింది.

"ఎవరు?" అన్నది రాజలక్ష్మి.

మొదట జవాబేమీ రాలేదు. "ఎవరటువెళ్లేది?" అని ఆమె మళ్ళీ కేకపెట్టింది. సడీచప్పుడూ లేకుండా యింట్లోఅడుగు పెట్టాడు మహేంద్రుడు.

ఇక ఆశ ఏమిసంతోషిస్తుంది?—బిడియపడుతూవున్న మహేంద్రునిచూచి ఆమె హృదయం లజ్జతో నిండిపోయింది. ఇప్పుడు మహేంద్రుడు తన యింట్లోకి రావడానికి కూడా లజ్జపడవలసివచ్చింది! ఆ సమయంలో పురోహితులు, వారి అక్కకూడా అక్కడే వుండడంవల్ల ఆశకింకా సిగ్గుగాతోచింది. లోకంయెదుట తనస్వామి అంతగా సిగ్గుపడడంచూచి అందుకు చింతిస్తూ తన దుఃఖాన్ని మరచిపోయింది.

"అమ్మాయీ, వంటామెతో మహేంద్రునికి పళ్లెంలో వడ్డించమని చెప్పు." అన్నది రాజలక్ష్మి.

"నేనే తీసుకొని వెళ్ళుతానత్తయ్యా." అన్నది ఆశ.

పతివ్రతయైన ఆశ యింటిపనివాళ్ళ దృష్టినుండికూడా మహేంద్రుని దాచుకొనవలెననుకొన్నది.

ఇంట్లో పురోహితుని, వారి అక్కనుచూచి తనలో తాను చాల కోపపడ్డాడు మహేంద్రుడు. అతనితల్లి, భార్య యిద్దరు దైవసహాయంతో తనను వశపరచుకొనవలెనని యీ ఈ తెలివితక్కువ దద్దమ్మలతోకలిసి బహిరంగంగా—సిగ్గుమాలిన

తనంతో కుతంత్రం పన్నుతూ వుండడం అతనికి అసహ్యంగా వుంది. పైగా పురోహితుని అక్క చాలా స్నేహరసంతో నిండిన తియ్యనిమాటలతో – "బాగావున్నావా తమ్ముడూ?" అని అడుగగానే ఇక అక్కడ కూర్చోనలేకపోయాడు మహేంద్రుడు. కుశలప్రశ్నకు జవాబు చెప్పకనే అతడు "అమ్మా, నేను కొంచెం పైకి వెళ్లుతున్నాను." అన్నాడు.

'మహేంద్రుడు మేడమీదికివెళ్ళి యేకాంతంలో కోడలితో యేదో మాట్లాడగోరుతున్నాడు' అనుకొన్నది తల్లి. వెంటనే చాలా సంతోషంతో వంటయింటిలోకివెళ్లి – "వెళ్లు వెళ్ళు, ఓసారి త్వరగా పైకివెళ్ళు, మహేంద్రునికి నీతో యేదో అవసరమున్నట్లుంది." అని ఆశతో చెప్పింది రాజలక్ష్మి.

గడగడ వణకుతున్న హృదయంతో అనుమానంగా అడుగులో అడుగువేస్తూ పైకివెళ్ళింది ఆశ. అత్తగారి మాటల వల్ల తనను భర్త పిలుస్తున్నాడని అర్థంచేసుకొంది. కాని ఆమె నేరుగా గదిలోకి వెళ్ళలేకపోయింది. ఆమె ఆ చీకట్లో తలుపుచాటుగా నిల్చి మహేంద్రుని ప్రవర్తనను గమనిస్తూ వుంది. అతడు నేలమీద దిండు తలక్రిందవుంచుకొని పడుకొని పైనున్న దంతెలవైపు శూన్యభావంతో చూస్తూవున్నాడు. ఆ మహేంద్రుడే! ముమ్మూర్తులా అతడే! కాని యెంత మారి పోయాడు! ఒకనాడీ చిన్నపడకగదిని స్వర్గతుల్యంగా చేశాడు మహేంద్రుడు. మహేంద్రా, నేడు నీవెందుకు ఆ ఆనందాన్ని స్మరించి యీ పవిత్ర స్థలాన్ని అవమానిస్తావు? ఇంతకష్టంతో – ఇంత ఔదాసీన్యంతో – ఇంత చంచలబుద్ధితోమాత్రం

ఆ మంచంమీద అడుగుపెట్టవద్దు. మహేంద్రా, యిక్కడికి వచ్చినాకూడా ఆ వెనుకటి పూర్ణరాత్రులు ఆ ప్రేమమధుర సంభాషణలు నీకు జ్ఞాపకం రాకపోతే—ఆ మేఘాచ్ఛన్నమైన పగటిని, ఆ దక్షిణపవన వికంపిత వసంతుని ఆనందమయమైన సంధ్యకాలాన్ని మరచిపోయినట్లైతే — ఈ భవనంలో ఇంకా అనేక గదులున్నాయి. వాటిలో యే గదిలోకైనా వెళ్ళు. కాని యీ చిన్నగదిలో గడియకూడా నిలువవద్దు!

ఆశ అంధకారంలో నిల్చొని మహేంద్రునివైపు చూస్తూవున్నకొలది అతడు యిప్పుడే వినోదినివద్దనుంచి వచ్చాడనీ, అతని శరీరంతో వినోదిని శరీరం అంటివున్నదనీ, అతని కళ్ళలో వినోదిని రూపమే నిల్చివున్నదనీ, అతని చెవులలో ఆ వినోదిని పలుకులే ప్రతిధ్వనిస్తున్నాయనీ, అతని మనసులో ఆ వినోదినితో కలుసుకొనవలెననే ఆశ దాగివున్నదనీ-అని పిస్తూవుంది. అలాంటి మహేంద్రునికి తన పవిత్రమైన భక్తితో కూడిన పూజలను యెట్లు అర్పించగలదు? 'అనుగ్రహించండి, నా అనన్య పరాయణమైన హృదయంలోనికి అనుగ్రహించండి; నా నిశ్చల నిష్టాగరిష్టమైన నిర్మల పతిభక్తిశతపత్రముమీద మీ శ్రీచరణద్వయాన్ని వుంచండి' – అని అనన్య మనస్సుతో యెలా చెప్పగలదు?

పిన్నమ్మ వుపదేశాలు, పురాణవిషయాలు, శాస్త్ర బోధలు – యెంతమాత్రం అంగీకరించలేకపోయింది ఆశ. ఈ దాంపత్యస్వర్గంనుండి పదభ్రష్టుడైన మహేంద్రుని తన మనసులో దేవతగా భావించలేకపోయింది. ఆమె నేడు, వినోదినీ

కళంకసాగరంలో, తన హృదయదేవతను విసర్జించివేసింది. ఆ ప్రేమపూర్ణమైన నిశాంధకారంలో,ఆమె కర్ణకుహరాలలో- హృదయంలో-మెదడులో-ప్రతి నరంలో-ప్రపంచమంతటిలో- మీది నక్షత్రాలలో - కుడ్యాలచే ఆవరింపబడివున్న మేడమీది యేకాంత గృహంలో - పడకటింటిలో పడివున్న మంచం క్రింది భాగంలో — ఒక భయానకమైన — వ్యాకులంతో కూడిన పరిత్యాగ వాయిద్యాలు మ్రోగడం ప్రారంభమయింది.

వినోదినికి వశుడైన మహేంద్రుడు ఆశయెదుట పర పురుషునిలాగా — పరపురుషునికంటె పరాయివానిగా కనిపించాడు. లోపలికి ఏ మాత్రమూ వెళ్ళలేకపోయింది ఆశ.

ఇంతలో మహేంద్రుని విరక్తమైన దృష్టి పైనున్న కొయ్యకడ్డీలనుండి గోడమీదికి ప్రసరించింది. అతని దృష్టితో పాటు ఆశకూడా యెదుటిగోడమీద మహేంద్రుని చిత్రపటం వద్దనే తన చిత్రపటముగూడా వ్రేలాడుతూవుండగా చూచింది. వెంటనే పరుగెత్తి దానిమీద ఒకబట్ట కప్పివేద్దామనీ, లాగి వెలుపల విసరికొడదామనీ, ఆమెకు కోరిక కలిగింది. ముందుగానే నా చిత్రపటాన్ని ఇక్కడినుండి యెందుకు వేరుచేయక పోతినా యని ఆమె తన తెలివితక్కువకు చింతపడుతూవుంది. మహేంద్రుడా చిత్రాన్నిచూచి లోలోపల నవ్వుకొంటున్నాడని, అతని హృదయ సింహాసనంమీద అధిష్ఠించివున్న వినోదినికూడా ముడివడిన తన కనుబొమల క్రిందుగా తన విద్వేషపూర్ణమైన దృష్టిని ఆచిత్రంవైపు సారిస్తూ వుందని భావించింది.

చివరకు మహేంద్రుని విరక్తమైన దృష్టి గోడమీది నుండి దిగి నేలమీద పడ్డది. ఆశ ప్రస్తుతం తన అజ్ఞానాన్ని పోగొట్టుకొనడానికి, సాయంసమయంలో, అత్తగారిసేవ-యితర యింటిపనులు పూర్తిచేసిన తర్వాత, రాత్రి ప్రొద్దుపోయేవరకు, వంటరిగా గ్రంథపఠనం చేస్తూవుంది. ఆమె చదువుకొనే పుస్తకాలు, కొన్ని మాసపత్రికల సంపుటాలు, ఒక ప్రక్కగా వున్నాయి. ఆకస్మికంగా మేమీ తోచని మహేంద్రుడు ఆ పుస్తకాల్లోనుండి ఒకదానిని లాగి తిరుగా బోర్లవేసి చూడడం మొదలుపెట్టాడు. గట్టిగా అరుస్తూ అమాంతం వెళ్ళి ఆ పుస్తకాన్ని వెంటనే లాగుకొందామనిపించింది ఆశకు. మహేంద్రుని హృదయహీనమైన విద్వేషదృష్టి తన వంకరటింకరగా నున్న ముద్దుఅక్షరాలమీద పడివుంటుందని భావించి, ఆమె యిక అక్కడ క్షణంకూడా నిలువలేకపోయింది. వెంటనే గబగబా క్రిందికి దిగిపోయింది. అడుగుల చప్పుడు వినిపిస్తుందేమో యనికూడా తోచలేదు.

మహేంద్రునికి పళ్లెంలో భోజనం సిద్ధంగావుంది. అతడు తన భార్యతో యేకాంతంగా మాట్లాడుతూ వుంటాడని భావించింది రాజలక్ష్మి. ఈ కారణంచేతనే ఆమె అక్కడికి భోజనం తీసుకొని వెళ్ళడం భావ్యంకాదని భావించింది. ఆశ క్రిందికి రాగానే అన్నం వడ్డించాను రమ్మని కుమారునికి కబురు పెట్టింది. అతడు భోజనం చేయడానికి వచ్చాడు. ఈయవకాశం చూచుకొని ఆశ వెంటనే గదిలోకి వెళ్ళి తన చిత్రాన్ని తీసి ఒక మూలగా నున్న పెట్టెక్రిందకు విసరివేసింది. తర్వాత

అక్కడనున్న తాను చదువుకొనే పుస్తకాలన్నింటినీ తీసుకొని పోయింది.

తిండి తిన్నతర్వాత మళ్ళీ తన పడకగదిలోకి వచ్చి కూర్చొన్నాడు మహేంద్రుడు! అటూయిటూ చూచింది రాజలక్ష్మి. యెక్కడా కోడలు కనిపించలేదు. వంటయింట్లోకి వచ్చి చూచింది; తనకొరకు పాలు కాస్తున్నది ఆశ. వాస్తవంలో ఆశకు పాలు కాచవలసిన అవసరం లేదు. దాసియే ప్రతి నిత్యమూ రాజలక్ష్మికి పాలు కాస్తూవుంది. ఆ దాసికూడా అక్కడేవుంది. ఆశ తీసుకొనే యీ అనవసరజోక్యం అత్తగారికి రుచింపలేదు. పాలలో మామూలుగా కొంత మంచినీరు కలిపి త్రాగుతుండేది. అదే పద్ధతిలో యివ్వాళకూడా తనకు పాలు లభిస్తాయనే ఆశ రాజలక్ష్మికి లేదు. అందువల్ల ఆమె లోలోపల బాధపడుతూవుంది.

"ఇదేమిటి అమ్మాయీ, యిక్కడ యేమిచేస్తున్నావు? వెళ్ళు, పైకి వెళ్ళు!'' అని కోడలితో చెప్పింది.

ఆశ పైకివెళ్ళి అత్తగారిగదిలో కూర్చొంది. కోడలి వ్యవహారం చూచి ఆమె దుఃఖించింది. ఏదోవిధంగా మహేంద్రుడు ఆ మాయావిని మాయాతంత్రంనుండి విడిపించుకొని ఒక్కగడియ యింటికి వచ్చాడు, కోడలు యీ విధంగా కోపిస్తూ ఛీదరించుకొంటూ దూరదూరంగావుంటూ, మళ్ళీ యింటినుంచి వెళ్ళగొట్టే ప్రయత్నం చేస్తూవుంది. అసలు వాడు వినోదిని తంత్రంలో చిక్కుకొనడానికి ఆశయే కారణం! పురుషులెప్పుడూ కుపథంలో నడవడానికి సిద్ధంగానే వుంటారు;

కపట కౌశల-బలప్రయోగాలతో-తెలివిగా యే విధంగానైనా స్త్రీలు మగవాణ్ణి సరియైన మార్గంలోకి తెచ్చుకోవాలి.

"అమ్మాయీ, నీ ప్రవర్తన అర్థంకావడంలేదు. నీ అదృష్టంవల్లనే నీ మగడు యింటికి వచ్చాడనుకో. నీ వీ విధంగా ముఖం వ్రేలాడవేసుకొని మూలమూలల్లో దాగుతూ తిరుగుతున్నావా?" అని బెదరించింది రాజలక్ష్మి.

ఆశ తనను అపరాధినిగా భావించి అంకుశంవ్రేటు తిన్న యేనుగులాగా పైకి వెళ్ళిపోయింది. తన మనసుకు మరొకవిధంగా ఆలోచించే అవకాశాన్నీయకుండా ఒక్క వూపుతో గదిలోకి వెళ్ళిపోయింది. ఆ సమయంలో మంచానికి యెదురుగా నిల్చొన్నాడు మహేంద్రుడు. చింతాగ్రస్తుడై, అనవసరంగా దోమతెర విదిలిస్తున్నాడు. వినోదినిమీద అతని కున్నభావం ఇప్పుడు మారిపోయింది. వినోదిని నన్ను జీతంలేని నౌకరుగా భావించింది, లేకపోతే నన్ను ఆశవద్దకు ఇంత నిర్భయంగా పంపిస్తుందా? నేటినుండి ఆశయెడలగల నా కర్తవ్యాన్ని పాలిస్తూవుంటే యెవరిసహాయంతో ఈ వినోదిని నిలువగలుగుతుంది? నేను నా కర్తవ్యాన్ని తెలుసుకొనలేనంత తెలివితక్కువవాడననే భావిస్తున్నదా? నన్నుగురించి యిదేనా వినోదిని అర్థంచేసుకొన్నది? నన్ను భక్తిపురస్సరంగా ప్రేమించేవారిని చులకనగాచూచికూడా ఆమె ప్రేమను సంపాదించలేకపోయాను. అవమానపరచి నన్ను పంపివేయడానికి ఆమె ఏమాత్రము సంకోచింపలేదు.

దోమతెరకు యెదురుగా నిల్చొని — 'వినోదిని చేసిన ఈ సాహసానికి బదులు తీర్చుకొంటాను. ఎలాగైనాసరే నా హృదయాన్ని ఆశవైపుకు మళ్ళించి వినోదినికి బుద్ధివచ్చే లాగా చేస్తాను.' అని దృఢచిత్తంతో ప్రతిజ్ఞ చేస్తున్నాడు మహేంద్రుడు.

ఆశ గదిలోకి రాగానే అతడు పరధ్యానంతో దోమ తెర విదిలించడం మానివేశాడు. యిప్పుడు యే ముఖంతో ఆశతో మాట్లాడేది? — ఇది యొక విషమ సమస్యలాగా అతని యెదురుగానిల్చింది. అతి ప్రయత్నంమీద ఒక సారహీనమైన నవ్వునవ్వి, తన నోటికి వచ్చినట్లు అనేశాడు—"నీవు కూడా నావలెనే చదువుమీద మనసు లగ్నంచేసినట్లున్నావు! ఇప్పుడే నేనిక్కడ చూచినపుస్తకాలు మాసపత్రికలు యెక్కడికి పోయినాయి?" అన్నాడు.

ఈమాట బొత్తిగా అసంగతమైనదీకాదు, తేలికగా తీసివేయతగినదీకాదు; కాని, ఆశ చిత్తంమీద మంచిదెబ్బ కొట్టాడు మహేంద్రుడు. అజ్ఞానురాలైన ఆశ జ్ఞానసంపాదనకు ప్రయత్నిస్తూవుంది — ఇది ఆమె రహస్యంగా వుంచుకొన్న విషయం. ఇది నగుబాట్లమారి సంగతియని ఆశ నిశ్చయించు కొంది. ఈ చదువు విషయంలో యెవరైనా యే కొంచమైనా హాస్యంగా — యీసుగా మాట్లాడితే ఆమె సహించలేదు; ఇక మహేంద్రుని విషయం చెప్పనక్కరలేదు. ఆ మహేం ద్రుడుకూడా యిన్నిదినాలకు తర్వాత ప్రప్రథంగా ఈ యెగ తాళి విషయాన్నే ప్రస్తావించడంతో, క్రూరమైన పేముబెత్తం

దెబ్బతిన్న పిల్లవాని నవనవలాడే శరీరంలాగా - ఆశ హృదయం కుంచించుకుపోయి బాధపడుతూవుంది. ఆమె యే జవాబు చెప్పకుండా ముఖం ప్రక్కకుత్రిప్పి ముక్కాలిపీట అంచును పట్టుకొని నిల్చొంది.

మహేంద్రుడుకూడా ఈ మాట అన్నాడేకాని ఇది సరసంగాను సమయోచితంగానులేదని, ఆమెకు సంతోషాన్ని కలిగించేదిగాలేదని, తెలుసుకొన్నాడు. ప్రస్తుత పరిస్థితుల్లో ఏ మాట సమయోచితంగా వుంటుందో—అతనికి ఆలోచించే అవకాశం లేదు. ఇంత గందరగోళం, ఇన్ని యెగుడు దిగుడు వ్యవహారాలు నడచిన తర్వాత, వెనుకటిలాగా యే మృదువైన మాటలుకూడా సమాయోచితమైనవిగా కనిపించవు. పైగా హృదయానికికూడా మూగతనం వచ్చేస్తుంది; అది యేక్రొత్త విషయాన్నికూడా చెప్పలేదు. 'దోమతెరలో పక్కమీాద పడుకొన్నతర్వాత సరియైనమాటలు వాటంతట అవే తోస్తాయిలే.' అనుకొన్నాడు మహేంద్రుడు.

ఇలా యోచిస్తూ అతడు దోమతెర వెలుపలిభాగాన్ని సవరిస్తున్నాడు. క్రొత్త పాత్ర స్టేజిలోకి ప్రవేశించకపూర్వం తెరచాటునుండి తనపాత్రను రెండు మూడుసార్లు వల్లిస్తున్నట్లు మహేంద్రుడుకూడా దోమతెరయెదుట నిల్చొని తను యెలా మాట్లాడవలెనో—యెలా ప్రవర్తించవలెనో — ఆలోచించ మొదలుపెట్టాడు. ఇదే సమయంలో ఒక చిన్నశబ్దం వినిపించింది; అతడు వెనుకకు చూచాడు—ఆశ ఆ గదిలోలేదు.

# 42

రెండవనాటి వుదయం మహేంద్రుడు తల్లివద్దకువచ్చి, "అమ్మా, నాకు చదువుకొనడానికి ప్రత్యేకమైన గదికావాలి. పిన్నమ్మ వుంటూవచ్చిన యింట్లో వుంటాను." అన్నాడు.

అమ్మ సంతోషించింది. ఐతే కొడుకు యింట్లోనే వుంటాడు! కోడలికి కొడుకుకి మనసుకలిసినట్లుంది! నా కోడలు మంచిశీలవతి; గొప్ప తెలివితేటలుగలది. మహేంద్రుడు ఆమెను విడిచిపెట్టి వుండలేడు. లక్ష్మిలాంటి భార్యను విడిచిపెట్టి మాయావినియైన రాక్షసివద్ద యేమనిపిస్తైనా యెంతకాలం వుండగలడు? — అనుకొని, "సరే నాయనా, నేనా యింటిని శుభ్రంచేయిస్తాను." అని వెంటనే అన్నది.

అటు పిమ్మట కొంగునవున్న తాళపుచెవితో తలుపు తీయించి, హడావిడిగా యిల్లంతా దుమ్ము దులిపించింది. "ఆశా, ఆశా, ఆశ యెక్కడికి వెళ్ళింది?" - అంటూ చాలాసేపు వెదకగా వెదకగా యింట్లో ఒకమూల ముడుచుకొనివున్న కోడలు కని పించింది. "ఆశా వెళ్ళు, ఒకమంచి తివాచీ పట్టించుకరా; ఇక్కడ టేబిల్ లేదు, ఇక్కడికొక టేబిల్ తెప్పించు; ఇక్కడ ఈ దీపం పనికిరాదు, పైనుండి లాంపు తెప్పించు" అని చెప్పి, అత్తా కోడలు కలిసి యింటి రాజాధిరాజుగారికి అన్నపూర్ణ ఇంటిలో రాజసింహాసనం అమర్చారు. ఈ పని చేసేవారివైపు చూడకుండా, తన పుస్తకాలు, అవసరమైన సామానులు తీసు కొని క్రొత్త యింట్లోకివెళ్ళి గంభీరభావంతో కూర్చొని,

ఒక్క క్షణంకూడా కాలాన్ని వ్యర్థంచేయకుండా చదువులో నిమగ్నమైపోయాడు మహేంద్రుడు.

సాయంకాలం భోజనమైన తర్వాత అతడు తిరిగి చదవడానికి కూర్చున్నాడు. అతడు మామూలుగా పడుకొనే గదిలో పడుకొంటాడో లేక క్రిందిగదిలో పడుకొంటాడో యెవరికీ తెలియదు. రాజలక్ష్మి చాలాకష్టపడి కొయ్యబొమ్మనలంకరించినట్లు అలంకరించి — "అమ్మాయీ, వెళ్ళి డాబామీదనే ప్రక్క వేయమంటాడేమో అడిగిరా." అని ఆశతో చెప్పింది.

ఈ ప్రస్తావన ఆశకు అంగీకారయోగ్యంగాలేదు; పాతిపెట్టిన గుంజలాగా మాట్లాడకుండా తలవంచుకొని నిల్చొనివుంది. ఈ వ్యవహారం చూచి రాజలక్ష్మి కోపపడినతర్వాత విధిలేక తిన్నతిన్నగా తలుపువద్దకు వెళ్ళింది. కాని మళ్ళీ అక్కడే ఆగిపోయింది. పంచమూలలో నిల్చొని కోడలి వ్యవహారం గమనించిన రాజలక్ష్మి, గుడ్లెర్రజేసి లోపలికి వెళ్ళమని సంజ్ఞచేయగానే, ప్రేతముఖంతో యింట్లోకివెళ్ళింది ఆశ. వెనుక మనిషివస్తున్నట్లు చప్పుడు వినికూడా మహేంద్రుడు తలయెత్తి చూడలేదు; పుస్తకంవైపు చూస్తూనే "ఇంకా నాకు ఆలస్యం వుంది — రేపు ఉదయంకూడా లేచి చదవాలి — నేనిక్కడే పడుకొంటాను." అని చెప్పివేశాడు.

ఎంత లజ్జాకరమైనవిషయం! ఆశ యేమైనా పైకివచ్చి నిద్రించమని చెప్పడానికివచ్చిందా!

గదిలోనుండి తిరిగి వెలుపలికిరాగానే కోపంతో "ఏం! ఏం జరిగింది?" అని అడిగింది రాజలక్ష్మి.

"వారింకా చదువుకొంటూనే వున్నారు, క్రిందనే నిద్రిస్తారట." అని అస్పష్టమైన మాటలతో చెప్పింది ఆశ.

ఇలా చెప్పి ఆమె తను నిద్రించేగదిలోకి - అవమానింపబడిన శయనాగారంలోకి - వెళ్ళి పడివుంది. ఎక్కడా ఆమెకు సుఖమన్నది లేదు. మధ్యాహ్నపు మండుటెండలో మలమల మాడుతున్న యిసుకమైదానంలాగా ప్రతి స్థలమూ ఆమెను కాల్చివేస్తున్నది.

ఇంకా కొంత ప్రొద్దుపోయిన తర్వాత మూసివున్న తలుపుమీద యెవరో గట్టిగా దెబ్బకొట్టారు - "అమ్మాయీ, తలుపు తియ్యి." అని వినిపించింది.

త్వరత్వరగా లేచి తలుపు తీసింది ఆశ. రాజలక్ష్మి మెట్లెక్కి రావడంచేత అలసిపోయి రొప్పుతూవుంది. ఆయాసంతో చాలా బాధపడుతూ వుంది. ఇంట్లోకి వస్తూనే ఆమె మంచంమీద కూలబడి, కొంచెం మాట్లాడేశక్తి కలిగిన తర్వాత "అమ్మాయీ, నీ యీ వ్యవహారం యేమిటి? పైకి వచ్చి తలుపుమూసి పడుకొంటున్నావా? కోపపడడానికి, పోట్లాడడానికి ఇప్పుడేనా నీకు సమయం చిక్కింది? ఇంత దుఃఖాన్ని అనుభవించికూడా నీకీ మాత్రం జ్ఞానం రాలేదు! వెళ్ళు, క్రిందికివెళ్ళు!" అని బొంగురుపోయిన కంఠంతో అన్నది రాజలక్ష్మి.

"వారు వంటరిగా వుంటానని చెప్పారు." అని చాలా మెల్లగా అన్నది ఆశ.

"వాడు చెప్పాడు, నీవంగీకరించావు! కోపంతో వున్న మనిషి యెలా మాట్లాడుతాడో తెలీదూ? అది విని యీవిధంగా ముఖంముడుచుకొని కూర్చొంటావూ? ఇంత అభిమానంతో వుంటే పనిసాగదు. వెళ్ళు, త్వరగా వెళ్ళు!"

కష్టపు దినాల్లో కోడలికి యేమాట చెప్పడానికీ అత్త సిగ్గుపడడంలేదు. యేవుపాయం చేతనైనాసరే మహేంద్రుడు యింట్లోవుండేలాగా చేయవలెనని ఆమె నిశ్చయించుకొంది.

ఆవేశంతో మాట్లాడడంచేత రాజలక్ష్మికి మళ్ళీ అలసట యెక్కువయింది. ఆ యలసట తగ్గకమునుపే ఆమె లేచింది. ఆశ యేమీ మాట్లాడకుండా ఆమెకు సహాయపడుతూ క్రిందికి వెళ్ళింది. అత్తగారిని తిన్నగా ఆమె గదిలోనికి తీసుకొనివెళ్ళి మంచంమీద కూర్చోబెట్టింది. ఆమె వీపుక్రింద ప్రక్క సరిచేసి దిండ్లు అటూఇటూ సర్దుతూవుంది.

"ఉండనీ ఉండనీ, అవి అలా వుంచి దాసీని పంపించు! నీవు వెళ్లు, ఆలస్యం చేయవద్దు." అన్నది రాజలక్ష్మి.

ఆశ యింతవరకు తన హృదయాన్ని మరొక విధంగా మార్చుకోలేదు. ఆమె అత్తగారి గదినుండి బయలుదేరి నేరుగా మహేంద్రుని గదిలోకి వెళ్ళింది. టేబిల్‌మీద మహేంద్రునికి యెదురుగా ఒక పుస్తకం తెరచివుంది. ఆటేబిల్‌మీద అతడు తన రెండుకాళ్ళను పారచాచి కుర్చీ వెనుకభాగంమీద తల వాల్చి యేకాగ్ర చిత్తంతో యేదో ఆలోచిస్తున్నాడు. వెనుక

వైపునుండి కాళ్ళచప్పుడు వినిపించడంతోనే అదరిపడి వెనుకకు తిరిగి చూచాడు. నేనెవరినిగురించిన ధ్యానంలో మునిగి వున్నానో ఆ హృదయదేవత బహుశా నాకు వరదాన మీయడానికి వస్తూవున్నదని ఆకస్మికంగా అతనికి భ్రమ కలిగింది. కాని ఆశను చూడగానే హతోత్సాహుడైపోయాడు. కాళ్ళ క్రిందికిదించి ఆ తెరచివున్న పుస్తకాన్ని చేతుల్లోకి తీసుకొన్నాడు.

మహేంద్రుని కీనాడు చాలా ఆశ్చర్యం కలిగింది. ఈ మధ్య ఆశ సిగ్గుతో తన యెదుటికి రావడంలేదు. ఎప్పుడైనా ఆకస్మికంగా యెదురుపడడమే సంభవిస్తే వెంటనే ఒకప్రక్కకు తొలిగి వెళ్ళుతూవుంది. ఈవేళ ఇంతరాత్రి గడచినతర్వాత ఇంత సహజంగా యింట్లోకి రావడంచూచి, అతని ఆశ్చర్యానికి అంతులేదు. మహేంద్రుడు పుస్తకంమీదినుండి తన దృష్టిని మళ్ళించకుండానే ఆశ ఈవేళ గదిలోనుండి వెళ్లిపోయే లాగా లేదని గ్రహించాడు. ఆమె మహేంద్రుని యెదుటికి వచ్చి, స్థిరభావంతో నిలువబడ్డది. ఆత డిక చదివేవానిలాగా నటించలేకపోయాడు; వెంటనే ఆశవైపు కళ్ళెత్తిచూచాడు. "అమ్మకు ఆయాసం యెక్కువగావుంది, మీరు వెళ్ళి కొంచెం ఆమెనుచూస్తే బాగావుంటుంది." అని చెప్పింది ఆశ.

"ఆమె యెక్కడుంది?"

"పడకగదిలోవుంది, ఆమెకు నిద్రపట్టడంలేదు."

"ఐతే పద, చూచి వద్దాము."

ఆశతో ఈమాత్రం మాట్లాడి ఎన్నిదినాలో గడిచింది. అందుచేత అతనికి ఈవేళ తననెత్తిమీదబరువు దించినట్లని పించింది. దుర్భేద్యమైన కుడ్యాలతో నిర్మింపబడిన దుర్గం లాగా వారిద్దరిమధ్య తన నల్లని ఛాయలను విస్తరించుకొని వున్న నిస్తబ్ధతను నిర్మూలించడానికి మహేంద్రునివద్ద తగిన ఆయుధ మేమీ లేకపోయింది. ఇలాంటిస్థితిలో ఆశ ఆ దుర్గ కుడ్యంలోని ఒక చిన్నకిటికీని తెరచింది.

రాజలక్ష్మిగదిద్వారంలో నిల్చొనివుంది ఆశ— మహేంద్రుడు లోపలికివచ్చాడు. వేళగానివేళ కొడుకు తన గదిలోకి రావడంవల్ల అమ్మకు భయంకలిగింది. మళ్ళీ ఆశతో ఏదో పేచీ వచ్చివుంటుం దనుకొన్నది. "ఏం మహేంద్రా, ఇంతవరకు నిద్రపోలేదా?" అని అడిగింది.

"నీకు ఆయాసం యెక్కువయిందా అమ్మా?" అన్నాడు కొడుకు.

ఇన్నిదినాలకు తనకుమారుడిలా ప్రశ్నించడంవల్ల తల్లికి లోలోపల గర్వంకలిగింది. 'కోడలు వెళ్ళి చెప్పింది – అందు వల్లనే అబ్బాయి అమ్మను విచారించడానికి వచ్చాడు.' అను కొన్నది. యీ అభిమాన ఆవేగంవల్ల ఆమె హృదయం యింకా ఆందోళన పడింది. చాలా కష్టంతో సమాళించుకొని "వెళ్ళు, నీవు వెళ్ళిపడుకో, ఇది నాకు ప్రతినిత్యం వుండే రోగమే." అన్నది.

"లేదమ్మా, ఒకసారి బాగా పరీక్షిస్తే బాగావుంటుంది; ఇది సామాన్య రోగంకాదు." అన్నాడు మహేంద్రుడు.

అమ్మకు గుండె చాలా నీరసంగావుందని అతనికి తెలుసు. ఈకారణం చేతనూ, ఆమెముఖంలోని వర్ణవిశేషాలు గమనించడంచేతనూ, మహేంద్రునికి కొంచెం భయంకలిగింది.

"చూడనూవద్దు, పరీక్షలూవద్దు నాయనా, ఇది బాగుపడేరోగంకాదు."

"ఈ రాత్రి హాయిగా నిద్రపోవడానికి ఒక మందు తెచ్చియిస్తాను; రేపు బాగా పరీక్షచేస్తాను."

"దిక్కులేనన్ని మందులు తిన్నాను; మందులవల్ల నాకేలాభమూకలుగదు! చాలా ప్రొద్దుపోయింది, వెళ్ళి పడుకో."

"నీ అరోగ్యం కొంచెం స్థిమితపడనీ, వెళ్ళుతాను."

అప్పుడు మానవతియైన రాజలక్ష్మి తలుపుచాటునవున్న కోడలిని సంబోధించి "అమ్మాయీ, నీవింత ప్రొద్దుపోయి వీణ్ణి బాధపెట్టడానికి యిక్కడికి తీసుకవచ్చావూ?" అన్నది.

ఇలా అంటూవుండగా ఆమె ఆయాసం యెక్కువయింది. అప్పుడు ఆశ గదిలోకి ప్రవేశించి మృదువుగానూ, దృఢంగానూ మహేంద్రునితో చెప్పింది — "వెళ్ళండి, మీరు వెళ్ళి పడుకోండి, నేను అమ్మవద్ద వుంటాను."

మహేంద్రుడు ఆశను చాటుకు తీసుకొనివెళ్ళి—"నేనొక మందు తెచ్చి యిస్తాను. ఆసీసాలో రెండు ఔన్సుల మందు వుంటుంది. ఒక ఔన్సుమందు త్రాగించిన తర్వాత నిద్ర రానిచో ఒక ఘంటకు తర్వాత మిగతామందుకూడ త్రాగించు. ఇంకా యెక్కువ అనారోగ్యచిహ్నాలు కనిపిస్తే వెంటనే నాకు తెలియజెయ్యి." అని చెప్పాడు.

మహేంద్రుడు తన నూతనగృహంలోకి వెళ్ళాడు. ఈ దినం ఆశ మహేంద్రునికి కనిపించిన విధానంలో అతని కొక క్రొత్తదనం కనిపిస్తూవుంది. ఈ ఆశలో సంకోచం మాయమయింది, దీనత్వం అదృశ్యమైపోయింది. ఈమె తన అధికారాన్ని తనంతటతానే తన చేతులలోకి తీసుకొంది—దానికొరకు మహేంద్రుని యెదుట భైక్ష్యవృత్తి నవలంబించ లేదు. ఇంతవరకూ అతడు 'తన భార్య'గా యీయామెను వుపేక్షించినప్పటికీ నేడు 'ఈ యింటికోడలు'గా ఈమెమీద అతనికి శ్రద్ధ కలిగింది. కోడలు నా కష్టసుఖాలు గమనిస్తూవుందనీ, నా కష్టాలను చూడలేక, మగనిని పిల్చుకొని వచ్చిందనీ-తనలో అనుకొని-కోడలిమీద తనకున్నప్రేమ యెక్కువయి లోలోపల సంతోషించింది రాజలక్ష్మి. కాని "అమ్మాయీ, నేను నిన్ను పడుకొమ్మని పంపితే వాణ్ణిక్కడికి కీడ్చుకొని వచ్చావెందుకు?" అని పైమాటగా అంది.

ఆశ దీనికేమీ జవాబు చెప్పక పంకా చేతిలోకి తీసుకొని అత్తగారి వెనుకగా కూర్చొని విసరుతూవుంది.

"ఇక వెళ్ళి పడుకో అమ్మా." అన్నది అత్తగారు.

"వారు నన్నిక్కడే వుండమని చెప్పారు." అని మెల్లగా చెప్పింది ఆశ. మహేంద్రుడు తల్లిసేవలో తనను నియోగించాడనే మాటవల్ల ఆమె సంతోషిస్తుందని తెలుసు ఆశకు.

# 43

ఆశ మహేంద్రుని సంతోషపెట్టి తన అధీనంలోకి తెచ్చుకొనజాలదని తెలుసుకొని, 'పోనీ కనీసం నా రోగం మూలకంగానైనా వారు యింట్లోవుంటే అంతేచాలు' నను కొన్నది రాజలక్ష్మి.

ఒక్కసారిగా తన రోగం తగ్గిపోతుందేమోనని ఆమెకు భయం కలిగింది. ఆమె ఈ భయంతో తనకిచ్చిన ఔషధాన్ని అశ కంటపడకుండా పారబోయడం మొదలుపెట్టింది.

మహేంద్రుని హృదయం విరక్తిగా వుంది. అతడు అమ్మ పరిస్థితిని గురించి అంతగా పట్టించుకోలేకపోతున్నాడు; కాని అత్తగారి రోగం యెంతమాత్రము తగ్గకపోగా దినదినాభి వృద్ధి పొందుతున్నదని ఆశకు ఆందోళన కలుగుతూవుంది.

ఆయన సరిగా ఆలోచించి మందు యివ్వడంలేదు, తల్లి రోగరివిషయంకూడా ఆలోచించకుండా పరధ్యానంలో వున్నారు—అని ఆశకు కష్టం కలిగింది.

మహేంద్రునికి కలిగిన యింత ఘోరమైన దుర్గతిని—ఇంత గొప్ప అధఃపాతాన్ని చూచి ఆమె తనలోతాను చాలా చింతించింది—ఒక విషయంలో చెడిపోయిన మనిషి అన్ని విషయాల్లో చెడిపోవలసినదేనా?

ఒకనాడు సాయంసమయంలో రాజలక్ష్మికి ఆమె రోగబాధ యెక్కువయింది. అప్పుడామెకు బిహారి జ్ఞాపకానికి వచ్చాడు. ఎన్ని దినాలనుండి బిహారి రాలేదు! – అని ఆలో

చించి, రాజలక్ష్మి కోడలినిపిలిచి "ఇప్పుడు బిహారి యెక్కడ వున్నాడో నీకు తెలుసా?" అని ప్రశ్నించింది.

ఎప్పుడు రోగంవచ్చినా, ఎప్పు డేకష్టాలు సంభవించినా బిహారి వారికి సేవచేస్తూ వుండేవాడు; అందుచేతనే కష్టసమయంలో బిహారి జ్ఞాపకానికి వచ్చాడని ఆశ తెలుసుకొంది. ఎంతకాలంగానో యీ యింటిశుభాలను కోరుతూ, ఈ యింటికి ఆధారభూతంగా వుండే బిహారికూడా దగ్గరలేడు! బిహారిబాబు వుంటే యిలాంటి కష్టసమయంలో తల్లికి అపారమైన సేవ చేసేవాడు. మహేంద్రుడిలాగా అతడంత హృదయహీనుడు కాడు - అనుకొని ఆశ ఒక పెద్ద నిట్టూర్పు విడిచింది.

"మహేంద్రుడు బిహారితో తగవులాడి వుంటాడు. వీడు చాలా చెడ్డపని చేశాడు. వీనికి అలాంటి హితచింతకుడైన మిత్రుడు లభింపజాలడు—" అన్నది రాజలక్ష్మి. ఇలా అంటూ వుండగా ఆమె కళ్ళనుండి అశ్రుబిందువులు రాలాయి.

ఆశకుకూడా మెల్లమెల్లగా బిహారినిగురించిన అనేకవిషయాలు జ్ఞాపకానికి వచ్చాయి. అప్పుడప్పుడు తెలివితక్కువ ఆశను అనేక విధాలుగా హెచ్చరిస్తూ వచ్చాడు బిహారి. ఆ హెచ్చరికవల్ల ఆశ మనసులోనుండి క్రమక్రమంగా అతడు దూరమౌతూ వచ్చాడు. చివరికి అతడు విరోధిగామారి పోయాడు. — ఈ పూర్వగాథనంతను స్మృతికి తెచ్చుకొని తనలో తాను చాలా అవమానాన్నిపొందింది ఆశ. — నిజమైన మిత్రుని గెంటివేసి, పరమశత్రువును ఆలింగనము చేసుకొనే కృతఘ్న మూర్ఖుల్ని విధాత యెందుకు దండింపడు?

నిరపరాధియైన బిహారీ భగ్నహృదయంతో ఈయింటిని వదలి వెళ్ళుతూ విడిచిన నిట్టూర్పు ఈ యింటిని ఊపి పారవేయ కుండా ఊరుకొంటుందా?

రాజలక్ష్మి మరికొంతసేపు లోలోపల చింతిస్తూ అలాగే వుండిపోయి, "ఆశా, బిహారీ గనుక వున్నట్లయితే మనస్థితి ఇలా పరిణమించేదికాదమ్మా — ఈ దుర్దినంలో వాడువుంటే మనలను రక్షించగలిగేవాడు." అని అదాటుగా కోడలితో అన్నది.

మౌనంగా కూర్చొని ఆలోచిస్తూవుంది ఆశ. రాజలక్ష్మి మళ్ళీ — "బిహారీకి నా జబ్బు సమాచారం తెలిస్తే వాడు రాకుండా వుండలేడు." అన్నది ఒక నిట్టూర్పు విడుస్తూ.

బిహారీకి సమాచారం పంపాలని అత్తగారికి కోరికగా వుంది. అతడు రాకపోవడంవల్ల ఈమె పూర్తిగా నిరాశ్రయురాలై నిర్జీవంగా వుంది — అని తనలోఅనుకొంది ఆశ.

గదిలోని లాంపు ఆర్పివేసి, గుమ్మంవద్ద వెన్నెలలో నిల్చొన్నాడు మహేంద్రుడు — చదువుమీదికి మనసు పోవడంలేదు. ఇంట్లో యే సుఖమూ కనిపించడంలేదు. తమకు ఆత్మీయులైనవారితో సహజమైన సంబంధం యెడమైపోయినప్పుడు వారిని పరాయివారిలాగా సులభంగా విడిచిపెట్టనూ విడిచిపెట్టరు — యిష్టబంధువులాగా ఆశ్రయమిచ్చి ఆదరించనూ ఆదరించరు; ఈ విధంగా సంకటస్థితి యేర్పడుతుంది. వారి త్రెంచుకోలేని బాంధవ్యం నానాటికీ అసహ్యమై, ఒక బరువాటిబండ గుండెలమీద పెట్టుకొన్నట్లు వుంటుంది.

అతనికి అమ్మవద్దకు వెళ్ళడానికి మనసు పుట్టడంలేదు. అదాటుగా అతను ఆమెవద్దకు వెళ్ళడంవల్ల అతణ్ణి భయసందేహాలతో చూస్తూవుంది రాజలక్ష్మి. ఇది మహేంద్రునికి బాధ కలిగిస్తూవుంది. ఏదైనా పనిమీద ఆశ తనవద్దకు వచ్చినప్పుడు తన నోటినుండి మాట పెకలిరావడంలేదు; మాట్లాడకుండా ఊరుకోవడం అంతకంటే కష్టంగావుంది. ఈ విధంగా అత డిక గడియసేపుకూడ నిలవలేకపోయాడు. ఏడుదినాలవరకు వినోదినితో యెంతమాత్రం కలవరాదని గట్టిగా ప్రతిజ్ఞ చేసివున్నాడు. ఆ ప్రతిజ్ఞ పూర్తికావడానికి ఇంకా రెండురోజులు బాకీవుంది. ఈ రెండుదినాలు యెలాగడపడం?

అతనికి వెనుకనుండి కాళ్ళచప్పుడు వినిపించింది. ఆశ వచ్చిందని గమనించాడు. కాని వినిపించనట్లేనటించి తన ముఖాన్ని మరోవైపుకుత్రిప్పి నిల్చొన్నాడు. ఈ నాటకమంతా తెలుసుకోనికూడా తిరిగి వెళ్ళలేదు ఆశ. — "ఒక్క-మాటవుంది, అదిచెప్పి నేను వెళ్లుతాను." అన్నది.

"వెళ్ళడమెందుకు, కొంచెం కూర్చొనే వెళ్ళరాదూ" అని వెనుకకు తిరిగి అన్నాడు మహేంద్రుడు.

ఆశ ఈ మానవత్వంమీద దృష్టి పెట్టకుండానే "అమ్మ జబ్బు వ్యవహారం బిహారికి తెలియజేయడం మంచిది." అన్నది అలాగే నిల్చొని.

బిహారిపేరు వినడంతోనే మహేంద్రుని గుండెల్లో దెబ్బ కొట్టినట్లయింది.

"ఏమిటా మంచిది? నా చికిత్సమీద నీకు నమ్మకం లేదా?" అని కొంచెం సమాళించుకొని అన్నాడు.

అతను మనఃపూర్వకంగా, ధ్యానముంచి శ్రద్ధగా రోగిని చూడడంలేదనీ, తగిన యత్నం చేయడంలేదనీ ఆశ హృదయంలో గట్టినమ్మకం యేర్పడింది. అందుచేతనే "ఏదీ, అమ్మ రోగం నానాటికి యెక్కువైపోతూనే వుంది!" అని సులభంగా అనివేసింది.

అతిసామాన్యంగా అన్న యీ మాటలో అంతర్గతమై వున్న వేడి మహేంద్రునికి తగులకపోలేదు. ఇలా గూఢంగా ఇంతకుముందెన్నడూ ఆశ తనను చీవాట్లు పెట్టలేదు. ఈ తిరస్కారంవల్ల అతనికి ద్వేషము ఆశ్చర్యము కలిగి "ఇక నేను నీవద్ద డాక్టరీ నేర్చుకోవాలి!" అన్నాడు.

ఈ విద్వేషబాణంవల్ల, బాధపడుతున్న ఆమెహృదయం మీద అదాటుగా యెన్నడూ తానూహింపనంత గట్టిదెబ్బ తగిలింది. అందుచేత యెన్నడూ యెదురు చెప్పలేని సరళ స్వభావంగల ఆశ "డాక్టరీకాదు, కాని మాతృసేవ చేయడమెలాగో నేర్చుకొనగలుగుతాను." అని నిర్భయంగా నిర్మొగమాటంగా చెప్పివేసింది.

ఈ జవాబు మహేంద్రుని ఆశ్చర్యచకితునిగా చేసింది. ఇలాంటి అలవాటులేని తీవ్రమైన ప్రత్యుత్తరంవల్ల అతడింకా కాఠిన్యాన్ని వహించాడు. ఆశ తీవ్రతను తగ్గించడానికి "మీ బిహారిబాబును ఈ యింటికి యెందుకు రాకుండా

చేశానో అది నీకు తెలిసేవుంది. పాపం, మళ్ళీ ఆయనగారు జ్ఞప్తికి వచ్చినట్టున్నాడు.'' అని పరిహాసంగా అన్నాడు.

అమాంతం ఒక పెనుతుపానుఅంత లజ్జవచ్చి ఆమెను యెగురగొట్టుకొని పోయిందేమో అన్నట్లు ఆ గదిలోనుండి వెంటనే వెళ్ళిపోయింది ఆశ. ఆమె తనకొరకు సిగ్గుపడడంలేదు; కాని తలమునిగి తాడిప్రమాణాన్ని అపరాధ సముద్రంలో మునిగివున్న మనిషికూడా యిలాంటి అన్యాయమైన అప వాదాన్ని తన నాలుకమీదికి తేగలిగాడు—అందుకు ఆమె సిగ్గుపడడం. ఇంతచేటు సిగ్గుమాలినతనాన్ని కోట్లకొలది లజ్జా పర్వతాలుకూడా కప్పిపుచ్చలేవు.

ఆశ వెళ్ళిపోగానే తానే పూర్తిగా ఓడిపోయినట్లు తోచింది మహేంద్రునికి. ఇంతకుపూర్వం యెలాంటి పరిస్థితిలో కూడా ఆశ యీవిధంగా ధిక్కరించగలుగుతుందనే వూహ కూడా అతనికి కలుగలేదు. ఇంతవరకు తాను సింహాసనా న్నధిష్టించివున్న స్థానంలోనే, యిప్పుడు బూడిదలో పొర్లవలసి వస్తున్నదని తెలుసుకొన్నాడు. ఆశకు కలిగిన ఈ వేదన అసహ్యంగా మారిపోతుందేమోననే చింత ఇన్ని దినాలకు అతనికి కలిగింది.

బిహారి స్మరణకు రావడంవల్ల వినోదిని విషయమైన చింత మహేంద్రుని బాధింపసాగింది. బిహారి పడమటి ప్రాంతం నుండి వచ్చాడో లేదో యెవరికితెలుసు? ఈ లోగా వినోదిని వానిజాడ తెలుసుకొనగలుగుతుందికూడా. వినోదినితో

బిహారికలవడంకూడా అసంభవంకాదు. ఇప్పుడు మహేంద్రునికి తనప్రతిజ్ఞను పాలించడం కష్టమైపోయింది.

ఆరాత్రి రాజలక్ష్మికి రోగబాధ యెక్కువైపోయింది. ఇక ఆగలేక ఆమె స్వయంగా మనిషినిపంపి మహేంద్రుని పిలిపించి, అతడురాగానే "నాయనా, నాకు బిహారినిచూడాలని చాలా కోరికగావుంది. చాలా దినాలనుంచి వాడురాలేదు." అని కష్టతరంగా ఒక్కొక్కమాటను పెకలిస్తూఅన్నది.

అత్తగారికి పంకా విసరుతూ తలవంచుకొని కూర్చొని వుంది ఆశ. "బిహారి యిక్కడలేడు, పడమటిదేశంలో తిరగడానికి వెళ్ళాడు." అన్నాడు మహేంద్రుడు.

"వాడు యిక్కడే వున్నాడని నా మనసు చెబుతూ వుంది. నీమీదికోపంచేత రావడంలేదు. రేపు నీవొకసారి వాడి యింటికివెళ్ళు. నామీద ఒట్టు సుమా, తప్పక వెళ్ళాలి." అన్నది రాజలక్ష్మి.

మహేంద్రుడు "సరే వెళ్ళుతాను." అన్నాడు.

ఇప్పుడు అందరూ బిహారినే పిలుస్తున్నారు! తలచుకొంటున్నారు! కలవరిస్తున్నారు! ప్రపంచమంతా తనను పరిత్యజించినట్లనిపించింది మహేంద్రునికి.

# 44

మరునాటి వేకువనే బిహారియింటికి వెళ్ళాడు మహేంద్రుడు. ద్వారంలో మెద్దుబళ్ళు వరుసగానిల్చివున్నాయి. ఆ బళ్ళనిండా సామాను నింపుతూ వున్నారు నౌకర్లు. "ఏమిటీ

సమాచారం?" అని భజ్జూను అడిగాడు మహేంద్రుడు. "బాబు గారు గంగాతీరమైదానంలో ఒకతోట ఖరీదు చేశారు. అక్కడికే ఈ సామానంతా పోతూవుంది." "బాబు యింట్లో వున్నారా?" అని అడిగాడు మహేంద్రుడు. "రెండుదినాలు మాత్రమే కలకత్తాలోవుండి తోటకు వెళ్ళిపోయారు." అని జవాబిచ్చాడు భజ్జూ.

ఇక మహేంద్రునికి సందేహం కలిగింది. తానిక్కడ లేడు. ఈ మధ్యకాలంలో బిహారి వినోదినివద్దకు వెళ్ళే వుండవచ్చు. మహేంద్రుని ఊహానేత్రాలకు వినోదిని యింటి వద్దకూడా బళ్ళమీద సామాను యెత్తుతూవున్నట్లుగా కనపడింది. ఇందుకోసమే ఆమె యీ మూర్ఖుణ్ణి (తనను) ఇంత దూరం వెళ్ళగొట్టింది — అని నిశ్చయించుకొన్నాడు.

క్షణంకూడా ఆలస్యం చేయకుండా తనబండిమీద ఎక్కి, బండివానితో త్వరత్వరగా తోలమనిచెప్పాడు. గుర్రం బాగా నడవడంలేదని భావించి బండివానిని రెండు మూడు సార్లు బెదరించి తిట్టాడు. కొంచెం సేపటికి ఆ తిట్లసందడిలోనే బండి వినోదిని యింటివద్ద ఆగింది. అక్కడ బళ్ళూలేవు, ప్రయాణ సన్నాహాలూలేవు. ఇక్కడిప్రయాణం ఇంతకుముందే ముగిసిపోయిందేమోనని భయంకలిగింది మహేంద్రునికి. తలుపుమీద గట్టిగా దెబ్బకొట్టాడు. లోపలినుండి ఒక వృద్ధ నౌకరు తలుపు తెరిచాడు. తలుపు తెరుస్తూవుండగానే "ఇంట్లో అంతా బాగున్నారా?"అని అడిగాడు మహేంద్రుడు.

"ఆఁ అంతా బాగానే వున్నారు." అన్నాడు నౌకరు.

మహేంద్రుడు పైకివెళ్ళి చూచాడు—వినోదిని స్నానానికి వెళ్ళింది. నిర్మానుష్యంగా వున్న వినోదిని పడకగదిలోకి వెళ్ళి, ఆమె రాత్రి నిద్రించే మంచముమీద—అదే పరుపు మీదపడుకొన్నాడు. ఆ మృదువుగానున్న పరుపును తన రెండు చేతులతో చుట్టి గుండెల్కకింద అదుముకొన్నాడు. దానిని వాసనచూచి, దానిమీద నోరుపెట్టి"కఠినాత్మురాలా, కఠినాత్మురాలా," - అని మాటిమాటికి అనడం మొదలు పెట్టాడు.

ఈ విధంగా తన హృదయంలోని పొంగును తొలగించుకొని ఆ పరుపును విడిచిపెట్టాడు. అప్పుడు దిగులు దిగులుగా వినోదిని రాకకు యెదురుచూస్తూ కూర్చొన్నాడు. లోపలి ఆవేదన అతణ్ణి కూర్చోనీయలేదు. వెంటనే లేచి అటూఇటూ తిరుగుతూ అక్కడ పడివున్న వార్తాపత్రికను చూచాడు. కాలక్షేపంకొరకు పరధ్యానంతో దానిని చేతికి తీసుకొన్నాడు. సంయోగవశాత్తు తనదృష్టి పడ్డచోటనే బిహారి నామాక్షరాలు కనిపించాయి. క్షణంలో అతని ధ్యానమంతా ఆవార్తాపత్రికలోని ఆ భాగంమీదనే లగ్నమయింది. "తక్కువ ఆదాయం లభించే వుద్యోగులు రోగగ్రస్తులైనప్పుడు వారు చాలా బాధ పడవలసివస్తున్నది. వారికి ఉచిత వైద్యం ఉచిత సేవ చేయడానికి బిహారిబాబుగారు గంగానదీ మైదానంలో ఒక తోట ఖరీదు చేశారు. ఇప్పుడక్కడ ఐదుగురు వ్యక్తులకు పూర్తి సదుపాయాలు కల్పించబడినవి." అని ఒక పత్రికా

విలేఖరి ఆ విషయాన్ని గురించి యింకా యేమేమో ప్రకటించాడు.

'వినోదిని ఈ సమాచారం చదివి వుంటుంది. ఇప్పుడామె భావం యెలావుంటుంది? తప్పక ఆమె మనస్సు ఆవైపుకు ఆకర్షింపబడుతూ వుండవచ్చు.' అనుకొని మహేంద్రుడు చాలా బాధపడ్డాడు. ఇంతేకాదు, బిహారి ఈ విధంగా సంకల్పించాడనే సమాచారం వినోదినికి అతనిమీద నున్న శ్రద్ధాభక్తుల నింకా యెక్కువ చేస్తుందేమోననే భయంతో మహేంద్రుని మనస్సు రెపరెపలాడిపోయింది. బిహారిని మనస్సులో 'కపటి, ధూర్తుడు' అని తిట్టాడు. అతడు తలపెట్టిన ఈ కార్యాన్ని 'డంబాచారం'గా భావించి,—'బిహారి చిన్ననాటినుండి లోకుల యెదుట తనను పరోపకారిగా ప్రకటించుకొనడానికి ప్రయత్నిస్తూనే ఉన్నాడు; ఇది ఆమోసగాడికి సహజనైజమే!' అనుకొన్నాడు. తర్వాత తాను బిహారీకంటె నిష్కపటినని, మోసంచేయడం యెరుగనని తనను తాను మెచ్చుకొంటూ—'నేను వుదారపురుషుడననీ, స్వార్థత్యాగిననీ ప్రచారం చేసుకొంటూ అమాయక ప్రజలను మోసం చేయడానికి ప్రయత్నించేవాళ్ళను చూచినా, వాళ్ళచేష్టలు చూచినా నాకు పరమఅసహ్యం, ఛీ!' అనుకొన్నాడు.

కాని అయ్యో, మహేంద్రుని నిష్టాగరిష్ఠమైన ఈ అకృత్రిమత — ఈ నిష్కాపట్యం లోకానికి, అనగా ఒక ప్రధానవ్యక్తికి అర్థం కాదుగదా!

తనను ఆ ప్రధానవ్యక్తినికూడా వంచించడానికి బిహారి ఇదొక క్రొత్తయెత్తు యెత్తాడని అనుకొన్నాడు మహేంద్రుడు.

వినోదిని కాలిచప్పుళ్ళు విని అతడు త్వరత్వరగా ఆ వార్తాపత్రికను చుట్టచుట్టి తన క్రింద పెట్టుకొన్నాడు. స్నానం చేసి వినోదిని గదిలోకి ప్రవేశించింది. ఆమె ముఖంవైపుచూచి మహేంద్రుడు విస్మితుడైనాడు. ఆ ముఖంలో ఏదో తపశ్శక్తి సంపన్నవలె ఒక అతిలోక సుందరమైన మార్పు కనిపించింది ఆమె శరీరం క్షీణించిపోయింది. ఆ దౌర్బల్యంవల్ల ఎండి పోయిన ఆమెముఖంలో ఒకవిధమైన తేజస్సు ప్రకాశిస్తూవుంది.

బిహారి జాబు వ్రాస్తాడనే ఆశవదలుకొంది వినోదిని. ఆమె తన కాల్పనికదృష్టితో బిహారి తనను తీవ్రంగా అపహసించాడని ఆలోచించి, ఆ యపహాసాగ్నిలో రాత్రింబగళ్ళు మాడిపోతూవుంది. ఈ యగ్నినుండి బయటపడడానికి మార్గం లభించకపోవడమే ఇలా మాడిపోవడానికి కారణం. తన నపహసించడానికే బిహారి పడమటి దేశానికి వెళ్ళాడని అనుకొన్నది. బిహారిజాడ తెలుసుకోడానికి తన కేఆధారమూ కనిపించడం లేదు. ఎల్లప్పుడు. ఏవో పనిపాటలుచేస్తూ సోమరితనమంటే యేదో తెలియని వినోదిని పనిపాటలు లేకుండా ఈ చిన్న ఇంట్లో దుఃఖంలో కుమిలిపోతూవుంది. ఆమెచేసే ప్రతిపనీ ఆమెనే గాయపరచి బాధపెడుతూవుంది. ఈ ప్రేమలేని, పని లేని, ఆనందంలేని యింటిలో - యింత దుర్గంధపూరితమైన వీధిలో తన భవిష్యజ్జీవనానికి సంబంధించిన అన్ని బంధనాలను ఆలోచించుకొని ఆమె విద్రోహప్రకృతి అనివార్యమైన తన

అదృష్టభాగ్యాన్ని ఎదిరించి ఓడించాలనే వ్యర్థప్రయత్నం చేస్తూవుంది. మూఢ మహేంద్రుడు వినోదిని విడిపించుకొని వెళ్ళడానికి వీలులేకుండా అన్ని మార్గాల్లో అవరోధాలను కల్పించి, ఆమె జీవితాన్ని యింత సంకీర్ణంగాను, ఇంత బాధా కరంగాను చేసివేశాడు; అందువల్ల అతనిమీద వినోదినికి తీవ్ర మైనకోపం - అంతులేని అసహ్యాం కలిగింది.

తాను యేవిధంగాకూడా మహేంద్రుడు తనను సమీపించకుండా చేయజాలనని బాగా ఆలోచించి నిశ్చయించు కొంది. ఈ చిన్నయింటిలోనికి అతడు ప్రతిరోజు రావడం అనివార్యం. అతడు ఇంచుమించు ఆనుకొన్నంత సమీపంగా యెదురుగా కూర్చొంటాడు - ప్రతిరోజూ అలక్ష్య ఆకర్షణ లతో ఇంకా ఇంకా అగ్రసరుడవుతూ వుంటాడు. ఈ అంధకూపంలో, సమాజభ్రష్టజీవనపంకపరిపూర్ణమైన సెజ్జమీద, అసహ్యాసక్తుల రెంటిమధ్య ప్రతినిత్యమూ భయంకరమైన యుద్ధం చెలరేగుతూ వుంటుంది. కష్టించి, భూమినిత్రవ్వి తీసినట్టు, వినోదిని స్వయంగా మహేంద్రుని హృదయంలో అట్టడుగున వాడియైన నాల్కలతో భయంకర మృగంలాగా దాగివున్న లోభగుణాన్ని వెలికితీసింది. దాని పంజానుండి ఇప్పుడామె తనను యెలా రక్షించుకోగలదు? ఆమె హృదయం ఈ విధంగా బాధపడుతూ వుండడంవల్ల, ఈ చిన్నయింట్లో ఖైదీలాగా నివసిస్తూ వుండడము, పైగా మహేంద్రుని వాసనా తరంగాలను రాత్రింబగళ్లు యెదుర్కొనవలసి రావడము - వీని నన్నింటిని తన మనసులో చిత్రించుకొన్నంతనే ఆమె హృద

యము గడగడ వణకసాగింది. జీవితంలో వీనికి అంతమెక్కడ? ఆమె యీ ఆపద లన్నింటినుండి యెప్పుడు విముక్తి పొందగలుగుతుంది?

దుర్బలంగావున్న యీ వినోదిని ముఖాన్నిచూచి మహేంద్రుని హృదయంలో యీర్ష్యాగ్ని వెలిగింది. ఈ తపస్విని హృదయంలోనున్న, బిహారినిగురించిన చింతను, సమూలంగా పెకలించేశక్తి అతనిలో లేదా? రాబందు గొర్రె పిల్లను క్షణంలో ఒక్కదెబ్బకొట్టి, తన పంజాలో యిరికించుకొని, ఆకాశాన్నంటివున్న పర్వతాగ్రంమీది తన దుర్గమస్థానానికి తీసుకొని పోతుంది. అలాగే మహేంద్రునికి తన సుందరమైనవేటను తన హృదయంవద్ద దాచుకొనుటకు తగిన విశ్వవిస్మృతమైన అగమ్యస్థానం దొరకదా? ఈర్ష్యాతాపంచేత అతనికోరిక యింకా ప్రబలంకాసాగింది. అతడిప్పుడు వినోదిని ఒక్కఘడియ తన కళ్ళయెదుట లేకపోయినా సహించలేక పోతున్నాడు. ఆమెను బిహారిబారినుండి దూరంగా - ఇంకా దూరంగా తీసుకపోవాలనుకొంటున్నాడు. బిహారికి ఆమె సన్నిధిలో సూదిమొన మోపినంత అవకాశాన్నికూడా యివ్వడానికి సాహసింపలేకపోతున్నాడు.

విరహతాపంవల్ల యువతియొక్క సౌందర్యం యింకా వన్నెకెక్కుతుందని అతడు సంస్కృత సాహిత్యంలో ఎప్పుడో ఎక్కడో చదివాడు. నేడు వినోదినిని చూచి ఈ విషయాన్ని అనుభవానికి తెచ్చుకొనడానికి ప్రయత్నించేకొలది, అతని

హృదయం సుఖ మిశ్రితమైన దుఃఖంతో ఆందోళితమై తీవ్రంగా మథించి పోతూవుంది.

వినోదిని ఒక్కక్షణం మౌనంగావుండి "మీరు టీ త్రాగారా?" అని మహేంద్రుని అడిగింది.

"త్రాగివచ్చాననుకో, కాని యిందువల్ల నీవు నీ చేతితో మరోగ్లాసు టీ యిస్తే నీకు నష్టమొస్తుందేమోనని భయపడబోకు. — ఇయ్యవోయ్, ఇవ్వు, గ్లాసునిండాయివ్వు."

వినోదిని బహుశః బుద్ధిపూర్వకంగానే అతని యీ ఉత్సాహంమీద దెబ్బకొట్టదలచి – "బిహారిబాబు యెక్కడ వున్నాడు, మీకేమయినా సమాచారం తెలిసిందా?" అని అడిగింది.

క్షణంలో మహేంద్రుని ముఖం మలమలమాడి పోయింది – "వాడిప్పుడు కలకత్తాలోలేడు." అన్నాడు.

"ఆయన చిరునామా యేమిటి?"

"దానిని వాడెవరికీ చెప్పదలచడంలేదు."

"వెదకి జాడ తీయలేరా?"

"అది నాకవసరంగా తోచడంలేదు."

"చేసే పనులన్నీ అవసరంవుండే చేస్తున్నారా? బాల్య స్నేహానికి విలువేమీలేదా?"

"బిహారి నాబాల్యస్నేహితుడనడం నిర్వివాదం. కాని నీతో అతనికి రెండు దినాలుమాత్రమే సాహచర్యం కలిగి నప్పటికీ, అతని సమాచారంకొరకు—అతని చిరునామా

కొరకు—నీకే యెక్కువ తొందరగావుంది—నీవే అధికంగా చింతిస్తున్నావు. ఆశ్చర్యకరమైన సంగతే!"

"ఇదిచూచి మీరు సిగ్గుపడవలసివుంది. స్నేహం యెలా చేయాలో అలాంటి మిత్రుని చూచికూడా మీరు నేర్చుకొనలేకపోయారు."

"దీనికి నేనంతగా దుఃఖించడంలేదు. మోసంచేసి స్త్రీల మనస్సును యెలా స్వాధీనంలోకి తెచ్చుకోవాలో అతనిదగ్గర నేర్చుకోలేకపోతినేయని దుఃఖంగా వుంది. ఈవిద్య నేను నేర్చుకొనేవుంటే యిప్పుడు బాగా వుపయోగపడేది."

"ఈ విద్య వూరికే కోరినంతమాత్రాన నేర్చుకొనవీలయ్యేదికాదు. అది నేర్చుకోడానికి తగిన యోగ్యతకావాలి."

"నీకు తెలిసివుంటే గురుదేవుని చిరునామా యేదో చెప్పు; ఇప్పుడే వారివద్దకు వెళ్ళి మంత్రసిద్ధి పొందివస్తాను; తర్వాత యోగ్యత పరీక్షించవచ్చు."

"మీరు మీమిత్రునిజాడ తెలుసుకోలేకపోతే, ఇక నాముందు ప్రేమ పేరుకూడా యెత్తవద్దు. బిహారిబాబు విషయంలో మీ ప్రవర్తనను తెలిసికొనికూడా మిమ్మెవరు విశ్వసించగలరు?"

"నీవు నన్ను పూర్తిగా విశ్వసించలేకపోతే, ఇంతగా అవమానపరచలేవు. నా ప్రేమ విషయంలో నీవు నిస్సంశయంగా వుండకపోతే నేనింత సహింపరాని దుఃఖాన్ని అనుభవింపవలసివచ్చేదీకాదు. బిహారికి బంధనాల్లో పడకుండా

తప్పించుకొనే విద్య తెలుసు; వాడా విద్యను యీ అభాగ్యునికి నేర్పితే తప్పక మైత్రి నెరపగలను!"

"బిహారి మనుష్యుడు; అందుచేత బంధనాల్లో చిక్కుకొనడు." అని వినోదిని తన శిరోజాలను వీపుమీద విరియబోసుకొని తలుపువద్ద అలాగే నిల్చొనివుంది. వెంటనే లేచి నిల్చొన్నాడు మహేంద్రుడు. అతడు గట్టిగా తన రెండు పిడికిళ్ళను బిగించి వుగ్రుడై గర్జిస్తున్నట్లుగా—"ఎందుకు నీవు నన్ను మాటిమాటికి అవమానపరచ సాహసిస్తున్నావు? ఈ యవమానానికి నీవు ఫలితం అనుభవించడంలేదంటే యెందుకనుకొన్నావు? నీయోగ్యతవల్లనా, లేక నా యోగ్యతవల్లనా? నీవు నన్ను మనుష్యుడుకాదనీ, పశువనీ అనుకొనేలాగుంటే క్రూరజంతువనే తెలుసుకో! ఎంత అవమానాన్నైనా సహిస్తూ యెదురుదెబ్బ కొట్టలేని పుంస్త్వహీనునిగా మాత్రం భావించబోకు!" అని ఒక్కఘుడియ మెదలకుండా వినోదిని ముఖంవైపు చూస్తూ వూరుకొని—"వినోదినీ, ఇక్కడినుండి మరెక్కడికైనా పోదాంపద! పశ్చిమదేశంగాని, కొండలమీదికిగాని, మరెక్కడికైనాగాని, నీ యిష్టమైనచోటికి పద. ఇక్కడ బ్రతికే అవకాశంలేదు. నేను చచ్చిపోతున్నాను."అని మళ్ళీ అన్నాడు మహేంద్రుడు.

"పద, యిప్పుడేపద—పడమటిదేశం వెడదాం."

"పడమట యెక్కటికి వెడతావు?"

"ఎక్కడికీ లేదు. ఒకచోట ఆగేదిలేదు – వెళ్ళుతూ వుందాం."

"నీకీకోరిక వుంటే, ఇవాళ రాత్రికే ప్రయాణం."

వినోదిని అంగీకరించి మహేంద్రునికి వంటచేసే ప్రయత్నంలో పడిపోయింది.

వినోదిని ఆ వార్తాపత్రికను చూడలేదని భావించాడు మహేంద్రుడు. ఇప్పుడతడికి వార్తాపత్రికను చూచేశక్తిలేదు. దైవయోగంవల్ల అదాటుగా యెప్పుడైనా ఆ వార్తాపత్రిక వినోదిని కంటపడుతుందేమోనని అతడు మహాజాగ్రతగా వున్నాడు.

# 45

బిహారి సమాచారం తెలుసుకొని మహేంద్రుడు తిరిగి వస్తూవుండవచ్చునని యింట్లో త్వరత్వరగా వంట చేసివేశారు. చాల ఆలస్యమయింది; కొడుకు తిరిగి రాలేదు. ఈ కారణం చేత రోగపీడితురాలైన రాజలక్ష్మి చాల భయపడుతూవుంది. అసలే రోగపీడిత, పైగా రాత్రియంతా నిద్రపట్టకపోవడం; ఆ పైన మహేంద్రునిగురించిన చింత ఆమె దుఃఖాన్ని యింకా యినుమడింపజేస్తూవుంది. ఆశ గుర్రపుశాలలోకి కబురు చేస్తే, బండి తిరిగి వచ్చినట్లు తెలిసింది. మహేంద్రుడు బిహారి యింటి నుండి బయలుదేరి 'పటల్‌డాంగా'లోని యింటికి వెళ్లాడని బండివానివల్ల సమాచారం తెలిసింది. రాజలక్ష్మి యీ సమాచారం విని, గోడవైపు తిరిగి మెదలకుండా నిద్రపోయింది.

ఆశ అత్తగారి తలదిక్కున బొమ్మలాగా నిల్చొని నెమ్మదిగా పంకా విసరుతూవుంది.

ప్రతిదినం భోజనసమయం కాగానే ఆశను భోజనానికి వెళ్ళమని చెప్పుతూవుండేది రాజలక్ష్మి; కాని నేడు యేమీ మాట్లాడలేదు. తాను గడచిన రాత్రి అనుభవించిన బాధను చూచికూడా వినోదిని మోహంలోపడి వెళ్ళిపోయాడు మహేంద్రుడు.

ఇదిచూచి ఇక ఈ సంసారంలో ప్రశ్నించడానికి, పని చేయడానికి, కోరడానికి మరేమీ ఆమెకు కనిపించలేదు. మహేంద్రుడు తనరోగాన్ని మామూలు రోగంగా భావిస్తున్నాడని ముందే తెలుసుకొంది రాజలక్ష్మి. ఈ రోగం చాలా సార్లు ఎక్కువవుతూ మళ్ళీ తగ్గిపోతూవుందనీ, అలాగే ఇప్పుడు కూడా కొన్నిదినాల్లో తగ్గిపోతుందనీ అతడు భావిస్తున్నాడు. కాని మహేంద్రుడు ఇలా నిశ్చింతగావుండడం రాజలక్ష్మికి చాలా కష్టంగావుంది. అతడిప్పుడు ప్రేమ మత్తులో మైమరచి వున్నాడు. ఏ భయానికి, ఏ కర్తవ్యానికి తన హృదయంలో స్థానమీయ గోరడంలేదు. అందువల్లనే తల్లిరోగాన్ని-కష్టాన్ని ఇంత తేలికగా – ఇంత సామాన్యమయిందిగా భావించాడు. తల్లివద్ద చిక్కుకొనివుండవలసివస్తుందేమోననేసందేహంతో – ఈ విధంగా సిగ్గుమాలి, ఈ మాత్రం అవకాశం లభించగానే వినోదినివద్దకు పరుగెత్తాడు.

రోగంగురించి ఆరోగ్యంగురించి ఆమె కొంచెంకూడా భయపడడంలేదు. మహేంద్రుడు భయపడకపోవడం అతని

పొరబాటుఅని – అంటే తన రోగం చాలా ప్రమాదకరమైన దనీ – అలక్ష్యం చేయతగినదికాదనీ, తనకున్న అంతులేని అభిమానంవల్ల స్థిరీకరింపగోరింది.

రెండుగంటలయిన తర్వాత ఆశ వచ్చి, "అత్తయ్యా, మందు తీసుకొనేవేళ అయింది." అన్నది. రాజలక్ష్మి మాట్లాడ లేదు. ఆశ మందుకొరకు వెళ్లే సమయంలో "మందు అవసరం లేదు ఆశా, నీవు వెళ్ళు." అన్నది రాజలక్ష్మి.

ఆశ, అత్తగారి అభిమానాన్ని గుర్తించింది. ఆ యభి మానం సాంక్రామిక రోగంలాగా ఆశ హృదయంలోకూడా ప్రవేశించి, యింకా అల్లకల్లోలంచేసింది. ఆమె యిక ఆగలేక తనను సమాళించుకొనడానికి ప్రయత్నిస్తూ మెల్లగా వెక్కి-వెక్కి యేడ్వసాగింది. అప్పుడు రాజలక్ష్మి నెమ్మదిగా ఆశ వైపుకుపొర్లి కరుణాస్నేహభావాలతో మృదుమృదువుగా ఆశవీపు నిమురుతూ "అమ్మాయీ, నీవింకా చాలా చిన్న దానివి, ఇంకా నీవు సుఖాన్ని అనుభవించేరోజులు చాలా వున్నాయి. నాకొరకు నీవేమీ కంగారుపడకు, – నేను చాలా పెద్దదానయాను, ఇంకా బ్రతికి ఏం చేస్తాను!" అన్నది.

రాజలక్ష్మి ఇలా అనగానే తన దుఃఖం యింకా పొంగి రావడంవల్ల తన చీరచెరగుతో నోరు మూసుకొంది ఆశ.

ఈ విధంగా రోగియింటిలో ఆ దుఃఖదుర్దినం యెలాగో తిన్నగా గడచిపోయింది. ఐనా ఆశకు రాజలక్ష్మికి దుఃఖం తొలగిపోలేదు. మహేంద్రుని విషయంలో అభిమానంవల్ల మౌనంగా వున్నప్పటికీకూడా 'అతడు యిక వస్తూవుండవచ్చు-

యిక వస్తూవుండవచ్చు'ననే ఆశ ఇద్దరికీ లోలోపల కదిలాడు తునేవుంది. వెలుపల యేమాత్రం శబ్దమైనా మహేంద్రుడు వస్తున్నాడని అత్తా కోడళ్ళిద్దరూ అదరిపడుతున్నారు. క్రమేణా దినాంతశోభ కనుపిస్తూవుంది. కలకత్తాలో తలుపులు మూయ బడిన జనానా గృహాలలో – గోధూళి సమయంలో కనిపించే చిరువెలుతురులో – వెలుగుజిలుగులుగాని, అంధకారం ఆవ రించడంగాని వుండవు. అది విషాదాన్ని బరువుగాను, నిరాశను అశ్రుహీనంగాను చేస్తుంది. పనిపాటలుచేసే శక్తిని, ధైర్యాన్ని వహించే శక్తినికూడా హరించివేస్తుంది. విశ్రాంతినిగాని వైరాగ్యంవల్ల కలిగే శాంతినిగాని యివ్వలేదు. ఆ యింట్లో సారహీనంగాను, శ్రీహీనంగాను వున్న సంధ్యాసమయంలో లాంపు వెలిగించి తెచ్చింది ఆశ. "అమ్మాయీ, వెల్తురు నాకు బాగాలేదమ్మా, లాంపు అవతలికి తీసుకవెళ్ళు." అన్నది రాజలక్ష్మి.

లాంపు తీసుకవెళ్ళి వెలుపలపెట్టి వచ్చింది ఆశ.

దట్టంగా క్రమ్మిన చిమ్మచీకట్లు వెలుపలవున్న అనంత రాత్రిని ఆ చిన్నగదిలోకి నెట్టుకువచ్చాయి. ఆశ తిన్నగా అత్త గారివద్దకువచ్చి "అత్తయ్యా, వారికి మనిషిని పంపి కబురు చేయనా?" అని అడిగింది.

"వద్దమ్మాయీ, నామీద ఒట్టుసుమా, నీవు యెంత మాత్రం మహేంద్రునికి కబురుచేయవద్దు." అని దృఢంగా చెప్పింది రాజలక్ష్మి.

ఈమాట విని ఆశ మాట్లాడలేదు. ఇక ఆమెకు యేడ్చే శక్తికూడా లేదు.

ఇంతలో నౌకరువచ్చి "బాబుగారివద్దనుండి జాబు వచ్చింది." అన్నాడు. ఈమాట వింటూనే మహేంద్రుడు అకస్మాత్తుగ జబ్బున పడ్డాడనీ, అతడు రాలేకపోవడంవల్ల ఈ జాబు వ్రాశాడనీ అనుకొంది రాజలక్ష్మి. ఆశవైపు చూచి "చూడు, మహేంద్రుడు యేమి వ్రాశాడో చదువు." అని లోలోపల బాధపడుతూ చెప్పింది.

ఆశ గడగడ వణకుతూ వెలుపలి లాంపువద్దకు వెళ్ళి జాబు చదువుతూవుంది—కొన్ని దినాలనుండి నామనసు బాగా లేదు. అందుచేత నేను యివాళ పడమటి ప్రాంతానికి యాత్రకు వెళ్ళుతున్నాను. అమ్మ జబ్బువిషయంలో భయకారణ మేమీలేదు. ఆమెను ప్రతినిత్యం పరీక్షించడానికి నా మిత్రుడైన ఒక డాక్టరుకు చెప్పివచ్చాను. రాత్రులు నిద్రపట్టనప్పుడు, తల నొప్పిగా వున్నప్పుడు, యేమి చేయవలెనో అదికూడా జాబులో వేరొకచోట వ్రాశాను. జాబుతోకూడా పుష్టికారకమైన తేలికపాటి అనుపానాన్నికూడా రెండు డబ్బాలలో పంపాను. – అని వ్రాశాడు. ఆ జాబులో చివర–మరొక అడ్రసు వ్రాయనంతవరకు పాట్నా పోస్టుమాస్టరు అడ్రసుకు జాబు వ్రాస్తూ అమ్మ ఆరోగ్యసమాచారాన్ని వెంటవెంటనే వ్రాస్తూవుండాలి.—అని వ్రాశాడు.

ఈ జాబు చదివి ఆశ స్తంభించిపోయింది. ఈ ప్రబలమైన ధిక్కారము ఆమె దుఃఖాన్నికూడా క్రిందికి అణచి

వేసింది. ఈ చెడ్డవిషయాన్ని - యింతబాధ కలిగించే జాబును— అత్తగారికి యెలా వినిపించను?

ఆశ ఆలస్యం చేయడంవల్ల రాజలక్ష్మి యింకా వ్యాకులపడుతూవుంది. "అమ్మాయీ, మహేంద్రుడు యేమని వ్రాశాడు? త్వరగా వినిపించు." అంటూ ఆమె వెంటనే మంచముమీాద లేచి కూర్చొంది. అంతట ఆశ లోపలికి వెళ్ళి మెల్లగా జాబు పూర్తిగా చదివి వినిపించింది. "తన మనసును గురించి యేదో వ్రాశాడే, — కొంచెం ఆభాగాన్ని మళ్ళీ చదువు—" అన్నది రాజలక్ష్మి.

ఆశ యిలా చదివింది—"కొన్ని దినాలనుండి నాకిక్కడ బాగాలేదు; మనసు వికలంగా వుంది. అందుచేతనే నేను——"

"ఆగు, ఆగు, యికముందు చదవవలసిన పనిలేదు! మనస్సెలా బాగా వుంటుంది! ముసలితల్లి చావడమూలేదు, వూరికే రోగంతో విసుగుపుట్టిస్తూ వుందికూడా! నా జబ్బు విషయం నీవు వానికెందుకు చెప్పావు? ఇంట్లో యేదో మూల కూర్చొని చదువుకొంటూ, యెవరికీ సంబంధం లేకుండా వున్నాడాయె——మధ్యలో అమ్మ రోగంవిషయం చెప్పి, వాణ్ణి యింట్లోనుంచి వెళ్ళగొట్టావు. దీనివల్ల నీవేంసుఖం అనుభవించావు? నేనిక్కడి పడి తీసుకు తీసుకు చస్తేమాత్రం యెవరికేమి నష్టం? ఇంత దుఃఖసమయంలోకూడా నీకు బుద్ధి రాలేదు!" ఇలా అని మంచంమీాద పడింది రాజలక్ష్మి.

వెలుపల బూట్లశబ్దం వినిపించింది. "డాక్టరుగారు వచ్చారు." అని నౌకరు వచ్చి చెప్పాడు. ఆశ వెంటనే మేలి

ముసుగు ధరించి మంచంచాటుకువెళ్ళి నిల్చొంది. "మీాపరిస్థితి యెలావుందో చెప్పండి" అని రాజలక్ష్మిని అడిగాడు డాక్టరు.

ఆమెకు కోపంవచ్చింది. "ఎలాగోవుంటుంది. ఎవ్వరినీ చావనీయరా? మీా మందు త్రాగితే యిక చావనాయేమిటి?" అన్నది.

"చావు బ్రతుకుల్ని నేను నిర్ణయించలేను; కాని కష్టం తగ్గేవుపాయం-" అనియేదో శాంతంగా చెప్పబోయాడుడాక్టరు.

మధ్యలోనే అడ్డంవచ్చి "విధవలు భర్తచితిలోపడి చచ్చేరోజుల్లో కష్టాలకు మంచిమందు వుండేది. ఈ దినాల్లో కట్టిపడేసి ప్రాణాలు తీస్తున్నారు! వెళ్ళండి డాక్టరుగారూ, మీారు వెళ్ళండి, నన్ను యిబ్బంది పెట్టకండి. నేను వంటరిగా ఉండ గోరుతున్నాను." అన్నది రాజలక్ష్మి.

డాక్టరు భయపడుతూ భయపడుతూ-"మీానాడి ఒక్క-సారి—"అన్నాడు.

"మిమ్మల్ని వెళ్ళమని చెప్పాను! నా నాడి చాలా బాగా వుంది-ఈ నాడి త్వరగా నన్ను వెడిచిపెట్టేలాగా లేదులెండి!" అని కోపంతో అన్నది రాజలక్ష్మి.

ఇక లాభంలేదని బయటికివెళ్ళి ఆశకు కబురంపాడు డాక్టరు. ఆమెను రోగస్థితినిగురించి ప్రశ్నించాడు. ఆశ అన్ని విషయాలు చెప్పింది. సమాచారమంతావిని, డాక్టరుగారు తిరిగి లోపలికివెళ్ళి, "చూడండి, మహేంద్రబాబుగారు మీా విషయం నాకు గట్టిగా వప్పజెప్పిపోయారు. తమరు నన్ను

మీకు చికిత్సచేయనీయకపోతే వారికి చాలా కష్టంకలుగు తుంది." అన్నాడు గంభీరభావంతో.

"మహేంద్రునికి కష్టం కలుగుతుంది." - అన్నమాట రాజలక్ష్మికి ఒక తీవ్రమైన పరిహాసంలాగా-వెక్కిరింతలాగా వినిపించింది. "మహేంద్రునికొరకు మీరింతగా చింతించకండి! కష్టమనేది ప్రపంచంలో అందరికీ కలుగుతుంది. ఈ కష్టంవల్ల మహేంద్రునికి యెక్కువ దుఃఖంకలుగదు! దయచేసి మీరిక వెళ్ళండి! నన్ను కొంచెం నిద్రపోనివ్వండి!" అన్నది.

రోగికి ఎక్కువ కలవరాన్ని కలిగించడం మంచిదికాదు- అనుకొని డాక్టరుగారు తిన్నగా బయటికివచ్చి, ఎప్పుడేమి చేయ వలెనో ఆశకు తెలియచేసి తన యింటిదారిపట్టాడు.

ఆశ గదిలోకిరాగానే "అమ్మాయీ, నీవు వెళ్ళి పడు కొని కొంచెం విశ్రాంతి తీసుకో. పగలంతా రోగిదగ్గరే కూర్చొన్నావు. దాసీని పంపించు. ఆమె ఆ ప్రక్కగదిలోనే వుంటుంది." అన్నది రాజలక్ష్మి.

ఆశకు రాజలక్ష్మి మనస్తత్వం బాగా తెలుసు. ఇది ఆమె ప్రేమతో చెప్పేమాటకాదు, ఆజ్ఞ; దీనిని పాలించడం కంటే వేరే ఉపాయంలేదు. ఆమె దాసీని అత్తగారివద్దకుపంపి, తాను తన చీకటిగదిలోకివెళ్లి చల్లగావున్న నేలమీదపడుకొంది.

పగలంతా ఉపవాసం చేయడంచేత, దిగులుచేత శరీరం కృశించిపోయింది. మనస్సు బాగా వుండడంలేదు. ఆ వీధి లోని ఒక యింట్లో ఆ దినం వుండివుండి పెళ్ళిమేళం మ్రోగుతూవుంది. మళ్ళీ యిప్పుడు మధురమైన సన్నాయి

మేళం మ్రోగుతూ—ఆ చీకటిరాత్రిని కంపింపజేస్తూ, ఆశ హృదయాన్ని గాయపరుస్తూవుంది. ఆశ వివాహంనాటిరాత్రి జరిగిన చిన్నచిన్న విషయాలు ఆమెకు జ్ఞాపకంవచ్చి - అంధ కారమయమైన ఆకాశాన్ని స్వప్నచిత్రాలతో నింపివేశాయి. ఆనాటి ప్రకాశం, కోలాహలం, జనసందోహం – ఆనాటి పుష్పహారాలు, క్రొత్తవస్త్రాలు, హోమధూమపు సువాస నలు – శంకవల్లను, లజ్జవల్లను, ఆనందంవల్లను క్రొత్తపెండ్లి కూతురి హృదయంలో కలిగిన నిగూఢ కంపనము – స్మృతి పథంలో నలుదిక్కులనుండి అమెను చుట్టుముట్టేకోలది, ఆమె హృదయంలోనివ్యథ యింకా పుంజుకొని తీవ్రంకాసాగింది. దారుణమైన దుర్భిక్షంలో ఆకలిగొన్నబిడ్డ ఆహారంకొరకు తన చిన్నచిన్న చేతులతో తల్లినికొడుతూ వుంటుంది. అలాగే ఆమెలో జాగరితమైన సుఖస్మృతి, తన ఆహారంకొరకు రోదనంచేస్తూ, ఆశహృదయంలో కొట్టడం మొదలుపెట్టింది. అది ఆశను సోమరితనంగా పడుకోనీయడంలేదు. ఆమె తన చేతులు జోడించి దేవుని ప్రార్థించడం మొదలుపెట్టింది. తనకు యేకైక ప్రత్యక్షదేవతగావున్న స్నేహమయమైన పిన్నమ్మ మూర్తి ఆమె అశ్రుపూరితమైన హృదయంలో మెరుపు మెరిసినట్లు ప్రత్యక్షమయింది. ఇక ఆ తపస్విని దుఃఖమయ మైన ఈ సంసార చిక్కులలోకి యీడ్వరాదని ప్రతిజ్ఞ చేసి వుంది ఆశ. కాని నేడు ఆమెకు తన పినతల్లికంటే మరెక్కడా యే ఆధారమూ కనిపించడంలేదు - నలుదిక్కులా చుట్టుముట్టి వున్న దుఃఖంలో మరోపట్టుకొమ్మ చేతికందడంలేదు. అందువల్ల

గదిలో లాంపు వెలిగించి తనబడిలో ఒక పుస్తకంమీద కాగితం పెట్టుకొని మాటిమాటికి కన్నీరు తుడుచుకొంటూ పిన్నమ్మకు జాబు వ్రాయ మొదలుపెట్టింది —

"శ్రీచరణ కమలేషు—

పిన్నమ్మా, నేడు నీకంటె నాకు దిక్కెవ్వరూ లేరు. ఒక సారివచ్చి యీ దుఃఖితురాలిని నీ ఒడిలోకి చేర్చుకో; లేకపోతే నేనెలా జీవించగలను? ఇంకేమని వ్రాయవలెనో నాకు తెలియదు. నీ చరణకమలములకు నాశతసహస్ర ప్రణామములు.

నీ ప్రేమపాత్రురాలు

చున్నీ."

# 46

కాశీనుండి కలకత్తాకు వచ్చింది అన్నపూర్ణ. ఆమె తిన్నతిన్నగా రాజలక్ష్మి గదిలోనికి వెళ్లి తోడికోడలికి నమస్కారంచేసి, ఆమె చరణరజాన్ని తన శిరస్సున ధరించింది. ఇటీవల వారిమధ్య విరోధంవల్ల కొంతయెడబాటు కలిగినప్పటికీ, అన్నపూర్ణ కనిపించడంతోటే పోగొట్టుకొన్న ధనం దొరికి నట్లుగా సంతోషించింది రాజలక్ష్మి. అన్నపూర్ణనుచూడగానే, ఆమె లోలోపల అగోచరభావంలో తనను ప్రేమిస్తూవుందని - రాజలక్ష్మికి అనిపించింది. అన్నపూర్ణ యిక్కడ వుండక పోవడంవల్లనే మాకిన్ని కష్టాలు కలిగాయని యిన్ని దినాలకు ఆమెకు ఒక్కక్షణంలో స్పష్టపడిపోయింది. వెంటనే ఆమె

వ్యథితహృదయం తన పురాతన స్థానంమీద అధికారం చేపట్టింది. మహేంద్రుడు పుట్టకపూర్వంనుంచీకూడా తోడి కోడళ్ళిద్దరూ ఆ యింటికి కోడళ్ళుగావచ్చి, ఆ కుటుంబ సుఖ దుఃఖాలన్నింటినీ తమనెత్తిన యెత్తుకొన్నారు. సుఖ దుఃఖా లలో, మంచిచెడ్డలలో, పెళ్ళి పేరంటాలలో ఆ సంసార రథానికి కట్టబడి వారిద్దరూ జీవనపథంలో జతగా యాత్రచేశారు. ఆనాటి ఆ దృఢమైత్రి, కలయిక, స్నేహం క్షణంలో రాజలక్ష్మి హృదయాన్ని క్రమ్మివేశాయి. వెనుకటిదినాలలో వారిద్దరూ కలిసి తమ నవ్యజీవనాన్ని ఆరంభించిన స్థానంలోనే, అనేక కష్టసుఖాలకు పిమ్మట, ఈ సహింపరాని కష్టపుదినాల్లో ఆ బాల్యసహచరిణి దగ్గరకు వచ్చింది. ఆ గడచిన రోజులలో అనుభవించిన సుఖదుఃఖాలను — శుభసమాచారాలను జ్ఞాప కానికి తెచ్చేది యేదయినా వున్నదంటే అది ఈ అన్నపూర్ణ మాత్రమే. ఎవనికొరకు రాజలక్ష్మి తన ప్రియసహచరణియైన తోడికోడలిని యింత క్రూరంగా బాధించిందో, ఆ మహేంద్రు డిప్పుడేడీ! అన్నపూర్ణ రోగివద్దకువచ్చి కూర్చొని, ఆమె కుడి చేతిని పట్టుకొని "అక్కా!" అన్నది.

"అన్నపూర్ణా!"—అన్నది రాజలక్ష్మి. తర్వాత ఆమె యేమీ మాట్లాడలేకపోయింది. ఆమె రెండుకళ్లు కన్నీటితో గ్రిరున నిండాయి. ఈ దృశ్యాన్నిచూచిన ఆశకూడా సమాళిం చుకోలేకపోయింది—ప్రక్కనున్న గదిలోకివెళ్ళి క్రింద కూర్చొని యేడ్వడం మొదలుపెట్టింది.

మహేంద్రుని సమాచారాన్ని గురించి రాజలక్ష్మిని గాని ఆశనుగాని ప్రశ్నించే సాహసం అన్నపూర్ణకు లేక పోయింది. దీననాథుని పిలిచి "మహేంద్రుడెక్కడ?" అని అడిగింది.

అప్పుడు దీననాథుడు వినోదినీ మహేంద్రుల పురాణ మంతా వినిపించాడు. "బిహారి యెక్కడ?" అని అడిగింది అన్నపూర్ణ.

"చాలా దినాలనుండి ఆయన యిక్కడికి రావడంలేదు; అందుచేత నాకు అతని సమాచారం బాగా తెలియదు." అన్నాడు దీననాథుడు.

"కొంచెం బిహారి యింటికివెళ్ళి వాని విషయం తెలుసు కొని రండి." అని దీననాథునితో చెప్పింది అన్నపూర్ణ.

దీననాథుడు బిహారి యింటికివెళ్ళివచ్చి "ఆయన యింట్లో లేరు, గంగాతీర మైదానంలో తన తోటకువెళ్ళారు." అన్నాడు.

పిమ్మట డాక్టరును పిలిపించి రాజలక్ష్మి రోగపరిస్థితిని గురించి అడిగింది అన్నపూర్ణ.

"అమె హృత్పిండం చాలా బలహీనంగావుంది; పైగా గుల్మం పెరిగిపోయింది. యెన్నాళ్ళు బ్రతుకుతుందో సరిగా చెప్పలేను." అన్నాడు డాక్టరు.

సాయంకాలం రాజలక్ష్మికి ఆయాసం యెక్కువకాగానే "అక్కా, డాక్టరును పిలిపించేదా?" అని అడిగింది. అన్నపూర్ణ.

"వద్దమ్మా, డాక్టరువచ్చి యేంచేస్తాడు?"

"ఐతే యెవరిని పిలవమంటావు చెప్పు?"

"బిహారిని పిలిపిస్తే బాగావుంటుంది."

ఈమాట అన్నపూర్ణ హృదయాన్ని గాయపరిచింది. ఆనాటి సాయంకాలం ఆమె కాశీలోవుండగా వచ్చినప్పుడు ద్వారంవెలుపలనుండియే బిహారిని అవమానపరచి పంపివేసింది. ఆ బాధను ఆమె యింతవరకూ మరచిపోలేదు. బిహారి యిక యెన్నటికి ఆమె వాకిట్లోకి రాడు. ఈ జీవితంలో యెన్నడూ ఆ యగౌరవాన్ని త్రిప్పుకొనే అవకాశం కలుగుతుందనే ఆశ లేదు.

ఒకసారి మేడమీదనున్న మహేంద్రుని గదిలోకి వెళ్ళింది అన్నపూర్ణ. ఆ యింటి మొత్తంలో యీ స్థానం ఆనందనిలయంగా వుండేది. అలాంటి ఆనందనిలయంకూడా నేడు కాంతిహీనంగావుంది. — అన్ని వస్తువులు కళాకాంతులు లేకుండా యెడ్డెమెడ్డెగా, యెగుడుదిగుడుగా పడివున్నాయి. పరుపు అటుయిటుచుట్టి క్రిందుమీదుగా పడివుంది. డాబా మీదవున్న పెద్ద తొట్టిలో నీళ్ళు చుక్కకూడా లేవు. క్రోటన్లు పూలతీగెలు యెండిపోయాయి.

పిన్నమ్మ డాబామీదికి వెళ్ళడంచూచి ఆశకూడా తిన్న తిన్నగా ఆమెను వెంబడించింది. అన్నపూర్ణ ఆమెను దగ్గరకు తీసుకొని కౌగలించుకొంది. ఆమె నుదురు ముద్దుపెట్టుకొంది. ఆశ క్రిందికివంగి రెండు చేతులతో పిన్నమ్మ కాళ్ళనుపట్టుకొని నమస్కరించి "పిన్నమ్మా, నన్ను ఆశీర్వదించు, నాకు బలాన్నివ్వు. మానవులు యింత కష్టాన్ని సహించగలరని యెన్నడూ

నేను ఊహించనైనాలేదు. అమ్మా, ఇంకా యెన్నాళ్ళు యీ విధంగా సహించగలను!" అన్నది.

అన్నపూర్ణ అక్కడే క్రిందకూర్చొంది; ఆశ ఆమె ఒడిలో తలదాచుకొని పడుకొంది. అన్నపూర్ణ ఆశ శిరస్సును తన ఒడిలోకి ఇంకా దగ్గరగా తీసుకొని యేమీ మాట్లాడకుండా నిస్తబ్ధభావంతో చేతులు జోడించి తన యిష్టదేవతను ధ్యానించడం మొదలుపెట్టింది.

స్నేహచిహ్నమైన అన్నపూర్ణ నిశ్శబ్ద ఆశీర్వాదం, ఆశ గంభీరహృదయంలోకి ప్రవేశించి ఎన్నిదినాలుగానో లుప్తమైనశాంతిని పునస్సంస్థాపనంచేసింది. తనకోరిక సిద్ధించడంలో ఇక ఆలస్యంజరుగదని ఆమెకు విశ్వాసంకలిగింది. తనలాంటి మూఢవ్యక్తిని దేవతలు అపహాస్యంచేస్తారని ఆమె అనుకొనేది; కాని ఆ దేవతలు పిన్నమ్మప్రార్థన అంగీకరించకుండా వుండలేరని ఆమె నమ్మకం.

తనహృదయంలో ఓదార్పు, బలం కలగడంచేత చాలా సేపటికి ఒక్క నిట్టూర్పువిడిచి లేచి కూర్చొని "పిన్నమ్మా, బిహారిబాబుకు జాబువ్రాసి పిలిపించరాదూ!" అన్నది ఆశ.

"వద్దు, జాబు వ్రాయడంవల్ల ప్రయోజనంలేదు."

"ఇక వారికెలా సమాచారం పంపగలవు?"

"రేపు నేను స్వయంగా బిహారివద్దకు వెళ్లుతాను."

# 47

బిహారికి పశ్చిమ ప్రాంతంలో పర్యటించే సమయంలో యేదో ఒకపనిలో నిమగ్నమై వుండకపోతే, తనహృదయానికి శాంతి లభించదని అనిపించింది. కలకత్తాలో ఆఫీసులలో పని చేసే-స్వల్పవేతనంపొందే గుమస్తాలకు ఉచిత వైద్యసహాయం చేయడానికి సంకల్పించాడు. గ్రీష్మ ఋతువులో చిన్నగుంట లోని బురదనీటిలో యెలాగో ముడుచుకొని పడివుండే చేప లాగా మురికి వీధులలో నివసిస్తూ, ఏదో ఒకపూట-అదీ అర్ధా కలిగా తిని కాలంగడుపుతూ, పరివారభారంచేత బాధపడుతూ, యే సుఖమూ యెరుగకుండా ఆఫీసుగుమాస్తాల జీవితం గడుస్తూవుంటుంది. పాలిపోయిన ముఖాలతో దుర్బలంగావుండి దుఃఖిస్తూవుండే ఆ నిర్భాగ్యులైన పెద్దమనుష్యులమీద చాలా దినాలుగా బిహారి కరుణాపూర్ణమైనదృష్టి ప్రసరించివుంది. వారికి ఆ తోటలోని ఆరోగ్యవంతమైన చెట్లనీడలు, గంగా తీరపు ఆరుబయళ్ళలోని స్వచ్ఛమైనగాలి యివ్వడానికి సంక ల్పించాడు.

ఇసుకనేలలో ఒక తోటఖరీదుచేసి దానిలో చీనా దేశపు మేస్త్రీలచేత చిన్నచిన్న కుటీరములు నిర్మింపజేయడం ప్రారంభించాడు బిహారి. కాని కల్లోలంగావున్న అతని మనసుకు శాంతి లభించలేదు. పని ప్రారంభించేదినం సమీపించేకొలది, ఆ సంకల్పంనుండి—ఆ ప్రయత్నంనుండి అతనిచిత్తం విముఖం కాసాగింది. 'ఈపనిలో యే సుఖమూలేదు, యే రసమూలేదు,

యే సౌందర్యమూలేదు; ఇదొక సారంలేని బరువు!' అని అతని చిత్తంచెబుతూవుంది.' అతడు సంకల్పించిన ఏ కార్యము కూడా యింతకుముందు బిహారికి యింతక్లేశాన్ని కలిగించి వుండలేదు.

బిహారికి యేదీ అవసరంలేని దినాలలో తన యెదుటికి యేపని వచ్చినా అనాయాసంగా తలదూర్చి పని చేయగలిగే వాడు. ఇప్పుడతని హృదయంలో ఒక విధమైన ఆకలిలాంటిది పుట్టింది. దానిని నివృత్తి చేయనిదే మరొకపనిలో అతని మనసు లగ్నంకాదు. వెనుకటి అభ్యాసం ప్రకారం అదీయిదీ చేతికి తీసుకొని చూస్తున్నాడు; కాని వానినలాగే వుంచేసి మళ్ళీ దూరంగా వుండడానికి ప్రయత్నిస్తున్నాడు.

బిహారిలో నిశ్చలభావంతో నిద్రిస్తున్న యవ్వనం, తానెన్నడూ దానినిగురించి యోచించనప్పటికీకూడా, వినో దిని స్పర్శవల్ల నేడు జాగరితమయింది. అది గరుడపక్షిలాగా తన ఆహారంకొరకు ప్రపంచమంతా గాలిస్తూ తిరుగుతూవుంది. ఇంతకుపూర్వం ఆకలిగొన్న ప్రాణితో బిహారికి పరిచయంలేదు. ఇప్పుడా పరిచయం కలగడంచేత వ్యథపడుతున్నాడు. అత డిప్పుడు కలకత్తాలోని బక్కచిక్కిన అల్పాయుష్కులైన ఆఫీసు గుమాస్తాలను తీసుకొని యేంచేస్తాడు?

ఆషాఢగంగ యెదుట ప్రవహిస్తూవుంది. ఎదుటిఒడ్డున దట్టంగావున్న నల్లని మేఘమాల తనభారాన్ని తానే మోయ లేకనాయన్నట్లు వుండివుండి చెట్లమీద పడుతూవుంది. ఆనదీతలమంతా ఒక్కొక్కచోట ఉజ్వలమైన కృష్ణవర్ణాన్ని

ధరిస్తూ, ఒక్కొక్కచోట అగ్నిలాగా మెరుస్తూవుంది. ఈ తొలకరివర్షాల హడావిడిమీదికి బిహారి తన దృష్టిని ప్రసరింప జేశాడు. అతని హృదయద్వారం తెరచుకొన్నట్లయింది. అతని నూతనదృష్టులకు ఆకాశంలో దట్టంగా అలముకొనివున్న నీలవర్ణపు ప్రకాశంలోనుంచి ఎవరో ఒక సుందరి ఒంటిగా వెలుపలికి వస్తున్నట్లనిపించింది. వేరొక సుందరి ఆ జడివాన లలో తడిసి తడిసి గాలి విసరులచే తరంగితమౌతున్న తన వినీలశిరోజాలను విరియబోసుకొని మందహాసాలను చిందిస్తూ ప్రత్యక్షమయింది. మరొక వనిత విడిపోయిన మేఘాలలో విస్తరించివున్న కిరణాలను ప్రోగుచేసి, తన అనిమేషదీనదృష్టుల ద్వారా కేవలం బిహారి ముఖంమీదకే ప్రసరింపజేస్తూవుంది.

సుఖసంతోషాలతో గడిచిపోయిన అతని పూర్వ జీవనాన్ని తలచుకొని తనజీవితంలో చాల భాగాన్ని వ్యర్థం చేసుకొన్నట్లు భావిస్తున్నాడు బిహారి. ఇలాంటి యెన్నో వర్షా కాలపు సంధ్యవేళలు, యెన్నెన్నో పున్నమీ వెన్నెలరాత్రులు వచ్చాయి; బిహారి శూన్యహృదయద్వారానికి యెదుట పీయూషపాత్రతో నిచ్చి, మాట్లాడకుండా వూరికే తిరిగి పోయినవి. ఆ దుర్లభమైన శుభముహూర్తాలలో యెన్ని మధుర సంగీతాలు ఆరంభం కాకుండానే అణగిపోయినవో; ఎన్నెన్ని వుత్సవాలు పూర్ణరూపాన్ని ధరించకుండానే ఖండ ఖండాలై పడివున్నాయో—యెవరు చెప్పగలరు? పూర్వంనుంచి బిహారి మనసులోవున్న అన్ని స్మృతులు ఆనాటి వినోదిని

ఉన్ముఖచుంబనారుణ దీప్తకాంతులతో వెలవెలబారి తుచ్ఛంగా మార్పుచెందాయి.

మహేంద్రునికి నీడలాగావుండి బిహారి తన జీవనంలో అధికభాగం యెలా గడపగలిగాడు? ఆ దినాల్లో అతడేమైనా ఫలితాన్ని పొందగలిగాడా? ప్రేమవేదనలో భూజలాకాశాల కేంద్రకుహరంనుండి యిలాంటి మధుర రాగాలాపనతో మురళి మ్రోగుతుందని యిదివరకెన్నడూ భావించలేదు బిహారి.

తన రెండుచేతులతో పట్టుకొని—చుట్టుముట్టి, ఒక్క-గడియలో ఆదాటుగా యీ అనుపమ సౌందర్యలోకంలోనికి తనను చేర్చివేసిన వినోదినిని అతడెలా మరువగలడు? ఆ వినోదిని దృష్టి, ఆ కాంక్ష యిప్పుడు అతనిలో వ్యాప్తిపొందింది. ఆమె వ్యాకులపూర్ణమైన వెచ్చని ఉచ్ఛ్వాసనిశ్వాశాలు బిహారి రక్తప్రవాహాలాను యెల్లప్పుడు చంచలంగా - పొంగే తరంగాలలాగా చేస్తున్నాయి. ఆమె మృదుస్పర్శవల్ల కలిగినవుష్ణం అతణ్ణి చుట్టుముట్టి అతని పులకిత హృదయాన్ని పుష్పంలాగా వికసింపజేసింది.

ఐతే బిహారి అలాంటి వినోదినినుండి యింత దూరంగా యెందుకు వున్నాడు? వినోదిని బిహారిని అభిషేకించిన సౌందర్యరసానికి తగినసంబంధాన్ని అతడు వినోదినితో కల్పించుకోలేకపోయాడు. కమలాన్ని పెళ్ళగిస్తే ఆ కమలంతోపాటు బురద కూడా లేచివస్తుంది. అతడు దానిని సౌందర్యప్రళయంరేగని ఒకానొక స్థానంలో యేవిధంగా స్థాపించగలడు. ఇంతేకాక మహేంద్రుడే యుద్ధకాండ ప్రారంభిస్తే దాని పర్యవసానం,

బిహారి తనహృదయంలో ఒకమూలకూడా స్థానమీయజాలని, కుత్సితరూపాన్ని ధరిస్తుంది. ఇందుచేతనే బిహారి విశ్వసంగీతం మధ్య గంగాతీరంలో యేకాంతంగా తన మానసిక ప్రతిమను ప్రతిష్టించి దానియెదుట తన హృదయాన్నికాల్చి ధూపం సమర్పిస్తున్నాడు. తన సుఖ స్వప్నజాలం యెక్కడ ఛిన్నాభిన్నమైపోతుందోనని జాబువ్రాసి వినోదిని సమాచారమైనా తెలుసుకొన ప్రయత్నించలేదు బిహారి!

ఒకనాడు ఉదయమే తన తోటకు దక్షిణపుగట్టుమీద బాగా పండిన నేరేడుచెట్టుక్రింద మౌనంగా పడుకొనివున్నాడు. ఎదుట చిన్నచిన్న పడవలు వస్తూపోతూ వున్నాయి. సోమరిగా పడుకొని వాటివైపు చూస్తున్నాడు బిహారి. మెల్లమెల్లగా ప్రొద్దెక్కుతూవుంది. "భోజనం సిద్ధం చేయమంటారా?" అని నౌకరు అడిగాడు. "ఇప్పుడు కాదుపో." అని అతణ్ణి పంపివేశాడు. పెద్దమేస్త్రీ ఏదో సలహా అడుగడానికివచ్చాడు. "కొంచెం ఆగిరా." అన్నాడు.

ఇంతలో అతడు అదరిపడ్డాడు. అన్నపూర్ణ యెదుట ప్రత్యక్షమయింది. సగౌరవంగా లేచినిల్చొన్నాడు బిహారి. తన రెండుచేతులతో అన్నపూర్ణ పాదాలను పట్టుకొని తల నేలకు ఆనించి ప్రణామంచేశాడు. ఆమె తన కుడిచేతితో బిహారి తలమీద, శరీరంమీద అతిస్నేహంతో నిమురుతూ కన్నీరు పొంగిరావడంవల్ల బొంగురుపోయిన కంఠంతో — "బిహారీ, నీవిలా రోగిలా అయిపోయావేం!" అన్నది.

"నీ స్నేహాన్ని తిరిగి పొందడానికి పిన్నమ్మా." అన్నాడు బిహారి. ఇదివిని అన్నపూర్ణకళ్ళనుండి అశ్రుబిందువులు జలజల రాలాయి.

"పిన్నమ్మా, నీవింకా భోజనం చేయలేదా?" అని వ్యాకులంగా అడిగాడు బిహారి.

"లేదు, ఇంకా నా భోజనసమయంకాలేదు."

"పద, నేనువచ్చి వంటసామాగ్రి సిద్ధంచేయిస్తాను. ఇన్నాళ్లకు నీచేతివంటకాలు, నీపళ్లెంలోని ప్రసాదంతింటాను."

బిహారి ఆశా మహేంద్రుల ప్రస్తావన ఏమీ చేయలేదు. ఒకప్పుడు ఆ వైపుగావున్న ద్వారాన్ని బిహారి వెళ్ళడానికి వీలులేకుండా తన చేతులతోనే మూసివేసింది అన్నపూర్ణ. అందువల్ల కలిగిన అభిమానంతో అతడా క్రూరమైన నిషేధాన్ని పాలించాడు.

"నావ రేవులో సిద్ధంగావుంది బిహారీ, నావెంట యిప్పుడు నీవు కొంచెం కలకత్తావరకు రావాలి." అని భోజన మైన తర్వాత బిహారితోఅన్నది అన్నపూర్ణ.

"కలకత్తాలో నాకేం పనివుంది?"

"అక్కగారికి చాలా జబ్బుగావుంది, ఆమె నిన్ను చూడగోరుతున్నది."

ఇదివిని బిహారి అదరిపడి "మహేంద్రదాదా యెక్కడ వున్నాడు?" అని అడిగాడు.

"కలకత్తాల్లో లేదు, పశ్చిమప్రాంతానికి వెళ్ళాడు."

ఈమాట వినగానే బిహారి ముఖం వెలవెల బారింది. అతడేమీ మాట్లాడలేదు.

"నీకు అన్ని విషయాలు తెలియవా?" అన్నది మళ్ళీ అన్నపూర్ణ.

"కొద్దికొద్దిగా తెలుసు; కాని పూర్తిగా తెలియవు."

వినోదినిని తీసుకొని మహేంద్రుడు పశ్చిమ ప్రాంతానికి వెళ్ళాడని చెప్పింది అన్నపూర్ణ. బిహారి దృష్టిలో తక్షణం భూజలాకాశాల రంగు పూర్తిగా మారిపోయింది. అతడు తన ఊహాభండారంలో కూడబెట్టిన రసమంతా ఒక్కసారిగా వేడెక్కిపోయింది.

'ఐతే మాయావినియైన వినోదిని ఆనాటి సాయంకాలం నాతో యింద్రజాలమే చేసిందా? ఆమె ప్రేమతో ఆత్మసమర్పణ చేయడం అంతా కపటం – మోసం – వంచనయేనా? ఆమె తన గ్రామం విడిచి ఈ విధంగా సిగ్గులేకుండా మహేంద్రునివెంట వంటరిగా పడమటదేశానికి వెళ్ళింది! ఛీ! ఒక్క క్షణకాలమైనా ఆమెను విశ్వసించానంటే నేనెంత మూర్ఖుణ్ణి!' —అని తన్నుతాను నిందించుకొన్నాడు బిహారి.

ఆహా, మేఘాచ్ఛన్నమైన ఆషాఢ సంధ్యాకాలమా! వర్షానంతరం, మిలమిల మెరిసే పాలవెన్నెలల్ని వొలకబోసే నిండుపూర్ణిమా! మీ యింద్రజాలమంతా యేమైపోయింది?

# 48

దుఃఖితురాలైన ఆశ ముఖాన్ని నేనెలా చూడగలనని ఆలోచిస్తున్నాడు బిహారి. ద్వారంలో అడుగు పెడుతూవుండగానే ఆ అనాథగృహంలో దట్టంగా అలముకొన్న విషాదఛాయలు బిహారిని అణచివేసినవి. ఇంటి దర్వాను—నౌకర్ల ముఖాలవైపు చూచి, జాడ తెలియని ఉన్మత్తుడైన మహేంద్రునివల్ల తనకు కలిగిన లజ్జతో తలవంచుకొన్నాడు. అతడు వెనుకటిలాగా స్నేహపూర్ణమైన, సరసస్వరంతో పూర్వపరిచితులైన నౌకర్లను కుశలప్రశ్న లడుగలేకపోయాడు. జనానా గదిద్వారం లోకి పోవడానికి కాళ్ళు రావడంలేదు. మహేంద్రుడు ప్రపంచ మంతటియెదుట అసహాయురాలైన ఆశను, బట్టబయలుగా యే అవమానంలో విడిచిపెట్టి వెళ్ళిపోయాడో, యే అవమానం స్త్రీలను వారి కట్టకడపటి లజ్జనుకూడా తొలగించి కుతూహల పూర్ణమైన ప్రపంచపు కృపాదృష్టివర్షమధ్యంలో నిల్చొన జేస్తుందో, అనావృతమైన ఆ యవమాన ప్రకాశంలో లజ్జా వ్యథలను అనుభవిస్తూవున్న ఆశను బిహారి యెలాచూడగలడు?

కాని యీ అన్ని విషయాలను ఆలోచించవలసిన, అనుమానించవలసిన అవసరం కలుగలేదు. బిహారి లోపలికి వెళ్ళగానే ఆశ త్వరత్వరగా వచ్చి "కొంచెం త్వరగా వచ్చి అమ్మను చూడండి, ఆమె చాలా బాధపడుతున్నది!" అన్నది.

బిహారితో విచ్చలవిడిగా మాట్లాడవలసిన అవసరం యిపుడు మొదటిసారిగా ఆశకు కలిగింది. దుఃఖదుర్దినంలో

సమస్త అంతరాన్ని ఎగరగొట్టివేయడానికి ఒక్క చిన్నగాలి విసురుమాత్రమే చాలు. దూరదూరంగా వుండేవారిని, ఆకస్మిక ప్రవాహం కొట్టుకొనివచ్చి, వొక యిరుకైన చిన్న పడవమీద యేకంచేయగలుగుతుంది.

ఆశలోని సంకోచహీనమైన వ్యాకులం బిహారికి బాధ కలిగించింది. మహేంద్రుడు తన యింటిని యేస్థితినుండి యేస్థితికి తెచ్చాడనే విషయాన్ని యీ చిన్న ఘటనవల్ల బాలవరకు తెలుసుకొనగలిగాడు బిహారి. కష్టపు దినాలలో గృహాలంకరణము, సౌందర్యము వుపేక్షింపబడునట్లు, గృహలక్ష్మికి కుంకుమబొట్టువుంచుకొనే అవకాశంకూడా కలుగలేదు. పరదాగాని, చాటుగాని, మాట్లాడవచ్చునా—మాట్లాడరాదా యనే విచారంగాని అన్నీ పతనంజెందాయి.

రాజలక్ష్మిగదిలోకి వెళ్ళాడు బిహారి. ఆమెకు కొంతసేపు ఆయాసం యెక్కువ కావడంచేత బాధపడ్డది. ఆయాసం కొంచెంగా తగ్గడంవల్ల మళ్ళీ కొంచెం స్థిమితపడ్డది.

ఆమెకు ప్రణామంచేసి ఆమె చరణరజాన్ని శిరస్సున ధరించాడు బిహారి. రాజలక్ష్మి అతణ్ణి కూర్చొనమని తిన్నగా సంజ్ఞ చేసింది. అతడు కూర్చొన్న తర్వాత "క్షేమంగా వున్నావా బిహారీ? ఎన్నాళ్ళకు కనబడ్డావు?" అన్నది మెల్లగా.

"అమ్మా, నీకు జబ్బుచేసిన సమాచారం నాకు ఎందుకు తెలుపలేదు? ఈ విషయం నాకు తెలిస్తే నే నిక్కడికి రావడానికి ఘడియ ఆలస్యం చేసేవాణా?"

రాజలక్ష్మి మృదుస్వరంతో — "అదినాకు తెలియదా నాయనా? నిన్ను నేను నాకడుపులో వుంచుకొనలేకపోయాను; కాని ఈ ప్రపంచంలో నాకు నీకంటే ముఖ్యబంధువులులేరు!" అన్నది.ఇలా అంటూవుండగా ఆమె కళ్ళనుండి నీటిబిందువులు రాలుతున్నాయి.

బిహారి వెంటనేలేచి అల్మెరాలోవున్న మందుసీసాలు పరీక్షించే మిషతో తనలో పెల్లుబికిన దుఃఖాన్ని సమాళించుకొన్నాడు. తిరిగివచ్చి ఆమెనాడిని చూడడానికి ప్రయత్నించాడు. "నా నాడి చూడడం అలావుంచు; నీవు ఇలా రోగిష్టిలాగా అయిపోయావేమిటి?" అని అడిగి రాజలక్ష్మి బలహీనమైన తనచేతిని పైకెత్తి బిహారినెత్తిమీద నిమురడం మొదలుపెట్టింది.

బిహారి:— నీచేతి కబళం తిననిదే నా శరీరంలోని యెముకలు యెంతమాత్రము పూడడంలేదు. నీవు త్వరత్వరగా కోలుకో అమ్మా, నేనీలోగా వంటకాల యేర్పాట్లు చేసి వుంచుతాను.

రాజలక్ష్మి నవ్వును ఆపుకొంటూ "త్వరత్వరగా ఏర్పాట్లు చెయ్యినాయనా — ఐతే వంట ప్రయత్నాలు మాత్రంకాదు." అన్నది. తర్వాత బిహారి చెయ్యిపట్టుకొని "బిహారీ, యికనీవు పెళ్ళిచేసుకో నాయనా. యింట్లో నిన్ను చూచేవారు, నీమాట వినేవారు, నీసేవ చేసేవారు యెవ్వరూ లేరు. అమ్మాయ్, అన్నపూర్ణా, యిప్పుడిక బిహారికి పెళ్ళి చెయ్యాలి-అబ్బాయిముఖం ఎలావుందో చూడలేదూ!" అన్నది.

అన్నపూర్ణ:— అక్కా, నీవు త్వరగా ఆరోగ్యవంతు రాలవుకా. ఇది నీవు చేయాలిసినపని. వాడి భారమంతానీదే. మేమంతా చూచి ఆనందించే వాళ్ళమే!

రాజ:— ఈవిధంగా చేయడానికి నాకు అవకాశం లేదు అన్నపూర్ణా. బిహారిని నీకు అప్పగిస్తున్నాను. వీడి మంచిచెడ్డలు నీవేచూడాలి. నేను వీడిఋణం తీర్చుకొనిపోలేక పోయాను – కాని భగవంతుడు తప్పక వీడికి మేలుచేయగలడు.

ఇలాఅని ఆమె తనకుడిచేతితో బిహారితలమీదనిమిరింది.

ఆశ ఆగదిలో వుండలేక యేడవడానికి బయటికి వెళ్ళి పోయింది. అశ్రుపూరిత నేత్రాలతో బిహారివైపు చూచింది అన్నపూర్ణ. రాజలక్ష్మికి వెంటనే యేవిషయం జ్ఞాపకానికి వచ్చిందో "అమ్మాయీ, ఆశా!" అని పిలిచింది.

"బిహారి భోజనానికి కావలసిన ఏర్పాట్లన్నీ చేశావా?" అని ఆశ గదిలోకి రాగానే అడిగింది రాజలక్ష్మి.

బిహారి:— నీ యీ కడుపాశగల బిడ్డను అందరూ కనిపెట్టేవున్నారు. నేను వాకిట్లోకి రాగానే పనివాడు బజారు నుండి అనేక రకాలైన కూరలు పళ్ళు యింకా యితర సామా నులు తీసుకొని వస్తూవుండగా చూచాను. ఈ యింట్లో నా పేరుప్రతిష్ఠలు దెబ్బతినలేదని గ్రహించగలిగాను. – ఇలాఅని నవ్వుతూ ఆశవైపు చూచాడు బిహారి.

ఇవాళ ఆశ సిగ్గుపడలేదు. ఆమె స్నేహపూర్ణమైన చిరునవ్వుతో బిహారి పరిహాసాన్ని అభినందించింది. బిహారి ఈ యింటికి యెలాంటి హితచింతకుడో ఆశ మొదట గ్రహించ

లేదు. అనేకసార్లు బిహారిని పనిపాటలు లేకుండా వచ్చే మనిషి క్రింద జమకట్టి చులకనగా చూచింది ఆశ. అనేకసార్లు బిహారి విషయంలో ఆమె ప్రవర్తనద్వారా ఆమె విముఖభావాలు స్పష్టంగా కనిపించాయి. ఆ పశ్చాత్తాపంవల్ల ఈవేళ అతని మీద శ్రద్ధ కరుణలు యెక్కువైనాయి.

రాజలక్ష్మి:— అన్నపూర్ణా, ఇది వంటకత్తెవల్లకాదు. నేటి వంటపని నీవు స్వయంగా నిల్చొని తయారుచేయించాలి. నా యీ పల్లెటూరి పిల్లవాడు మరెన్ని మంచి వంటకాలు లేనిదే కడుపునిండా తినడు.

బిహారి:— అమ్మా, నీ పుట్టిల్లు ఉన్నావ్ జిల్లాలోని ఒక పల్లెటూరు. కచ్చితంగా పట్టణంలో నివసించే పెద్దమనిషి ముద్దుబిడ్డని పల్లెటూరివాడంటున్నావా? ఇది నేను సహించను.

ఈ మాటమీద చాలాసేపు నవ్వుతూ, తుళ్లుతూ గడిచిపోయింది. చాలా దినాలు ఉదాసీనంగావున్న మహేంద్రుని యిల్లు నేడు కొంచెం కళకళలాడుతూ వుంది.

ఇన్ని సంభాషణలు జరుగుతున్నా ఏ విషయంలోనూ మహేంద్రుని పేరుకూడా యెత్తినవారు లేరు. ఇంతకుముందు రాజలక్ష్మి బిహారితో ఎప్పుడు మాట్లాడినా మహేంద్రుని గురించి చాలా చాలా మాట్లాడుతూవుండేది. ఈ విషయంలో మహేంద్రుడే ఒకసారి తల్లిని యెగతాళిచేశాడుకూడా. అటువంటి ఆమెకూడా ఈవేళ తన నోటితో మహేంద్రుని ప్రస్తావనైనా తేకపోయేసరికి బిహారి ఆలోచనలో పడిపోయాడు.

రాజలక్ష్మి ఒక్కకునుకు తీసింది. అప్పుడు బయటికి వచ్చి "అమ్మజబ్బు సామాన్యమయిందికాదు." అని అన్న పూర్ణతో అన్నాడు బిహారి.

"అది స్పష్టంగా కనిపిస్తూనేవుంది." అని చెప్పి అన్నపూర్ణ ద్వారందగ్గరగా వసారాలో కూర్చొంది. కొంత సేపాగి "బిహారీ, ఇప్పుడు నీవు మహేంద్రుని పిలుచుకొని రావాలి. ఆలస్యం చేయడం మంచిదికాదు." అన్నది.

బిహారి కొంచెంసేపు మానంగావుండి "నీ ఆజ్ఞ ప్రకారమే చేస్తాను పిన్నమ్మా. అతని చిరునామాగాని నివాసంగాని యెవరి కైనా తెలుసా?" అన్నాడు.

అన్నపూర్ణ:— ఎవ్వరికీ పూర్తిగా తెలియదు. వెదకి తీసుకరావలసిందే; అంతకంటె సులవైన మార్గంలేదు. బిహారీ, మరొకవిషయం, చున్నీ ముఖంవైపుచూచావా? వినోదిని చేతుల్లోనుండి నీవు మహేంద్రుని విడిపించకపోతే యిక ఆమె బ్రతుకజాలదు. మృత్యుదేవత దానిహృదయంలో శర ప్రయోగంచేసినట్లు దానిముఖంచూస్తే నే కనుపిస్తూవుంది!

'ఇతరులను రక్షించడానికి నేను వెళ్ళుతున్నాను, ఆరి భగవంతుడా, నన్నెవరు రక్షిస్తారు?' అని తనలోతాను నవ్వు కొన్నాడు బిహారి.

బిహారి:— వినోదిని ఆకర్షణనుండి శాశ్వతంగా మహేం ద్రుని అడ్డగించడానికి నాకు మంత్రాలేమైన వచ్చునా పిన్నమ్మా! అమ్మ జబ్బుగావున్నదికాబట్టి నాలుగుదినాల

పాటు వుంటేవుండవచ్చు; కాని అతడు తిరిగి ఆమెవైపు వెళ్ళ డని యెలా చెప్పగలం!

అదే సమయంలో మాసినబట్టలు కట్టుకొని, సగంవరకు ముసుగు కప్పుకొనివచ్చి, పిన్నమ్మ పాదాలవద్ద కూర్చొంది ఆశ. బిహారి అత్తగారివిషయమై మాట్లాడుతున్నాడని వూహించి వినవలెననే కోరికతో ఆమె వచ్చింది. పతివ్రతయైన ఆశముఖంలో నిస్తబ్ధంగా కనిపించే దుఃఖఛాయలనుచూచి, బిహారి మనసులో అపూర్వమైన భక్తిభావం వుదయించింది. శోకసంతప్తమైన తీర్థజలంలో స్నానమాడిన యీ యువతి పూర్వయుగాలలోని దేవతలలాగా శాశ్వత గౌరవాన్ని పొందింది. ఇప్పుడీమె సాధారణ స్త్రీకాదు — పురాణాల్లో వర్ణించినట్లు దారుణమైన దుఃఖానుభవంపొందిన పతివ్రతా స్త్రీల స్థానాన్ని పొందింది.

రాజలక్ష్మి పథ్యపానాల విషయంలో - మందు విష యంలో బిహారి ఆశకు సలహానిచ్చి పంపినతర్వాత ఒక నిట్టూర్పువిడిచి — "మహేంద్రుని నేను రక్షిస్తాను." అన్నాడు అన్నపూర్ణతో.

బిహారి మహేంద్రుని బ్యాంకుకువెళ్ళి విచారించి కొన్ని దినాలనుండి అతడు ఆ బ్యాంకుయొక్క అలహాబాదు బ్రాంచి నుండి ఎకౌంటు ప్రారంభించాడని తెలుసుకొన్నాడు.

# 49

స్టేషన్‌కు వెళ్ళగానే యింటర్‌క్లాసు జనానాబండిలో యెక్కికూర్చొంది వినోదిని. "నీకు రెండవక్లాసు టిక్కెట్టు పుచ్చుకొంటున్నాను, ఇక్కడ కూర్చున్నావేం?" అన్నాడు మహేంద్రుడు.

వినోదిని:— అవసరంలేదు, ఇక్కడ హాయిగావుంది.

మహేంద్రునికి ఆశ్చర్యంకలిగింది. వినోదిని స్వభావ సిద్ధంగా విలాసవతి. ఇంతవరకూ బీదవాళ్ళలాగా వుండడం ఆమెకిష్టంగావుండేదికాదు. తన పేదరికాన్ని ఆమె అవమాన కరంగా భావిస్తూవుండేది. 'నాయింట్లో ధనానికి లోటులేదు, అలంకార సామాగ్రికి కొదువలేదు, కోరిన విలాస సామగ్రు లన్నీ స్వేచ్ఛగా తెప్పించుకోవచ్చు. ధనవంతుణ్ణి కావడంచేత సాధారణవ్యక్తులమధ్య గౌరవింపబడుతున్నాను, పేరు పొందు తున్నాను – ఈ వ్యవహారమంతా చూడడంవల్లనే ఒకనాడు వినోదిని నావైపుకు ఆకర్షించబడ్డది. ఆమె అనాయాసంగా నా ధనసంపత్తికి నా గౌరవప్రతిష్టలకు స్వామినికాగలదు.'— ఈ వూహాలే అతణ్ణి ఎంతో ఉత్తేజపరిచాయి. నేడు మహేం ద్రునిమీద అధికారాన్ని పొందవలసిన సమయంలో, చేజాచి అడుగకనే మహేంద్రుని సర్వసంపత్తిని అనుభవింపగలిగే సమయంలో, ఆమె యిలాంటి అసహ్యాకరమైన వుపేక్షతో, ఒకవిధమైన గర్వంతో — దుఃఖకరమూ, లజ్జాకరమూనైన దైన్యాన్ని యెందుకు స్వీకరిస్తూవుంది? ఆమె మహేంద్రుని

మీాద తాను ఆధారపడి ఉండడాన్ని — తన నమ్మకాన్ని వీలైనంతగా తగ్గించుకొనడానికి ప్రయత్నిస్తూవుంది. స్వాభావ సిద్ధమైన తగిన ఆశ్రయమునుండి — ఆమెను శాశ్వతంగా భ్రష్టురాలినిగాచేసిన ఉన్మత్త మహేంద్రునినుండి తన యీా సర్వనాశన మూల్యాన్ని లెక్కగట్టడానికి ఉపకరించే యే వస్తువును ఆమె అపేక్షించడంలేదు — అంగీకరించడంలేదు. వినోదిని మహేంద్రుని యింట్లోవుండే దినాల్లో తన ప్రవర్తన విషయంలో, తన వైధవ్యవ్రతపాలనంలో ఇంత కఠినంగా కనిపించలేదు. ఐతే ఇన్నిరోజులు గడిచినతర్వాత ఈవేళ తనను అన్నిసుఖాలనుండి వేరుచేసుకొన్నది. ఇప్పుడామె ఒంటి పూట భోజనం చేస్తూవుంది, ముదుకబట్టలు కట్టుకొంటూ వుంది. ఎల్లప్పుడు యెకచెకాలుగా మాట్లాడుతూవుండే వినోద స్వభావంకూడా మాయమైపోయింది. ఇప్పుడామె ముసుగు ధరించి దూరదూరంగావుంటూ, నిర్లిప్తమై, భయంకర మౌన ధారిణికావడంచేత మామూలు విషయాలలోకూడా ఆమె మీాద ఏమాత్రము వత్తిడి, బలవంతం చేయడానికి సాహసించ లేకుండా వున్నాడు మహేంద్రుడు. అతడు ఆశ్చర్యంతోపాటు అధీరుడై, క్రుద్ధుడై – 'వినోదిని విశ్వప్రయత్నంచేసి, అందని పండునుకోసినట్లు మహోన్నత స్థానంలోవున్న నన్ను తృంపు కొన్నది; కాని తర్వాత వాసనకూడా చూడలేదు; పైగానేను నేలమీాద విసరికొట్టడానికి ప్రయత్నిస్తూవుంది. ఏమిటిదంతా?' —అనే ఆలోచిస్తున్నాడు.

మహేం:— టికెట్ యెక్కడికి తీసుకొనేది?

వినో:— పశ్చిమ ప్రాంతానికి, ఎక్కడకు పోవాలను కొంటే అక్కడికిపద. తెల్లవారగానే బండి యెక్కడ ఆగితే అక్కడే దిగుతాను.

ఉద్దేశ్యరహితంగా యిలా తిరగడం — ఇటువంటి యాత్రలు మహేంద్రునికి యిష్టంలేదు. విశ్రాంతికి ఆటంకం కలుగడాన్ని సహించలేడు. పెద్ద పట్టణాల్లోదిగి, మంచియిల్లు మంచి సామాను సునాయాసంగా పొందాలి. అలా కాకపోతే అతనికి చాలా కష్టంకలుగుతుంది. అతడు కొంపకొంపతిరిగి వెతికేవాడుకాడు. అందువల్ల చాలా బాధపడుతూ—చిరాకు పడుతూవెళ్ళి బండిలో కూర్చొన్నాడు. కొంతసేపటికి ఒకవేళ వినోదిని తనకు చెప్పకుండా — ఏ స్టేషన్‌లోనైనా దిగిపోదు గదా — అనే భయంకూడా కలిగింది.

వినోదిని ఈ విధంగా శనిగ్రహంలాగా అతణ్ణి తిప్పుతూ తాను తిరుగుతూవుంది. ఆమెవల్ల మహేంద్రునికి యెక్కడా విశ్రాంతి లేదు. వినోదినిలో మనిషిని వెంటనే తన చెప్పుచేతల లోనికి తెచ్చుకొనే శక్తివుంది. ఆమె నిముషంలో బండిలో యెక్కే—దిగే స్త్రీలను పరిచయం చేసుకోగలిగేది. ఆమె వెళ్ళ దలచుకొన్న స్థలాలకు సంబంధించిన సమాచారాన్నంతా ముందుగానే సంగ్రహిస్తూవుండేది. ధర్మశాలలో మకాంపెట్టి, అక్కడ చూడదగిన విషయాలన్నింటినీ తిరిగి చూస్తూ వుండేది. వినోదినికి తనతో యే అవసరం కలుగడం లేనందుకు మహేంద్రుడు అవమానపడుతున్నాడు. టిక్కెట్టు కొనడంతప్ప అతనికి వేరే పనేలేదు. మిగత సమయాల్లో అతడి

ప్రవృత్తి అతణ్ణి బాధపెడుతూవుంది - అతడు తన ప్రవృత్తిని బాధిస్తూవున్నాడు. మొట్టమొదట కొన్ని దినాలు అతడు ఆమె వెంట వీధివీధి తిరిగాడు. క్రమంగా యిప్పుడది అసహ్యంగా కనిపించింది. అందువల్ల యిప్పుడు భోజనమైన తర్వాత నిద్రించ డానికి ప్రయత్నిస్తున్నాడు మహేంద్రుడు. యాత్ర చేసే యితర స్త్రీలవెంట ప్రొద్దస్తమానం తిరుగుతూవుంది వినోదిని. తల్లివద్ద అతిప్రేమతో లాలించి పోషింపబడిన పుత్రుడు, యీవిధంగా యిల్లు విడిచిపెట్టి వీధులవెంట తిరుగుతాడని యెవ్వరూ అనుకోలేదు.

ఒకనాడు అలహాబాదు స్టేషనులో వారిద్దరు బండి కొరకు యెదురుచూస్తూవున్నారు; ఏదో ఆకస్మికకారణంవల్ల బండి రావడం ఆలస్యమవుతూవుంది. ఈ మధ్య వస్తూపోతూ వుండే అన్ని బళ్ళలోని యాత్రికులను బాగా పరీక్షిస్తూవుంది వినోదిని. పశ్చిమదేశంలో తిరుగుతూ చూస్తూవుంటే ఆకస్మి కంగా యెవరో దొరుకుతారని ఆమె ఆశిస్తున్నట్లు కనబడుతూ వుంది. నిరంతరం యిరుకువీధిలో—నిర్జనగృహంలో, బంధింప బడినట్లు, పనిపాటలు లేకుండా అణగిపడి చచ్చేకంటే, నిత్యం యేదో పనిపాటలలో మునిగివున్న ఆ విశాలవీధులలోని జన కోలాహలంలోనే గొప్ప శాంతి వున్నదని కనీసం ఆమె అను కొంటునట్లుగావుంది. వినోదిని దృష్టి ఆస్టేషన్‌లోవున్న ఒక అద్దాలపెట్టెమీద ఆకస్మికంగా పడింది. అది పోస్టాఫీసుకు సంబంధించినపెట్టె. దానిలో చిరునామా తెలియనివారిజాబులు వరుసగా అమర్చబడి వుంటాయి. ఆ బాక్సులోవున్న

ఒక జాబుమీద బిహారి పేరు వ్రాయబడివుంది.'బిహారీలాల్' అనే పేరు అసాధారణమైన దేమీకాదు. ఈ జాబులోని 'బిహారి'యే వినోదిని వెతికే 'బిహారి' అనుకోడానికి తగిన కారణమేదీ లేక పోయినప్పటికీ, అతని పూర్తి పేరు చూడగానే యిది ఆ బిహారి జాబేనని నిశ్చయించుకొంది. జాబుమీది అడ్రసు జ్ఞాపకం వుంచుకొంది వినోదిని. మహేంద్రుడు ఒక బెంచిమీద చింతిస్తూ కూర్చొన్నాడు. వినోదిని అతనివద్దకు వెళ్ళి "కొన్ని దినాలపాటు అలహాబాదులోనే వుందాము." అన్నది.

వినోదిని తన యిష్టప్రకారం మహేంద్రుని త్రిప్పుతూ వుందేకాని, అతని ఆకలిగొన్న అతృప్తహృదయానికి కొంచెం కూడా మేత వేయడంలేదు. ఇందువల్ల అతని పౌరుషాభి మానానికి దెబ్బతగిలి, అతని హృదయం ద్రోహచింతతో నిండి పోతూవుంది. అలహాబాదులో కొన్నిదినాలుగడిపి విశ్రాంతి పొందే అవకాశంలభిస్తే తన ప్రాణాలు కుదుటపడుతాయనే భావిస్తున్నాడు మహేంద్రుడు. ఈ విషయం ఆతనికోరికకు అనుగుణంగానే వున్నప్పటికీకూడా, దీనిని వినోదిని తనకోరికగా చెప్పడంతోనే మహేంద్రుని విద్రోహాత్మ అందుకు ఎదురు తిరిగింది. "ప్రయాణమై స్టేషనుకువచ్చి తిరిగి వెళ్ళడమేమిటి? నేను వెళ్ళిపోతాను." అన్నాడు కోపంతో.

"నేనురాను, ఇక్కడే వుంటాను." అన్నది వినోదిని.

"ఐతే నీవు వంటరిగావుండు, నేను వెళ్ళుతున్నాను."

"సరే, అలాగే." అని, వినోదిని వెంటనే కూలీనిపిల్చి తనపెట్టె - పరుపు వాని నెత్తిమీదపెట్టి స్టేషన్ వెలుపలికి వెళ్ళిపోయింది.

మహేంద్రుడు పురుషకర్తృత్వాధికారంతో పౌరుషంగా బెంచిమీద కూర్చొన్నాడు; అతని ముఖం నల్లగా పొగచూరినట్లయిపోయింది. వినోదిని కనిపిస్తున్నంతవరకు స్థిరంగా కూర్చొన్నాడు; కాని, ఆమె తనవైపు కన్నెత్తి కూడా చూడకుండా స్టేషనుబయటకు వెళ్ళిపోగానే మహేంద్రుడుకూడా త్వరత్వరగా కూలీనెత్తిన సామాను యెత్తించుకొని, చరచరా ఆమె వెళ్ళినదిక్కుగానే బయలుదేరాడు. బయటికివచ్చి ఆమెవొక గుర్రపుబండిమీదకూర్చొని వుండగా చూచాడు. మరేమీ మాట్లాడకుండా వెంటనే తన సామాను కూడా ఆ బండిలోనే పెట్టించి, బండివానిప్రక్కనే కూర్చొన్నాడు. తన అభిమానాన్ని కోల్పోవడంవల్ల బండిలోపల వినోదినియెదుట కూర్చొనడానికి అతనికి ముఖం చెల్లలేదు.

బండి నేరుగా వెళ్ళిపోతూవుంది, ఒకగంట గడిచింది, పట్నం దాటిపోయింది, పొలాలు కనుపిస్తున్నాయి. బండి యెక్కడికి వెళ్ళుతున్నదని బండివానిని అడుగడానికి చిన్నతనంగావుంది మహేంద్రునికి. బండివాడు — లోపలవున్న ఆడమనిషే యజమానురాలు — అనుకొంటాడేమోనని అతని భయం. అందువల్లనే ఆ బండివాడుకూడా 'ఎక్కడికి వెళ్ళాలి?' అని ఈ అనావశ్యక వ్యక్తిని ప్రశ్నించలేదు. తన రోషపూర్ణ

మైన అభిమానంతో లోలోపల కుతకుతవుతుకుతూ మాట్లాడ కుండా కోచ్ బాక్సుమీద కూర్చొన్నాడు మహేంద్రుడు.

యమునానది వొడ్డున, ప్రశాంతస్థలంలో, ఒకమంచి తోటమధ్యకువెళ్ళి ఆగిందిబండి. మహేంద్రునికి చాలా ఆశ్చర్యం కలిగింది. ఇదెవరితోట? దీని సమాచారం వినోదినికి యెలా తెలిసింది?

తోటలోవున్న భవనంతలుపు మూయబడివుంది. పిలువగా పిలువగా ఒక వృద్ధబ్రాహ్మణుడు వెలుపలికివచ్చి "ఈ తోటయజమాని చాలా దగ్గరలోనే నివసిస్తూంటారు. వారి అనుమతిపొందితే మీరు ఈ తోటలో వుండవచ్చు." అని చెప్పాడు.

మహేంద్రునివైపు చూచింది వినోదిని. ఆ అందమైన యింటిని ఆ తోటనుచూచి అతనికికూడా వుండవలెనని ఆశ పుట్టింది. చాలా దినాలనుండి తిరుగుతూవున్నందువల్ల కొంత కాలం విశ్రాంతి తీసుకొనవలెననేకోరిక మహేంద్రునికికూడా కలిగింది. — "అయితే యజమాని యింటికి వెళ్ళుదాంపద. నీవు వెలుపల బండిలోనేకూర్చొనివుండు, నేను లోపలికివెళ్ళి యజమానితో అద్దె మాట్లాడుకొనివస్తాను." అన్నాడు.

వినోదిని:— ఇక నేను తిరుగలేను. మీరేవెళ్ళండి, నేనంతవరకు విశ్రాంతి తీసుకొంటాను. ఇక్కడ వంటరిగా వుండేవిషయంలో భయమంద నవసరంలేదు.

మహేంద్రుడు బండి తీసుకొనివెళ్లాడు. వినోదిని వృద్ధ బ్రాహ్మణునిపిల్చి, అతని పిల్లా - జల్లా విషయాలు ప్రస్తావించి

మీరు ఏ బ్రాహ్మణులు, మీకు ఎంతమందిబిడ్డలు, ఎక్కడ నౌకరి చేస్తున్నారు, మీ కుమార్తెలను ఏవూళ్ళోయిచ్చారు, వగైరా సమాచారాలు అడుగుతూవుంది. ఆవృద్ధుని భార్య చనిపోయినదనే విషయంవిని "అయ్యో! మీకు యెంతకష్టం కలిగింది, ఈ వయస్సులో మీరు వంటరిగా వుండిపోయారు, మిమ్మల్ని చూచేవారు, మీమాట వినేవారు, మీసేవచేసేవారు యెవ్వరూ లేకపోయారే!" అన్నది కరుణాపూర్వకంగా.

అటుతర్వాత మాటలమధ్య — "ఇక్కడ బిహారి బాబుగారు వుండేవారుకదూ?" అని అడిగింది.

"అవును, కొన్నిదినాలువున్నారు! అమ్మా, తమరు వారి నెరుగుదురా?"

"వారు మా బంధువులు."

వృద్ధునివల్ల వినోదిని తెలుసుకొన్నదానినిబట్టి 'ఈ బిహారియే అత'డని నిశ్చయించుకొంది. వినోదిని వృద్ధునిచేత తలుపుతీయించి బిహారి యెక్కడకూర్చొనేవాడు, యెక్కడ పడుకొనేవాడని అతణ్ణిఅడిగి కావలసిన సమాచారమంతా తెలుసుకొన్నది. అతడు యిక్కడినుండి వెళ్ళినప్పటినుంచి తలుపులు మూసేవున్నాయి. కనుపడకపోయినా బిహారి ఇక్కడ వున్న సూచనలు యింటినిండావున్నాయి. ఆ సూచనలను అచ్చటిగాలి యెగురగొట్టలేకపోయింది. వానిని మనస్ఫూర్తిగా ఆఘ్రాణించి తనహృదయాన్ని నింపుకొంది — అక్కడకూడిన గాలిని తన అవయవాలకు రుద్దుకొంది; కాని బిహారి ఎక్కడికి వెళ్ళాడో తెలియలేదు. అతడు తిరిగి యిక్కడికి వస్తాడో

లేదో స్పష్టంగా తెలియడంలేదు. ఈ విషయం మా యజమానిని అడిగి నీకు అన్నివిషయాలు తెలియజేస్తానని హామీ యిచ్చాడు వృద్ధబ్రాహ్మణుడు.

అడ్వాన్సు బాడుగయిచ్చి, వుండడానికి అనుమతి తీసుకొని వచ్చాడు మహేంద్రుడు.

## 50

**హి**మాలయ పర్వతశిఖరం తన మంచుగడ్డలను కరిగించి యమునానదిలోనికి ప్రవహింపజేసే జలప్రవాహం అనంతమైనట్లు, ప్రాచీన అర్వాచీన కవులందరుకలసి యమునలో ప్రవహింపజేసిన కవితాస్రోతలుకూడా అక్షయమైనవి. ఈ కవితాస్రోతలనుండి ప్రభవించిన కలధ్వనులలో ఎన్నో విచిత్రగీతాలు ప్రతిధ్వనిస్తున్నాయి. దానితరంగాలుచేసే మనోహరనృత్యంలో యుగయుగాలనుండి పులకరించిన భావస్రవంతులు పరవళ్ళు త్రొక్కుతున్నాయి.

సాయంకాలం ఆ యమునానది ఒడ్డుకు వెళ్ళి కూర్చొన్నాడు మహేంద్రుడు. అప్పుడు ఘనీభూతమైన ప్రేమావేశం అతని దృష్టిలో, శ్వాసలో, రక్తనాళాల్లో, ఎముకల్లో ప్రగాఢమైన మోహారసాన్ని ప్రవహింపజేసింది. ఆకాశంలో అస్తంగతుడవుతున్న దినకరుని అరుణకిరణాలనే బంగరువీణ, వేదనారూపమైన "మూర్ఛన"లో యెన్నడూ యెరుగని ఒక విలక్షణమైన స్వరాన్ని ఝుంకారంచేసింది.

దిననాథుని దీప్తులు ఆ నిర్జనమూ విశాలమూనైన యిసుక మైదానంలో తమ చిత్రవిచిత్రాలైన వర్ణసమూహా లను ప్రదర్శించి తిన్నతిన్నగా అదృశ్యమైనాయి. మహేంద్రుని మనస్సు కావ్యలోకంలోకి వెళ్ళింది. అతడు కళ్ళు మూసుకొని గోవులగిట్టలనుండి ధూళిపైకి లేస్తున్నట్లు, చీకటిపడుతున్నట్లు, ఆవులు బృందావనంనుండి "అంభా"యని అరుస్తూ తమ స్వస్థానాలకు తిరిగి వెళ్ళుతున్నట్లు చూస్తున్నాడు.

వర్షాకాలపు మేఘాలు నభోమండలాన్ని చుట్టివేశాయి. తనకు యెన్నడూ పరిచయంలేని స్థానంలోని ఆ యంధకారం నల్లని తెరలాగా మాత్రమే కాకుండా యింకా ఆనేక రహ స్యాలతో నిండినట్లుగా కనిపిస్తూవుంది. ఆ యంధకారంలో నుంచి కనిపించే ప్రకాశరేఖలు, ఆకారాలు, అతనికి అర్థం కాని ఏదో మౌనపరిభాషలో మాట్లాడుతున్నాయి. ఆవలి యొడ్డునవున్న యిసుకనేలలోని అర్థంకాని మసకదనం, అలలు లేని నీళ్ళలోని సిరాలాంటి నల్లదనం, అచ్చటితోటలో ఘనీ భూతమైన ఆకులతో గుబురుగుబురుగావున్న వేపచెట్లలోని నిస్తబ్ధత, వృక్షాలు లేక ఆ మలుపుతిరిగిన నదీతటంలోని వక్ర రేఖ, యివన్నీకూడా ఆయాషాఢ సంధ్యాసమయంలో ఫలానా యని తెలియరాని అస్పష్టమైన ఆకారాలతో నలుదిక్కుల నుండి మహేంద్రుని ముట్టడించాయి.

అప్పుడు అతనికి కావ్యాలలో చదివిన వర్షఋతువు లోని 'అభిసారం' జ్ఞాపకానికివచ్చింది. ఇంటినుండి బయలుదేరి వచ్చింది 'అభిసారిక'; యమునానది ఆవలిగట్టున ఒంటరిగా

నిల్చొనివుంది. నదిని దాటడమెలా? – "యమున దాటించండి యేరైనగాని" – ఈకేక మహేంద్రుని హృదయంలోకి ప్రవేశించింది – "యమున దాటించండి యేరైనగాని."

ఈ 'యభిసారిక' నదికి ఆవలిగట్టున అంధకారంలో చాలా దూరంగా వున్నప్పటికీకూడా స్పష్టంగా ఆమెను చూచాడు మహేంద్రుడు. ఆమె కాలభేదంగాని, వయోభేదం గానిలేని అనాది గోపబాలిక యైనప్పటికికూండా, మహేంద్రుడు ఆమె తన వినోదినియేనని గుర్తించాడు. ఆమె తన విరహాన్నంతటినీ, వేదననంతటినీ, యవ్వన భారాన్నంతటినీ వెంట తీసుకొని యెప్పుడీ అభిసారయాత్రకు బయలుదేరిందో, ఎన్ని గీతాలలోనుంచి – ఎన్ని పద్యాలలోనుంచి ఈనాటికి కాల వాహినియొక్క ఈ ఒడ్డునదిగిందో; ఈవేళ ఈ జనహీనమైన యమునాతీరానికి పైగానున్న ఆకాశంలో "యమున దాటించండి యేరైనగాని" అని ఆమె కంఠధ్వనియే వినిపిస్తూవుంది. ఒడ్డుచేర్చేనావకొరకు ఆమె ఈ అంధకారంలో యెంతవరకు నిల్చివుండగలదు?—"యమున దాటించండి యేరైనగాని."

మేఘాలలో ఒకప్రక్క కొంచెం తెరపియిచ్చింది. కృష్ణపక్ష తదియ చంద్రుడు కనిపించాడు. మయామయమైన ఆ వెన్నెలమంత్రంతో ఆ నది, దానితీరము, ఆకాశము దాని అంచులు, పృథ్వినుండి చాలా దూరమువరకు వెళ్ళిపోయినవి. వానితో మనుష్యునికి యేమాత్రము సంబంధం లేకుండా పోయింది. ఎడతెగని కాలప్రవాహం విచ్ఛిన్నమయింది — భూతకాలికమైన యితిహాసమంతా లుప్తమైపోయింది, భవిష్య

త్కాలంలోని ఫలాఫలాలు అంతర్హితమైపోయినవి. రజిత ధారలచే తడుపబడిన కేవలం ఈ వర్తమానకాలం మాత్రమే, యమునాస్రవంతిని, దాని తీరాన వినోదినీ-మహేంద్రులను పెట్టుకొని, విశ్వసృష్టికి వెలుపల చిరస్థాయిగావుంది. మహేంద్రుడు మోహాతురుడైపోయాడు. వినోదిని తనను స్వీకరించకపోతుందనీ—ఈ వెన్నెలరాత్రిలోని ఈ నిర్జనస్వర్గఖండాన్ని లక్ష్మీరూపంలో అన్నివిధాల సుసంపన్నంగా చేయకపోతుందనీ — అతడు వూహింపలేకపోయాడు. వెంటనే లేచి వినోదినిని వెదకుతూ యింటివైపు బయలుదేరాడు.

పడకగదిలోకి వెళ్ళి చూచాడు, యిల్లాంతా పుష్ప పరిమళంతో నిండిపోయింది. తెరచిన ద్వారంగుండా వెన్నెలకాంతులు పరుపుమీద పడుతున్నాయి. తోటలోని పుష్పాలను తెచ్చి చాలా మాలలుకట్టింది వినోదిని. ఆమాలలలో కొన్నింటిని తలలో పెట్టుకొంది, కొన్ని మెడలో వేసుకొంది, కొన్ని గదిలో వ్రేలాడగట్టింది. పుష్పాలతో అలంకరించుకొని, వసంతకాలంలో పుష్పాల భారంతో వంగినలతలాగా వెన్నెలలో పరుపుమీద పడుకొనివుంది.

మహేంద్రుని మోహం ద్విగుణీకృతమయింది.

“వినోదినీ, నేను యమునానదిబడ్డున కూర్చొని, నీకొరకు యెదురు చూస్తున్నాను. ఆకాశంలోని చందమామ నీవు యిక్కడవుండి నా రాక కెదురుచూస్తున్నావని చెప్పాడు. అందువల్ల వచ్చాను.” అని చెప్పి అతడుకూడా పరుపుమీద కూర్చోడానికి ముందుకు సాగాడు.

వినోదిని వెంటనే అదరిపడి లేచి కూర్చొని "వెళ్ళు వెళ్ళు, నీవు ఈ పరుపుమీద కూర్చోవద్దు." అని తన కుడి చేతితో వారిస్తూ చెప్పింది.

గాలిచే నిండిన 'తెరచాప'వల్ల బహువడిగా పోతూ వున్న నావ లోతులేని నీటిలో నేల తగిలి ఆగిపోయింది— మహేంద్రుడు స్తంభీభూతుడై నిలబడిపోయాడు. చాలాసేపటి వరకు అతని నోటినుండి మాట రాలేదు. ఇక ఆపినా మహేం ద్రుడు ఆగడేమోననే భయంచేత ఆమె ప్రక్కమీదినుండిలేచి దూరంగా వెళ్ళి నిల్చొంది.

"ఐతే నీవు యెవరికొరకు ఈ శృంగారము ఈ అలంకర ణమూ చేశావు? యెవరికొరకు యెదురుచూస్తున్నావు?"

"ఎవరికొరకు శృంగారమంతా చేశానో అతడు నా హృదయంలోనే వున్నాడు." అని గుండెలమీద చెయ్యిపెట్టు కొని అన్నది వినోదిని.

"అతడెవరు? — బిహారియా?"

"వారిపేరు నీనాల్కతో వుచ్చరింపవద్దు!"

"వాడికొరకే నీ వీ ప్రాంతంలో తిరుగుతున్నావా?"

"అవును, వారికొరకే."

"వాడికొరకే యిక్కడ నిరీక్షిస్తున్నావా?"

"అవును."

"వాడెక్కడవున్నాడో తెలుసునా?"

"తెలియదు, కాని ఏదోవిధంగా జాడతీస్తాను."

"ఏవిధంగానైనా వాడిజాడ నీకు తెలియకుండా చేస్తాను"

"అతనిజాడ నాకు తెలియకుండా నీవుచేస్తే చేయవచ్చు, కాని అతణ్ణి నా హృదయంనుంచి ఏవిధంగాకూడా తొలగించ లేవు." ఇలాఅంటూ కళ్ళుమూసుకొని తనహృదయంలో బిహారిని అనుభవించింది.

ఆ పుష్పాభరణభూషితురాలు, విరహవిధురరూపిణి యైన వినోదినివల్ల ఒకసారి ఆమెవైపుకు అనంత వేగంతో ఆకర్షితుడై, తిరిగి వెంటనే తిరస్కృతుడు కావడం చేత ఒక్కసారిగా విశ్వరూపం దాల్చాడు. మహేంద్రుడు. అతను తన రెండుపిడికిళ్ళు బిగించి "ఖడ్గంతో నీ హృదయాన్ని చీల్చి అతణ్ణి బయటికి లాగుతాను." అన్నాడు.

వినోదిని యెంతమాత్రమూ చలించలేదు. "నీప్రేమ కంటే నీ ఖడ్గమే నా హృదయంలో సులభంగా ప్రవే శిస్తుంది." అన్నది.

"నీవెందుకు భయపడడంలేదు, నిన్ను యిక్కడ రక్షించేవారెవరు?"

"నీవే రక్షిస్తావు. నీనుండికూడా నీవే నన్నురక్షిస్తావు."

"ఇంతశ్రద్ధ, ఇంతవిశ్వాసం యింకా మిగిలివుందా?"

"అలాకాకపోతే నేను ఆత్మహత్య చేసుకొని మరణించే దానినే, నీవెంట వెలుపలికి వచ్చేదాననేకాదు."

"నీవు యెందుకు చావలేదు! నా కంఠంలో యిలాంటి విశ్వాసపు పుర్రితాడువేసి, దేశ దేశాంతరాలకు యీడ్చుకొని

వచ్చి, నన్ను యెందుకుచంపుతున్నావు? ఆలోచించుకో, నీవు చచ్చిపోతే, యెంతక్షేమంగా — యెంత మంగళకరంగా వుంటుందో!" '

"ఇదినాకుతెలుసు, బిహారీనిగురించిన ఆశతొలగనంత వరకు నేను మరణింపజాలను."

"నీవు చావనంతవరకు నా ఆశకూడాచావదు, ఈ ఉచ్చులోనుంచి నేను విముదలకూడా పొందలేను. ఈవేళనుండి నేను హృదయపూర్వకంగా భగవంతుని యెదుట నీవు చావాలని ప్రార్థిస్తుంటాను. నీవు నాదానవూ కావద్దు, బిహారీదానవూ కావద్దు. నీవువెళ్ళు, నాకు విముక్తి కలిగించు. నాతల్లి ఏడుస్తూవుంది, నాభార్య ఏడుస్తూవుంది. వారి అశ్రువులు అచ్చటినుండియే నన్ను దహించివేస్తున్నాయి. నీవు చావకుండా, నా ఆశకు - ప్రపంచంలోని అందరిఆశకు - అతీతంకాకుండావుంటే, నాకు వారికన్నీరు తుడిచేఅవకాశం కలుగదు!"

ఇలాఅని మహేంద్రుడు వెంటనే ఒక్క ఉరకలో బయటికి వెళ్ళిపోయాడు. వినోదిని తనచుట్టూ కట్టబడివున్న శృంగార సామగ్రినంతా ఛిన్నాభిన్నం చేసివేసింది. ఆమె మాట్లాడకుండా నిల్చొని వెలుపలికి చూస్తూవుంది. అకాశంలో క్రమ్ముకొనివున్న వెన్నెల, తన అమృతమంతా యేమయిందో కాని, శూన్యంగా కనిపిస్తూవుంది. తీర్చి పెంచిన వుపవనమూ, దాని తర్వాత యిసుకగట్టు, అటుపిమ్మట నదిలోని నల్లనినీరు,ఆపైన ఆవలివొడ్డున అస్ఫుటమైన దృశ్యం—అన్నీకూడా ఒక పరిశుద్ధమైన కాగితంమీాద పెన్సిలుతో గీయబడిన రేఖాచిత్రం

లాగా వున్నాయి. అన్నీ నీరసంగాను నిరర్థకంగాను కని పించాయి.

వినోదిని మహేంద్రుని ప్రబలవేగంతో యెలా ఆకర్షించిందో, తీవ్రమైన తుపానులాగా సమూలంగా అతణ్ణి యెలా పెల్లగించివేసిందో, దీనిని అనుభవానికి తెచ్చుకొని ఆమె హృదయం శాంతిని కోల్పోయింది. ఆమెలో ఈశక్తి సంపూర్ణంగా వుంది; ఐతే పూర్ణిమ రాత్రులలో పొంగిన సముద్రంలాగా బిహారి నాయెదుటకు వచ్చి పడకపోవడానికి కారణం? ప్రతిదినమూ ఒక అనావశ్యకమైన ప్రబల ప్రేమప్రతీఘాతం యెదురుగా వచ్చి యెందుకు యేడుస్తూవుంది? — రాదలచుకొన్న యేడుపు ధారాళంగా వచ్చి. ఆమెలోపలనున్న యేడుపునంతా బయటికి యెందుకు వెళ్ళగొట్టదు? ఈ యల్లరినంతా రేపిన ఆమె దీనితో తన జీవితమంతా యేమిచేస్తుంది? ఇక ఆమె ఈ అల్లరినంతా యెలా శాంతింపజేయగలదు?

ఈవేళ తాను అలంకరించుకొన్న పుష్పమాలలమీద మహేంద్రుని పాపదృష్టి పడిందని భావించి, వాని నన్నిటినీ త్రెంచి నలిపి విసరిపారేసింది. ఆమె శక్తిఅంతా వృథా అయింది, పనిఅంతా వృథా అయింది, జీవనమంతా వృథా అయింది. — ఈ తోట, ఈ వెన్నెల, ఈ యమునాతటం, ఈ యపూర్వసుందరమైనపృథ్వి అంతా వృథా అయింది!

ఇంత వ్యర్థమైనప్పటికీ ఆమె వున్నచోటనే వుండిపోయింది! ప్రపంచంచంలోని యే వస్తువూ కొంచెంకూడా మార్పుకాలేదు. ఏమైనా రేపు సూర్యుడు వుదయిస్తాడు!

ప్రపంచం తన అతి చిన్నపనినికూడా మరువదు! చలింపని బిహారి దూరంగా వుండికూడా బ్రాహ్మణబాలునికి 'శిక్షావళి' లోని క్రొత్తపాఠాన్ని బోధిస్తూ వుంటాడు.

అశ్రువులు వినోదిని కళ్ళను చీల్చుకొని బయటికి వచ్చాయి. ఆమె తన సంపూర్ణబలాన్ని సంపూర్ణలాలసను పూర్తిగా వుపయోగించి, ఏ బ్రహ్మాండమైన శిలాఖండాన్ని త్రోస్తూవుంది! ఆమె హృదయం రక్తాన్ని చిమ్మేస్తూవుంది; కాని ఆమె అదృష్టం సూదిమొన మోపినంతకూడా చలించలేదు.

# 51

మహేంద్రుడు రాత్రి నిద్రపోనేలేదు. అతని శరీరం యింకా శిథిలమైపోయింది. ప్రొద్దు పొడిచేముందుగా అతనికి నిద్రపట్టింది. ఎనిమిది, తొమ్మిదిగంటలు కొట్టేసరికి త్వర త్వరగా లేచి కూర్చొన్నాడు. గడచినరాత్రిజరిగిన యేదో అసమాప్తమైన వేదన నిద్రలో లోలోపల సంచారం చేస్తు న్నట్లుగావుంది. మేల్కొనగానే ఆ వ్యథ అతనికి అనుభవానికి రాసాగింది. కొంచెంసేపటిలోనే రాత్రి వ్యవహారం స్పష్టంగా స్ఫురణకువచ్చింది. అతనికి ఆ ప్రాతఃకాలపు యెండలో, కలతనిద్రవల్ల కలిగిన తూగులో, ప్రపంచమంతాకూడా-జీవన మంతాకూడా శిథిలమైపోయినట్లు కనిపించింది. తాను యిల్లు విడిచిపెట్టినందువల్ల కలిగిన క్లేశమూ, కర్తవ్యత్యాగంవల్ల-

ధర్మత్యాగంవల్ల కలిగిన గంభీరసంతాపం, ఈ దేశద్రిమ్మరి జీవితంలోని అశాంతితో కూడిన భారము అతడు తననెత్తిమీద యెందుకు మోస్తున్నాడు! ఈ మోహావేశంవల్ల శూన్యంగా కనిపిస్తున్న ప్రభాతవెలుగులో తాను వినోదినిని ప్రేమించడంలేదని భావించాడు మహేంద్రుడు. వీధివైపు తలయెత్తి చూచాడు, ప్రపంచమంతా నిద్రనుండి మేల్కొని తన పని పాటలవైపు ఆసక్తితో పురోగమిస్తూవుంది. ఆత్మగౌరవాన్ని పాపపంకిలంలో ముంచివేసి, తనకు విముఖురాలైన ఒక్క ఆడుదాని పాదాలవద్ద తన సోమరిజీవితాన్ని శాశ్వతంగా కట్టి పడవేసిన వికటమూఢత్వం మహేంద్రుని యెదుట తేటగా కనిపిస్తూవుంది.

మంచి ఆవేగంతో ఒక ఉచ్ఛ్వాసాన్ని తీసుకొని విడిచిన తర్వాత, హృదయంలో ఒకవిధమైన నీరసం యేర్పడుతుంది. అప్పుడు అలసిపోయిన హృదయం, తన అనుభవాన్ని-తన ఆలోచనలోవున్న విషయాన్ని, కొంతసేపు దూరంగా వుంచవలెనని అనుకొంటుంది. ఆ భావంలో 'పొంగు' వచ్చే సమయంలో అగుడున దాగివున్నబురద యావత్తు బయటికి వస్తుంది; ఇంతవరకు తాను మోహాపడుతున్న వస్తువుమీద అసహ్యం ఏర్పడుతుంది. ఈ విధంగా తన్నుతానే యెందుకు అవమానించుకొంటున్నాడో తెలుసుకొనలేక పోయాడు మహేంద్రుడు. 'నేను అన్నివిషయాలలో వినోదినికంటే గొప్పవాడనై వుండికూడా, అన్నివిధాలైన హైన్యాన్ని, చులకనతనాన్ని అంగీకరించి, అసహ్యాకరమైన భిక్షుకునిలాగా

రాత్రింబవళ్ళు ఆమె వెంట తిరుగుతున్నాను! నా బుర్రలో యిలాంటి వున్మాదాన్ని యే పిశాచం ప్రవేశపెట్టింది!' అని ఆలోచించాడు.

ఈవేళ అతనియెదుట వినోదిని ఒక సాధారణ స్త్రీ మాత్రమే, అంతకంటే మరేమీకాదు. ప్రపంచంలోని సౌందర్యమంతటినుంచి, అన్నినవలలు, నాటకాలనుండి వినోదినికి నలుదిక్కులా చుట్టుముట్టివున్న ఒకవిధమైన సౌందర్య జ్యోతి మాయా మరీచికలలాగా అంతరించి పోగానే ఆమె ఒక సాధారణ స్త్రీ గానే మిగిలిపోయింది — ఆమెలో యే అపురూపమూ — యే విశేషమూ కనిపించలేదు.

ఇప్పుడు యీ నీచమైన మోహజాలంనుండి తనను వేరు చేసుకొని యింటికి తిరిగి వెళ్ళవలెనని తొందపడుతున్నాడు మహేంద్రుడు. అతడి నిజమైన—స్వాంతశాంతి, ప్రేమ, స్నేహం — ఇవి యిప్పుడు మహేంద్రునికి దుర్లభమైన అమృతంలాగా కనిపించాయి. బాల్యంనుండి బిహారికి తనకువున్న బంధుత్వం, అతనివల్ల తనకు లభించే దృఢమైనఆధారం, యిప్పుడు మహేంద్రునికి చాలా విలువగలిగినట్టిదిగా కనిపిస్తూవుంది. 'నిశ్చయమైన గాంభీర్యము, స్థయిర్యము కలిగివున్నదానిలోనికి మానవుడు అప్రయత్నంగా, బాధారహితంగా తనను పూర్తిగా నిమగ్నుణ్ణి చేసుకోగలుగుతాడు—అందువల్లనే మనము దాని గౌరవాన్ని తెలుసుకొనలేము. చంచల కపటవస్తువులతో సంపూర్ణమైన తృప్తిని పొందినాకూడా చిన్నమెత్తు సుఖం కనిపించకపోయినప్పటికీ, అవి మనల్ని తమవెనుక పందెపు,

గుఱ్ఱాలలాగా పరుగెత్తిస్తాయి—అందువల్లనే మనము వాటినే అతికష్టంమీదనైనా సంపాదించగోరుతాము.' అని తనలో అనుకొని, 'ఇవాళే యింటికి వెళ్ళుతాను, వినోదిని వుండదలచుకొన్నచోట ఆమెకు వుండేయేర్పాటుచేసి నేను వెళ్ళిపోతాను.' అనే దృఢనిశ్చయానికి వచ్చాడు మహేంద్రుడు.

"నేను వెళ్ళిపోతాను" అని దృఢంగా వుచ్చరించగానే అతని మనస్సులో ఒక విధమైన ఆనందం కలిగింది. ఇన్ని దినాలుగా తాను భరిస్తూవున్న ద్వంద్వవిచారాల భారం తేలికపడిపోయింది. ఇంతవరకూ, ఇప్పుడు అయిష్టంగా — అసహ్యంగా కనిపిస్తూవున్నదానినే తిరిగి కొంతసేపటికి విధిలేక చేయవలసివస్తూవుండేది. అతడు గట్టిగా అవుననిగాని — కాదనిగాని చెప్పలేకపోయేవాడు. తన అంతఃకరణంలోనుంచి వచ్చిన ఆజ్ఞను బలవంతంగా అణచివేసి మరొకమార్గంగుండా వెళ్ళేవాడు. ఇప్పుడు అతడు 'నేను వెళ్ళిపోతాను' అని ఆవేశంతో అన్నమాటలను — ఇంతవరకు యిటూఅటూ యని వూగుతూ బాధ పడుతూవుండే హృదయం, వున్నదున్నట్లుగానే వెంటనే అంగీకరించి అభినందించింది.

అప్పుడే ప్రక్కమీదినుండి లేచి కాలుచేతులు ముఖం కడుగుకొని వినోదినిని చూడడానికి వెళ్ళాడు. తలుపు మూసి వుంది. తలుపుమీద ఒక్కదెబ్బ కొట్టి "నిద్రపోతున్నావా?" అన్నాడు.

"లేదు, నీవు తక్షణమే వెళ్ళిపో!" అన్నది వినోదిని.

"నీతో కొన్ని విశేషాలు మాట్లాడాలి; నేను చాలా సేపు వుండను."

"నేను యేమాటా వినలేను. నీవు వెళ్ళు, నన్ను బాధించబోకు, నన్ను వంటరిగా వుండనివ్వు!"

ఇంకో సమయంలో అయితే వినోదిని అన్న ఈ మాటలవల్ల అతని ఆవేశం ఇంకా యెక్కువైపోయేది; కాని ఈవేళ అతనికి విపరీతమైన అసహ్యంకలిగింది. ఈ విధంగా ఒక సామాన్య స్త్రీ యెదుట—నన్ను అగౌరవపరచి నెట్టివేయడానికి, "పో, అవతలకిపో!" అని నిందించడానికి ఆమెకు అధికారం లభించేటంత హైన్యంగా ప్రవర్తించాను! ఈ అధికారం ఆమెకు స్వభావజన్యమైనదీకాదు, తగినదీకాదు. ఆమెకు నేనే ఈ అధికారం యిచ్చి ఆమె గర్వాన్ని ఆకాశం అంటేలాగా చేశాను.

ఈ యవమానాన్ని పొందినతర్వాత తనగొప్పదనాన్ని గురించి తనలో ఆలోచించి 'నేను జయిస్తాను; నేను యీామె కట్టినకట్లు త్రెంచుకొని వెళ్ళిపోతాను.' అనుకొన్నాడు.

భోజనమయిన తర్వాత మహేంద్రుడు డబ్బుకొరకు బ్యాంకుకువెళ్ళాడు. అక్కడ డబ్బుతీసుకొని తల్లికి, ఆశకు కొన్ని మంచి మంచి క్రొత్తవస్తువులు కొనడానికి బజారుకు వెళ్ళాడు.

వినోదిని గదితలుపుమీద మళ్ళీ యెవరో దెబ్బకొట్టారు. ఆమె మొదట కోపంవచ్చి పలుకలేదు. మాటి మాటికి అదే పనిగా కొడుతూవుండడంచేత మండిపడ్డది. ఒక్క విసురుమీద

తలుపు తెరచి "నీవు మాటిమాటికి వచ్చి నన్నెందుకు బాధి..." ఆమెమాట యింకా పూర్తికాక మునుపే యెదుట నిల్చొని వున్న బిహారిని చూచింది.

ఇంట్లో మహేంద్రుడు వున్నాడో లేడో తెలుసుకొనడానికి ఒక్కసారి లోపలికి చూచాడు బిహారి. ప్రక్కమీద నేలమీద యెండిన పూలు త్రెంచినమాలలు చెల్లాచెదరుగా పడి వుండడం చూచాడు. అతనిమనసు క్షణంలో వెనుకకు మళ్ళింది. బిహారి దూరంగా వుండగా వినోదిని జీవనయాత్రకు సంబంధించిన సందేహజనకమైన యే చిత్రముకూడా అతని హృదయపటంమీద ప్రతిబింబించివుండ లేదనడానికి వీలులేదు; కాని అతని కాల్పనికమైనలీల, ఆ చిత్రాన్ని మూసివేసి దాని స్థానంలో ఒక ఉజ్జ్వలమైన మోహినీప్రకాశాన్ని నిలిపి వుంచింది. అతడు యీ తోటలో అడుగుపెట్టేసమయంలో ఆ మోహినీప్రకాశానికి యెక్కడ దెబ్బతగులుతుందోననే భయంతో అతని గుండెలు దడదడలాడడం మొదలుపెట్టాయి. అందుకనే అతనిమనస్సు సంకోచిస్తూవుంది. వినోదినివున్న ద్వారంలోకివచ్చి నిలబడగానే బిహారికి ఆదెబ్బ తగులనే తగిలింది.

తన ప్రేమాభిషేకంవల్ల వినోదిని జీవితంలోని కల్మషాన్నంతా సులభంగా కడిగివేయవచ్చునని దూరంగావున్న సమయంలో ఒకప్పుడు అనుకొన్నాడు బిహారి. దగ్గరికివచ్చిచూస్తే, అది అంతసులభంగాలేదని తెలుసుకొన్నాడు. మనస్సులో కరుణవల్ల కలిగిన వేదనాసానుభూతుల్ని, అదాటుగా ఈర్ష్య

తరంగాలు చెలరేగి అణచివేశాయి. బిహారికి వినోదిని కళంకి నిగా కనిపించింది.

బిహారి వెంటనేవెనుకకుతిరిగి "మహేంద్రా, మహేంద్రా," అని కేకవేశాడు.

ఈ యవమానాన్ని లెక్కచేయకుండా వినయంతో కూడిన మృదుమధురస్వరంతో "మహేంద్రుడు లేడు, బజారు వెళ్ళాడు." అని చెప్పింది వినోదిని. బిహారి బయలు దేరబోయాడు. "బిహారిబాబూ, మీ పాదాలమీద పడతాను, కొంచెం మీరు కూర్చోవాలి." అని వినయంతో అన్నది వినోదిని. మనస్సును కలచివేసే ఆ ఘృణితదృశ్యాన్ని చూచి తాను దూరంగా వెళ్ళిపోవాలని, బ్రతిమలాడినా భంగపడినా యెంతమాత్రం అక్కడ నిలవరాదని నిశ్చయించు కొన్నాడు బిహారి. కాని కరుణాజనకమైన వినోదిని కంఠ స్వరాన్ని వినగానే అతనికి కాళ్ళాడలేదు.

"మీరివాళ ఈ విధంగా విముఖులై వెళ్లేటాగుంటే నేను ప్రాణత్యాగం చేస్తాను; మీమీద ఒట్టుపెట్టి చెబు తున్నాను." అన్నది మళ్ళీ వినోదిని.

బిహారి వెనుకకు తిరిగి "వినోదినీ, నేను నీమార్గంలోకి యెన్నడూ రాలేదు! —— నీకష్టసుఖాలలో నేనెన్నడు చెయ్యి పెట్టలేదు! నీవు, నీజీవితంతోపాటు నన్నుకూడా యెందుకు చుట్టచుట్టాలని చూస్తున్నావు?" అన్నాడు.

"నామీద మీరు యెంత అధికారం సంపాదించారో, మీతో ఒకసారి చెప్పివున్నాను, కాని మీరు విశ్వసించలేదు.

ఐనప్పటికీ ఇవాళ మీరు పెడముఖం పెట్టి వున్నాకూడా, ఆమాటే మళ్ళీ అంటున్నాను. మీకు చెప్పుకోడానికి, లజ్జాపూర్వకంగా తెలియజేసుకోడానికి మీరు నాకు అవకాశమే యివ్వలేదు. మీరు నన్ను కాళ్ళతో దూరంగా తన్నిత్రోసి వేసినప్పటికీకూడా నేను మీకాళ్ళమీద పడి చెపుతున్నాను, నేను మిమ్మ్మ—" అని వినోదిని ఇంకా యేదో చెబుతూ వుండగానే, వినోదిని మాటకు అడ్డువచ్చి "ఆమాట యిప్పుడు చెప్పవద్దు, నీ నాలుకమీదికి తేవద్దు! ఆ మాటను విశ్వసించడానికి ఆధారంలేదు!" అన్నాడు బిహారి.

"ఆమాటను సంకుచితబుద్ధిగలవారు విశ్వసింపలేక పోవచ్చు, కాని మీరు విశ్వసిస్తారు. అందువల్లనే కొంచెం కూర్చోవలసిందిగా కోరుతున్నాను."

"నేను విశ్వసించనీ; విశ్వసించకపోనీ, దీనివల్ల వచ్చేది లేదు, పోయేదిలేదు. నీజీవితం యథాపూర్వంగానే జరుగుతూ వుంటుంది."

"మీకు దీనివల్ల వచ్చేది పోయేదిలేదని నాకు తెలుసు. మీసమ్మానం పొంది, దానిని కాపాడుకొంటూ మీయెదుట నిల్చొనడానికి నాకు మరి వుపాయంలేదు; నా అదృష్టమే అలాంటిది. శాశ్వతంగా నేను మీకు దూరంగానే వుండవలసి వస్తుంది. ఐతే నేను యెక్కడైనా వుండనీ, మీరు నన్ను స్నేహపూర్వకంగా స్మరిస్తూ వుండాలనే కనీస కోర్కెను— హక్కును నామనసు మీముందు వదలుకోలేదు. నామీద మీకు కొంచెం శ్రద్ధ కలిగిందని నాకు తెలుసు, దానినే నేను

నా యేకైకఆశ్రయంగా చేసుకొంటాను. ఇందువల్లనే నామాట లన్నింటినీ మీరు వినవలసి వుంటుంది. నేను చేతులు జోడించి ప్రార్థిస్తున్నాను. మీరు కొంచెం కూర్చోండి."

"వీలులేదు, నేను వెళ్ళిపోతున్నాను" అని అక్కడి నుండిలేచి వేరొకచోటికి వెళ్ళడానికి సిద్ధపడ్డాడు బిహారి.

"మీ భావన సరియైనదికాదు. ఈ యింటిని యెవ్వరూ కళంకితంచేయలేదు. ఈ యింటిలో మీరొకనాడు నిద్రించారు; అందువల్ల దీనిని మీకొరకే వుంచివేశాను. ఈవేళ యిక్కడ యెండిపడివున్న పుష్పాలు మీపూజకు వినియోగించినట్టివే. ఈ గదిలోనే మీరు కూర్చోవాలి."

ఈ మాటవిని బిహారి హృదయం పులకరించింది. అతడు గదిలోకివెళ్ళాడు. వినోదిని అతనికి మంచం చూపించింది. బిహారివెళ్ళి మంచంమీద కూర్చొన్నాడు; అతని పాదాలవద్ద నేలమీద కూర్చొంది వినోదిని. బిహారి వ్యాకులుడై లేవబోయాడు. "మీరు కూర్చోండి, నామీదఒట్టు, మీరు లేవవద్దు. నేను మీ పాదాలవద్ద కూర్చొనడానికి యోగ్యురాలను కాను; కాని మీరే దయతో నాకు ఆ స్థానంయిచ్చారు. దూరంగావుండికూడా నేను యీ అధికారాన్ని కాపాడుకొంటాను." అని కొంతసేపు మౌనంగావుండి "మీరు భోజనం చేశారా?" అని అదాటుగా అడిగింది వినోదిని.

"స్టేషన్‌లోనే భోజనం చేసివచ్చాను."

"నేను మా గ్రామంనుండి వ్రాసినజాబును తెరచిచూచి, యే జవాబు యివ్వకుండా మహేంద్రునిచేతికిచ్చి యెందుకు పంపివేశారు?"

"నేనేజాబు చూడనూలేదు పంపనూలేదు. నాకా విష యమేమీ తెలీదు."

"ఇటీవల కలకత్తాలో మీరు మహేంద్రుని కలుసు కొన్నారా?"

"నిన్న మీ గ్రామానికి పంపివచ్చిన తర్వాత ఆ మరు నాడే నేను అతన్ని కలుసుకొన్నాను. అటుపిమ్మట నేను ఈ పశ్చిమ ప్రాంతానికి తిరగడానికి వచ్చివేశాను. మళ్ళీ అతన్ని నేను కలుసుకోనేలేదు."

"అంతకు పూర్వం యేనాడైనా మీరు నాజాబును చదివి జవాబు వ్రాయకుండా వాపసు చేశారా?"

"లేదు, అలాకూడా యెన్నడూ జరుగలేదు."

వినోదిని కొంతసేపు మౌనంగావుండి, ఒక పెద్ద నిట్టూర్పువిడిచి, — "అంతా ఇప్పుడర్థమయింది. ఇక నేను నా కథ చెపుతున్నాను వినండి. మీరు విశ్వసించగలిగితే అది నా అదృష్టంగాభావిస్తాను, లేదా మీ మీద దోషారో పణంచేయను. నన్ను నమ్మడం చాలా కష్టసాధ్యం."

అప్పుడు బిహారీ హృదయం దయార్ద్రమయింది. ఈభక్తి భావపూర్ణమైన వినోదిని పూజలను యే విధంగాకూడా తిరస్క రింపలేక పోయాడు. — "నీవేమీ చెప్పనవసరంలేదు. నీ మాటలు వినకుండానే నేను నిన్ను విశ్వసిస్తాను. నేను నిన్ను

అసహ్యించుకోవడంలేదు. ఇక నీవు ఈ విషయంలో ఒక్క మాటకూడా చెప్పవద్దు."

ఈమాట వినగానే వినోదిని కళ్ళనుండి అశ్రువులు ప్రవహింపసాగాయి. బిహారి పాదధూళిని తన శిరస్సుమీద ధరించి అన్నది—"అన్నిమాటలు చెప్పనిదే నా హృదయం కుదుటపడదు. కొంచెం ధైర్యం వహించి తప్పక వినాలి. మీరు నాకిచ్చిన ఆజ్ఞను శిరసావహించాను. మీరు నాకు ఒక్కజాబుకూడా వ్రాయకపోయినా ఆ గ్రామంలోనివారు చూపిమోపి అనే మాటలు, నిందలు సహిస్తూకూడా అక్కడే నా జీవితం గడుపుకొంటూ వుండేదాన్ని,—మీ స్నేహానికి బదులుగా మీ ఆజ్ఞనే గ్రహించేదాన్ని; కాని విధాతకు అది కూడా యిష్టంకాలేదు. నేను మేల్కొల్పిన పాపం నన్ను దేశబహిష్కారంలోకూడా నిలవనీయలేదు. మహేంద్రుడు మా గ్రామంవచ్చి – నా గుమ్మంలో – అందరియెదుట నన్ను తల యెత్తుకొనకుండా చేశాడు. ఆగ్రామంలో వుండడానికి నాకు స్థలం కరువయింది. మీ యాజ్ఞకొరకు మరొకసారి మిమ్ము బాగా వెతికాను, కాని మీరు దొరకలేదు. ఇదే సమయంలో మీ యింటినుండి తెరచివున్న జాబును తెచ్చి మహేంద్రుడు నన్ను మోసంచేశాడు. మీరు నన్ను సంపూర్ణంగా పరిత్యజించివేశారనే అనుకొన్నాను. ఆ పరిస్థితిలో నేను సర్వనాశనం కావలసినదానినే; ఐతే మీ ప్రభావంవల్ల మీరు దూరంగావుండికూడా మీవాళ్లను రక్షించగలసమర్థులు మీరు. అటువంటి మిమ్మల్ని నేను నా హదృయపీఠంమీద అధివసింప

జేసుకొన్నాను. అందుచేతనే యింతవరకు నా పవిత్రతకు యే భంగమూ కలుగలేదు. ఒకనాడు మీరు నన్ను దూరంగా నెట్టి పడవేసి మీరు నాకిచ్చిన ఆ కఠోర పరిచయం, కఠినమైన బంగారంలాగా-కఠినమైన వజ్రంలాగా నాహృదయంలో అంటి పెట్టుకొని వుంది. ఆ పరిచయమే నన్ను అనంతమూల్యా వంతంగా చేసివేసింది. ప్రభూ, నీ పాదాల సాక్షిగా చెబుతున్నాను, ఆ మూల్యం నష్టంకాలేదు.''

బిహారి మౌనంగా కూర్చొన్నాడు. వినోదినికూడా మరేమీ మాట్లాడలేదు. మూడవజామున యెండ తిన్నతిన్నగా మందగిస్తూవుంది. ఇదే సమయంలో మహేంద్రుడు గుమ్మం వద్దకు వచ్చి, బిహారిని చూచి, అదిరిపడ్డాడు. మహేంద్రుని మనస్సులో వినోదిని యెడల ఇప్పటివరకూవున్న ఔదాసీన్యాన్ని ఈర్ష్యవచ్చి తన్నితరిమేసింది. వినోదిని బిహారి పాదాలముందు మౌనంగా కూర్చొనివుండడంచూచి, తిరస్కరింపబడిన మహేంద్రుని గర్వానికి పెద్దదెబ్బ తగిలింది. ఉత్తర ప్రత్యుత్తరాలద్వారా వీరు యీ విధంగా కలుసుకొని వుండ వచ్చునని మహేంద్రునికి గట్టి నమ్మకం కుదిరింది. ఇంతవరకు బిహారి విముఖుడుగా వున్నాడు; అతడు తనంతతానే ఆమె వద్దకు వచ్చినప్పుడు, యిక వినోదిని ఎవరుఆపితే ఆగుతుంది?

ఈవేళ బిహారిని చూడగానే – 'నేను వినోదినిని విడిచి పెట్టగలను, కాని మరొకరికిమాత్రం పప్పగించజాల'నని మహేంద్రుడు గట్టిగా నిశ్చయించుకొని పట్టరాని కోపంతో – ''అయితే ఇక యీ రంగభూమినుండి మహేంద్రుని నిర్గమనము,

బిహారి ఆగమనము జరిగిందని భావింపవచ్చునా? — దృశ్యం చాలా సుందరంగావుంది! ప్రశంసా పూర్వకంగా చప్పట్లు చరచాలనిపిస్తూవుంది. ఐతే ఇదే యీ నాటకానికి చివరి అంకం కావాలని ఆశిస్తున్నాను – కాకపోతే యికపైన ఏమీ బాగావుండదు.” అన్నాడు వినోదినివైపుచూస్తూ.

వినోదిని ముఖం కందగడ్డయిపోయింది. ఆమె విధిలేక మహేంద్రుని ఆశ్రయం పొందవలసివచ్చింది, అందుకే ఈ అవమానానికి జవాబు ఆమెవద్ద లేదు; – ఆమె వ్యాకులదృష్టితో ఒకసారి బిహారివైపు చూచింది.

బిహారి మంచముమీదినుంచి లేచి నిల్చొన్నాడు, తర్వాత కొంచెం ముందుకువచ్చి స్థిరభావంతో “మహేంద్రా, నీవు నీచునిలాగా, పిరికివానిలాగా వినోదినిని అగౌరవ పరచవద్దు. నీబుద్ధి నిన్ను దుష్కృత్యాలనుంచి అడ్డగించే అధికారాన్ని సామర్థ్యాన్ని కోల్పోవచ్చు, కాని నిన్ను అడ్డగించడానికి నాకు అధికారం సామర్థ్యంవుంది.” అన్నాడు.

మహేంద్రుడు వెటకారంగా నవ్వి — “ఓహో! ఈ మధ్యలో అధికారంకూడా స్థిరపడిందీ? అయితే ఇక నీకు ‘వినోద – విహారి!’ అని పేరుపెడితే చాలా బాగుంటుంది.” అన్నాడు.

అవమానం మోతాదు పెరుగుతున్నదని గమనించి బిహారి మహేంద్రుని చేయి గట్టిగాపట్టుకొని – “మహేంద్రా, నేను వినోదినిని పెళ్ళాడతాను; విషయం నీకు తెలియజేశాను;

ఇకనుంచి కొంచం తమాయించుకొని — జాగ్రతగా మాట్లాడాలి!” అన్నాడు.

ఈ మాటవిని ఆశ్చర్యంతో మహేంద్రుడు నిశ్చేష్టుడైపోయాడు! నోటివెంట మాటరాలేదు! పైశ్వాస పైనే-క్రింది శ్వాస క్రిందనే ఆగిపోయింది! అటు వినోదినికూడా అదరిపడ్డది; ఆమె హృదయంలోని రక్తం వేగంగా ప్రవహింపసాగింది. బిహారి మహేంద్రునితో మళ్ళీ ఇలా అన్నాడు — “నీకు మరొకవిషయంకూడా చెప్పాలి. మీ అమ్మ మృత్యుశయ్యమీద పడివుంది, ఆమె బ్రతుకుతుందనే ఆశలేదు. నేను యీ రాత్రిబండిలోనే వెళ్ళుతున్నాను, ఈమెకూడా నా వెంట వస్తుంది.”

వినోదిని అదిరిపడి “అత్తగారు జబ్బుగా వున్నదా?” అన్నది.

“అవును, అది బ్రతికే జబ్బుకాదు, యెప్పుడేమి జరుగుతుందో చెప్పలేము.”

మహేంద్రుడు మరేమీ మాట్లాడకుండా మౌనంగా వెళ్ళిపోయాడు.

వినోదిని బిహారితో “ఇప్పుడు మీరన్నమాట మీ నోటినుండి యెట్లావచ్చింది? ఏమిటీపరిహాసం?”

“పరిహాసం కాదు వినోదినీ, నేను నిజమే చెప్పాను, నిన్ను వివాహం చేసుకొంటాను.”

“ఈ పాపిష్టిదాన్ని ఉద్ధరించడానికా?”

“కాదు, నేను నిన్ను ప్రేమిస్తున్నాను, అందుచేత.”

"చాలు, యిదినాకు చివరికానుక. మీరు ఇంతవరకు అంగీకరించారు, ఇంతకంటే అధికంగా నేను కోరడంలేదు. లభించినా అది కానుక కాజాలదు, ఎందుకంటె మన హిందూ ధర్మం దానిని సహించదు."

"ఎందుకు సహించదు?"

"ఛీ ఛీ, ఇలాంటిమాట మనసులోకి తేవడంకూడా సిగ్గుపడవలసిన విషయం. నేను విధవను, నింద్యమైనదానను, మిమ్ము యీ సంఘమంతటియెదుట చులకన చేయనా! —— అది యెన్నడు జరుగజాలదు! ఛీ ఛీ, ఈ మాట యిక మీ నాల్కతో వుచ్చరించవద్దు."

"నీవు నన్ను త్యాగం చేస్తావా?"

"త్యాగంచేసే అధికారం నాకులేదు. మీరు గుప్తంగా యెంతమందికో చాలాచాలా మేలుచేస్తున్నారు. అలాంటి యేదైనా ఒక సత్కార్యాన్ని నాకు వప్పగించండి. నేను దానినే శిరోధార్యంగా భావించి, నన్ను మీ దాసీగా భావించు కొంటాను. ఛీ ఛీ, విధవను మీరు వివాహం చేసు కొంటారా! మీ ఔదార్యానికి నిదర్శనంగా మీరు యేమైనా చేస్తారు; కాని నేనే ఈపనిచేసి, మిమ్ము సంఘభ్రష్టునిగాచేస్తే, ఈ జీవితంలో మళ్ళీ తలయెత్తుకొని తిరుగలేను."

"కాని వినోదినీ, నేను నిన్ను ప్రేమిస్తున్నాను."

"ఆప్రేమాధికారంవల్లనే సాహసించి ఈవేళ యిది మాత్రం చేస్తాను" — అని, వినోదిని నేలమీదికి వంగి బిహారి కాలివ్రేళ్లను ముద్దుకొన్నది. తిరిగి పాదాలముందు కూర్చొని-

"ముందుజన్మలో మిమ్మల్ని పొందడానికి తపస్సు చేస్తాను. ఈ జన్మలో యిక నాకు యే ఆశాలేదు, నేను పొందతగినదీ లేదు. నేను అనేకులను దుఃఖపెట్టాను, అనేక దుఃఖాలను అనుభవించాను. నాకు చాలా లోకానుభవం కలిగింది. ఆ లోకానుభవాన్ని నేను మరచేలాగుంటే - మిమ్మల్ని హైన్యపరచి, ఇంకా హీనురాలనవుతాను. ఐతే మీరు వున్నతమైనవారు, అందువల్లనే నేడు నేను తలయెత్తినిలవగలిగాను — ఈ ఆశ్రయాన్ని నేను నేలపాలు చేయలేను."

బిహారి గంభీరభావంతో మౌనంగా కూర్చొన్నాడు.

వినోదిని చేతులుజోడించి మళ్లీ చెప్పింది — "చూడండి, ఒకమాట, పొరబాటుపడకండి, — నన్ను వివాహం చేసుకొని మీరు సుఖం అనుభవించలేరు. అందువల్ల మీ గొప్పతనం నశించిపోతుంది. నేనూ నాగౌరవం పోగొట్టుకొంటాను. మీరు యెల్లప్పుడు అంటీ అంటకుండా సంతోషంగా వుండగలరు. నేడుకూడా అలాగేవుండండి; నేను దూరంగావుండి మీ పనులు చేస్తూవుంటాను. మీరు సంతోషంగా సుఖంగా వుండండి." అన్నది.

# 52

మహేంద్రుడు అమ్మవున్న గదిలోకి వెళ్ళబోతూ వుండగా ఆశ త్వరత్వరగా బయటికి వచ్చి - "ఇప్పుడే వెళ్ళవద్దు!" అన్నది.

"ఎందుకు?"

"సంతోష విషయంగాని దుఃఖవిషయంగాని అదాటుగా ఆమె హృదయంలోకి రావడంవల్ల, ఆమె హృదచలనం ఆగి పోయే ప్రమాదం వున్నదని డాక్టరుగారు చెప్పారు."

"నేను మెల్లమెల్లగా తలగడవద్దకు వెళ్ళి ఆమెకు తెలియకుండా చూచి వస్తాను."

"ఏ కొంచెం అలికిడి అయినా ఆమె అదరిపడుతూవుంది, మీరు లోపలికి రాగానే ఆమె తెలుసుకొంటుంది."

"అయితే యిప్పుడు యేంచేయడం మంచిదంటావు."

"ముందు బిహారిబాబును వచ్చి చూడనీయండి; వారి సలహా ననుసరించి చేద్దాం." మాట పూర్తిగాకమునుపే వచ్చాడు బిహారి. అతనికి ముందే కబురంపింది ఆశ.

"వదినా, నాకు కబురుచేశావా? అమ్మ కులాసాగా వుందా?" అని అడిగాడు బిహారి.

బిహారిని చూడగానే ఆశకు ఒక ఆధారం దొరికినట్లయింది. "మీరు వెళ్ళినప్పటినుంచి అమ్మ యింకా చంచలంగా వుంది. మొదటిరోజు మీరు కనిపించనందువల్ల 'బిహారి యెక్కడికి వెళ్ళాడు?' అని అడిగింది. 'వారు అవసరమైన పనిమీద వెళ్ళారు, బుధవారంలోగా వస్తా'రని చెప్పాను. అప్పటినుండి ఆమె వుండివుండి అదరిపడుతూవుంది. నిన్న మీ తంతి చేరగానే యివాళ మీరు వస్తారని చెప్పాను. అది విని ఈవేళ మీ భోజనానికి చేయవలసిన యేర్పాట్లనుగురించి యెన్నో చెప్పింది. మీకు బాగా యిష్టమైన పదార్థాలన్నీ

తెప్పించింది. తన గదికి యెదురుగావున్న పంచలో వంట యేర్పాటు చేయించింది. ఆమె యెదురుగా వుండి సలహాలిస్తూ స్వయంగా వంట చేయించగోరుతూ వుంది. డాక్టరు యెంత వద్దని చెప్పినా ఆమె అంగీకరించలేదు. ఇంతకు ముందుగానే ఆమె నన్ను పిల్చి, 'అమ్మాయీ, నీవే స్వయంగా అన్నీ వండాలి. ఈవేళ బిహారిని నాయెదుట కూర్చోబెట్టుకొని భోజనం చేయిస్తాను' — అన్నారు." అని చెప్పింది ఆశ.

ఈ మాటలు వినగానే బిహారి కళ్ళలో నీళ్ళునిండాయి. "అమ్మ యెలా వుంది?" అని అడిగాడు.

"మీరు ఒకసారి వచ్చి చూడండి. ఆమె జబ్బు యెక్కువయిందనే అనిపిస్తూవుంది."

బిహారి గదిలో ప్రవేశించాడు. ఆశ్చర్యంలో మునిగిపోయి, వెలుపల నిల్చొన్నాడు మహేంద్రుడు. ఆశ సులభంగా గృహభారాన్ని వహించింది. ఆమె యెంత సులభంగా మహేంద్రుని లోపలికి వెళ్ళకుండా ఆటంకపరిచింది! అభిమానపడలేదు, సంకోచింపనూలేదు! మహేంద్రుడు యిప్పుడెంత హీనస్థితికి దిగజారాడు! అతడు అపరాధి! వెలుపల మౌనంగా నిల్చొన్నాడు! అమ్మ గదిలోకికూడా వెళ్ళలేకపోయాడు! ఇంతేకాదు, ఇంకా ఆశ్చర్యకరమైన సంగతి — బిహారితో ఆశ యెంత నిస్సంకోచంగా మాట్లాడుతూవుంది! అన్ని సలహాలు బిహారివద్దనే పొందింది. అతడే తమ సంసారానికి యేకైక రక్షకుడు, అందరికి హితకారియైన మిత్రుడు. అతడా యింట్లో యెక్కడికి వెళ్ళదలచుకొంటే అక్కడికి వెళ్లవచ్చు;

యే అడ్డంకి లేదు. అతని సలహాల ప్రకారమే అందరు నడచు కొంటున్నారు. మహేంద్రుడు కొద్ది రోజులపాటు విడిచిపెట్టిన స్థానాన్ని తిరిగి చూచుకొనేసరికి అది వేనుకటిలాగా లేదు!

బిహారి లోపలికి వేళ్ళగానే అతనివైపు కరుణాపూర్ణమైన దృష్టితో చూచి "బిహారీ, వచ్చావా నాయనా?" అన్నది రాజలక్ష్మి.

"అవునమ్మా, వచ్చాను."

"నీపని ఫలవంతమయిందా?" — ఇలా అని ఆమె బిహారివైపు ఏకాగ్రఉత్సుకదృష్టితో చూచింది.

"ఆఁ, ఫలవంతమయింది, ఇక నిప్పుడు నాకే విచారమూ లేదమ్మా." అని నవ్వుముఖంతో ఒకసారి వెలుపలికి చూచాడు బిహారి.

"ఈ వేళ కోడలు నీకొరకు స్వయంగా వంట చేస్తుంది. నేను యిక్కడవుండి సలహాలిస్తుంటాను. డాక్టరు వద్దంటున్నాడు—ఇంకాయెందుకు నన్ను ఆటంకపరచడం? నేను చావడానికి ముందు ఒక్కసారి నా చేతులతో మీకు భోజనంకూడా పెట్టకూడదూ?"

"డాక్టరు వద్దనడంలో అర్థంలేదు; నీవు యెదుటవుండి వంట తయారు చేయించకపోతే యెలా జరుగుతుంది? నీవు వండిన పదార్థాలే మాకు చిన్నప్పటినుంచి యెంతో బాగా వుంటున్నాయి. మహేంద్రదాదాకు బజారుపూరీలు తినితిని నాల్క పాడైపోయింది. ఈ వేళ నీవు చేయించిన వంటకాలు తిని ఆయనకూడా చాలా సంతోషిస్తాడు. ఈవేళ

అన్నదమ్ములం యిద్దరమూ కలిసి వెనుకటిలాగా సంతోషంగా పందేలువేసుకొని భోజనం చేస్తాం. నీ కోడలు వడ్డించగలదో లేదో చూడాలి.''

బిహారి మహేంద్రుని తనవెంట తీసుకొనివచ్చి వుంటాడని రాజలక్ష్మి ఇంతకుముందే గ్రహించినా, మహేంద్రుని పేరు వినగానే ఆమె శ్వాస వున్నదివున్నట్లే ఆగిపోయినట్లయింది. ఒక్క క్షణం ఆమె హృదయచలనం ఆగిపోయింది. శ్వాస తీసుకొనడం కష్టమయింది.

ఆమె స్థితిని గమనించి — "పశ్చిమయాత్ర చేయడంచేత మహేంద్రదాదా ఆరోగ్యం చాలా బాగావుంది. ఇప్పుడు ప్రయాణబడలికవల్ల కొంచెం బద్ధకంగావున్నాడు. స్నానపానాదులు చేయగానే అతని ఆరోగ్యం చక్కబడుతుంది." అన్నాడు బిహారి. ఇప్పటికీ మహేంద్రునిపేరు యెత్తనేలేదు రాజలక్ష్మి. అప్పుడు బిహారి – "అమ్మా, మహేంద్రదాదా బయట నిల్చొనివున్నాడు, నీవు పిలువనిదే అతను లోపలికి రాలేడు'' అన్నాడు మళ్ళీ.

రాజలక్ష్మి యేమీ మాట్లాడకుండా ద్వారంవైపు చూచింది. ఇంతలో "మహేంద్రదాదా, లోపలికిరా." అని పిలిచాడు బిహారి.

మెల్లమెల్లగా లోపలికివచ్చాడు మహేంద్రుడు. హృదయచలనం అదాటుగా ఆగిపోతుందేమోననే భయంతో ఆమె అతనివైపు వెంటనే నేరుగాచూడలేదు. తనదృష్టిని కొంచెం క్రిందికి మళ్ళించింది. తనదృష్టి రాజలక్ష్మి మంచంమీద

పడగానే వులిక్కిపడ్డాడు మహేంద్రుడు; తననెవరో చెళ్ళుమని చరచినట్లయింది. అతను తన తల్లి పాదాలమీద శిరస్సు వుంచి ఆమెపాదాలను రెండుచేతులతో పట్టుకొని అలాగే వుండిపోయాడు. దుర్బలమైన రాజలక్ష్మిహృదయం చురుకుగా చలించడంచేత శరీరం గడగడ వణకిపోయింది.

"అక్కా, మహేంద్రుని లెమ్మనిచెప్పు, లేకపోతే వాడు లేవడు." అన్నది అన్నపూర్ణ.

రాజలక్ష్మి మెల్లగా మాటపెల్లగిస్తూ "లే మహేంద్రా!" అన్నది.

మహేంద్రునిపేరు వుచ్చరించగానే ఆమె కళ్ళవెంట అశ్రువులు మళ్ళీ ప్రవహించాయి. కన్నీరు కారిపోయినందువల్ల ఆమె హృదయంలోని బాధ కొంచెం తేలికపడింది. అప్పుడతడు మోకాళ్లమీదలేచి అమ్మవద్ద మంచం పట్టిమీద గుండెనుమోపి దగ్గరగా కూర్చొన్నాడు. రాజలక్ష్మి అతికష్టం మీద ప్రక్కకుతిరిగి మహేంద్రుని శిరస్సును తన రెండు చేతులలోకి తీసుకొని మస్తకాన్ని ఆఘ్రాణించి ముద్దుకొన్నది.

మహేంద్రుడు రుద్ధమైన కంఠంతో "అమ్మా, నేను నిన్నుచాలా కష్టపెట్టాను, నన్నుక్షమిస్తావా అమ్మా!"అన్నాడు.

రాజలక్ష్మి హృదయం కొద్దిగా శాంతించింది. — "అలా అనవద్దు నాయనా, నిన్ను క్షమించకుండా యెలా వుండగలను? ఆశా, ఆశ ఎక్కడికి వెళ్ళింది?"

ఆశ ప్రక్కనేవున్నగదిలో పథ్యం తయారుచేస్తున్నది. అన్నపూర్ణ ఆమెను పిల్చుకొనివచ్చింది. అప్పుడు రాజలక్ష్మి

కొడుకును మంచంమీద కూర్చోనమని సంజ్ఞచేసింది. అతడు కూర్చొన్నతర్వాత అతని ప్రక్కనే స్థానంచూపించి ఆశతో — "అమ్మాయీ, నీవు యిక్కడకూర్చో — ఈవేళ మిమ్మ యిద్దరినీకలిపి – నావద్ద కూర్చోబెట్టుకొని, ఒక్కసారి చూస్తే నా అన్నిదుఃఖాలు, కష్టాలు తీరిపోతాయి. కోడలా, నీవు నా యెదుట సిగ్గుపడవద్దు. మహేంద్రునిమీది కలుష భావాన్నికూడా పోగొట్టుకొని యిక్కడకూర్చో; మిమ్మ చూచి నాకళ్ళు చల్లబరచుకొంటాను." అన్నది.

ఆశ ముసుగు కప్పుకొని బిడియంతో మెల్లమెల్లగా దగ్గరకు వచ్చి, దడదడ వణకుతున్న హృదయంతో మహేంద్రుని ప్రక్కగా కూర్చొంది. అప్పుడు రాజలక్ష్మి ఆశ కుడి చేతిని మహేంద్రుని చేతిలోపెట్టి, "నేను నాకోడలిని నీచేతిలో వప్పగించిపోతున్నాను. నీవు యిలాంటి దేవిని మరెక్కడా పొందలేవు. అన్నపూర్ణా, రా, వీరిని ఆశీర్వదించు—నీపుణ్య బలంచేత వీరికి శుభములు కలుగుగాక!" అన్నది.

అన్నపూర్ణ యెదుటికి వచ్చి నిలబడగానే దంపతులిద్దరు తమ కళ్ళనుండి అశ్రువులురాలుస్తూ ఆమెపాదాలకు ప్రణామం చేశారు. ఆమె వారి శిరస్సులను మూర్కొని "భగవంతుడు మీకు శుభములు చేకూర్చుగాక!" అని ఆశీర్వదించింది.

"బిహారీ, రా నాయనా, నీవుకూడా నా యెదుట మహేంద్రుని క్షమించు." అన్నది రాజలక్ష్మి.

బిహారి లేచి మహేంద్రుని యెదుటికి వచ్చాడు; మహేంద్రుడు వెంటనే అతణ్ణి ఆలింగనం చేసుకొన్నాడు.

"మహేంద్రా, బిహారి నీకు చిన్నతనంనుంచి ఎలాంటి ఆప్తబంధువుగా ఉన్నాడో అలాగే వుండుగాక! — అంతకంటే నీకు శుభకరమైనది వేరేదీలేదు. ఇదే నీకు నా ఆశీర్వాదం." అన్నది రాజలక్ష్మి.

ఆమె అధికంగా మాట్లాడడంవల్ల నీరసపడిపోయింది. ఉత్తేజంకలిగించే ఒక ఔషధాన్ని ఆమె నోటిదగ్గరకు తెచ్చాడు బిహారి. అతనిచెయ్యి ప్రక్కకునెట్టి "ఇక మందు అక్కరలేదు నాయనా, ఇక భగవంతుని స్మరిస్తాను. ఆయన నాకు ఈ సంసారికతాపాన్ని అణచే మందుయిస్తాడు. మహేంద్రా, మీరు వెళ్ళి కొంచెం విశ్రాంతితీసుకోండి. అమ్మాయీ, నీవు వెళ్ళి వంటపని పూర్తిచెయ్యి." అన్నది.

సాయంకాలం బిహారీ మహేంద్రులు యిద్దరు రాజలక్ష్మి మంచం ప్రక్కనే భోజనం చేయడానికి కూర్చొన్నారు. ఆమె వడ్డించేపని ఆశకు వప్పగించింది. ఆశ వడ్డిస్తూవుంది.

మహేంద్రునికి కళ్ళనీళ్ళు వుబికివస్తున్నాయి, అతని నోటిలోకి ముద్ద పోవడంలేదు. "మహేంద్రా, నీవు యేమీ తినడంలేదేమి? బాగాతిను, నేను చూస్తాను!" అని మాటి మాటికి అనసాగింది రాజలక్ష్మి.

"మహేంద్రదాదా యెప్పుడూ యింతేనమ్మా, ఏమీ తిననేతినడు, యిది నీ వెరుగనిసంగతా! వదినా, ఈ పెసరపప్పు యింకా కొంచెంవెయ్యి — చాలా బాగావుంది." అన్నాడు బిహారి.

రాజలక్ష్మి సంతోషంతో నవ్వి "నాకు తెలుసు, బిహారికి మసాలా వేసిన పెసరపప్పు చాలా యిష్టం. అమ్మాయీ, అదిచాలదు యింకా కొంచెం వడ్డించు." అన్నది.

"అమ్మా, నీ కోడలు బలే పిసినిగొట్టు, ఆమె చేతినుండి యే వస్తువు బయటికి రానేరాదు." అన్నాడు బిహారి.

"చూడు అమ్మాయీ, బిహారి నీ ఉప్పుతిని నిన్ను దూషిస్తున్నాడు." అని నవ్వింది రాజలక్ష్మి.

ఆశ బిహారి పళ్ళెంలో యెక్కువగా పప్పువడ్డించింది.

"అమ్మయ్యో, నా పొట్టంతా పప్పుతోనే నింపేలా గుందే, ఇక మంచి మంచి పదార్థాలన్నీ మహేంద్రునికే వేసుకొంటుంది కాబోలు." అన్నాడు బిహారి.

"ఎప్పుడూ వకరిని నిందిస్తూవుండేవారినోరు ఏ విధం కూడా మూతపడదు." అని మెల్లగా సాణుగుతూపోయింది ఆశ.

"కొంచెం మిఠాయి పెట్టిచూడు, నోరు మూత పడు తుందో లేదో," అన్నాడు బిహారికూడా అదేస్వరంతో.

వీరిద్దరు భోజనం చేసినతర్వాత రాజలక్ష్మికి చాలా తృప్తికలిగింది. "అమ్మాయీ, నీవుకూడా త్వరగా భోజనం చేసిరా." అన్నది.

ఆశ భోజనంచేయడానికి వెళ్ళగానే మహేంద్రుని పిలిచి "నాయనా, నీవు వెళ్ళి పడుకో." అన్నది.

"ఇంకా నిద్రించే వేళ కాలేదమ్మా." అన్నాడు మహేంద్రుడు.

రాత్రికి తల్లిసేవ చేయాలని నిశ్చయించుకొన్నాడు మహేంద్రుడు. కాని ఆమె సుతరామూ అంగీకరించలేదు. "అలసివున్నావు, వెళ్ళి పడుకో" అన్నది.

ఆశ భోజనంచేసి పంఖా చేతిలోకి తీసుకొని రాజలక్ష్మి తలగడదిక్కుగా కూర్చొంది. "అమ్మాయీ, మహేంద్రుని పక్క సరిగావుందో లేదో వెళ్ళిచూడు; వాడు ఒంటరిగా వున్నాడు." అని ఆశతో అన్నది రాజలక్ష్మి.

ఆశ సిగ్గుతో చచ్చిపోయింది, యెలాగో మెల్లగా అక్కడినుండి వెళ్ళిపోయింది. రాజలక్ష్మివద్ద అన్నపూర్ణ, బిహారిమాత్రమే వుండిపోయారు.

"బిహారీ, నిన్ను ఒకమాట అడుగుతాను. వినోదిని యేమయిందో, యిప్పుడు యెక్కడ వున్నదో, చెప్పగలవా?" అని అడిగింది రాజలక్ష్మి.

"కలకత్తాలోనే వుంది."

రాజలక్ష్మి మౌనంగా బిహారివైపు ప్రశ్నాసూచకంగా చూచింది. బిహారి అదిగమనించి — "వినోదిని విషయంలో నీవు యెంతమాత్రం భయపడనక్కర్లేదమ్మా." అన్నాడు.

"అది నన్ను చాలా కష్టపెట్టింది బిహారీ, అయినప్పటికీ నేను ఆమెను లోలోపల ప్రేమిస్తూనే వున్నాను."

"ఆమెకూడా లోలోపల నిన్ను ప్రేమిస్తూనే వుందమ్మా."

"నాకూ అలాగే అనిపిస్తూంది బిహారీ. గుణదోషాలు అందరిలోనూ వుంటాయి; కాని అది నన్ను ప్రేమిస్తూనేవుంది.

ఆమె నాకెంతో సేవచేసేది. మనసులో కపటంవున్నవాళ్ళు ఆ మాదిరిగా సేవచేయలేరు."

"నీసేవ చేయాలని ఆమె యిప్పటికీ వ్యాకులపడుతూనే వుంది."

రాజలక్ష్మి ఒక పెద్ద నిట్టూర్పు విడిచి—"మహేంద్రుడు వాళ్ళుఅంతా నిద్రించడానికి వెళ్ళారుగదా, ఆమెను ఒకసారి యిచ్చటకు తీసుకవస్తే నష్టమేముంది?" అన్నది.

"ఆమె యీ యింటిలోనే వెలుపల దాగివున్నదమ్మా. నేను ఎంతో చెప్పాను; రాత్రి ఇంత ప్రొద్దుపోయినప్పటికీ ఆమె ఈవేళ యింతవరకు ఒక్కచుక్క నీరుకూడా త్రాగలేదు. నీవు స్వయంగా ఆమెను పిల్చి క్షమించేవరకు మంచినీరుకూడా పుచ్చుకోనని ప్రతిజ్ఞ చేసింది."

"పగలంతా నిర్జలవ్రతంతో కూర్చున్నదా? అయ్యయ్యో, పిలువు నాయనా, ఆమెను పిలువు." అని నొచ్చుకొన్నది రాజలక్ష్మి.

వినోదిని మెల్లమెల్లగా గదిలోకి వచ్చింది. ఆమెను చూస్తూనే "ఛీ ఛీ, నీవిలా నిర్జలవ్రతంతో కూర్చొన్నావా అమ్మాయీ, వెళ్ళు వెళ్ళు, ముందు భోజనం చెయ్యి,తర్వాత మాట్లాడుదాము." అన్నది రాజలక్ష్మి.

వినోదిని రాజలక్ష్మి చరణరజాన్ని తన శిరస్సున ధరించి నమస్కారం చేసింది—"ముందు యీ పాపిని క్షమించండి అత్తయ్యా, తర్వాత అన్నపానాదులు చేస్తాను." అన్నది.

"క్షమించానమ్మా, క్షమించాను. ఇప్పుడు నాకు యెవ్వరిమీదా క్రోధంలేదు." అని మళ్ళీ వినోదిని చెయ్యి పట్టుకొని "అమ్మాయీ, నీవల్ల యెవ్వరికి కీడు కలుగకుండు గాక, నీవుకూడా సత్ప్రవర్తనకలిగియుందువుగాక!"

"మీ ఆశీర్వాదం వృధాకాదు అత్తయ్యా, మీ పాదాలు సాక్షిగా చెపుతున్నాను, నా వల్ల ఈ యింటికి చెడు గేదీ జరుగదు."

వినోదిని అన్నపూర్ణకుకూడా సాష్టాంగ దండప్రణామం చేసి, భోజనం చెయ్యడానికి వెళ్ళింది. ఆమె భోజనం చేసి వచ్చిన తర్వాత రాజలక్ష్మి ఆమెవైపు చూచి "అమ్మాయీ, యిక వెళ్తావా?" అన్నది.

"అత్తయ్యా, నేను మీసేవ చేస్తాను, దైవసాక్షిగా చెప్పుతున్నాను, నావల్ల యే అనిష్టాన్ని మీరు శంకించకండి" అన్నది వినోదిని.

రాజలక్ష్మి బిహారీవైపు చూచింది. బిహారి కొంచెం ఆలోచించి "ఆమెను వుండనీఅమ్మా, మరేమీ నష్టంలేదు." అన్నాడు.

రాత్రికి అన్నపూర్ణ, వినోదిని, బిహారి ముగ్గురూకలిసి రాజలక్ష్మికి సేవ చేశారు.

ఇక్కడ ఆశకు రాత్రియంతా రాజలక్ష్మి గదిలోకి రావడానికి వీలు చిక్కనేలేదు; ఈ లజ్జతో చాలా వేకువనే లేచింది. మహేంద్రుడు యింకా నిద్రపోతూనే వున్నాడు. త్వరత్వరగా కాలుచేతులు ముఖం కడుగుకొని బట్టలు మార్చు

కొని తయారుగా వచ్చింది. అప్పటికి యింకా చీకటిగానేవుంది. రాజలక్ష్మిగదిద్వారంలోకి వచ్చి చూడగానే నిశ్చేష్టురాలయింది! యిది స్వప్నమా, నిజమా! అనుకొంది.

వినోదిని ఒక 'స్పిరిట్ లాంపు' మీద నీరు కాస్తూవుంది. బిహారి రాత్రి నిద్రపోనేలేదు; అతనికి తేనీరు సిద్ధపరుస్తున్నది.

ఆశను చూచి వినోదిని లేచి నిల్చొని—"ఇవాళ నేను అనేక అపరాధాలతో మీ ఆశ్రయానికి వచ్చాను, మరెవ్వరూ నన్ను యిచ్చటినుండి పంపివేయలేరు; కాని నీవునన్ను 'వెళ్ళు' అనిఅంటే తక్షణం వెళ్ళవలసివస్తుంది" అన్నది.

ఏ జవాబు చెప్పలేకపోయింది ఆశ. తన మనసులోవున్న భావాల్నికూడా తాను గ్రహించలేకపోయినట్లుగా నిశ్చేష్టితురాలయింది.

"నిజమే, నీవు నన్ను ఎన్నటికీ క్షమించలేవు—ఆ ప్రయత్నంకూడా చేయవద్దు. అయితే ఇప్పుడు నావల్ల నీవు యెంతమాత్రమూ భయపడవద్దు. అత్తగారికి స్వస్థత చిక్కేవరకూ నన్ను ఆమెకు సేవచేయనివ్వు; అటుతర్వాత నేను వెళ్ళిపోతాను."

నిన్న రాజలక్ష్మి తన చెయ్యిపట్టుకొని మహేంద్రుని చేతికి వప్పగించిన పిమ్మట ఆశ తనమనసులోవున్న క్రోధాన్ని, అభిమానాన్ని, సమస్త మలినభావాల్ని కడిగివేసి మహేంద్రునికి పూర్తిగా ఆత్మసమర్పణం చేసింది. ఈవేళ యెదురుగా వినోదిని కనిపించినంతనే ఆమె భగ్నప్రేమాగ్ని అశాంతిని శంకిస్తూవుంది. ఒకప్పుడు ఈమెను మహేంద్రుడు ప్రేమించాడు, బహుశా

యింకా అతను లోలోపల ప్రేమిస్తూనే వుండవచ్చు—ఈ విష యం ఆమె హృదయంలో ఒక తరంగంలాగా పరుగులెత్తింది. కొంతసేపటికి వారు లేస్తారు, వినోదినిని చూస్తారు, ఏ దృష్టితో చూస్తారో యెవరికి తెలుసు! గడచిన రాత్రి తనయిల్లు నిష్కంటకంగా కనిపించింది — కాని ఈవేళ వుద యం లేచి చూచేసరికి ముళ్లచెట్టు తన ముంగిట్లోనే కనిపించింది. సంసారంలో సౌఖ్యానికి స్థానం చాలా సంకీర్ణంగానే వుంటుంది—అది సంపూర్ణంగా నిర్విఘ్నమైనదనిగాని, దాని దరిదాపుల కే భాధలు – ప్రమాదాలు రావనిగాని, భావించ డానికి అవకాశంలేదు.

ఆశ తన హృదయభారంతో అణిగిపోయి రాజలక్ష్మి గదిలోకి వెళ్ళి చాలా సిగ్గుపడుతూ — "పిన్నమ్మా, నీవు రాత్రిఅంతా మేల్కొనేవున్నావు, వెళ్ళు, పడుకో!" అన్నది.

ఒక్కసారి ఆశ ముఖంవైపు చక్కగా చూచింది అన్నపూర్ణ.

ఆమె నిద్రించడానికి వెళ్ళకుండా ఆశను తన గదిలోకి తీసుకొనివెళ్ళి—"చున్నీ, నీవు సుఖపడదలచుకొంటే, ఇక యీ విషయాలనన్నింటినీ నీ మనసులో పెట్టుకోవద్దు. ఇతరులమీద దోషారోపణంచేయడంలో ఎంత సుఖంవున్నదో; ఆ దోషాన్ని మనసులో అలాగే అంటిపెట్టుకొని వుండడంలో అంతకంటె యెక్కువ దుఃఖంవుంది." అని చెప్పింది.

"పిన్నమ్మా, నేను అంతా మరచిపోవాలనే అనుకొంటు న్నాను. కాని నా మనసు మరచిపోవడంలేదు."

"అమ్మాయీ, నీవు నిజంచెప్పావు - ఉపదేశమివ్వడం సులభమే, ఉపాయంచెప్పడం కష్టం. అయినప్పటికీ నేను నీకు ఒక ఉపాయం చెబుతాను. కనీసం నీబాహ్య ప్రవర్తచేతనైనా నీవు అన్నీ మరచిపోయినట్లుగా వ్యవహరిస్తూవుండు. ముందు బాహ్యామనస్సులో మరచిపోవడానికి ప్రయత్నించు, తద్వారా క్రమంగా అంతర్మనస్సులోకూడా మరచిపోగలవు. నీవు మరచిపోకపోతే యెదుటవారినికూడా మరచిపోకుండా చేస్తావు. ఇది బాగా జ్ఞాపకంవుంచుకో. నీవు నీ బుద్ధిపూర్వకంగా ఇలా చేయలేకపోతే ఇది నా ఆజ్ఞగాభావించి నేను చెప్పినట్లు నడుచుకో - వినోదిని నీకు యెన్నడు ఏ అపకారం చేయలేదనీ, ఆమెవల్ల యికముందుకూడా యే అనిష్టమూ జరుగదనీ, నీవు భావిస్తున్నట్లు ఆమెకు తెలిసేలాగా వ్యవహరించు."

"ఏం చేయమంటావో చెప్పు." అని తలవంచి వినయంగా అడిగింది ఆశ.

"వినోదిని యిప్పుడు బిహారికి తేసీరు తయారుచేస్తూవుంది. నీవు పాలు, చక్కెర, గిన్నెలు తీసుకవెళ్ళు. నీవుకూడా ఆమెతో కలిసి కట్టుగా పనిచెయ్యి."

ఆజ్ఞాపాలనం చేయడానికి లేచింది ఆశ. "ఇప్పుడు నీవు చేయబోయేపని సామాన్యవిషయం; కాని యింకొక విషయం చెబుతున్నాను, అది యింకా కఠినమైనది - అది నీవు తప్పక చేయవలసి ఉంటుంది. మధ్యమధ్య వినోదిని మహేంద్రుని కంటపడడం తథ్యం, అప్పుడు నీ మనసు యెలా వుంటుందో నాకు తెలుసు. అప్పుడు మహేంద్రునిభావం యెలా వుంటుందో

వినోదినిభావం యెలా వుంటుందోనని క్రీగంటితో కూడా చూడడానికి ప్రయత్నించవద్దు. హృదయం బ్రద్దలై పోయినా సరే నీవు చలించవద్దు. నీవు దుఃఖించడం లేదనీ, సందేహించడం లేదనీ, నీ మనసులో చింతగాని భయంగాని లేదనీ, జంట విడిపోవడానికి ముందు యెలావున్నావో, జంటకలిసినతర్వాత కూడా సరిగ్గా అలాగే వున్నావనీ, విరిగిన చిహ్నంగూడా అతనిలో నేగాని నీలో కనిపించడం లేదనీ, మహేంద్రుడు భావించేలాగా వ్యవహరించాలి. మహేంద్రుడుగాని యింకెవ రైనాగాని నీ ముఖంచూచి తాము అపరాధులమని అనుకోరు. చునీ్న, ఇది నా ఉపదేశంగాని, బ్రతిమాలడంగాని కాదు. ఇది నీ పిన్నమ్మ ఆజ్ఞ. నేను కాశీకి వెళ్ళినతర్వాత ఒక్కరోజు, ఒక్కక్షణంకూడా ఈ విషయం మరచిపోవద్దు.'' అని చెప్పింది అన్నపూర్ణ.

తేనీటిగిన్నెలు మొదలయినవన్నీ తీసుకొని వినోదిని వద్దకువెళ్ళి "నీళ్ళు కాగినవా? పాలు తెచ్చాను." అన్నది ఆశ.

ఆశ్చర్యంగా ఆశముఖంవైపుచూచి — "బిహారిబాబు పంచలో కూర్చొని ఉన్నారు, తేనీరు వారికిపంపించు. నేను ఈలోగా అత్తగారి దంతధావనానికి యేర్పాటు చేస్తాను. ఆమె కూడా యిప్పుడే లేస్తూన్నట్లున్నది.'' అన్నది వినోదిని.

వినోదిని స్వయంగా బిహారికి టీ యివ్వడానికి వెళ్ళలేదు. బిహారి తన ప్రేమను స్వీకరించి తనకు యిచ్చిన అధికారాన్ని ఇష్టమొచ్చినట్లు స్వేచ్ఛగా వినియోగించుకోడానికి ఆమెకు సంకోచం కలుగుతూవుంది. అధికారం పొందడానికి అవసర

మైన మర్యాదను కాపాడుకొంటూ నిలుపుకోవాలంటే ఆ అధి కారాన్ని నియమపూర్వకంగా ప్రయోగించవలసి ఉంటుంది. దొరికినంతవరకు తీసుకొందామని పెనుగులాడడం దరిద్రుని లక్షణం. భోగాలను తగ్గించుకోవడంలోనే సంపత్తికి యధార్థ మైన గౌరవంవుంది. ఇప్పుడు బిహారి స్వయంగా పిలిచినప్పుడు తప్ప యేదో మిషతో అతనివద్దకువెళ్ళడం వినోదినికి యిష్టం లేదు. వినోదినిమాట పూర్తి కాకముందే మహేంద్రుడక్కడకు వచ్చాడు. ఆశ హృదయంలో యెవరో చరచినట్లయింది; కాని ఆమె తనను సమాళించుకొని స్వాభావికంగా మహేం ద్రునితో — "మీరు యింత పెందలకడనే లేచారేమి? వెలు తురు లోపలికివస్తే మీకు నిద్రాభంగం కలుగుతుందేమోనని అన్ని కిటికీలు, ద్వారాలు మూసివచ్చానుకూడా." అన్నది.

వినోదినియెదుట తనతో యింత నిస్సంకోచంగా తన భార్య మాట్లాడడంచూచి మహేంద్రుని గుండెలమీదినుండి పెద్దబరువు దించినట్లయింది. ప్రసన్నచిత్తుడై "అమ్మ ఆరోగ్యం యెలా వున్నదీ చూడడానికివచ్చాను. అమ్మ యింకా నిద్ర పోతున్నదా?" అన్నాడు.

"ఆఁ, ఇంకా నిద్రపోతూనేవుంది, యిప్పుడే వెళ్ళకండి. రోజూకంటే ఆమెఆరోగ్యం ఈవేళ బాగావుందనీ, ఇన్నాళ్లకు ఈవేళే హాయిగా నిద్రపోయిందని చెప్పాడు బిహారీబాబు."

మహేంద్రుడు నిశ్చింతగా "పిన్నమ్మ యెక్కడవుంది?" అని అడిగాడు.

అన్నపూర్ణగది చూపించింది ఆశ. ఆశ దృఢచిత్తాన్ని ఓర్పునుచూచి వినోదినినోట మాటరాలేదు.

"పిన్నమ్మా," అని పిలిచాడు మహేంద్రుడు.

అన్నపూర్ణ ఉదయాన్నే స్నానంచేసి, పూజాపునస్కారాలకు కూర్చోబోతూ, మహేంద్రుని పిలుపు విని—"రా మహేంద్రా, రా!" అన్నది. మహేంద్రుడు ప్రణామంచేసి "పిన్నమ్మా, నేను చాలా పాపిని, నీ యెదుటికి రావడానికి నాకు సిగ్గుగావుంది." అన్నాడు.

"ఛీ ఛీ, అలా అనవద్దు నాయనా, వంటినిండా మన్ను పూసుకొనికూడా బిడ్డ తల్లిఒడిలో కూర్చుంటాడు."

"కాని నేను పూసుకొన్న దుమ్ము విదిలిస్తే పోయేది కాదు పిన్నమ్మా."

"లేదు నాయనా, నీవు ఒక్కసారి విదిలించుకొంటే చాలు రాలిపోతుంది. ఒక విధంగా యిదీ మంచికే జరిగింది. నీకు, నీవు చాలా మంచివాడవనే గర్వముండి! ఈ పాపిష్టి తాపానువల్ల నీయహంకారం మాత్రమే నుగ్గునుగ్గు అయిపోయింది. అంతకన్న మరేప్రమాదమూ జరుగలేదు."

"పిన్నమ్మా, యిక నిన్ను విడిచివుండను, నీవు వెళ్ళినందువల్లనే నాకీ దుర్గతి సంభవించింది."

"నేను యిక్కడ వుండడంవల్ల నీకు కలుగకుండా ఆగిపోయే దుర్గతి ఒక్కసారి జరిగిపోవడం మంచిదే అయింది. ఇక నేను యిక్కడ వుండవలసిన అవసరమే వుండదు."

"పిన్నమ్మా, పూజలో కూర్చున్నావా?" అని గుమ్మంలోనుంచి మళ్ళీ కేక వినిపించింది.

"లేదు నాయనా, రా!" అన్నది అన్నపూర్ణ.

బిహారి లోపలికి వచ్చాడు. ఇంత పెందలకడనే మహేంద్రుడు నిద్రలేచి వుండడంచూచి "మహేంద్రదాదా, బహుశా నీజీవితంలో మొదటి సూర్యోదయాన్ని యివాళే చూచావనుకొంటాను!" అన్నాడు.

"ఔను బిహారీ, నా జీవితానికి యిదే ప్రథమ సూర్యోదయం. నీవు పిన్నమ్మతో యేదో ఆలోచించడానికి వచ్చావనుకొంటాను—సరే, నేను వెళ్ళుతున్నాను."

బిహారి నవ్వుతూ—"నీవుకూడా కాబినెట్ మినిస్టర్గా యెన్నుకోబడ్డావుగదా. నీదగ్గర నేను యెన్నడూ యేదీ దాచలేదు. నీకు అభ్యంతరం లేకపోతే యిప్పుడూ దాచనక్కర్లేదు" అన్నాడు.

"నాకు అభ్యంతరమా! అయితే ఇక నీమీద నా కే హక్కూ వుండదు. నీవు నా ముందు యేదీ దాచకుండావుండేలాగుంటే, నేనుకూడా నా విషయంలో మళ్ళీ శ్రద్ధ వహించగలుగుతాను."

ప్రస్తుతం మహేంద్రుని యెదుట నిస్సంకోచంగా మాట్లాడడం కష్టం. బిహారినోరు యెవరో బందించినట్లయింది అయినప్పటికీ బలవంతంగా "నాకు వినోదినిని వివాహ మాడవలెనని ఒక ఆలోచన కలిగింది. ఆ విషయంలో పిన్నమ్మతో మాట్లాడి నిశ్చయించుకోవాలని వచ్చాను." అన్నాడు.

మహేంద్రుడు సిగ్గుతో కుంచించుపోయాడు. అన్న పూర్ణ ఆశ్చర్యంగా "ఈ ఆలోచన యేమిటి బిహారీ?" అన్నది.

తన శక్తినంతా ఉపయోగించి తనకు కలిగినసిగ్గును తొలగించుకొని — "బిహారీ, నీవు ఈ పెళ్ళి చేసుకోవలసిన అవసరంలేదు." అన్నాడు మహేంద్రుడు.

అన్నపూర్ణ:— ఈ ప్రస్తావనలో వినోదిని హస్తం కూడా వుందా?

బిహారి:— ఎంతమాత్రము లేదు.

అన్నపూర్ణ:—ఆమె ఇలాచేయడానికి అంగీకరించిందా?

మహేం:— వినోదిని యెందుకు అంగికరించదు పిన్నమ్మా? ఆమె బిహారిమీద చాలా భక్తిశ్రద్ధలు కలిగివుంది; అనన్యభావంతో భజిస్తూవుంది — ఇలాంటి ఆశ్రయాన్ని ఆమె బుద్ధిపూర్వకంగా యెందుకు నిరాకరిస్తుంది? ఈ విషయం నాకు బాగా తెలుసు.

బిహారి:— మహేంద్రదాదా, వినోదినితో నేను వివాహ ప్రస్తావన చేశాను — కాని ఆమె సిగ్గుపడుతూ నిరాకరించింది.

ఇదివిని మహేంద్రుడు నిస్తబ్ధుడైపోయాడు.

## 53

మంచి చెడ్డల్ని చూచుకొంటూ రెండు మూడుదినాలు ఎలాగో గడిపింది రాజలక్ష్మి. ఒకదినం ఉదయం ఆమె ముఖంలో మంచి ప్రసన్నత కనిపించింది – ఆమె బాధలన్నీ

క్రమక్రమంగా తగ్గిపోసాగాయి. వెంటనే మహేంద్రుని పిలిచి — "నాయనా, ఇక నాకెక్కువ అవకాశంలేదు, నేను చాలా సుఖంగా వెళ్ళిపోతున్నాను, నాకు యే దుఃఖమూలేదు. నీవు పసిబిడ్డవైవుండగా నిన్ను చూచుకొని నేను అనుభవించిన అనందాన్నే యిప్పుడూ అనుభవిస్తున్నాను. నీవు నా ఒడిలోని బిడ్డవు, నా హృదయ ధనానివి. నీ చీకుచింతల్ని - భ్రమ ప్రమాదాల్ని నాతో తీసుకొని వెళ్ళిపోతున్నాను; ఇదే నాకు గొప్ప సుఖం కలిగిస్తూవుంది." — ఇలా అంటూ మహేంద్రుని ముఖంమీద శరీరంమీద చేతితో నిమిరింది. అతని యేడుపు ఆటంకాన్ని లెక్క చేయకుండా పొంగిరాసాగింది.

"మహేంద్రా, ఏడువవద్దు నాయనా, లక్ష్మిలాంటి కోడలిని నీవద్దవిడిచిపెట్టి వెళ్ళుతున్నాను. నా తాళం కోడలికి యివ్వాలి." ఇంటికి కావలసిన సామానుయావత్తు నేను సంపాదించాను. యే వస్తువుకు నీవు బాధపడనవసరంలేదు. మరొక మాట చెబుతున్నాను నాయనా, ఈ విషయం నేను చావక ముందు యెవ్వరికీ చెప్పకు. నా పెట్టెలో రెండువేల రూపాయలనోట్లు ఉన్నాయి. వాటిని వినోదినికి యిస్తున్నాను. ఆమె విధవరాలు, ఒంటరిగావుంది, ఈ డబ్బుతో ఆమె జీవితం చక్కగా జరుపుకొంటుంది. అయితే, అబ్బాయ్, ఆమెను నీ ఇంట్లోమాత్రం వుంచుకోవద్దు, ఈమాట గట్టిగా జ్ఞాపకం పెట్టుకో." అని చెప్పింది.

తర్వాత రాజలక్ష్మి బిహారిని పిలిపించి ఇలా చెప్పిం —"నాయనా, బిహారీ, మర్యాదస్తులయిన బీదవారి చికిత

కొరకు నీవు తోటయేదో కొన్నావని మహేంద్రుడు చెప్పాడు. నీవు చిరకాలం జీవించి బీదలకు సేవ చేసేలాగా భగవంతుడు అనుగ్రహించుగాక! నా వివాహసమయంలో మామగారు నాకు ఒక గ్రామం యిచ్చారు. ఆ గ్రామం నేను నీకు యిచ్చి వేస్తున్నాను. దానిమీది ఆదాయం నీ సత్కార్యంలో విని యోగించుకో. అందువల్ల మా మామగారికి పుణ్యమూ, ఆత్మ శాంతికూడా కలుగుతుంది."

రాజలక్ష్మి మరణించిన తర్వాత ఆమె అంత్యక్రియలు యథావిధిగా జరిపారు. అప్పుడు మహేంద్రుడు బిహారిని పిలిచి — "తమ్ముడూ, నాకు డాక్టరీ తెలుసు — నీవు ప్రారం భించినపనిలోకి నన్నుకూడా తీసుకొని వెళ్ళు. చునీ చాల కుశాగ్రబుద్ధిగల గృహిణి అయింది. ఆమెకూడా నీకు చాలా సహాయకారి కాగలదని ఆశిస్తున్నాను. మనమందరమూ అక్కడే వుందాము." అన్నాడు.

"దాదా, బాగా ఆలోచించి మరీ చెప్పు, ఈ పని మీకు యెల్లకాలము సంతోషం కలిగిస్తుందా? క్షణికమైన వైరాగ్యపు పొంగులో ఒక శాశ్వతమైన భారాన్ని నీ నెత్తిని మోపుకోవద్దు."

"బిహారీ, నేను నా జీవితాన్ని యెలాంటి మూసలో పోత పోశానో నీవుకూడా బాగా ఆలోచించిచూడు. దానిని నిర్లక్ష్యంగా అనుభవించడానికి వీలులేదు. పనిపాటలతో బంధించి దానిని యీడ్చుకొనిపోకపోతే, చివరికి ఒకప్పుడు అదే నన్ను తనవెంట ఈడ్చుకొనిపోయి, అనేక ప్రమాదాలలో

పారేస్తుంది. నీవు నీసత్కార్యాలలో నాకుకూడ స్థానమీయక తప్పదు."

ఆఖరుకు ఈ విషయం నిర్ణయమైపోయింది.

అన్నపూర్ణ, బిహారి యిద్దరు కూర్చొని శాంతి విషాదాలతో వెనుకటి విషయాలు మాట్లాడుకొంటున్నారు. వారిద్దరు ఒకరినొకరు విడిచి వెళ్ళేసమయం దగ్గరకు వచ్చింది. ఇంతలో వినోదిని ద్వారందగ్గరకు వచ్చి—"పిన్నమ్మా, నేను అక్కడకువచ్చి కొంచెంసేపు కూర్చోవచ్చునా?" అన్నది.

"రా అమ్మా, రా, కూర్చో." అన్నది అన్నపూర్ణ.

అన్నపూర్ణ వినోదినితో రెండు మూడు మాటలు మాట్లాడి తన పరుపుచుట్ట తెచ్చుకొనే నెపంతో వరండాలోకి వెళ్ళింది..

"ఇప్పుడు మీరు నన్ను యేమి చెయ్యమంటారో చెప్పండి!" అని బిహారిని అడిగింది వినోదిని.

"నీవే చెప్పు, యేం చెయ్యదలచుకొన్నావో?"

"మీరు బీదలకు చికిత్సాలయం నెలకొల్పనున్నారనీ అందుకు గంగాతీరంలో ఒకతోట తీసుకొన్నారనీ విన్నాను—అక్కడ యేదో ఒక పని చేస్తాను. ఏదీ చేతకాకపోతే వంట యేర్పాటైనా చేస్తాను."

"నేను బాగా ఆలోచించాను. అనేకవిధాలైన గడబిడలవల్ల మన జీవితజాలంలో అనేక ముళ్ళుపడ్డాయి. ఇక యేకాంతంగా కూర్చొని ఒక్కొక్కముడిని విడదీయవలసిన సమయం వచ్చింది. ముందు మన మార్గాల్ని నిష్కంకటం

చేసుకోవాలి. ఇప్పుడు హృదయంలోకలిగే ప్రతికోరికకు ఆశ్రయం యిచ్చే సాహసంలేదు. ఇంతవరకు జరిగిన—ఇంతవరకు సహించిన, అన్ని విపర్యయాలను – పేచీలను – ఆందోళనలను శాంతి పొందించనిదే మనము జీవనసమాప్తికి తయారు కాలేము. మన గడచినకాలమంతా అనుకూలంగా పరిణమించే లాగుంటే నీ వొక్క—దాని ద్వారానే నా జీవనం సంపూర్ణం కాగలుగుతుంది; కాని యిప్పుడు నేను నీకు దూరంగానే వుండ వలసి వుంటుంది. ఇక సుఖంకొరకు ప్రయత్నించడం వ్యర్థం. ఇది మెల్లమెల్లగా జీవితనౌకలో తూట్లుపడిన భాగాలను మరమ్మతు చేసుకొనవలసిన తరుణం."

ఇంతలో అన్నపూర్ణ లోపలికి వచ్చింది. వినోదిని అన్నది — "అమ్మా, మీరు మీ పాదాలముందు నాకు స్థానం యివ్వాలి. పాపినిననేకారణంచేత నన్ను దూరంగా త్రోసివేయవద్దు."

"రా అమ్మా, నా వెంటరా."

అన్నపూర్ణవెంట వినోదిని కాశీకి వెళ్ళేరోజు బిహారి మెల్లగా ఆమెను కలుసుకొని "వినోదినీ, నీ ఆనవాలేదైనా నావద్ద వుంచుకోవాలని కోరికగావుంది." అన్నాడు.

"మీరు గుర్తుగా మీవద్ద వుంచుకొనతగినవస్తువు నావద్ద యేముంది?"

బిహారి సిగ్గుపడుతూ ససంకోచంగా — "ఇంగ్లీషు వాళ్ళలో తమకు యిష్టమైన మనుష్యులవద్ద కొన్ని వెంట్రుక

లను కత్తిరించి తీసుకొని జ్ఞాపకార్థంగా తమవద్ద వుంచుకొనే ఆచారంవుంది. నీవుకూడా అలా —" అన్నాడు.

"ఛీ ఛీ, ఎంత నీచపువిషయం! నా వెంట్రుకలు తీసుకొని మీరు యేమిచేసుకొంటారు! ఈ అపవిత్రమైన వస్తువు మీకు యివ్వతగినదిగా నేను భావించడంలేదు. ఈ యభాగ్యురాలు మీ సన్నిధిలోవుండే అవకాశంలేదు. కనుక మీకు ఉపయోగించే నావస్తువు నొకదానిని మీకు యివ్వగోరుతున్నాను — పుచ్చుకొంటారా? చెప్పండి."

"తీసుకొంటాను."

అప్పుడు వినోదిని తన చీరకొంగునుండి రెండువేల రూపాయిల విలువగలనోట్లు తీసి బిహారిచేతిలో ఉంచింది.

బిహారి గంభీరదృష్టితో వినోదినివైపు అలాగేచూస్తూ వుండిపోయాడు. తర్వాత ఆమెతో — "నేను నీకు యేమీ యివ్వలేనా వినోదినీ?" అన్నాడు.

"మీ ఆనవాలు నావద్ద యిదివరకేవుంది; అది నా శరీరానికి భూషణం లాంటిది — దానిని యెవ్వరూ అపహరించలేరు. నాకు మరేది అవసరంలేదు." ఇలా అని లోగడ ఆమె చేతికి తగిలిన దెబ్బను చూపించింది వినోదిని.

బిహారికి చాలా ఆశ్చర్యం వేసింది. "యీ దెబ్బమీది, మీకు తెలియదు కాని ఈ గాయం మీదే — ఇది మీకు తగినదికూడా! ఇప్పుడు దీనిని మీరుకూడా తిరిగి తీసుకోలేరు!" అన్నది వినోదిని.

అన్నపూర్ణ ఉపదేశాలు పొందికూడా వినోదిని విషయంలో తన హృదయాన్ని నిష్కల్మషంగా చేసుకోలేకపోయింది ఆశ. ఇద్దరూకలిసే రాజలక్ష్మికి సేవ చేశారు; కాని ఆశ వినోదినివైపు చూచినప్పుడంతా ఆమె హృదయంలో వ్యథ కలుగుతూనేవుంది — నోటినుంచి ధారాళంగా మాట రావడంలేదు,నవ్వడానికి ప్రయత్నించడం బాధాకరంగావుంది. వినోదినివల్ల సాధారణమైన పనులు చేయించుకొనడానికి కూడా ఆమెకు మనసొప్పడంలేదు. వినోదిని చుట్టియిచ్చిన తమలపాకు బీడాలు మర్యాదకొరకు తీసుకొన్నప్పటికీకూడా ముఖం చాటుకాగానే వాటిని విసరిపారవేసేదేకాని నోట్లో వేసుకోలేదు. అయితే ఈవేళ పరిస్థితి అలాలేదు. వినోదిని ప్రయాణ సమయం ఆసన్నమయింది. పిన్నమ్మ మరొకసారి యిల్లువిడిచి కాశీకి వెళ్ళుతూవుండడంవల్ల ఆశ హృదయం కన్నీటితో తడిసిపోయింది. అప్పుడు వినోదినిమీదకూడా ఆమెకు కరుణ కలిగింది. ఆమె రోషమంతా కర్పూరంలాగా హరించిపోయింది. ఒక్కసారిగా యిల్లు విడిచిపెట్టి దూరంగా వెళ్ళిపోయేవారిని కూడా క్షమించలేని కఠినాత్ములు చాలా కొద్దిమందిమాత్రమే వుంటారు. వినోదిని మహేంద్రుని ప్రేమిస్తూవుందని ఆశకు తెలుసు. మహేంద్రుని యెందుకు ప్రేమించదు? అతణ్ణి ప్రేమించడం యెంత అనివార్యకార్యమో ఆశకు తన హృదయం బాగా తెలుపుతూనేవుంది. తాను అనుభవించిన ఆప్రేమ వేదనానుభవంవల్ల ఈవేళ ఆశకు వినోదినిమీద చాలా దయ కలిగింది. ఆమె శాశ్వతంగా మహేంద్రుని విడిచి వెళ్ళిపోతూ

వుంది; ఇది సహింపరాని దుఃఖకరమైన విషయం; యిలాంటి దుఃఖాన్ని యెంత బలమైనశత్రువులైనా అనుభవించడం—ఆశకు సమ్మతంకాదు. ఇలా అనుకోన్నంతనే ఆమెకళ్ళలో అశ్రుజలం నిండిపోయింది. ఆమె ఒకప్పుడు వినోదినిని ప్రేమ దృష్టితోచూచింది. ఆప్రేమే తిరిగి ఆమెహృదయంలో క్రొత్త చిగుళ్ళు తొడిగింది. ఆమె మెల్లమెల్లగా వినోదినివద్దకువెళ్ళి అత్యంతకరుణతో, స్నేహంతో, విషాదంతో,కోమలస్వరంతో "అక్కా—, నీవు వెళ్ళుతున్నావా?" అని అడిగింది.

వినోదిని ఆశాలత గడ్డంపట్టుకొని — "ఔను చెల్లీ, నేను వెళ్ళేవేళఅయింది. నీవు నన్ను ఒకప్పుడు ప్రేమించావు; ఇప్పుడు నీ సౌఖ్యదినాలలో ఆ ప్రేమలో యే కొంచెమైనా నామీాదవుంచి మిగతావన్నీ మరచిపోవాలి!" అన్నది.

మహేంద్రుడు వచ్చి ప్రణామంచేసి — "పెద్దవదినా, క్షమించాలి — " అన్నాడు.

ఇలా అంటూవుండగా మహేంద్రుని కళ్ళనుండి రెండు నీటిబొట్లు క్రిందపడ్డాయి.

"మీరుకూడా క్షమించాలి మహేంద్రబాబూ, భగవంతుడు మీకు యెల్లప్పుడు సౌఖ్యాలు చేకూర్చుగాక." అన్నది వినోదిని.

